# హనుమంతరావు స్ఫూర్తి చిరస్మరణీయం



రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 15 సంచిక : 2 హైదరాబాద్ 187 ఫిబ్రవరి 2017 పేజీలు : 68 రు. 20

- ☼ పెద్ద నోట్ల రద్దు అసలు రహస్యాలు
- ☼ భూసేకరణ చట్టానికి సవరణలు
- ☼ ప్రైవేట్ విశ్వవిద్యాలయాల వ్యాపారం
- ☼ నిజనిర్ధారణే నేరమవుతున్న చోట
- ☼ ట్రంప్ లక్ష్యం మెరుగైన అమెరికానేనా?

అలుపెరగని అక్షరయోధుడు, వీక్షణం వ్యవస్థాపక సంపాదకుడు

హనుమంతరావుకు నివాళి వ్యాసాలు

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| మా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| గుజరాత్ ఫైల్స్ | రానా అయూబ్ | 130 |
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీలాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | రు. 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 60 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| వామపక్ష కమ్యూనిజం - ఒక బాలరిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

187 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఫిబ్రవరి 2017
సంపుటి : 15
సంచిక : 02







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
VEEKSHANAM
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 జనవరి నెలలో వచ్చిన విరాళాలు - ఎన్. వెంకటేశ్వర్లు, అమెరికా - రు. 10.000; శ్రేయోభిలాషి, అమెరికా - రు. 5,000; నరహరి, హైదరాబాద్ - రు. 2.500; రమేష్ గొండ్యాల, ముంబై - రు. 800, పి. వర్మ, బాపట్ల - రు. 10,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.***

గత సంచికలో పి.ఎల్. ఏసు రాసిన రాంగూడ సంఘటన ఆర్థిక రాజకీయ నేపథ్యం వ్యాసం చదివాను. ఈ వ్యాసం చదివే దానికి ముందు వరకు 33 మంది చనిపోయిన బెజ్జంగి ఎన్‌కౌంటర్ ఘటన పట్ల బయట ఉన్న ప్రజలకు ప్రజాసంఘాలు చేసిన ప్రచారముకు పూర్తి భిన్నంగా ఈ వాస్తవాలు ఉన్నాయి. ప్రజాసంఘాలు ఈ ఎన్‌కౌంటర్ కోవర్ట్ ఆపరేషన్ ద్వారా ఆహారంలో విషం పెట్టి చేసిన దాడిగా ప్రచారం చేశాయి. దీన్నే ప్రజలు పెద్ద ఎత్తున ఇప్పటివరకు నమ్మిన విషయం. కాగా మీడియా కూడా ఇదే ప్రచారం చేసింది. మరి మీడియా ప్రజాసంఘాల ప్రచారాన్ని నమ్మిందా? లేక ప్రజాసంఘాలు మీడియా ప్రచారాన్ని నమ్మినట్లా? లేదా ఈ రెండూ పోలీస్ ఇంటిలిజెన్స్ ప్రచారంలో ఇరుక్కుపోయినట్లా? అయితే ఈ వ్యాసం ద్వారా స్పష్టమవుతున్నదేమంటే మావోయిస్టు గెరిల్లాలు ఒక వీరోచిత ప్రతిఘటనతో, సమయస్ఫూర్తితో, సాహసంగా, కొందరు ప్రాణత్యాగం చేస్తూ మెజారిటీని రక్షించారని, మూడు వైపుల నుండి, ఒక వైపు మాత్రమే భూభాగం ఉండి, ఆ భూభాగం వైపు నుండే దాదాపు వెయ్యి మంది ప్రభుత్వ సాయుధ బలగాలు అత్యంత అధునాతన, శక్తివంతమైన ఆయుధాలతో దిగ్బంధించి, తప్పించుకోలేని విధంగా వారిపై కాల్పులు జరుపుతున్నప్పటికీ, సమయ స్ఫూర్తితో అటు మూడు వైపులు ఉన్న నీటిపై వెళ్లకుండా ప్రాణాలను సైతం త్యజిస్తూ, పోలీసుల వలయాన్ని ఛేదించుకుంటూనే వెళ్లిపోవడం మావోయిస్టు ప్రజా గెరిల్లా సేన పరిణతికి చిహ్నం. కొందరు ప్రాణత్యాగం జేస్తూ మెజారిటీ ప్రజా గెరిల్లా సైనికులను, పార్టీ నాయకులను కాపాడడం ఈ ఘటన ద్వారా మనకు తెలుపుతున్న విప్లవోత్తేజ స్ఫూర్తిదాయక సందేశమేమిటనగా, ప్రభుత్వ సాయుధ బలగాలు, ఈ సంఘటనలో అన్ని విధాల తమకే అనుకూలంగా మలుచుకొని, ఇక పూర్తి విజయం తమదేననే భరోసాతో, ఒక్కరు కూడా బతకకుండా అంతం చేయాలనే పక్కా ప్రణాళికతో దాడి మొదలుపెట్టినప్పటికీ, వ్యాసకర్త తెలిపినట్లే గెరిల్లాలు సెక్యూరిటీ పరంగా పూర్తిగా అప్రమత్తతగా లేని సమయంలో ఈ దాడిని వాళ్లు ఎదుర్కోవడం, మెజారిటీ కేడర్లను రక్షించుకోవడం, ఈ ఘటన విప్లవ విజయం పట్ల భరోసా నిచ్చే సంఘటన అనుకోవచ్చు. దేశవ్యాప్తంగా ప్రజలు విప్లవోద్యమంతో మమేకమై విప్లవిస్తే ఎంత అత్యంత అధునాతన ఆయుధాలు, టెక్నాలజీ కలిగిన ప్రభుత్వ సాయుధ బలగాలు ప్రజల చేతిలో ఓటమి చెందక తప్పదనే సత్యం ఈ ఘటన ద్వారా మనకర్థమవుతుంది. ప్రజా ఉద్యమాల పట్ల, విప్లవోద్యమం పట్ల అత్యంత కమిట్‌మెంట్‌తో పనిచేస్తున్న ప్రజాసంఘాల కృషి, త్యాగాన్ని గౌరవిస్తూనే, ఇలాంటి గొప్ప ప్రజాసైన్య విజయాన్ని మరుగున పరిచేలా జరిగిన ప్రచారం బాధ కలిగించేదే. అయితే ఇలాంటి పొరపాటును ప్రజాసంఘాలు గుర్తించి గుణపాఠాలు తీసుకుని సాగుతాయని భావిస్తున్నా. ఈ సందర్భంగా మరో అంశాన్ని కూడా ఇక్కడ ప్రస్తావిస్తాను. వ్యాసకర్త మొదటే సూచించినట్లుగా ప్రజాసంఘాలు, నిజనిర్ధారణ బృందాలు నిజనిర్ధారణకు వెళ్లినప్పుడు ఆ సంఘటనకు కారణమైన సామాజిక, ఆర్థిక, రాజకీయ కోణాలను కూడా సేకరించి చెప్పడం ద్వారా బయట ఉన్న ప్రజలకు ఒక విస్తృత కోణం అర్థమవుతుంది. తద్వారా సాయుధ పోరాటాన్ని అణచడానికి మాత్రమే ప్రభుత్వం తమ సాయుధ బలగాలను ఆయా ప్రాంతాల్లో దింపుతుందనే పాలకవర్గ దుష్ప్రచారాన్ని బట్టబయలు చేస్తూ అసలు వాస్తవాలను బయట ప్రజలకు తెలియజేయగలమని భావిస్తున్న.

– వి. కృష్ణమూర్తి
హైదరాబాద్

“రంగనాయకమ్మకీ మార్క్సిజానికీ ఏమీ సంబంధం లేదని... ఎన్నో కొటేషన్లతో స్పష్టంగా చూపిన తోలేటి జగన్మోహన్ రావుకి ధన్యవాదాలు” తెలిపారు జి. లింగమూర్తి (నవంబర్ సంచికలో). అలాగే, “మార్క్సిస్టు సిద్ధాంతం... సమగ్రమైనది” అన్న లెనిన్ మాటలను కూడా ప్రస్తావించారు. మరి, తోలేటి జగన్మోహన్ రావు దృష్టిలో మార్క్సిజం ఎలాంటిదో లింగమూర్తి మరిచారా? “మార్క్సిజం పరిపూర్ణ సిద్ధాంతం కాదు” అని, తన పుస్తకంలో (పే. 286) జగన్మోహన్‌రావు ప్రకటించిన దాన్ని లింగమూర్తి మరిచి పోయారా? మార్క్సిజం సమగ్రమైనది కాదని భావించే జగన్మోహన్ రావు, రంగనాయకమ్మకీ – మార్క్సిజానికీ ఏమీ సంబంధం లేదని ఎలా స్పష్టం చెయ్యగలరు? ఆయన్ని లింగమూర్తి ఎలా ప్రశంసించగలరు, కృతజ్ఞతలతో? రంగనాయకమ్మ పట్ల ఇతరేతర వ్యతిరేకత ఉంటే తప్ప అది సాధ్యం కాదు. ఆ కారణం చేతనే లింగమూర్తి, రంగనాయకమ్మ పట్ల వాస్తవ విరుద్ధమైన వ్యాఖ్య ఇంకోటి చేశారు. “ఇక కాపిటల్ ఆమె అనుకున్నట్టుగా ఉత్తి ఆర్థిక శాస్త్ర పుస్తకం కాదు. అది ఒక తాత్విక ప్రాపంచిక దృక్పథానికి ఆర్థిక సంబంధాల వ్యక్తీకరణ” అన్నారు. ఈ వ్యాఖ్య చూశాక, లింగమూర్తి, రంగనాయకమ్మ రాసిన ‘కాపిటల్ పరిచయం’ అసలు చదివారా, చదివినా సరిగా జీర్ణం చేసుకోలేదేమో (ఆయన మాటల్లో చెప్పాలంటే, “అజీర్ణ ఫలితమో”) అన్న అనుమానం కలుగుతుంది. ఈ అనుమానానికి ఆధారం: కాపిటల్ పరిచయం రెండవ సంపుటంలో, “మార్క్సిజం ‘ఆర్థిక శాస్త్రమే’ కాదు, ‘తత్వ శాస్త్రం’ కూడా!” అనే పేరుతో 16 పేజీల చాప్టరే ఉంది. ‘తత్వశాస్త్రం’ మీద రంగనాయకమ్మ ప్రదర్శించిన విసుగంతా, ఆ శాస్త్రాన్ని తెలుసుకోవాలనుకునే సాధారణ పాఠకులకు అర్థం కాని విధంగా, పాండిత్య ప్రదర్శన చేస్తూ, పరమ జటిలంగా, పాషాణ పాకంగా రాసే తత్వశాస్త్ర పండితుల మీదే! ఈ సంగతి, “తత్వశాస్త్రం విసుగెత్తించే శాస్త్రం” అని ఒక చాప్టరుకి రంగనాయకమ్మ పెట్టిన పేరుని బట్టి అర్థం చేసుకోవచ్చు.

– కస్తూరి రావిపాటి
సిన్‌సినాటి

జనవరి వీక్షణంలో తోలేటి జగన్మోహన్ రావు గారి వ్యాసం ఎన్నిసార్లు చదివినా, సెప్టెంబర్ సంచికలో నేను ఆయన్ని అడిగిన ‘ఆరు’ ప్రశ్నలలో ఏ ఒక్కదానికీ జవాబు లేదు. పైగా, రంగనాయకమ్మ ‘శ్రమశక్తి విలువ’ గురించి రాసిన వ్యాసాన్ని తెచ్చి అసందర్భంగా చర్చను ఎక్కడికో మళ్లించారు. కార్మికుడు, పెట్టుబడిదారుడితో ‘నేను నీకు అమ్మిన సరుకు మిగిలిన సరుకుల గుంపు కంటే భిన్నం’ అనీ, ఆ తరువాత ‘అది అదనాన్ని ఉత్పత్తి చేయగలదు’ అనీ నిరుపిస్తాడని, ‘కాపిటల్’ నుండి ఒక సంభాషణ ప్రస్తావించారు జగన్మోహన్

(మిగతా 59వ పేజీలో...)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# విస్ఫోటన అంచుకు చేరుతున్న అంతరాల వ్యవస్థ

వీక్షణం

భారతదేశం ప్రపంచంలోనే పెద్ద ప్రజాస్వామ్య దేశమనీ, రాజ్యాంగ ప్రవేశికలో సామ్యవాదం అనే మాట ఉన్నదనీ, ఆదేశిక సూత్రాలలో సంపద కేంద్రీకరణకు వీలులేని ఆర్థిక వ్యవస్థను నిర్మించడం ప్రభుత్వ బాధ్యత అని ఉన్నదనీ, డెబ్బై సంవత్సరాలుగా గద్దెనెక్కిన పాలకులు ప్రతి ఒక్కరూ అభివృద్ధి, పేదరిక నిర్మూలన, సమసమాజం అనే వాగ్దానాలే చేస్తున్నారనీ చిలక పలుకులు ఎన్ని విన్నా, వాస్తవాలు అందుకు పూర్తి భిన్నంగా ఉన్నాయి. దేశప్రజల కళ్ల ముందర కనబడే చేదు నిజాలు మాత్రమే కాదు, నిజాయితీగా పరిశీలించదలచుకున్న ప్రతి ఒక్కరికీ అవి కొట్టవచ్చినట్టు కనబడుతున్నాయి. దేశంలో విప్లవ పరిస్థితి ఉన్నదా లేదా, ప్రజలలో అసంతృప్తి ఉన్నదా లేదా అని మీనమేషాల పండిత చర్చ ప్రగతిశీల ఉద్యమకారులు చేస్తున్నారు గాని కఠోర భౌతిక పరిస్థితికి ఆ చర్చ లేదు. దేశంలో ఫ్రెంచి విప్లవం నాటి పరిస్థితి ఉన్నదని, అంతరాలు నానాటికీ పెరుగుతున్నాయని, ఈ అంతరాలు ఇలాగే పెరుగుతూ పోతే సమాజం విస్ఫోటక స్థితికి చేరుతుందని పరిశీలకులకు, చివరికి పెట్టుబడిదారీ విధానాన్ని, సామ్రాజ్యవాదాన్ని యథాతథంగా ఉంచదలచుకున్నవారికి కూడ అర్థమవుతున్నది.

భారత సామాజిక, ఆర్థిక స్థితి ఎలా విస్ఫోటక స్థితికి చేరుతున్నదో తాజాగా డావోస్‌లో విడుదలైన నివేదిక చెపుతున్నది. స్విట్జర్లాండ్ లోని డావోస్‌లో వరల్డ్ ఎకనమిక్ ఫోరమ్ వార్షిక సమావేశం జరుగుతుంది. ప్రపంచ దేశాలన్నిటి నుంచి సంపన్నులు, శక్తిమంతులు, నిర్ణయాధికారం ఉన్న రాజకీయ నాయకులు హాజరయ్యే ఈ సదస్సు ప్రధానంగా సామ్రాజ్య వాద, బహుళజాతి కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల గురించి చర్చిస్తుంది. ఈ సందర్భంగా జనవరి 16న అంతర్జాతీయ స్వచ్ఛంద సంస్థ ఆక్స్‌ఫామ్ 'ఒక్క శాతం వ్యక్తుల ఆర్థిక వ్యవస్థ' అనే నివేదికను విడుదల చేసింది. ఆ నివేదిక ప్రపంచ వ్యాప్తంగా పెరిగిపోతున్న అసమానతల గురించి, భారతదేశం గురించి చెప్పిన విషయాలు ఈ సమాజం గురించి ఆలోచిస్తున్న బుద్ధిజీవులు తప్పనిసరిగా పట్టించుకోవలసినవి.

ఆ నివేదిక ప్రకారం దేశంలోని మొత్తం సంపదలో 58 శాతం సంపద అత్యంత సంపన్నులైన ఒక్క శాతం వ్యక్తుల చేతుల్లో ఉన్నది. ప్రపంచవ్యాప్తంగా చూసినప్పుడు 50 శాతం సంపద ఒక్క శాతం మనుషుల దగ్గర ఉండగా, భారతదేశంలో ఈ అసమానత మరింత ఎక్కువగా ఉన్నది. బిలియన్ డాలర్లు (వంద కోట్ల డాలర్లు ? 6,800 కోట్ల రూపాయలు) ఉన్నవారిని డాలర్ శత కోటీశ్వరులు అంటారు. అటువంటి డాలర్ శతకోటీశ్వరులు దేశంలో ఏటేటా పెరిగిపోతున్నారు. ఈ స్థితిని ఇంకా వివరంగా చెప్పాలంటే దేశంలోని 57 మంది డాలర్ శతకోటీశ్వరుల దగ్గర ఉన్న సంపద మొత్తం 216 బిలియన్ డాలర్లు (పద్నాలుగు లక్షల డెబ్భైవేల కోట్ల రూపాయలు). అది దేశంలో అట్టడుగున ఉన్న 70 శాతం జనాభా సంపదతో సమానం. దేశంలో 84 మంది డాలర్ శతకోటీశ్వరుల దగ్గర 248 బిలియన్ డాలర్ల (పదహారు లక్షల ఎనభైఏడు వేల కోట్ల రూపాయలు) సంపద పోగుపడి ఉంది. దేశ సంపద మొత్తం 3.1 ట్రిలియన్ డాలర్లు (రెండు కోట్ల పదకొండు లక్షల కోట్ల రూపాయలు) కాగా దానిలో దాదాపు పది శాతం వంద కుటుంబాల దగ్గర ఉంది. భారత శతకోటీశ్వరులలో 46 శాతం తమ సంపదను కేవలం ప్రభుత్వానుమతులను తమకు అనుకూలంగా మలచుకోగల అధికారం నుంచి, ప్రభావం నుంచి, ప్రాధాన్యతా సౌలభ్యాల నుంచి గ్రహించారని కూడ ఈ నివేదిక ప్రకటించింది. అంటే ఈ సంపద పోగుపడడానికి ప్రధాన మార్గం అధికారవర్గాల ఆశ్రితులుగా ఉండడమే. కాగా ఈ అంతరాలు యథాతథంగా కొనసాగితే రానున్న ఇరవై సంవత్సరాలలో దేశంలో కేవలం 500 మంది వ్యక్తుల దగ్గర 2.1 ట్రిలియన్ డాలర్ల (ఒక కోటీ నలభై మూడు లక్షల కోట్ల రూపాయల) సంపద పోగుబడి వారి వారసులకు అందుతుందనీ, అది దేశ స్థూల జాతీయోత్పత్తి (జిడిపి) కన్న ఎక్కువనీ కూడ ఆ నివేదిక చెప్పింది.

ఇలా ఒకవైపు అసహ్యకరమైన, దిగ్భ్రాంతికరమైన స్థాయిలో సంపద పోగుపడడం మాత్రమే కాదు, దేశంలో వాస్తవంగా నెత్తురు చెమట చేసుకుని సంపద సృష్టిస్తున్న నిజమైన శ్రామికుల స్థితి ఎలా ఉన్నదో కూడ నివేదిక రేఖామాత్రంగా చెప్పింది. దేశంలోని ఒక బడా సమాచార సాంకేతిక పరిజ్ఞాన కంపెనీ ప్రధాన కార్యనిర్వహణాధికారికి ఆ సంస్థలో పనిచేసే సగటు ఉద్యోగి జీతం కన్న 416 రెట్లు ఎక్కువ జీతం వస్తున్నదని చెప్పింది. ప్రపంచంలోని బడా బహుళ జాతి దుస్తుల పరిశ్రమ కంపెనీలన్నీ కూడ భారతదేశంలోని నూలు స్పిన్నింగ్ మిల్లులతో సంబంధంలో ఉన్నాయనీ, ఆ స్పిన్నింగ్ మిల్లులన్నిటిలోనూ బాలికల నిర్బంధ శ్రమ సాగుతున్నదనీ, భారతీయ దుస్తుల కర్మాగారంలో శ్రామికుల సగటు వార్షిక జీతం కన్న 8,00,000 రెట్లు ఎక్కువ ఆదాయం ఆ కర్మాగారం నుంచి దుస్తులు తీసుకునే బహుళజాతి దుస్తుల కంపెనీ భాగస్వామికి అందుతున్నదనీ ఆ నివేదిక చెప్పింది.

ఈ భయానకమైన ఆర్థిక అంతరాలు భారత సమాజంలో అంతకు ముందు నుంచే ఉన్న కుల, మత, ప్రాంతీయ అంతరాలను మరింత బలోపేతం చేస్తున్నాయి. అన్నిరకాల, స్థాయిల అంతరాలు కలిసి, చెరబండరాజు అన్నట్టు 'భోగాలు, ఆనందయోగాలు కొందరివి, రోగాలు నొప్పులూ కోట్లాది ప్రజలవి' అనే స్థితిని పెంచుతున్నాయి. నిజానికి ఈ స్థితి అత్యల్పసంఖ్యాక పాలకవర్గానికీ, అశేష పీడిత జనవాహినికీ మధ్య వర్గపోరాటాన్ని పదునెక్కించి, ప్రజా విజయానికి దారితీయవలసి ఉండింది. కాని కర్మ సిద్ధాంతాన్ని, సామాజిక అంతరాలను, భేదాలను, పార్లమెంటరీ రాజకీయ భ్రమలను, అప్పుడప్పుడు విదిల్చే సంక్షేమ రాజ్యపు ఎంగిలి మెతుకులను వాడుకుని పాలకవర్గాలు ఏనాటికానాడు పబ్బం గడుపుకుంటున్నాయి. ఈ స్థితిని గుర్తెరిగి, విశ్లేషించుకుని, ప్రజలను ఐక్య సంఘటిత శక్తిగా మార్చడానికి, పాలకవర్గాల మీద పోరాటం ఎక్కుపెట్టడానికి తగిన వ్యూహాలను రచించుకునే స్వీయమానసిక శక్తుల సంసిద్ధత ఉంటే ఈ దేశంలో అత్యద్భుతమైన ప్రజావిజయానుకూల పరిస్థితి ఉందని సామ్రాజ్యవాద శిబిరం కూడ గుర్తిస్తున్నది. దేశంలోని ప్రజానుకూల శక్తులకు, బుద్ధిజీవులకు ఆ గుర్తింపు ఇంకా రావలసే ఉంది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# ఇది ప్రజాస్వామ్యం అనడం హాస్యాస్పదం

ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యత్వానికి రాజీనామా చేస్తూ ఇచ్చిన చరిత్రాత్మక ఉపన్యాసంలో తరిమెల నాగిరెడ్డి గారు 1969 మార్చ్ లో శాసనసభ బాతాఖానీ క్లబ్బు కన్న ఎక్కువ కాదని అన్నారు. ఐదు దశాబ్దాల తర్వాత అదే ప్రాంగణంలో సమావేశమవుతున్న తెలంగాణ శాసనసభ ఆ మాటను రుజువు చేయదలచుకున్నట్టుంది. తాజాగా జరిగిన శీతాకాలం సమావేశాలు ప్రజా ప్రయోజనాల గురించి చర్చకు, ప్రశ్నలకు, భిన్నాభిప్రాయాల ఘర్షణకు, కనీసం బాతాఖానీకి కూడ వేదిక కాలేదు. ఎన్నికల్లో 63 స్థానాలు గెలిచి, 19 మందిని, అంటే తన సొంతబలంలో మూడో వంతును ఇతర పార్టీల నుంచి ఆకర్షించి "తిరుగులేని" అధికారపక్షంగా ఉన్న తెలంగాణ రాష్ట్ర సమితి సభను ఇష్టారాజ్యంగా నడిపింది. సభ మొత్తం 94 గంటలు సాగితే అందులో ముఖ్యమంత్రి 9 గంటలకు పైగా, మంత్రులు 24 గంటలకు పైగా, అధికారపక్ష సభ్యులు 17 గంటలకు పైగా కలిసి యాభై గంటలు అధికారపక్షమే మాట్లాడింది. నామమాత్రంగా మిగిలిపోయిన ప్రతిపక్షాలు పాలకవర్గ తానులో ముక్కలే గనుక నిజమైన ప్రజాసమస్యలు చర్చకే రాలేదు. అత్యంత కీలకమైన భూసేకరణ బిల్లు, జిల్లాల పునర్వ్యవస్థీకరణ బిల్లు, కరీంనగర్, నిజామాబాద్, రామగుండం, సిద్దిపేట, ఖమ్మంల పోలీసు వ్యవస్థలలో సవరణల బిల్లులతో సహా మొత్తం 16 బిల్లులు తూతూ మంత్రంగా సభ ఆమోదాన్ని పొందాయి. ఒక బిల్లు చర్చించడానికి, కనీసం చదవడానికి ఎంత సమయం పడుతుందో కూడ లెక్కలేనంత హడావిడిగా ప్రవేశ పెట్టడం, చర్చ అయిందనిపించడం, ఆమోదించడం జరిగిపోయాయి. వాటిలో భూసేకరణ బిల్లుతో సహా ఐదు బిల్లులు ఒకే ఒక్క రోజులో ఆమోదం పొందాయి. సమాజం మొత్తాన్నీ, భవిష్యత్తునూ ప్రభావితం చేయగల విస్తృతమైన చట్టాలను ఇలా అడ్డగోలుగా ప్రజల మీదికి తోయడంలో తెరాస ప్రభుత్వం గత ఆరున్నర దశాబ్దాల పాలకవర్గాల వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్నానని రుజువు చేసుకుంది. నరహంతకుడు, కబ్జాకోరు నయీంకు రాజకీయ నాయకులతో, పోలీసులతో సంబంధాలు లేవని పచ్చి అబద్ధాన్ని న్యాయస్థానం ముందు చెపితే, దానిమీద శాసనసభలో ప్రభుత్వాన్ని ప్రశ్నించే దిక్కే లేకుండా పోయింది. తెలంగాణ ప్రజా ఉద్యమ ఆకాంక్షలను నెరవేర్చే ప్రయత్నాలు లేకపోవడం, అధికార పక్షం కనీసం తన ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాలైనా నెరవేర్చక పోవడం, ఆరు దశాబ్దాల పాటు ఏ స్వార్థప్రయోజన శక్తుల విధానాలకూ, వ్యవహారాలకూ తెలంగాణ అణగిపోయిందని ఉద్యమం ఎలుగెత్తి చాటిందో ఆ శక్తులే ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ అధికారం చలాయిస్తూ ఉండడం, ఇంకా తెలంగాణ వనరుల దోపిడీ యథాతథంగా సాగు తుండడం, రైతాంగ ఆత్మహత్యలు, నిరుద్యోగం, అవినీతి, పారిశ్రామిక వెనుకబాటుతనం, రాజ్యాంగబద్ధ పౌరహక్కుల ఉల్లంఘన వంటి అసలు సమస్యలేవీ చర్చకే రాలేదు. ఎప్పటికన్న ఎక్కువ రోజులు జరిగిందనీ, ప్రతిపక్షాల కోరిక మేరకు జరిగిందనీ ఎన్ని గొప్పలు చెప్పుకున్నా తెలంగాణ శాసనసభ ప్రజాప్రాతినిధ్య సభగా మాత్రం జరగలేదు. ప్రభువు తలచుకున్నట్టుగా జరిగింది. అంటే ఇది ప్రజాస్వామ్యం కాదనీ, కొత్త రూపపు రాచరికమనీ రుజువు చేసింది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ప్రపంచవేదికల మీద అవే ప్రగల్భాలు

ఇంట్లో ఈగల మోత, బైట పల్లకి మోత అని తరతరాల తెలుగువారి వివేకం సృష్టించిన నుడికారాన్ని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అడుగడుగునా నిజం చేయదలచుకున్నట్టున్నారు. విభజనానంతర రాష్ట్రంలో ప్రజా సమస్యలు పెరిగిపోతుంటే, అటు కేంద్ర ప్రభుత్వం హామీలను ఉల్లంఘి స్తుంటే, ఇటు తమ ప్రభుత్వం గత రెండున్నర సంవత్సరాలలో చేసిన వాగ్దానాలను నెరవేర్చకుండా ప్రజాజీవితాన్ని అతలాకుతలం చేస్తున్న ప్రభుత్వం దేశదేశాల సంపన్నులకు ఎర్రతివాచీలు పరుస్తున్నది. సింగపూర్ నుంచి దావోస్ దాకా బహుళ జాతి సంస్థల, స్వార్థ ప్రయోజన కార్పొరేట్ శక్తుల ప్రశంసలు చాలుననుకుంటున్నది. ఆ విదేశీ భూకబ్జాదారులకూ, తమ ఆశ్రితులకూ వేలాది ఎకరాల భూమి కట్టబెట్టడానికి అభివృద్ధి పేరిట, పథకాల పేరిట రైతులనుంచి దురాక్రమించడానికి ప్రయత్ని స్తున్నది. ఇటుమూల చిత్తూరులో ఎర్రచందనం మాఫియాలలో రాజకీయ నాయకుల, పోలీసు అధికారుల అక్రమాలను స్వయంగా ఒక పోలీసు ఉన్నతాధికారే అంగీకరించిన ఘటన నుంచి అటుమూల శ్రీకాకుళంలో వంశధార నిర్వాసితుల క్రియాశీల ఆందోళన దాకా, అధికారపక్ష శాసనసభ్యుడు ప్రేమ పేరుతో వంచించి, రెండో పెళ్లి చేసుకున్న యువతిని హత్యచేసే దాకా, ప్రశ్నించే ప్రతి గళం మీద దాడులు, నిందలు, అబద్ధ ప్రచారాల దాకా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జరపని అక్రమం లేదు. రాష్ట్రానికి అదనపు నిధులు సమకూర్చే ప్రత్యేక హోదా ఇస్తామని, అదనపు సౌకర్యాలు కల్పిస్తామని పార్లమెంటు సాక్షిగా హామీ ఇచ్చిన కేంద్ర ప్రభుత్వం ఆ హామీలన్నిటినీ ఉల్లంఘిస్తుంటే, ఆ మంత్రివర్గంలో భాగం కూడ పంచుకుంటూ నిలదీసి అడగలేని దుస్థితిలో ఉన్నది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. ప్రత్యేకహోదా వల్ల ప్రజలకు ఒరిగేది పెద్దగా ఏమీ లేకపోయి నా, కనీసం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల దగాకోరు విధానాలను విప్పిచెప్పి, ప్రజా చైతన్యాన్ని రగిలించడానికి ఒక సాధనంగా దాన్ని వాడుకోవడానికి కూడ ప్రతిపక్షాలు సిద్ధంగా లేవు. తమిళనాడు జల్లికట్టు ఆందోళన తర్వాత ప్రత్యేకహోదా కోసం ప్రజాసమీకరణ జరపాలనే ప్రయత్నాలలో చిత్తశుద్ధి అనుమానాస్పదమే అయినా, ఆ మాత్రం ప్రయత్నాలను కూడ సహించలేని నిరంకుశత్వంతో ప్రభుత్వం దమనకాండ కు పాల్పడుతున్నది. ఒకవైపు తనకు వోట్లు వేసి గెలిపించిన ప్రజలతో ఇంత నిరంకుశంగా, నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్న ప్రభుత్వం తాను ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్ (వ్యాపార సౌలభ్యం – దోచుకునే, వనరులు కొల్లగొట్టే సౌలభ్యం) జాబితాలో దేశంలో అన్ని రాష్ట్రాలలోకీ అగ్రస్థానంలో ఉన్నానని గప్పాలు కొట్టుకుంటున్నది. బహుళజాతి సంస్థల వల్ల, బహుళ జాతి సంస్థల కోసం, బహుళజాతి సంస్థల చేత అందుతున్న ఈ ప్రశంస లను మళ్లీ దావోస్ వంటి వేదికల మీద ప్రదర్శించుకుంటూ మరిన్ని బహుళజాతి సంస్థలను ఆహ్వానిస్తున్నది. ఈ ప్రభుత్వ దుర్మార్గాన్ని అడు గడుగునా వివరించి, విశ్లేషించవలసిన బుద్ధిజీవులు, ఆ చైతన్యంతో ఈ విధానాలను అడ్డుకోవలసిన విశాల ప్రజారాశులు అందుకు తగినస్థాయి లో సిద్ధంగా లేకపోవడమే ఆంధ్రప్రదేశ్ సమాజం ముందున్న విషాదం. వీ

# దుర్మార్గానికి అద్దం ట్రంప్ తొలి అధ్యక్షోపన్యాసం

సామ్రాజ్యవాద అగ్రాసనాధిపతి, అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడుగా ఎన్నికైన డొనాల్డ్ ట్రంప్ జనవరి 20న తన పదవి స్వీకరిస్తూ చేసిన పదిహేడు నిమిషాల ఉపన్యాసం రానున్న నాలుగు సంవత్సరాలలో అమెరికా పాలక విధానాలు మరెంతగా బరి తెగించనున్నాయో విశదం చేస్తున్నది. తడిగుడ్డతో గొంతు కోసే రాజకీయ నాయకులందరూ చేసే ఉపన్యాసాల లాగనే ఈ ఉపన్యాసం కూడ చాల ఆదర్శవంతమైన, ఆకర్షణీయమైన, ప్రజానుకూలమని భ్రమ గొల్పే ఆడంబరపు మాటలతో మొదలయింది. పాలకులు ఇంతకాలమూ తమ సంగతి తాము చూసుకున్నారనీ, ప్రజల సంగతి పట్టించుకోలేదనీ, వాషింగ్టన్ బలపడింది గాని అమెరికన్ ప్రజలకు అందులో వాటా దక్కలేదనీ ట్రంప్ అన్నాడు. తమ పిల్లలకు మంచి చదువులు కావాలనీ, తమ కుటుంబాలకు భద్రత కావాలనీ, తమకు మంచి ఉద్యోగాలు కావాలనీ ప్రజలు న్యాయమైన, సకారణమైన కోరికలు కోరారనీ, కాని అవి దక్కలేదని అన్నాడు. దారిద్ర్యంలో చిక్కిన తల్లులూ శిశువులూ, దేశం మొత్తం విస్తరించి సమాధిరాళ్లలా ఉన్న తుప్పు పట్టిన కర్మాగారాలు, సంపదతో నిండినప్పటికీ జ్ఞానం ఇవ్వని విద్యాలయాలు, నేరంతో, హంతక ముఠాలతో, మాదకద్రవ్యాలతో అణగారిపోతున్న దేశపు శక్తి – ఈ అమెరికన్ దురాగతం ఆగిపోవాలి అని సమ్మోహకంగా మాట్లాడాడు. అమెరికన్ ప్రజల నిజమైన సమస్యలను ఇలా తన స్వప్రయోజనాల కోసం వాడుకుని, ఈ దుస్థితికి కారణంగా ఒక విదేశీ బూచిని తయారు చేశాడు. విదేశాలలో పరిశ్రమల కోసం అమెరికా తన పరిశ్రమలను పోగొట్టుకుందట. ఇతర దేశాలను కాపాడడానికి, ఇతర దేశాల సైన్యాలకు తన నిధులు వెచ్చించిందట. ఇతరదేశాల సరిహద్దులు కాపాడడంలో పడి, తన సరిహద్దులను మరిచిపోయిందట. కోట్ల కోట్ల డాలర్లు విదేశాలలో ఖర్చు పెట్టి తన సొంత మౌలిక సౌకర్యాలను దెబ్బతీసుకుందట. ఇతర దేశాలను సంపన్నంగా, బలంగా తయారు చేసి, తన సంపదను పోగొట్టుకుందట. ఈ అవకతవకలను సరి చేయడానికి అవతరించిన అవతార పురుషుడిగా తాను ఇక అమెరికా ఫస్ట్ (అమెరికాకే అగ్రాసనం) అనే నినాదం ఇస్తున్నాడట. ఇక నుంచి అన్ని నిర్ణయాలూ అమెరికన్ల కోసం మాత్రమే తీసుకుంటారట. తమ సరిహద్దులను రక్షించుకుంటారట. తమ కంపెనీలను పరిరక్షించుకుంటారట. తమ ఉద్యోగాలను రక్షించుకుంటారట. అమెరికన్ ఉత్పత్తులు మాత్రమే కొని, అమెరికన్లను మాత్రమే ఉద్యోగాల్లో పెట్టుకునే వ్యవస్థను తయారు చేస్తారట. "ఇస్లామిక్ టెర్రరిజాన్ని" భూమి మీది నుంచి తుడిచిపెట్టేస్తారట. మొత్తం మీద అమెరికాలో పెరుగుతున్న రుణభారం, నిరుద్యోగం, అసమానతలు, పేదరికం వంటి సమస్యలను సాకుగా చూపుతూ, జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడానికి కల్పిత శత్రువుల దిష్టిబొమ్మలు తయారుచేస్తూ, మరొకసారి ప్రపంచం మీద పంజా విసరడానికి అమెరికన్ పాలకవర్గాలు వ్యూహాలు రచిస్తున్నాయనడానికి ఈ ఉపన్యాసం సూచిక. డెమొక్రటిక్ అధ్యక్షుడిగా ఒబామా కూడ రిపబ్లికన్ అధ్యక్షుల కంటె ఎక్కువ కాలం, ఎక్కువ బాంబు దాడుల యుద్ధాలు చేశాడనే మాట నిజమే గాని, అమెరికన్ అగ్రరాజ్య అహంకారంలో మరొక రెండాకులు ఎక్కువ చదువుకున్నానని ట్రంప్ మొదటి రోజే ప్రకటిస్తున్నాడు. ఈ ధాష్టీకాన్ని ఎదిరించడానికి ఏకం కావడమే ప్రపంచ ప్రగతిశీల శక్తుల కర్తవ్యం. వీ






❖ **ప్రజాకళలు** – పికెఎం ప్రభాకర్ రచనలు – విరసం ప్రచురణ – 135 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 70, ప్రతులకు: డి.వి. రామకృష్ణారావు, ఎంఐజి–14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్–500 040; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **వెండితెరపై మహాప్రస్థానం** – శ్రీశ్రీ సినిమా పాటలు – శ్రీశ్రీ సాహిత్య నిధి ప్రచురణ – 47 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40



❖ **జ్ఞానగుళికలు** – సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణ – 79 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60
పై రెండు ప్రతులకు: ఆలోచన, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ–520 004. ఫోన్: 0866–6617375, సెల్: , 9246277375; ఈమెయిల్: srisri_sahityanidhi@yahoo.com




❖ **అవగాహన** – ఆధునిక సాహిత్య వ్యాసాలు – తుమ్మల రామకృష్ణ – సంపాదకులు: డా. జి. వెంకటరమణ, ఎం. నాగరాజు – చంద్ర పబ్లికేషన్స్ – 143 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 125, ప్రతులకు: చంద్రకళ పబ్లికేషన్స్, టి. విజయలక్ష్మి, ప్లాట్ నం. 204, సిగ్మా సెంట్రల్, తారానగర్, శేరిలింగంపల్లి, హైదరాబాద్–19, ఫోన్: 9949055015




❖ **ఆంధ్ర రాష్ట్రంలో వామపక్ష ఉద్యమ చరిత్ర – 1934–56** – డా. కందుకూరి రమేష్ – పాలపిట్ట బుక్స్ – 228 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 160




❖ **కథలు – హాస్య కథలు** – భీమరాజు వెంకటరమణ – పాలపిట్ట బుక్స్ – 112 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80
పై రెండు పుస్తక ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036; ఫోన్: 040–27678430 ఈమెయిల్: palapittabooks@gmail.com




❖ **ఆటలు కథలు డ్రామాలు పాటలు క్రాఫ్ట్ పిల్లలకు ఎందుకు?** – వై. మాలతీకృష్ణ – మంచి పుస్తకం; అలరు ప్రచురణలు, దేవినేని సీతారావమ్మ ఫౌండేషన్ – 39 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 20




❖ **బడి** – ఎలా ఉంది? ఏం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? ఎవరు చెయ్యాలి? – శాంతివనం మంచికంటి – మంచి పుస్తకం – 72 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 35
పై రెండు ప్రతులకు: మంచి పుస్తకం, 12-13-439, వీధి నం.1, తార్నాక, సికింద్రాబాద్ – 500017; ఫోన్: 94907 46614; ఇమెయిల్: info@manchipustakam.in; www.manchipustakam.in




❖ **మొదటి చెంచు మహాసభ** – తెలంగాణ వికాస సమితి – 56 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: దేశపతి శ్రీనివాస్, ఒఎస్‌డి, సిఎం, మమత 'సి' బ్లాక్, సెక్రటేరియట్, హైదరాబాద్. ఫోన్: 9553953330




❖ **తెలంగాణ సాహిత్య పీఠికలు** – డా. బన్న అయిలయ్య – నానీ ప్రచురణలు – 295 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200, ప్రతులకు: శ్రీమతి కె. విజయ, 2-7-1261, 'రాజగృహం' విజయపాల్ కాలనీ, హన్మకొండ – 506 370; ఫోన్: 0870–2456001



❖ **ఈ మట్టి ఆక్రోశం** – బండి చంద్రశేఖర్ – కోటి లింగాల ప్రచురణలు– 116 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: బండి చంద్రశేఖర్, 7-2-904/1, మంకమ్మ తోట, కరీంనగర్ – 505 001; ఫోన్: 944087930 అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **మళ్లీ మళ్లీ ఉదయిస్తాను** – కవిత్వం – మద్దెర్ల రమేశ్ – జయలక్ష్మి ప్రచురణలు – 106 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 190, ప్రతులకు: మద్దెర్ల సరోజినిదేవి, ఇం.నం. 3-2-74/1, పాతబజార్, మహబూబాబాద్ జిల్లా; సెల్: 99851 35771, 99851 00771




❖ **బ్రేకింగ్ న్యూస్** – కవిత్వం – కోట్ల వెంకటేశ్వరరెడ్డి – ధ్వని ప్రచురణలు – 183 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 150, ప్రతులకు: ధ్వని పబ్లికేషన్స్, 7-5-297, లక్ష్మీనగర్ కాలనీ, మహబూబ్‌నగర్ – 509 002; ఫోన్: 9849444944




❖ **ఒకప్పుడు మనుషులుండేవారు!** – కవిత్వం – పెద్దన్న మారాబత్తుల – తులసి ప్రచురణలు – 136 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: తులసి ప్రచురణలు, పెద్దన్న మారాబత్తుల, 2-206, మామునూరు, ఎర్రుపాలెం (మం), ఖమ్మం జిల్లా; ఫోన్: 9866881140; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **కథా భారతి** – అనువాద కథలు – ఆర్. శాంతసుందరి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 197 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 140




❖ **తెలంగాణం** – వ్యాసాలు – సంకలనం: వట్టికోట ఆళ్వారుస్వామి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 316 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200
పై రెండు పుస్తకాల ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్–500 068, తెలంగాణ ఫోన్ : 040–24224453/54

# అలుపెరగని అక్షరయోధుడు, వీక్షణం వ్యవస్థాపక సంపాదకుడు
# వి. హనుమంతరావుకు అక్షర నివాళి

## నేను - వి. హనుమంతరావు గారు

- దాసరి అమరేంద్ర
రచయిత

హనుమంతరావుగారు నాకు 35 ఏళ్లుగా తెలుసు. లౌకిక దృష్టితో చూస్తే ఆయన నాకు బంధువు - మా తమ్ముడి మామగారాయన.

వాస్తవానికి ఆయన నాకు స్నేహితుడు. మా స్నేహానికి పునాది - లవ్ ఎట్ ఫస్ట్ మీట్. ఒకర్ని ఒకరు ఇష్టపడ్డాం. ఆయన వయసును నేనూ, నా వయసును ఆయనా - మా మధ్య ముప్పై ఏళ్ల ఎడముంది - అధిగమించి స్నేహితులమయ్యాం. నేను ఆయన సంపూర్ణ వ్యక్తిత్వానికి అభిమానినయ్యాను. ఆయనకూ నా మీద అవధిమీరిన అభిమానం, ప్రేమ, వాత్సల్యం కురిపించారు. నేను గత పాతికేళ్లుగా రాస్తున్నాను. కథలూ, వ్యాసాలూ, సమీక్షలూ, ఇంటర్వ్యూలూ, కవితలూ, అనువాదాలూ - ఇదో జాక్ ఆఫ్ ఆల్‌ట్రేడ్ ప్రయాణం. ఆ ప్రయాణానికి పచ్చజెండా ఊపి నన్ను ముందుకు నడిపించింది హనుమంతరావు గారు.

1989లో నేను పదిరోజుల పాటు ఆఫీసు పనిమీద లండన్, పారిస్, మ్యూనిక్ నగరాలు చూసివచ్చాను. ఎనిమిది తొమ్మిది గంటలు ఆఫీసు పని, మరో ఏడెనిమిది గంటలు ఆయా నగరాల్లో అసంప్రదాయ విహారాలూ - అలా గడిచాయి ఆ పది రోజులు. ఆ జ్ఞాపకాలు వెంటాడి 'వేధించగా', వాటికి అక్షరరూపం ఇవ్వాలి అన్న తపన నిలవనీయకపోగా - ఓ అరవై పేజీలు రాస్తూ పోయాను. అలా రాస్తున్నప్పుడు అదో ట్రావెలాగ్ అనీ, దాన్ని ప్రచురించవచ్చనీ - అసలా భావనే లేదు. ఆ కాగితాలు హనుమంతరావుగారి కంటపడ్డాయి. ఆయనకు నచ్చాయి. 'వాటిని ప్రచురింపజేసి తీరాలి' అని ఆయన అపర భగీరథుడయ్యారు. చివరికి 'ఉదయం' దినపత్రిక ఆదివారం అనుబంధంలో సీరియల్‌గా వచ్చేవరకూ వదిలి పెట్టలేదు. ఆ సీరియల్‌కు మంచి స్పందనే వచ్చింది. నాలో విశ్వాసాన్ని, ఉత్సాహాన్ని నింపింది. అలా రాసుకుంటూ పోయేలా చేసింది.

ఆ 'మూడు నగరాలు' యాత్రాగాథ ప్రచురితమయ్యాక, ఒకటి రెండేళ్ల పాటు నేను ఏది రాసినా, ఏది ప్రచురితమయినా ఆయన స్పందించి ఉత్తరం రాసేవారు. ముఖ్యంగా ఎకనమిక్ టైమ్స్, ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్, హిందుస్థాన్ టైమ్స్‌లలో వ్యాసాలు వచ్చినపుడు సంబరపడిపోయి 'తొలి ప్రయత్నాలలోనే జాతీయ స్థాయి ఆంగ్ల పత్రికలలోకి అడుగుపెట్ట గలిగావు. అందుకోనా అభినందనలు. ఇక నీకు తిరుగులేదు. ముందుకు సాగిపో' అని రాసారు. ఉత్తర రూపంలో ఆయన ప్రోత్సహించడం అదే చివరి సారి. బహుశా నాకు ఇక అలాంటి ప్రోత్సాహాల అవసరం తీరిందని ఆయన భావించి ఉండాలి.

ఈనాటి మధ్యతరగతి జీవులు చాలామంది నోట్లో వెండి బంగారాల స్పూన్లతో కాకపోయినా కనీసం స్టెయిన్‌లెస్ స్టీల్ చెంచాలతో పుట్టినవాళ్లు, ఆనాడు కూడా చాలమంది తమతమ కుటుంబాల ఆధారపీఠాలు ఏర్పరచగా ఆయా పునాదుల మీద నిలబడి, చదివి, ఉద్యోగించి, సంపాదించి రాణించిన వాళ్లు. స్వయం శక్తితో తనను తాను ముందుకు తీసుకువెళ్లి, ఆధారం నిర్మించుకొని జీవితాన్ని సఫలం చేసుకొన్న అరుదైన మనుషులూ మనలో ఉన్నారు. అలాంటి సెల్ఫ్‌మేడ్ పర్సన్ హనుమంతరావు గారు.

ఎస్సెల్సీ 'డిగ్రీ', 'హస్తవ్యహస్తం' చేతిలో పెనిసిలు ముక్క - వీటిలో వృద్ధియానం ఆరంభించిన హనుమంతరావు గారు సుందరయ్యగారి అభిమాన స్టెనోగ్రాఫర్‌గా ఆ ప్రయాణం మొదలుపెట్టి, నెహ్రూ నాటి పార్లమెంట్ విలేఖరిగా ముందుకు సాగి, ఐఎన్నెస్ విక్రాంత్‌లో బంగ్లా యుద్ధ వార్తలను ప్రపంచానికి అందించి, ఈనాడుకు శ్రీకారం చుట్టిన మూలజట్టు సభ్యుడయ్యి, డేటా న్యూస్ ఫీచర్స్ స్థాపకుడయ్యి, వేలాది వ్యాసాలు రాసి, అధికారులూ మంత్రులూ ఇబ్బంది పడుతూనే అభిమానించే ఆర్థిక వ్యాసకర్తగా పరిణమించి, నిష్క్రమణకు నెల రోజులు ముందుగా కూడా ఓ బృహత్ నివేదిక రూపకల్పన గురించి ఆలోచించిన ఓ స్వయం సిద్ధ మనిషి అనడం సూర్యుడు వెలుగూ వేడీ ఇస్తాడు అనడమంత. స్వభావోక్తి ఆయన పరిజ్ఞానం, జ్ఞానం పూర్తిగా స్వార్జితాలు.

నాతో ఎప్పుడు మాట్లాడినా ఆయన నెమ్మదిగా, శాంతంగా, మృదువుగా మాట్లాడేవారు. అసలు ఎవరి మీదా ఆయన గొంతెత్తడం నేను చూడలేదు. ఎంత కోపం వచ్చినా, ఎంత అసహనం కలిగినా - మనుషుల మీద గానీ, వ్యవస్థమీద గానీ - మాట విసిరేవారు కాదు. ఎవరి గురించీ ఆయన కఠినంగా గానీ పరుషంగా గానీ మాట్లాడడం వినలేదు. ఎంతోమంది గురించి గొప్పగా చెప్పడం మాత్రమే విన్నాను.

నిజానికి ఆయన కోపాలూ, ఆగ్రహాలూ, అసంతృప్తులూ మనుషుల మీద కానే కాదు. వ్యవస్థ మీద. అది మనకు అనునిత్యం కనిపించి ప్రత్యక్షంగా ప్రభావం చూపించే సమీప సూక్ష్మ వ్యవస్థ కావచ్చు. మనకు ఏ మాత్రం కనిపించకపోయినా సర్వ ప్రపంచాన్ని సర్వకాలాల్లోనూ ప్రభావితం చేసే స్థూల వ్యవస్థ కావచ్చు. మనుషులు వ్యవస్థ చేతిలో పనిముట్లు కాబట్టి తన ఆగ్రహాన్ని వ్యవస్థ మీదనే ఎక్కుపెట్టవలసి ఉంటుందన్న అవగాహన ఆయనకు ఉంది.

మళ్లీ ఆ వ్యవస్థ మీది ఆగ్రహమూ 'ధ్వంస రచన' కానే కాదు. సమస్యల మీద కేంద్రీకృతమైన ఆగ్రహం కాదది. పరిష్కారాల కోసం వెదికే నిర్మాణాత్మక అసంతృప్తి హనుమంతరావు గారిది. అలాగే ఆయన విమర్శ వస్తునిష్ఠ - ఆబ్జెక్టివిటీ - కలది. డేటా ఆధారితం. తన వ్యక్తిగత అభిప్రాయాలకన్నా గణాంకాలూ, సమాచారమూ ఏం చెప్తున్నాయో దానికే విలువ ఇచ్చిన మనిషి ఆయన. చాలామందికి ఒక అపోహ ఉంటుంది. 'వ్యక్తిగత జీవితం వేరు, వృత్తి గత జీవితం వేరు. వీటని వేరువేరుగానే చూడాలి. ఆ విభజన రేఖను స్పష్టంగా గుర్తించి గౌరవించాలి. ఆ రెండు జీవితాలనూ కలగాపులగం చెయ్యకూడదు.

ఇది ఒక భ్రమ. ఆ మాట వీఎచ్‌కు తెలుసు. ఆ రెండు జీవితాలకూ మధ్య ఏ విభజన రేఖా లేదని తెలుసు. ఆ స్పష్టత ఆయనలో ఉంది.

ఆయన బతికిన తొంభై రెండేళ్లలో, ఏడాదికి మూడొందల అరవై అయిదు రోజుల్లో, రోజుకు ఇరవై నాలుగ్గంటల్లో – పనిచేసారు. కుటుంబంతో గడిపారు. స్నేహితుల్ని కలుసుకొన్నారు. ప్రపంచాన్ని చూసారు. మరో ప్రపంచం కోసం తపన పడ్డారు. జీవించారు.

'ఇదిగో దీనికి ఇదీ సమయం' అనలేదు. 'దానికి నా దగ్గర సమయం లేదు' అని ఏనాడూ అనలేదు. దాటరాని, దాటలేని, దాటగూడని విభజన రేఖలున్నాయనలేదు.

జర్నలిజాన్ని, రచనను శ్వాసించినా, కుటుంబాన్ని బంధువుల్ని ప్రేమించినా, హితులకూ, సన్నిహితులకూ, స్నేహితులకూ అభిమానాన్ని పంచినా, ప్రపంచాన్ని కౌగిలించుకొన్నా ఆ పనులన్నీ అలవోకగా చేసారు. ఒకే ఒక్క జీవితం జీవిస్తూ చేసారు. 'పరిపూర్ణ జీవితమంటే ఇదీ' అని చెప్పకుండానే చెప్పారు.

ఆయన ఒక నిరంతర విద్యార్థి.

'ఇంత చూసాను. ఇంత చేసాను. నాకు ప్రపంచం తెలుసు. బతుకంతా తెలుసు..' అని ఆయన ఏనాడూ భావించలేదు. 'తనకు తెలిసింది అణువంత, తెలియనిది కొండంత' అన్న ప్రాథమిక అవగాహన ఉన్న మనిషి ఆయన. నేర్చుకోవడం విషయంలో ఆయన అచ్చమైన పసిబాలుడు.

ఓ ఏడాది క్రితం ఫోన్ చేసి పిలిచారు. వెళ్లాను. రెండు గంటలు మాట్లాడుకొన్నాం. 'డిఫెన్స్ రిసెర్చి గురించీ, ఉత్పత్తుల గురించీ కటువైన విమర్శలు ఏళ్లతరబడి వినపడుతున్నాయి. నువు డిఫెన్స్ ఫ్యాక్టరీలో ఓ జీవితకాలం పనిచేసావు కదా. నీ అనుభవాలూ అవగాహనా చెప్పు' అన్నారు. విన్నారు. ఆకళించుకొన్నారు. ఆ తర్వాతే ఆ విషయం గురించి వ్యాసం రాశారు.

అలాగే ఈ మధ్య తన మనవరాలు వరస అయిన పల్లవితో 'నాకు ఎకనమిక్స్ చదువుకోవాలని ఉంది. సాయం చెయ్యగలవా' అన్నారట. ఇంకో రెండేళ్లు ఉండి ఉంటే అదీ చదివి ఉండేవారు.

*ఒక అన్వేషి – ఒక విశ్వప్రేమ*
*ఒక నిరంతర చింతనాశీలి. విద్యార్థి*
*మనిషి బాగు కోసం తపించిన మనిషి*
*వెళ్లిపోయారు. పూర్ణ జీవితం గడిపి –*
*వెళ్లిపోయారు!*

వీ

# నా జీవన గమనాన్నే మార్చేసిన వి.హెచ్ పరిచయం

**– విద్యాభూషణ్**
జర్నలిస్ట్

మొట్టమొదటి సారిగా నేను హనుమంతరావు గారిని కలిసింది – 1991 చివర్లో అనుకుంటా. 'ఏగ్రో ఇండస్ట్రీస్'లో కొలువు నిమిత్తం 1988 జూన్‌లో నగరానికి వచ్చిన నేను 1990 నాటికల్లా బైటపడ్డాను. విశాలాంధ్రలో ప్రూఫ్‌రీడర్‌గా ఓ సంవత్సరం పనిచేసిన మీదట మళ్లీ ఉద్యోగ ప్రయత్నం చేయాల్సి వచ్చింది. అప్పుడు రంగనాయకమ్మ – బాపూజీ గార్ల సిఫార్సు మేరకు హనుమంతరావు గారి దగ్గర పనిచేసే అవకాశం కలిగింది. అప్పటి నా కర్తవ్యం ఏంటంటే ఇబ్బడి – ముబ్బడిగా పడి ఉన్న విహెచ్ రచనలను చదివి, సబ్జెక్ట్ వైజ్‌గా సెపరేట్ చేయడం. ఈ పనిని ఆయన సంతృప్తి మేరకు సరిగ్గానే నిర్వహించాననుకుంటాను. ఎందుకంటే ఆ పనైన తరువాత, నీవు వేరేచోట పనిచేయడం ఎందుకు? మా డేటా న్యూస్ ఫీచర్స్ (డిఎన్ఎఫ్) లో పనిచేయొచ్చు కదా అని ప్రతిపాదించారు. అప్పుడప్పుడే డిఎన్ఎఫ్ కాలేజ్ ఆఫ్ జర్నలిజం ప్రారంభిస్తున్న తొలి దినాలు. కరస్పాండెన్స్ కోర్సు (దూర విద్య విధానం)గా ప్రారంభమైనందున విద్యార్థుల నమోదు – చెల్లింపుల – సక్రమ నిర్వహణావసరాన్ని కల్పించింది. ఆ అవకాశాన్ని వినియోగించు కున్నాను. తరువాత జర్నలిజానికి పునాది వేసే రంగాల ఎంపిక – పాఠాలను రాయించడం – విద్యార్థులకు కాంటాక్ట్ తరగతులను నిర్వహించడం వంటి బాధ్యతలను చూడాల్సి వచ్చేది. శక్తి మేరకు చేయగలిగా. విధి నిర్వహణలో భాగంగా చర్చల్లో పాల్గొనడం – కాంటాక్ట్ క్లాసుల అధ్యాపకుల పరిచయాలు క్రమేపీ జర్నలిజం పట్ల మక్కువను పెంచాయి. దీనికి తోడుగా విహెచ్ గారి ప్రోత్సాహం. 'నీవు రాయగలవు. రాయి' అని ప్రోత్సహించి నాడే కొన్ని ఆర్టికల్స్‌ను రాయించారు. ఉదయం పత్రికలో అడపాదడపా వస్తూండేవి. ఆ క్రమంలో ఎబికె గారి పరిచయం. తదనంతరం వారి 'వార్త' పత్రిక ప్రారంభం కావడం. విహెచ్ గారి సిఫార్సుతో 'వార్త' పత్రికలో కొలువు. ఈ రీతిన పాత్రికేయునిగా మీ ముందు నిలవగలిగాను. ఇందుకు పూర్తిగా హనుమంతరావు గారే కారణ భూతులు.

నాటి పరిచయం నేటి వరకూ కొనసాగుతూనే వచ్చింది. సాధారణంగా నాదో వింత ప్రవృత్తి. మెజారిటీగా భావ సామీప్యం కుదిరితేనే, నా సహచర్యం కొనసాగ గలుగుతుంది. ఏమాత్రం భిన్నాభిప్రాయం పొడసూపినా నేను కొనసాగలేను. పరిస్థితుల రీత్యానైనా రాజీపడుతూ తలదించుకుని కొనసాగలేని మానసిక స్థితి. నూటికి నూరు పాళ్లు ఏకీభావం సాధ్యం కాకున్నా, కనీసం 60 శాతం అయినా భావసామీప్యత అనివార్యమనుకునే ఆలోచన. లేకుంటే వ్యక్తిగతంగా ఎంతటి దుర్భరానికైనా సంసిద్ధమే. మొదటి నుంచి నాటుకుపోయిన ఆలోచనా సరళి ఇది. ఎన్నో కష్ట నష్టాలకు గురయ్యాను. అయినా 'మార్పు' రాలే. ఇక రాదు. ఇంతకీ చెప్పొచ్చేదేంటంటే, సుమారు పాతికేళ్లుగా కొనసాగిన విహెచ్ సహచర్యం – మెజార్టీగా ఆయనతో భావసామీప్యతను సాధించుకున్నందువల్లనేనని.

వార్త పత్రికలో పనిచేస్తున్నప్పటికీ తరచుగా అయన్ని కలవడం జరుగుతుండేది. నా కుటుంబ పరిమితుల మేరకు ఆయన ఆశించిన మేరకు నేను కృతకృత్యుడ్ని కాలేకపోయాననీ నాకు తెలుసు. ఇంక 'అదంతే, ఇంతకన్నా నావల్ల కాదనేది' ఆయనకు స్పష్టంగా చెప్పినప్పటికీ ఆయనకది రుచించలే.

వార్త నుంచి ఎబికె గారి నిష్క్రమణ తదనంతర పరిస్థితుల్లో కొనసాగలేక నేనూ విరమించుకోవాల్సి వచ్చింది. నా కంటే అమితంగా నా గురించి ఆక్రోశించిన వ్యక్తి విహెచ్. ఎప్పుడూ నేను ఖాళీగా ఉండకూడదు. దేనికంటే నేను ఆర్థికంగా బాధపడకూడదన్నదే ఆయన తపన. నా సహచరి ఉద్యోగం చేస్తున్నప్పటికీ 'నీ బాధ్యతను నీవు నిర్వహించాలిగా' అంటూ నన్ను ఏదో ఓ ప్రాజెక్టులో ఇన్వాల్వ్ అయ్యేటట్లు

చేసేవారు. ఈ క్రమంలో సుమారుగా ఆయన చేపట్టిన ప్రతీ ప్రాజెక్టులోనూ నా భాగస్వామ్యం ఉండేది. ఇలా అనుక్షణం నా గురించి పరితపించే అత్యంత 'ఆత్మీయులు' విహెచ్ గారే నని చెప్పక తప్పదు.

పేపర్ క్లిప్పింగ్స్‌ను సబ్జెక్ట్ వారీగా నిర్వహించడంలో ఆయన దగ్గర పొందిన శిక్షణ తరువాతి క్రమంలో మాటీవి న్యూస్ ఛానల్‌లో 'రీసెర్చ్ అండ్ రిఫరెన్స్' విభాగం ఇన్-చార్జ్‌గా ఉద్యోగం వచ్చేందుకు దోహద పడింది. రోజుకో కొత్త విశ్లేషణను అందివ్వగల సమర్థతనూ అందించింది విహెచ్ సహచర్యమే. ఓ నూతనాన్ని గమనించారంటే, పనిగట్టుకుని మాటీవి ఆఫీసుకు వచ్చేసేవారు. 'ఎందుకు సార్ ఫోన్ చేస్తే నేనే వచ్చేవాణ్ణి కదా' అంటే, 'కాదులే ఎస్ఆర్ శంకరన్ గార్ని సైతం కలవాల్సి ఉంది. రెండు పనులు అవుతాయని వచ్చా' అని కాసేపు కూర్చొని వెళ్లేవారు. (శంకరన్ గారు ఆ పరిసరాల్లోనే ఓ ఫ్లాటులో ఉండేవారు) అదో ప్రేరణ. భిన్న సమీకరణలను వెలుగు చూడనివ్వాలని రాసిన - రాస్తున్న వ్యాఖ్యానాలను క్లుప్తీకరిస్తూ, 'అంకెల్ని కూడా మాట్లాడనీయ్' అని డేటాను ప్రెజెంట్ చేయమనేవారు. దటీజ్ డిఎన్ఎఫ్ హనుమంతరావు గారు. అదే సమయంలో తలవని తలంపుగా ఎబికె గారు విహెచ్ గారి గురించి 'ప్రొఫెసర్ హన్మంతరావ్' అని కీర్తించడం గుర్తుకొచ్చేది. 2004 ఎన్నికల సందర్భంగా నా జీవితంలో అత్యంత క్లిష్టతరమైన, కీలకమైన సమయం. తెలుగుదేశాన్ని భుజానికెత్తుకున్న మాటీవిలో కొలువు. తెలుగుదేశ దారుణాల్ని వ్యక్తీకరిస్తూ రచనలను అందించే ప్రవృత్తి. అదీ 'ప్రజాపక్ష సమీక్ష' విహెచ్ గారి పత్రికకైనా కంట్రిబ్యూషన్‌గా. ఇలా రెండు గుర్రాల స్వారీగా ఉండేది పరిస్థితి. దాన్ని సానుకూలంగా నిభాయించుకు రాగలగడంలో విహెచ్ గారే ప్రేరణ. తదనంతరం, మళ్లీ ఈ మనిషి రోడ్డున పడితే నాకంటే ఎక్కువ వ్యాకులం చెందింది విహెచ్ గారే. అంతటి సన్నిహితుడు మరి.

ఆయన ప్రయత్న ఫలితంగానే 'ప్రజాశక్తి'లో సబ్ ఎడిటర్‌గా చేరాల్సి వచ్చింది. అది సైతం ఆర్నెల్ల కంటే మించి సాగలే. ఈ క్రమంలో మన పని మనం చేసుకుపోతూ సర్దుకుపోవాలన్న బోధన ఏమాత్రం ఉపకరించలే. ఎంతకు సర్దుకుపోతున్నా 'లాయల్'గా ఉంటున్నారా? లేదా? అన్నది ఇక్కడి ప్రధాన ప్రశ్న. ఇక్కడే కాదు, ఎక్కడైనా ఇప్పుడిదే ప్రధానం. బాధ్యతలను సక్రమంగా నిర్వహించడమే కదా ప్రధానం - తలదించుచుదెందుకు? అన్నది ఆత్మాభిమానం ప్రశ్న. ఇలా అనునిత్యం నా హితవు కోరే 'శ్రేయోభిలాషి' విహెచ్. కొన్ని సందర్భాల్లో వ్యక్తిగత చర్చల్లో ఆయన్ని నొప్పించేనేమోనని ఇప్పుడనిపిస్తుంది. మనసు మెలి తిప్పినంతగా బాధపడుతూ ఉంది.

ప్రధానంగా మా మధ్య భిన్నాభిప్రాయం వెలువడ్డ సందర్భం 'సహజీవనం' పట్ల. ఓ ఇద్దరు వ్యక్తులు భార్య భర్తలుగా సహజీవనం చేస్తున్నప్పుడు బాధ్యతాయుతంగా వర్తించడం వేరు, 'ఖర్చులు - వెచ్చాలు' విషయంలో నీ వాటా - నా వాటా అని లెక్కలు వేయడం వేరని నా వాదన. డబ్బు విషయంలో 'లెక్కలు' అర్థ రాహిత్యం అని. ఖర్చులు అర్థవంతం కావాలనీ నే అన్నప్పుడు మౌనమే సార్ సమాధానమయ్యేది!

ఆ తర్వాత్తర్వాత మా కానూరి తాత ద్వారా తెలిసింది. ఏదో మాటల సందర్భంలో విహెచ్ విషయం తాత దగ్గరొస్తే, 'హన్మంతరావు గారంటే, ఆ మండపేటాయన తమ్మారెడ్డి కృష్ణమూర్తి గారి తోడల్లుడు కదా సార్' ఆయనో మహానుభావుడు ఆదర్శ జీవి సారూ. ఆ రోజుల్లోనే వితంతు వివాహం చేసుకున్నాడు సారు. అదీ మీటింగ్ పెళ్లి. తాపీ ధర్మారావు గారు నిర్వహించారనీ' చెప్పుకొచ్చాడు కానూరి. 'సార్ నీకు తెలుసా తాతా?' అంటే, ఇప్పుడంటే రాజకీయాలు వేరయి సంబంధాలు లేవుగాని ఆ రోజుల్లోనే సార్ ఆర్గనైజర్‌గా ఉండేవారు. ఆయనకంటే నేను సుమారో పదేళ్లు పెద్ద ఉంటాను. ఆయన భార్య సరళమ్మ కల్చరల్ కార్యకర్త, నృత్య నాటికల్లో పాల్గొనేదని నాటి వైభోగాన్ని వివరించేవాడు కానూరి. అయితే ఈ ప్రస్తావనెప్పుడూ మా మధ్య చోటుచేసుకోలే. మీరు కానూరికి తెలుసు అని మాత్రం చెప్పా.

సార్‌ని అతి సన్నిహితంగా గమనించే సందర్భాలూ ఉన్నాయ్. రాత్రి, పగలు కలిసి పనిచేసిన సందర్భాల్లో ఆయన దినచర్య బహు నిబద్ధతా యుతంగా ఉండేది. రాత్రి ఎంత లేటుగా నిద్రపోయినా, వేకువజామున 4.30 గంటలకే లేవడం ఆయన అలవాటు. లేచి యోగ చేసుకుని టీ పెట్టి మిగతా వారిని లేపేవారు. టీ తాగి తాడుకట్టిన పెన్నును మెళ్లో వేసుకుని వరండాలో కూర్చొని, వచ్చిన పేపర్‌ను వచ్చినట్టే ఓ విహంగ వీక్షణం చేసేసి, తీరిగ్గా చదవాల్సిన కత్తిరించుకోదగ్గ అంశాలను మార్క్ చేసేస్తూ పక్కన పడేసేవారు. పేపర్ల ప్రహసనం ముగిసే సరికి 6.30-7.00 గంటలయ్యేది. ఒక్కోసారి 3, 4 వ్యాసాలు రాయాల్సి వచ్చేది. మూడు కన్నా ఎక్కువ రాసివ్వాల్సి వచ్చినప్పుడు ఆయన 'ఘోస్ట్-రైటర్' గానే అవతారమెత్తే వాడు. ఇదంతా బాగానే ఉంది. ఉండేది. ఒక్కోసారి ఆయన రాసిన వ్యాసం ప్రచురణకై ఆయా సంపాదకులకు ఫోన్ చేసి ప్రచురించమని 'రిక్వెస్ట్' చేయడం ఎందుకో నాకు మింగుడు పడేది కాదు. 'రిక్వెస్ట్ చేయడం ఎందుకు సార్, వాళ్లు వేయకపోయినా మన ఫైల్లో ఫైల్ చేసుకుందాం. ఎప్పుడో అదే ఉపయోగపడుద్ది' అనేవాణ్ణి. దానికి ప్రతిగా ఓ నవ్వు నవ్వేవారు.

తాను వ్యయ పరంగా ఎవరికి భారం కాకూడదనేది ఆయన అంతరంగం. ఓ సారి ఆయనకు బ్యాక్ పెయిన్ - అదే వెన్ను నొప్పి వచ్చింది. నిమ్స్‌లో డాక్టర్ ప్రతిభగారి ద్వారా చూపించుకున్నారు. అయినా ఆశించిన స్థాయిలో ఫలితం లేనందువల్ల - యోగా ద్వారా నయం కాగలదని విన్న మీదట బెంగుళూర్ పమీపంలో వివేకానంద యోగా రిసెర్చ్ సెంటర్‌లో తగు పరిష్కారం లభ్యం కాగలదని ఆ సెంటర్‌ను సంప్రదించి, వారి ఏభై ఏళ్ల వార్షికోత్సవ సన్నాహాల్లో పిఆర్‌ఒగా వ్యవహరించి ఉచితంగా యోగానభ్యసించడం ఓ సజీవ ఉదాహరణ. ఆ తర్వాత పత్రికలకు రాసిన వ్యాసాలు ఆన్‌లైన్ ద్వారా పంపేందుకు కంప్యూటర్ శిక్షణ అవసరమని భావించి, అమీర్‌పేటలో డిటిపితో పాటు కంప్యూటర్ శిక్షణను నేర్చుకోవడం ఆయన 'దృఢ దీక్ష'ను వ్యక్తం చేస్తుంది.

ఎప్పుడూ పువ్వుల్ని-పిట్టల్ని-పక్షుల్ని పరిశీలించడం సార్ ప్రకృతి ఆరాధన భావాన్ని చెప్పకనే చెపుతుంది. అందమైన గ్రీటింగులను-చిన్న పిల్లల ఫోటోలను కత్తిరించుకుని ఆయన గదిలో అలంకరించుకోవడం ఆయన పసితనాన్ని వ్యక్తం చేస్తుంది. రోజు ఓ గుప్పెడు చాక్లెట్లను కొనుక్కొచ్చి చుట్ట పక్కల పసివాళ్లను పిలిచి వారికా చాక్లెట్లను పంచిస్తూ బోసి నవ్వులు నవ్వడం ఈనాటికీ కళ్లముందు కదలాడుతూనే ఉంది. అటువంటి వ్యక్తి ఒక్కసారిగా వారుంటున్న ఇంటిని డెవలప్‌మెంట్‌కు ఇచ్చేందుకు వృద్ధాశ్రమానికి తరలి వెళ్లాల్సి రావడం నిజంగా శోచనీయం. ఆ సందర్భంగా ఆయన పడ్డ మానసిక వేదన అంతా ఇంతా కాదు. కొన్నిసార్లు తలవని తలంపుగా, వారాయిల్లు ఎలా కట్టుకొచ్చిందీ కథలు కథలుగా చెప్పుకురావడం ఆయన పడ్డ వేదనా తీవ్రతను చెపుతున్నట్టనిపిస్తుంది. ఎందుకంటే వ్యక్తిగత విషయ ప్రస్తావనకు అదే ప్రారంభం కాబట్టి. అదిలగాయతు, 'నాకున్న అంతరంగిక మిత్రుల్లో నువ్వొకడవి', 'నాకున్న ఆప్తుడవి నీవే' నని పలుమార్లు అనడం గుండె గొంతులోకి వచ్చినట్టనిపిస్తుంది నేడు.

పిల్లలంటే అమితమైన ప్రేమ. కాస్తా మనసు తేలిక పడితే చాలు మనవరాళ్ల ముచ్చట్లే. ఎక్కువగా స్రవంతి గురించి చెప్తుండేవారు. కోస్తా అభ్యుదయ వాసనలను వంటపట్టించుకున్నందుకు 'కమ్యూనిస్టు ఉద్యమంలో మహిళల పాత్ర' అన్న అంశంపై ఎం.ఫిల్ చేస్తుందని చెప్పారు. ఇది చెప్పేటప్పుడు ఆ కళ్లలో ఎంతటి మెరుపో..?

ఇవన్నీ ఒక ఎత్తయితే, వీలైనప్పుడల్లా మా పిల్లల్ని తీసుకురమ్మని కోరడం, వచ్చిన వారిని అక్కున చేర్చుకుని ఎలా మసలుకోవాలో చెప్తున్న వైనం గుర్తుకొస్తే ఈ వాత్సల్యానికి విలువకట్టేదెవరు? అని అనిపించక తప్పదు.. మా అమ్మాయి ఉద్యోగంలో జాయిన్ అయిన తర్వాత సార్‌ని కలవలే. చాలాసార్లు అడిగారు తీసుకురమ్మని. అయితే ఉద్యోగం చేస్తూ ఎంబిఎ చేస్తున్నందున కలవడం కుదరలే. ఇదే విషయం సార్‌కి చెప్తే.. 'ఉద్యోగం చేసుకుంటూ, చదువుకుంటున్నందునే నాకూ చూడాలని పిస్తుంది' అన్నారు. ఇప్పుడనిపిస్తుంది ఒక్కసారి తీసుకొచ్చి చూపించాల్సిందని. మా వాడు చదువు ముగించుకొచ్చాక తీసుకుపోయా. 'డాక్టర్లు – ప్రజారోగ్యం' మీద కూలంకషంగా మాటాడి ఆయనకు తెలిసిన పలు ప్రజా వైద్యుల ఉదంతాలను చెప్పుకొచ్చి, తన సందేహాలను అడిగి తెలుసుకున్నారు. 'ఈనాడు మన ముందున్నది అమెరికన్ వైద్య విధానం అంటే పిన్–పాయింటెడ్‌గా సమస్యను తెలుసుకుని, దానికి ట్రీట్‌మెంట్ చేయడమే నేటి విధానం. ఆ సమస్యను తెలుసుకోవడం కోసం అన్ని పరీక్షలు రాసేయడం/చేయించేయడం దీంతో అటు లేబ్‌లు బతుకుతాయి ఇటు డాక్టర్లూ బతుకుతారు. నాడి చూసి వైద్యం చేయడం (బ్రిటిష్ ప్రాసెస్) మరుగున పడిపోయిందంటే' మా వాడి వైపు ఆశ్చర్యంగా చూశారు. ఏమైనా మా వాడిని సార్‌కు కలిపించి ఓ మంచి పనిచేశానని పిస్తుంది. వారి హితోక్తుల్లో కనీసపరంగానైనా మావాడు ఆలోచిస్తే అదే పదివేలు!! ఇలా నా జీవితాంతం 'చిరస్మరణీయులు'గా మిగలగలుగుతారు కామ్రేడ్ వి. హెచ్..!! వీ

# ప్రజల మనిషి వి. హనుమంతరావు

– కె.ఆర్. చౌదరి
వ్యవసాయ అర్థశాస్త్రవేత్త

హనుమంతరావు గారితో నాకు దాదాపు 30 సంవత్సరాల పరిచయం, అనుబంధం, ఆత్మీయత ఉంది. వారితో నా తొలి పరిచయం గమ్మత్తుగా జరిగింది. కేంద్ర బడ్జెట్ గురించి విశ్లేషణాత్మక ప్రసంగం సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నేను చేశాను. ఆ సందర్భంలో బడ్జెట్‌ను గురించి ప్రశ్నలతో నన్ను ఒక బక్కాయన ఉక్కిరి బిక్కిరి చేశాడు. ఆయన బడ్జెట్‌ను గురించి కొన్ని విలువైన వ్యాఖ్యానాలు, విమర్శలు చేశాడు. ఆయనే హనుమంతరావు. జర్నలిస్ట్ అని తెలుసుకున్నాను. తర్వాత ఆయన శ్రీనగర్ కాలనీ క్లబ్‌లో నాతో ఒక ఉపన్యాసం ఏర్పాటు చేశాడు. జర్నలిజంతో పాటు ఆర్థిక విషయాల్లో కూడా నిష్ణాతుడని తెలుసు కున్నాను. ఎస్ఎస్ఎల్‌సి మాత్రమే చదువుకున్న ఆయన ఆర్థిక విషయాల్లో అపారమైన పరిజ్ఞానం, పట్టును సాధించడం విశేషం. ప్రజల పక్షాన ఆలోచించి, మాట్లాడుతూ, రచనలు చేసే వ్యక్తిగా గుర్తింపు పొందాడు.

అఖిల భారత స్థాయిలో జరిగిన రెండు మహా సభల్లో ఆయనా, నేనూ పాల్గొన్నాం. సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసి ఒక ప్రజా సంఘాన్ని జాతీయ స్థాయిలో ఏర్పాటు చేసింది. అదే అఖిల భారత కిసాన్ మజ్దూర్ సంఘ్. ఈ సంఘం ఆరంభ మహాసభలు రాజమండ్రిలో జరిగాయి. ప్రపంచ వాణిజ్య సంస్థ, భారత్‌పై దాని ప్రభావం అనే అంశాన్ని గురించి నేను కీలకోపన్యాసం చేశాను. ఆ ఉపన్యాసానికి సంబంధించి నాకు ఆయన అనేక సూచనలు, సలహాలు ఇచ్చాడు. అవి నాకు ఎంతగానో తదుపరి కాలంలో ఉపయోగపడ్డాయి. ఇక రెండో మహాసభలు అదే సంఘం పంజాబ్ రాష్ట్రంలో జలంధర్‌లో జరిగాయి. సమావేశం తెల్లవారి నాలుగు గంటల వరకు జరిగింది. నేనేమో రాత్రి 12 గంటలకు నిద్రపోయాను. హనుమంత రావు సమావేశం అయిపోయే వరకు ఉండిపోయారు. సంఘం నాయకులు, కార్యకర్తల క్రమశిక్షణ, అంకితభావం, పట్టుదల హనుమంతరావును విశేషంగా ఆకట్టుకున్నాయి. ఎంతో సంతోషపడ్డారు. దాన్ని గురించి ఒక పెద్ద వ్యాసమే రాశాడు. చాలా పట్టుదల, కమిట్‌మెంట్ ఉన్నవాడు అని నాకు అర్థమయింది. రైతాంగ సమస్యల పైన ఎన్నో వివరాలు సేకరించారు.

వ్యవసాయం, రైతులు, ఆర్థిక, రాజకీయ విషయాల పైన అనేక సభలు, సమావేశాల్లో ఉపన్యసించేవాణ్ని. నా ఉపన్యాసాల్లోని లోటుపాట్లను హనుమంతరావు నిర్మోహమాటంగా ఎత్తి చూపేవాడు. సవరించుకోవడానికి సలహాలిచ్చేవాడు. నాలాగే ఎంతో మంది అభివృద్ధికి తోడ్పడేవాడు.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాస్త్ర సంఘం (ఎపి ఎకనామిక్ అసోషియేషన్) మహాసభను తిరుపతిలో నిర్వహించింది. మహాసభలో నేను అధ్యక్ష్యోపన్యాసాన్ని చేశాను. వృద్ధాప్యం, అనారోగ్యం పట్టి పీడిస్తున్నప్పటికీ, హనుమంతరావు తిరుపతి సభకు తనను పిలుచుకుని పొమ్మన్నాడు. నిజంగా నాకు భయమేసింది ఆయన ప్రయాణం చేయగలడా అని. ఆయన నడువలేని స్థితిలో ఉన్నాడు. అయినప్పటికీ, ఆయన పట్టుదలకు, అభ్యర్థనకు తలొగ్గి తిరుపతికి తీసుకెళ్లి, మరలా హైదరాబాద్‌కు తీసుకువచ్చాను. నేనూ, నా శిష్యులూ ఆయన్ని అతి జాగ్రత్తగా చూసుకున్నాం. మహాసభలో ప్రతి ఒక్కరూ వచ్చి, ఆయన్ను ఎంతో ఆప్యాయంగా, గౌరవంగా పలుకరించారు. ఆయనకు అంతటి పాపులారిటి ఉండడం చూసి ఆశ్చర్యపోయాను. మహాసభల్లో చేసిన ఉపన్యాసాల నుండి, పరిశోధనా పత్రాల నుండి ఎన్నో గణాంకాలు, వివరాలు సేకరించారు. విషయాల్ని తెలుసుకోవాలనే జిజ్ఞాస మెండుగా ఉండేది. ఆయన ఆర్థిక విషయాల పైన సుదీర్ఘ కాలం పాటు రాశారు. ఆయన్ను ఆర్థిక వేత్తగా పరిగణించేవారు. అందువల్లనే ఎపి ఎకనామిక్ అసోషియేషన్ వారు ఆయనకు జీవితకాలం గౌరవ సభ్యత్వం ఇచ్చారు. ఎస్ఎస్ఎల్‌సి మాత్రమే చదువుకున్న వారికి అలాంటి గౌరవం దొరకడం దుర్లభం. అయినా, ఆయనకు అలాంటి గౌరవం దక్కింది. అధ్యాపకులకు, విద్యార్థులకు ఆయన ఎంతో స్ఫూర్తినిచ్చారు.

సర్వత్రా గుర్తించబడిన సీనియర్ జర్నలిస్ట్ హనుమంతరావు. వందల కొలదీ, లేదా వేలాదిగా వ్యాసాలను, రచనలను దాదాపు అన్ని తెలుగు పత్రికల్లో ప్రచురించారు. ఆయన రాసిన రచనలు సంఖ్యా పరంగా, నాణ్యతా పరంగా విశిష్టమైనవి. ఆర్థిక, రాజకీయ, సామాజిక,

వ్యవసాయం, పారిశ్రామిక, రైతాంగం మొదలైన రంగాల్లో రచనలు చేశారు. వ్యాసాలు, పుస్తకాలు పుంఖాను పుంఖానులుగా రాశారు. రచనల్లో స్పష్టత ఉండేది. ప్రజా సమస్యలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి రాసేవాడు. ప్రజలే ఆయన రచనలకు వస్తువు, స్ఫూర్తి. గణాంక వివరాలతో, విశ్లేషణలతో, విమర్శలతో ఆయన రచనలు సుసంపన్నంగా ఉండేవి. ఆయన రచనల్లో కొంత అపహాస్యం, వ్యంగంపాలు ఎక్కువగా ఉన్నాయి. ఆయన రాసిన పుస్తకాలను నాకు మా ఇంటికి తెచ్చి ఇచ్చేవాడు. అంతటి ఉదార బుద్ధి, గొప్ప మనసు, వాత్సల్యం ఉన్నవాడు.

బడ్జెట్‌లపైన, ప్రభుత్వ విధానాల మీద ఆయన రాసిన రచనలు ఎంతో విజ్ఞానవంతమైనవి. బడ్జెట్ కేటాయింపులు ఏనాడు పూర్తిగా ఖర్చుపెట్టలేదని రాసేవాడు. సాధారణ వ్యక్తులకు కూడా అర్థమయ్యే భాషలో, సులభమైన రీతిలో రాసేవాడు. స్వయంగా ఆయన పరిశోధకుడు. విషయాల్ని సేకరించడంలో దిట్ట. ఎంతో మంది జర్నలిస్టులకు మార్గ దర్శకత్వం చేసేవాడు. వారిని ప్రోత్సహించేవాడు. జర్నలిజానికి పూర్తిగా అంకితమైన వాడు. రాస్తూ, రాస్తూనే చనిపోవాలనేవాడు. అట్లాగే చివరి వరకు రాస్తూనే చనిపోయాడు. జర్నలిస్టులకు ఆయన ఆదర్శప్రాయుడు. అట్టడుగు ప్రజల జీవితాల్లో మార్పును కోరుతూ రాసే సామాజికవేత్త హనుమంతరావు. గ్రామీణ రంగంలో బాగా రాసిన పత్రికా విలేఖరులకు ఉత్తమ గ్రామీణ జర్నలిస్ట్ అవార్డులు ఇచ్చేవాడు.

వీక్షణం పత్రికకు ముందు సమీక్ష పేరుతో ఒక పత్రికను హనుమంతరావు నడిపేవాడు. తదుపరి కాలంలో ఆ పత్రికే వీక్షణం అయింది. వీక్షణం తెలుగులో ఒక మంచి సామాజిక, ఆర్థిక, రాజకీయ పత్రికగా రూపుదిద్దుకుంది. ఎన్ని నష్టాలు, కష్టాలున్నా పత్రిక ఆగిపోకుండా నడుస్తోంది. వేణు పైన అయనకు అపారమైన నమ్మకముండేది. వీక్షణంను నిరాటంకంగా కొనసాగించడమే హనుమంతరావుకు నిజమైన నివాళి.

వేణు సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్ రీసర్చ్ అండ్ కమ్యూనికేషన్స్ (సిడిఆర్‌సి) అనే సంస్థను ఏర్పాటు చేయడంలో చొరవ తీసుకున్నాడు. ప్రొ. ఆర్ఎస్ రావు, హనుమంతరావు, అరవింద, వనజ, బిఎస్ రాజు, నేను అందులో సభ్యులుగా ఉండేవాళ్లం. ఈ సంస్థ అభివృద్ధికి హనుమంత రావు ఎన్నో సలహాలిచ్చాడు. కానీ, ఈ సంస్థ చాలా కాలం పనిచేయలేదు. సంస్థకు నిధులు లేవు. సిబ్బంది లేరు. సభ్యులు ఎవరి పనుల్లో వారు నిమగ్నమై ఉన్నారు. సిడిఆర్‌సికి సమయం కేటాయించలేకపోయారు. అయినప్పటికీ, 'యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్' అను గ్రంథాన్ని తీసుకుని వచ్చింది. ఈ సంస్థ విఫలమవడాన్ని రావు జీర్ణించుకోలేక పోయాడు.

రాష్ట్రంలో వ్యవసాయం ప్రధానమైన రంగం. రైతులు సంక్షోభంలో పడిపోయారు. దీనిపైన ఒక ప్రామాణిక గ్రంథాన్ని తెద్దామని హనుమంత రావు నాతో చెప్పేవాడు. మా ఇద్దరి సంపాదకత్వంలో ఈ పుస్తకం రావాలని ఆయన తాపత్రయ పడేవాడు. సంబంధిత అంశాలు, వాటిని రాయగల నిష్ణాతుల్ని గుర్తించాం. వ్యాసాలు పంపమని అందరికీ ఉత్తరాలు రాశాం. ఫోన్లు చేశాం. ఒక్కరు తప్ప మరెవ్వరూ స్పందించలేదు. అందువల్ల ఆ ప్రయత్నం మానుకున్నాం. నిష్ణాతులు, మేధావుల ఈ ప్రవర్తన పట్ల చాలా నిరాశ చెందాడు. ఆ ప్రాజెక్టు విఫలమైంది. ఎప్పటికైనా ప్రాజెక్టును పూర్తి చేయాలనే కోరిక ఆయనకు ఉండేది. దాన్ని పూర్తి చేయకుండానే పోయాడు అదే విషాదం.

2004లో నక్సలైట్లతో ప్రభుత్వం చర్చలు జరపాలని కోరడానికి పీస్ ఇనిష్యేటివ్‌ను హనుమంతరావుతో సహా కొంత మంది మేధావులు, సామాజిక వేత్తలు ఏర్పాటు చేశారు. ఆ కమిటీలో నేను కూడా సభ్యుడిగా ఉంటిని. కమిటీ సమావేశాలకు తప్పకుండా హాజరై, కార్యక్రమాల్లో పాల్గొనే వ్యక్తి హనుమంతరావు ఒక్కడే. చాలా కమిట్‌మెంట్ ఉన్న వ్యక్తి ఆయన. నక్సలైట్లతో ప్రభుత్వం చర్చలు ఒకే ఒక దఫా జరిపింది. తర్వాత చర్చలు లేవు. చర్చలు విఫలమైన సంగతి మనకు తెలుసు.

హనుమంతరావు ఏ కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడు కాదు. అయినప్పటికీ అన్ని వామపక్షాలు ఆయన్ని గౌరవించేవి. ఆహ్వానించేవి. రచనలు రాయించుకునేవి. ఆయన కమ్యూనిస్టు ఉద్యమాన్ని అభిమానించేవాడు. ఆయన నిజమైన కమ్యూనిస్టు. హనుమంతరావు నిజమైన సంఘ సంస్కర్త. ఆయన కులాంతర వివాహం చేసుకున్నాడు. అంతేకాక, అది విధవా వివాహం కూడా! ఆయన మాటల మనిషి కాదు, చేతల మనిషి.

హనుమంతరావు వక్తిత్వం చాలా గొప్పది. ఆయన వ్యక్తిత్వం పట్ల ప్రత్యేక ఆకర్షణ, గౌరవం ఆయన్ని ఎరిగినవారందరికీ ఉండేది. ఆయన నిరాడాంబర జీవి. ఎప్పుడూ కుర్తా, పైజామాలనే ధరించేవాడు. అరుదుగా సఫారీ డ్రస్ కూడా వాడేవాడు. ఆయనకు ఎంత పేరు ప్రఖ్యాతులున్నా, మేధావి అయినా, ఏమాత్రం అహంభావం, గర్వంలేని వ్యక్తి. దాపరికంలేని మనిషి. కల్లా, కపటం ఎరుగనివాడు. ఆయన అభిప్రాయాల్ని నిర్మోహమాటం గా చెప్పేవాడు. డబ్బుకు ప్రాముఖ్యతనిచ్చేవాడు కాదు. కష్టపడే మనస్తత్వాన్ని ఒంటికి పట్టించుకున్న మనిషి. ఆయన మహా మనిషి, మహానీయుడు. నిబద్ధత, సత్ప్రవర్తన , సాహసం, పట్టుదల, పరిపూర్ణత కలిగిన వ్యక్తి అనడం లో నాకేమాత్రం సందేహం లేదు. నాకు అత్యంత ఆత్మీయుడు, గౌరవనీయ మైన స్నేహితుడు. ఆయన లేని లోటు నా జీవితంలో చాలా వెలితిగా ఉంది. మనసంతా విషాదంతో నిండిపోతోంది. పుట్టినవాడు గిట్టకతప్పదు. జాతస్య మరణం ధృవం. ఏది ఏమైనప్పటికీ, హనుమంతరావు మంచి లక్షణాలను మనం అలవరచుకోవాలి. ఆచరించాలి. ఆయన జీవితం అందరికీ ఆదర్శప్రాయం. 92 ఏళ్ల వయస్సులో మరణానికి గురైనారు. ఆయనకు నా హృదయ పూర్వక జోహార్లు. వీ

# సామాజిక విశ్లేషకుడుగా హనుమంతరావుగారు

– ముదునూరి భారతి

సామాజిక శాస్త్రవేత్త

**హ**నుమంతరావు గారు ఇంక మన మధ్యన లేరు అన్న వార్త వినగానే నాకు మొదట వచ్చిన ఆలోచన – అయ్యో! వీక్షణంలో ఆయన రచనలు ఇంక కనపడవా అని. ఆయన అంతగా వీక్షణంతో మమేకమై పోయారు. వేణు సమర్థత మీద ఉన్న నమ్మకంతో, వేణునే వీక్షణం నడపటానికి తగినవాడని భావించి, తను రూపుదిద్దిన వీక్షణాన్ని వేణు ఆధ్వర్యంలో సమర్థవంతంగా నడిచేటట్లు చేయడంలో ఆయన భాగస్వామ్యం ఉంది. వీక్షణం ఆర్థికంగా వచ్చిన బాలానష్టాలను తట్టుకొని ఒక మంచి పత్రికగా పేరు సంపాదించుకోవాలనే కోరికతో, చివరి

వరకూ ఆయన పత్రికకు వ్యవస్థాపక సంపాదకులుగా తన బాధ్యతలను నెరవేరుస్తూనే వచ్చారు.

నాకు హనుమంతరావుగారితో పరోక్షంగానే సంబంధం ఉండడంతో, ఆయన గురించి రాయడానికి ఆయనకి – ఆయన భాగమైన వీక్షణంతో ఉన్న అనుబంధం ద్వారా, ఆయన రాసిన వ్యాసాల ద్వారా, ఆయన ఆలోచనా విధానం, సమాజంలో చోటు చేసుకుంటున్న మార్పులను విశ్లేషించే తీరు, సమకాలీన ఆర్థిక అంశాల మీద ఆయన ఆసక్తి, అర్థం చేసుకునే ప్రయత్నమిది. ఆయనతో సమావేశాలలో పాల్గొన్న అవకాశాలు నాకు తక్కువే. అందులో మొదటిది సిడిఆర్‌సి అనే ఒక పరిశోధక సంస్థ స్థాపించాలనే లక్ష్యంతో చేసిన ప్రయత్నాలు. మొదటిది సమాజంలో సామాన్య ప్రజానీకాన్ని ప్రభావితం చేస్తూ కూడా పరిశోధకుల దృష్టిలో పడని అంశాలమీద పరిశోధనలు చెయ్యటం, రెండవది సంస్థ ఆధ్వర్యంలో కొన్ని పుస్తకాల ప్రచురణ అనేవి ముఖ్య కార్యక్రమాలు. రెండవ కార్యక్రమం సఫలీకృతమైంది కాని మొదటిది అసంపూర్తిగా ఉండిపోయింది. సంస్థ ముఖ్య ప్రచురణ ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 50 సంవత్సరాలు పూర్తి అయిన సందర్భంలో ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ రంగాల మీద వ్యాసాలతో కూడిన పుస్తకం. ఇది 2006లో రిలీజు అయింది. ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొని కూడా అనుకున్న సమయానికి పుస్తకాన్ని రిలీజు చెయ్యటంలో సంస్థ డైరక్టర్‌గా హనుమంతరావుగారు ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఇది ఆంధ్రప్రదేశ్‌ని గురించి తెలుసుకోవాలని అనుకునే పరిశోధకులందరికీ డేటా బేస్‌గా ఉపయోగపడాలనేది ఆయన ఆకాంక్ష. ఆ వాల్యూమ్‌లో ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక అభివృద్ధి, ఎలిమెంటరీ విద్య పెరుగుదల అనే అంశాల మీద ఎంతో డేటా ఇచ్చి వివరించారు. నా రెండో అవకాశం వీక్షణం పత్రిక 10 సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంలో ప్రత్యేక సంచిక తీసుకుని వచ్చిన సమయంలో వచ్చింది. దీనిలో హనుమంతరావు గారు రాసిన ప్రజాస్వామ్యం మెరిసిపోతోందా సమసిపోతోందా అనే వ్యాసంలో అభివృద్ధి మీద, పేదరిక నిర్మూలన మీద తన అభిప్రాయం వెలిబుచ్చారు. క్రమం తప్పకుండా ప్రతి నెలా ప్రజలకు అందే వీక్షణం పత్రికలో తరుచు ఆయన సమకాలీన అంశాల మీద వ్యాసాలు రాయడమే కాక పత్రిక అనుకున్న దిశలో సాగేటట్టుగా తన సహకారాన్ని అందించేవారు. ఆయన మరణం తరువాత వచ్చిన వీక్షణంలో కూడా 'నెహ్రూ నుండి మోదీ వరకు అవినీతి' అనే వ్యాసం ఉంది.

ఒక్కసారి ఆయన గురించి ఆలోచిస్తే, క్రమశిక్షణ ఆయన మారుపేరుగా అనుకోవచ్చును. సమాజాన్ని విమర్శనాత్మక విశ్లేషణ చేయగలిగే ఒక మంచి జర్నలిస్టుగా ఆయన తనను తాను మలచుకున్నారు. ఆయన లక్ష్యం కూడా ఇదే అనుకుంటాను. ఈ లక్ష్యమే ఆయనకు కావలసిన క్రమశిక్షణనిచ్చి ముందుకు నడిపించింది. సిడిఆర్‌సి ఆధ్వర్యంలో జరిగే సమావేశాలకు మేమందరం ఉత్తి చేతులతో వెడితే, ఆయన మాత్రం ఒక చిన్న నోటుపుస్తకంలో ఆరోజు చర్చించవలసిన అంశాలు, ఒక్కో అంశంలో ఉండే ప్రశ్నలు రాసుకుని వచ్చేవారు. చర్చని అనవసర విషయాల మీదికి మళ్లిపోకుండా నియంత్రించేవారు. కాలక్షేపానికి ఆయన ఇంటికి రమ్మని పిలిచినప్పుడు కూడా చర్చ వీక్షణం భవిష్యత్తు మీదే సాగేది. వీక్షణం ఇంకా ఎలా స్ఫూర్తిదాయకంగా చెయ్యవచ్చును? ఏ విషయాల మీద ఎటువంటి రచనలు వస్తే బాగుంటుంది? ఎవరి చేత రాయించాలి? ఇలా ఎన్నో ప్రశ్నలు వేసి, సమాధానాలు అన్వేషించేవారు. వ్యక్తిగత జీవితంలో తన సహచరి సృజనాత్మకత బయటికి రావడానికి, ఆవిడకి ఒక ప్రత్యేకమైన గుర్తింపు రావడానికి ఆయన ఇచ్చిన చేయూత ఆవిడ తెలుగులో ప్రచురించిన పిల్లల పద్యాల పుస్తకాలలో కన్పిస్తుంది.

వీక్షణం ఆయన అనుబంధాన్ని చూస్తే, పత్రిక వేరు వ్యక్తి వేరు అని చూడటం కుదరదు. ఆయన వీక్షణంకి వ్యవస్థాపక సంపాదకులుగా ఒక వ్యవస్థ నిర్మాణంలో భాగమయ్యారు. వీక్షణం పరిణతి చెందే క్రమంలో పత్రిక కోసం ఎంచుకున్న కార్యక్రమాల ద్వారా దానిని ముందుకు నడిపించటంలో ఆయనకి ఒక పాత్ర, ఒక ఐడెంటిటీ వచ్చాయి. అందుచేత నేను ఆయన గురించిన జ్ఞాపకాలు గుర్తు చేసుకోవాలంటే అవి వీక్షణంతో ఆయనకి ఉన్న సంబంధాలలోనే చూడగలను. ఆయన ఆలోచనా ధోరణి అర్థం చేసుకోవాలంటే వీక్షణంలో వచ్చిన ఆయన వ్యాసాల ద్వారానే సాధ్యమౌతుంది. సామాజిక అవగాహనకి ఆయన ఆధారపడ్డ ముఖ్య పరికరం డేటా. వివిధ సంస్థల ద్వారా లభ్యమయ్యే డేటాని పరిశీలించి వాటి సహాయంతో సమాజంలో వస్తున్న మార్పులను, వాటి ప్రభావాన్ని అంచనా వేయగలిగేవారు. గత సంవత్సరం చివరలో వీక్షణంలో వచ్చిన కొన్ని వ్యాసాల మీద కేంద్రీకరించి, అభివృద్ధి, పేదరిక నిర్మూలన, అభివృద్ధికి అడ్డంగా నిలిచిన నల్లధనం మొదలయిన అంశాల మీద ఆలోచన ద్వారా ఆయన దృక్పథాన్ని అర్థం చేసుకోవచ్చును.

దశాబ్ది సంచిక (2013 జనవరి)లో 'ప్రజాస్వామ్యం, పేదరికం, అభివృద్ధి' అనే వ్యాసంలో ఎన్నికల రాజకీయాలను అపహాస్యం చేస్తూ, సమాజాలలో సమస్యలు ఉత్పన్నమైతే పాలకులు సందర్భానుసారంగా ఎలా ప్రజల దృష్టిని మరలించి వేస్తారో వ్రాసారు. వృద్ధికి, అభివృద్ధికి తేడా ఉందని వివరిస్తూ, పేదల నిర్వచనంలోనే స్పష్టత లేదని చెబుతూ, పేదల నిర్మూలన ఎలా సాధ్యపడుతుందో సూచించారు.

2009 సంవత్సరంలో కాంగ్రెసు హయాంలో స్కాంల పర్వము కొనసాగుతూ ఉండటంతో, ఆ సంవత్సరంలో జరిగే ఎన్నికల సమయంలో ప్రజల దృష్టిని స్కాంల మీది నుండి మరలించటానికి పాలకులు 'అభివృద్ధి' అనే భావనని ముందుకు తీసుకుని వచ్చారు. ఓ నాలుగు భవనాలు, మరో నాలుగు ఫ్లై ఓవర్లు కట్టి ఇదే అభివృద్ధి అన్నారు. పెరుగుదల వేరు అభివృద్ధి వేరు అని కాకుండా పెరుగుదలనే అభివృద్ధిగా ప్రచారం చేసారు. ఈ ప్రయత్నంలో దేశ అభివృద్ధి అంటే సామాజిక అభివృద్ధి అని, దేశమంటే మనుష్యులు అనే అర్థాన్ని వెనక్కు నెట్టివేసారు. మన పాలకుల దృష్టిలో మౌలిక సదుపాయాల కొరత మనదేశంలో తీవ్రంగా ఉందనీ, అదే అభివృద్ధికి అడ్డంకి అని భావించి, వీటి కల్పనకి కావలసిన పెట్టుబడిని విదేశాల నుండి అప్పుగా సంపాదించి, పెద్ద పెద్ద విమానాశ్రయాలు, 5 నక్షత్రాల హోటళ్లు లాంటి ఎన్నో మౌలిక సదుపాయాలను ప్రవేశపెట్టారు. ఈ క్రమంలో సంపదతో పాటు పేదరికంగా కూడా పెరిగింది. పేదరిక నిర్మూలన మాట అటుంచి పేదలంటే ఎవరు? ఎంతమంది ఉన్నారు? అనే ప్రశ్నలు తలెత్తాయి. ఈ పేదరిక నిర్మూలనమీద ప్రభుత్వానికి ఆసక్తి లేదు. అందుచేత పేదరిక నిర్మూలన పేదల చేతుల్లోనే ఉందని, ఆందోళనల ద్వారా ప్రభుత్వాన్ని కుదిపివేయడమే మార్గమనే అమూల్యమైన సలహా ఇచ్చారు.

తెలుగు రాష్ట్రం పారిశ్రామీకరించబడే క్రమంలో ఆర్థిక వ్యవస్థ పబ్లిక్ రంగం నుండి ప్రైవేట్‌రంగానికి మారిందనీ, దీనికి అవసరమైన పెట్టుబడుల కోసం విదేశీ సంస్థలకు ఎన్నో ప్రోత్సాహకాలు ఇచ్చి ఆహ్వానించవలసి వచ్చిందనే చెబుతూ.. ఈ క్రమంలో సమాజంలో ఆర్థికరంగం విపరీత పరిణామాలకు లోనైందని వివరిస్తూ, ఈ విధ్వంసక అభివృద్ధి మార్గానికి మరో ప్రత్యామ్నాయ మార్గాన్ని సూచించారు.

విభజన పూర్వ తెలుగు రాష్ట్రంలో (1960 సంవత్సరాలలో) పలు నగరాల్లో ప్రభుత్వరంగ పరిశ్రమలు స్థాపించటం ద్వారా రాష్ట్రంలో

పారిశ్రామిక వాతావరణం నెలకొంది. దీని వలన సమాజంలో కొన్ని మార్పులు వచ్చాయి. 1980లలో ప్రభుత్వము దేశ ఆర్థిక విధానాలలో ప్రవేశపెట్టిన మార్పుల కారణంగా, ప్రపంచబ్యాంకు సహకారంతో ప్రయివేటురంగంలో విదేశీ పెట్టుబడులు ప్రవేశించి, మన పారిశ్రామీకరణకి కొత్త రూపాన్ని తయారు చేసాయి. కేంద్రంలో ప్రధానమంత్రి, రాష్ట్రంలో ముఖ్యమంత్రి కూడా విదేశీ పెట్టుబడులకు అధిక ప్రోత్సాహకాలు, మినహాయింపులు ఇచ్చి ఆహ్వానించడం, భాగస్వామ్య సదస్సులు నిర్వహిస్తూ ఎన్నో అవగాహనా పత్రాలు (పరిశ్రమలు స్థాపించటానికి) వ్రాసుకోవటం జరిగింది. కాని వాస్తవంలో వీటికి సరితూగేలా పరిశ్రమలు మాత్రం రాలేదు. ఈ క్రమంలో పబ్లిక్ రంగం నిర్లక్ష్యానికి గురి అయి క్షీణించిపోవటము, ప్రయివేటు రంగం తగినంత బలాన్ని పుంజుకోకపోవడంతో మన దేశ ఆర్థిక పరిస్థితులు ఉభయ భ్రష్టత్వానికి గురి అయ్యాయి. మరి ఈ సమస్యకి సమాధానం ఉందా అంటే ఏ రాష్ట్రమైనా పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలంటే స్థానిక వనరుల ఆధారిత పరిశ్రమల ఆవశ్యకతని గుర్తించాలని ప్రతిపాదించారు. మన రాష్ట్రానికి వస్తే, మనది వ్యవసాయిక రాష్ట్రం అవడంతో వ్యవసాయాధారిత పరిశ్రమలు, దీనితో పాటు రాష్ట్రంలో ఉన్న అపార ఖనిజ సంపద ఆధారంగా, పరిశ్రమల ఏర్పాటు మీద శ్రద్ధ వహించాలని సూచించారు.

హనుమంతరావు గారు దేశవ్యాపితంగా పెరిగిపోతున్న నల్లధనం మీద తన అభిప్రాయాన్ని మూడు వ్యాసాలలో వివరించారు. మొదటి దానిలో ప్రజలకు నల్లధనం మీద ఉన్న వ్యతిరేకత వాడుకుని మోదీ ఎన్నికలలో గెలిచారనీ, రెండవ దానిలో కార్పొరేట్లు, బడా వ్యాపారులు ఇచ్చిన విరాళాలతోనే, అంటే నల్లధనంతోనే, ప్రధాని అయ్యారనీ, నల్లధనం దేశమంతటా వ్యాపించిందనీ, మూడవ దానిలో ఈ అవినీతి నెహ్రూ కాలం నుండి మోదీ వరకు పాలనా వ్యవస్థలో క్రింద నుండి పైవరకు వ్యాపించి విస్తరిస్తున్న అవినీతి, లంచగొండి తనం యొక్క చరిత్రని వివరించారు.

నల్లధనం పెరుగుదల గురించి చెబుతూ, గత రెండు సంవత్సరాలలో మోదీ పాలనలో చాలా వేగంగా పెరిగిందనీ, ప్రాజెక్టు నిర్మాణాలకి చేసే ఖర్చులో 50 శాతము సొమ్ము రాజకీయ నాయకుల, ఉన్నతాధికారుల చేతుల్లోకి వెడుతుందని చెబుతూ, దేశసరిహద్దులు దాటి వెళ్లిపోయిన డబ్బు తిరిగి దేశానికి రప్పించటం కష్టసాధ్యమన్నారు. ఇలా విదేశాలకు తరలిపోయిన సొమ్ము మారిషస్ చేరి విదేశీ పెట్టుబడిగా (తెల్లధనంగా) మారి తాజాగా దేశంలోకి వస్తోందనే రూపాంతరాన్ని కూడా వివరించారు.

రెండో వ్యాసంలో, 2014 ఎన్నికలలో కగార్పొరేటు విరాళాలతోనే మోదీ ప్రధాని అయ్యారు. అందుకే మొదటి బడ్జెట్‌లో ఆదాయపు పన్ను 30.25 శాతం తగ్గించి, తనకు విరాళాలిచ్చిన వారికి లాభం చేకూర్చి, రైలు చార్జీలు పెంచి సామాన్య ప్రజలకు కష్టాలు తెచ్చిపెట్టడంతో మోదీ మొగ్గు ఎటువైపో తెలుస్తుందన్నారు. తెల్లదొరలు పోయి నల్లదొరలు వచ్చిన తరువాత నల్లధనం గ్రామస్థాయి నుండి కేంద్రం స్థాయి వరకూ విస్తరించటానికి లింకులు ఏర్పడి, మంత్రులు ఉన్నతాధికారులు శక్తి మంతులయ్యారని, విదేశీ కంపెనీలకు లైసెన్సులు ఇచ్చి లంచాలు పుచ్చుకోవటం వేల నుండి లక్షల నుండి కోట్లలోకి మారిందని, 1980ల తరువాత హద్దులేకుండాపోయి అవినీతి స్కాంల రూపం తీసుకుందన్నారు. ప్రస్తుతం తర్జన భర్జనలవుతోన్న నోట్ల రద్దు గురించి తన అభిప్రాయం చెబుతూ, ఇది మోదీ ఆలోచించకుండా ప్రజల మీద చేసిన పాశవిక దాడిగా వర్ణించి, ఈ ప్రభుత్వ చర్య చట్ట సమ్మతమేనా అనే సందేహం వెలిబుచ్చారు.

మూడవదానిలో 60 సంవత్సరాల క్రితం ఛాయ్-పానీలకే పరిమితమైన 'మామూళ్లు', 1980లు వచ్చేసరికి స్కాంలు రూపంలోకి మారిపోయిందనీ, అంకురార్పణ గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో జరిగి దేశమంతటా లింకులు ఏర్పరచుకుందని అన్నారు. నెహ్రూ హయాంలోనే కేంద్ర ప్రతిపాదిత పథకాల ద్వారా అవినీతి మొదలై భారీ కుంభకోణాలు చోటు చేసుకున్నాయనీ, తప్పు చేసిన వాడు శిక్షింపబడడు అని నెహ్రూ పరోక్షంగా ఇచ్చిన సందేశంలో, దేశంలో అవినీతి విశ్వరూపాన్ని ప్రదర్శించటం మొదలైంది. మోదీ తిరిగి నల్లధనాన్ని కక్కిస్తానని నోట్ల రద్దు ప్రకటించటం ప్రజలు నమ్మదగిన విషయమేనా అని ప్రశ్న వేసారు.

హనుమంతరావుగారు మనలను విడిచి వెళ్లిపోవటం ఆయన సొంత కుటుంబానికే కాకుండా, ఆయనను సొంతం చేసుకున్న వీక్షణంకి కూడా పెద్ద దెబ్బ. వారి కుటుంబానికి ఆయన జ్ఞాపకాల ద్వారా స్వాంతన చేకూర్చటం కంటే మనం చెయ్యగలిగింది ఏమీ ఉండదు. వీక్షణంకి ఒక పెద్ద దిక్కుగా, బాధ్యతాయుతమైన జర్నలిస్టుగా గత 15 సంవత్సరాలలో మన సమాజం ఎదుర్కొనే ఎన్నో అంశాల మీద వీక్షణంలో తన అభిప్రాయాలు వ్రాస్తూనే ఉన్నారు. ఆయన మరణం వీక్షణంకి పెద్ద లోటు. దీని నుండి వీక్షణం కోలుకుని, ఆయన ఆశించినట్లుగా, సమాజానికి మార్గదర్శకంగా ఉండే విధంగా ముందుకు తప్పకుండా వెళుతుందనీ నమ్మకంతో... వీ

# నాకు తెలిసిన హనుమంత రావు

– బి.ఎస్. రాజు

రచయిత

కొన్ని పరిచయాలు వింతగా ఉంటాయి. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటారు. మొదటిచూపులోనే ప్రేమ కల్గడం అని నిత్యం వింటూ ఉంటాం! మొదటి పరిచయమే ఆత్మీయ స్నేహంగా మారి, ఆ స్నేహం ఓ లక్ష్యం వైపు, ఒక ఆదర్శ ప్రయత్నం వైపు పయనించడం సత్పరిణామం, మంచి ముందడుగు. ఇదే జరిగింది వి. హనుమంతరావు గారితో నా మొదటి పరిచయం ఏర్పడిన వెనువెంటనే. అదే ఈనాటి 'వీక్షణం'గా మనందరి ముందు ఉంది. హనుమంతరావుగారు 'వీక్షణం' విత్తు నాటి, మొక్కగా పెంచి, వృక్షంగా విస్తరించమని వెన్నుతట్టి 'వేణు' చేతిలో పెట్టడం, గర్వించదగ్గ పరిణామం. దీనికి ఆద్యుడు విహెచ్ గారైతే, బాధ్యుడు మన వేణు. 'వీక్షణం' మొక్కగా ఉన్నప్పుడు, చెట్టుగా ఎదిగిన తరువాత నాలాంటి వాళ్లం అడపాదడపా కాసిని నీళ్లు పోయడమే చేసాం!

విహెచ్ గారితో నా మొదటి పరిచయం నాటికి వారికి బహుశా 75 ఏళ్లు. నాకు 55 ఏళ్లు. వారి ఇల్లు హైదరాబాద్‌లో అమీర్‌పేట్ సెంటర్‌కి దగ్గర నాగార్జున నగర్‌లో, నా మకాం శ్రీనగర్ కాలనీ. మేం సన్నిహితం కావడం, తరుచూ కలవడానికి అది కారణం కూడా. అంతేకాదు, శ్రీనగర్ కాలనీ పోస్ట్ ఆఫీసు మా అపార్టుమెంటుకు చాలా

దగ్గర (అప్పట్లో). వారికి పోస్ట్ ఆఫీసుకు వచ్చే పనులేవో ఉండేవి. పోస్టాఫీసుకు వచ్చినప్పుడల్లా మా ఇంటికి తప్పక వచ్చేవారు. అలా నా సహచరికి కూడా వారు ఆత్మీయ స్నేహితులయ్యారు. మా అపార్ట్‌మెంట్ బిల్డింగ్ వాచ్‌మన్ విహెచ్ గారు ఎప్పుడొచ్చినా సాదరంగా చెయ్యి పుచ్చుకుని వారిని తీసుకు వచ్చేవాడు. అలా ఆయన అతని ఫ్యామిలీకి కూడా దగ్గరయ్యారు. శ్రీనగర్ కాలనీ పోస్ట్ ఆఫీసు మారిపోవడం, వారికి వయస్సురీత్యా కల్గిన ఇబ్బందుల మూలంగా మా ఇంటికి రావడం తగ్గినా, పూర్తిగా రావడమైతే బంద్ పెట్టలేదు. అయితే నేనే మధ్య మధ్యలో ఆయన నాగార్జున నగర్ ఇంట్లో ఉన్నప్పుడు వెళ్లి పలకరించి, కొంత సమయం ఆయనతో గడిపేవాణ్ణి. ఆయన చంద్ర రాజేశ్వర్రావు వృద్ధాశ్రమంలో ఉన్నప్పుడు కూడా రెండు, మూడు సార్లు వెళాను.

ఈ ఆత్మీయ కలయికలన్నిట్లోనూ ఎక్కువ సమయం 'వీక్షణం' పత్రిక గురించి, సిడిఆర్‌సి (సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్ అండ్ రిసెర్చ్ సెంటర్) నడిచినంతకాలం, దాని బాగోగుల గురించే ఎక్కువ చర్చించేవారు. 'వీక్షణం'లో వస్తున్న వ్యాసాల పట్ల మంచి, చెడులు మాట్లాడుతూ ఉండేవారు. సిడిఆర్‌సి విషయంలో చాలా పట్టుదల ప్రదర్శించేవారు. ఆ సంస్థ ఎలాగయినా నడిచి తీరాలనే ప్రగాఢ ఆకాంక్షతో ఉండి, అది పలు ఇబ్బందులు ఎదుర్కొంటున్న సమయంలో చాలా మదన పడేవారు. సిడిఆర్‌సిలో ప్రముఖులైన ప్రొ. ఆర్ ఎస్ రావుగారు, ప్రొ. కె ఆర్ చౌదరి గారి వద్దకు వెళదాం పదండి అని, సంస్థ విషయాలు చర్చించడానికి నన్ను పురిగొల్పి తీసుకు వెడుతూ ఉండేవారు. ఆయన ఎంత తపన పడ్డా, బాధ్యులందరు ఎంతగా ఆకాంక్షించినా కాలమాన పరిస్థితులు అనుకూలించక సిడిఆర్‌సి పనిచేయడం ఆగిపోయింది. అలా ఆగిపోవడం గురించి ఆయన అంతిమ శ్వాస వరకు బాధపడుతూనే ఉండేవారు. అయితే 'వీక్షణం' పత్రిక వేణు నాయకత్వంలో, సంపాదకత్వంతో కొనసాగడం, మంచిపేరు సంపాయించుకోవడం ఆయనకు ఊరటగా ఉండేది.

మన హనుమంతరావు గారిలో నాకు నచ్చిన కొన్ని పటిష్ఠమైన లక్షణాల గురించి, ఆయన సింప్లిసిటీ, మానవతా దృక్పథం గురించి కొంత చెప్పాల్సి ఉంది.

మొదటి లక్షణం: పట్టుదల, చెయ్యాలనుకున్న పనిని ఎలాగైనా సాధించాలనే ధృడసంకల్పం. ఆ పని గురించి, ఆ పనిని సఫలీకృతం చెయ్యడానికి కావలసిన కేంపైన్, పబ్లిక్ రిలేషన్స్ నిర్మొహమాటంగా కొనసాగించడం.

రెండవ లక్షణం: శ్రామిక స్పిరిట్. అంటే శ్రమపడే లక్షణం. చెయ్యాలనుకునే పనిని తక్కువ బడ్జెట్‌లో ఎలా చెయ్యగలమో గట్టిగా ప్రయత్నించడం.

మూడవ లక్షణం: తెలవనిది తెలిసినట్టు నటించకపోవడం. తెలియనిదాన్ని గురించి నాకసలేమీ తెలియదని నిష్కర్షగా, పటాటోపం లేకుండా చెప్పేయడం.

నాల్గవ లక్షణం: కమ్యూనిస్టులను నమ్మడం. ఏ పార్టీ ఐనా, ఏ గ్రూపైనా ఫరవాలేదు. వాడు చేసేది చేస్తాడు, చెయ్యనియ్యి. మన వంతు చెయ్యి మనం వేద్దాం! అని అనుకోవడం. వాళ్లు ప్రజల్లో ఉండి పని చేస్తున్నారంటే సంతోషించడం. ప్రజలకు దూరమౌతున్నారంటే మెత్తగా, నొప్పి లేకుండా విమర్శించడం.

సింప్లిసిటీ: జీవన విధానంలో 'సింప్లిసిటీ'ని భాగం చేసుకోవడం. తినే తిండి, వేసుకునే దుస్తులు, రాసే రాత, చెప్పేమాట 'సింప్లిసిటీ'తో నింపుకోవడం.

నాకు మార్క్సిజంలో ప్రావీణ్యం లేదనీ, అలానే తెలుగు-ఇంగ్లిష్ సాహిత్యాలతో పరిచయం లేదని, జర్నలిజమే నా వ్యాసాంగమని అసలు ఏ బడాయికి పోకుండా చెప్పుకోవడం.

విషయాలను చర్చించడానికి ప్రాముఖ్యత నివ్వడం. మీటింగ్ అనుకుంటే ఏ సాకులు చెప్పకుండా సమయానికి హాజరు కావడం, చర్చించాలనే అంశాలపై నోట్స్ తయారుచేసి తెచ్చుకోవడం... ఇటువంటి సత్ సాంప్రదాయం హనుమంతరావు గారు మనకు అందించి నిష్క్రమించారు. వాటిని గౌరవించి, స్వీకరించి, ఆచరించడం మనం మరింతగా సొంతం చేసుకోవడం... చెయ్యగల్గితే మంచిది.

'వీక్షణం' ఆరంభంలో ప్రజాపక్ష 'సమీక్ష'గా వచ్చేది. విహెచ్ గారు అన్నీ తానే అయి ఒంటి చేతిమీద దానిని నడిపారు. వేణు అప్పుడు 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో పనిచేస్తూ ఉండేవారు. ఆయన కొంత భుజం కాస్తూ ఉండేవారు. రాసేవాళ్లు తక్కువ. అన్ని పనులు ఆయనే చూసుకునే వారు. ఆయనే కట్టలు ఆటోలో తెచ్చి శ్రీనగర్ కాలనీ పోస్టాఫీసులో పోస్టు చేసేవారు. కొన్నాళ్లకి వీరారెడ్డి గారు హనుమంతరావుగారికి సహాయకుడుగా రావడం మూలంగా పెద్దాయనకు కొంత పనిభారం తగ్గింది. ఆతదనంతరం పత్రిక పేరు 'వీక్షణం'గా మార్చడం, ఆ పేరు రిజిస్ట్రేషన్‌కు ఆయన పడ్డతంటాలు, శ్రమ నాకు తెలుసు. పట్టువిడవక ఆయనకున్న సంబంధాలతో ఆ పేరు సంపాదించారు. అప్పుడు పత్రికకు వనరులేమీ లేవు. విహెచ్ గారి ఇల్లు, వ్యక్తిగతంగా ఆయనే పెద్దవనరు. ఆయన పట్టిన ఉడుంపట్టే 'వీక్షణం'కు పెద్ద బలం. ఆయన వ్యక్తిగత పరిచయాల ద్వారా సేకరించిన సొమ్మే ఆర్థిక వనరు. ఆ తదనంతరం వేణు పూర్తికాలం 'వీక్షణం' బాధ్యత తీసుకోవడం, రామచంద్రం వీరారెడ్డి స్థానంలోకి రావడం 'వీక్షణం' నిలదొక్కుకోవడానికి దోహదపడ్డాయి. ఇంకొంచెం ముందుకు నడిచి సిడిఆర్‌సి ఏర్పడటం. ప్రొ ఆర్ ఎస్ రావు గారు, డా. ముదునూరి భారతి గారు, అరవింద, ప్రొ. కె ఆర్ చౌదరిగారు, రాంకీ అంతా తలో చెయ్యివేయడం 'వీక్షణం'కు మరికొంత బలం చేకూరింది. వీక్షణాన్ని నిలబెట్టడానికి ఇహ వేణు పడ్డ బాధ, కష్టం చెప్పడానికి లేదు. ఆయనకు కుడిఎడమన దన్నుగా నిలబడ్డ రామచంద్రం, రాంకీల పాత్ర మరువలేనిది. వీటన్నిటికన్నా మించి పత్రికారంగంలో పెద్దలు, హేమాహేమీలు, జర్నలిస్టులు, విస్తృతంగా ఎందరో శ్రేయోభిలాషులు అందించిన మద్దత్తు లేకపోయినట్లైతే ఈరోజు 'వీక్షణం' తెలుగు సమాజానికి తన సేవలందించలేక కనుమరుగైపోయేదన్నది ఓ వాస్తవం. ఇప్పుడు వెనుతిరిగి చూసుకుంటే ఆశ్చర్యమేస్తుంది. పైసలేక, ఉన్నా చాలక, రాసేవాళ్లు లేక, డిటిపి చేసేవాళ్లు లేక, ఇలా ఎన్నో ఇబ్బందులు నాకు గుర్తు. ఓరోజు నేను అన్నమాట.. వేణు మనం చెయ్యితిరిగిన వారి వ్యాసాలు కావాలనుకుని ఎదురుచూసి అలిసిపోయేకన్నా, దినపత్రికల్లో కొత్తగా రాస్తున్న వాళ్లను, ఆ పత్రికలకు మంచి మంచి ఉత్తరాలు రాస్తున్న వాళ్లను సంప్రదించి వారిని మన పత్రికకు రాయమని అడగటం తెలివైన పనేమోనని! వేణుకు ఆ సలహా నచ్చి వెంటనే ఆవైపుగా పని చేయడం, ఇంకో అడుగు ముందుకు వేసి కొత్తవాళ్లను, నాలాంటి అరకొర రాతగాళ్లను వీక్షణం తరఫున సిలబస్ తయారుచేసి, క్లాసులు పెట్టి వ్యాసాలు రాసే పద్ధతిని, రీతిరివాజులను నేర్పించడం వీక్షణానికి ఎంతో దోహదపడింది. ఈ మొత్తం క్రమంలో హనుమంతరావు గారు వయస్సు రీత్యా ఎదుర్కొంటున్న ఆరోగ్య సమస్యలను పక్కకు పెట్టి మరీ ఉత్సాహంగా పనిచేసేవారు. వ్యాసాలు రాసేవారు. గైడ్ చేసేవారు. మద్దతు తెలిపేవారు. వీక్షణం ఆఫీసుకు

రావడానికి సిడిఆర్‌సి సమావేశాలకు, అమీర్‌పేట అతి రద్దీ సెంటర్‌లో ఒకవైపు నుండి ఇంకోవైపుకు రోడ్డు దుమికి బస్సుల్లో ప్రయాణం చేసేవారు. 80వ పడిలో ఆయన అంత ప్రమాదకరంగా చెంగునదూకి రోడ్డు దాటడం చూసిన నాకు భయంతో వణికిపోయి కోపం వచ్చింది. వారిని అంత రిస్క్ తీసుకోవద్దని సీరియస్‌గా మందలించవలసి వచ్చింది. సాధ్యమైనంతవరకు సమావేశాలకు నేను ఆయన్ను నా కారులో తీసుకువచ్చేవాణ్ణి. ఒకోసారి కుదిరేది కాదు.

నేను మధ్యలో ఓ నాలుగేళ్లపాటు దుబాయ్‌లో 'బుర్జ్ దుబాయ్ (ఇప్పుడు బుర్జ్ ఖలీఫా)' ప్రాజెక్ట్ నిర్మాణంలో ఇంజనీరింగ్ ఎస్సైన్‌మెంట్‌పై వెళ్లాల్సి వచ్చింది. ఆ నాలుగేళ్ల వీక్షణానికి, సిడిఆర్‌సికి దూరమయ్యాను. ఎప్పుడు సెలవులో వచ్చినా హనుమంతరావుగార్ని, వేణును కలవడం, వీక్షణం ఆఫీసులో కొంతకాలం వెచ్చించడం నా ప్రథమ కర్తవ్యంగా ఉండేది. అయినాగాని పెద్దాయనకు సంతృప్తిగా ఉండేది కాదు. మధ్య మధ్యలో దుబాయ్ ఫోన్ చేసేవారు. మీరు అక్కడే ఉండిపోతే ఎట్లా? ఇక్కడ మీ అవసరం ఉంది. తొందరగా చాపచుట్టుకుని వచ్చేయండి! అని హెచ్చరిస్తూ ఉండేవారు. ఇంతకీ చెప్పడం మర్చిపోయాను. అసలు పెద్దాయనతో నా మైత్రికి కారణం వరవరరావుగారు. సమీక్ష పత్రిక రావడానికి చాలాముందు నుండే విప్లవ రాజకీయాలే ప్రధానం కాని ఒక సామాజిక పత్రిక పెట్టాలని నేను వివి గారితో అంటూ ఉండేవాణ్ణి. ఔను, ఆ అవసరం ఉంది అని ఆయన కూడా అంటూ ఉండేవారు. ఐనా కొంతకాలం గడిచిపోయింది. అది కార్యరూపం తీసుకోలేదు.

ఒకసారి ఆయన్ను కలిసినప్పుడు మీరు ఎన్నాళ్ల నుండో అనుకుంటున్న పత్రికను సీనియర్ పాత్రికేయులు హనుమంతరావుగారు ప్రారంభించారనో, ప్రారంభిస్తున్నారనో అన్నారు. వేణు కూడా ఆయనతో కలవడానికి ఉత్సాహంగా ఉన్నాడని, మీరు కూడా వారికి మద్దతివ్వండి. వాళ్లతో కలిసి పని చెయ్యండని చెప్పారు. ఆయన సలహా ప్రకారం నేను మొట్టమొదటిసారి హనుమంతరావుగార్ని కలిసాను. కలిసి ఈ విషయమే చెప్పాను. ఆయన చాలా సంతోషించి మనసారా ఆహ్వానించారు. అలా మా మొదటి పరిచయం, స్నేహంగా మారి, ఆయన తుదిశ్వాస వరకు కొనసాగింది. ఆయన మరణానికి రెండు రోజుల ముందు ఓ రెండు గంటలపాటు ఆయనతో ఉండి కాలం గడిపినందుకు ఆత్మ తృప్తిగా ఉంది. మా ఆఖరి కలయిక సమయంలో కూడా ఆయన హుషారు గానే కన్పించారు. పెద్దనోట్ల రద్దుపై మాట్లాడారు. ఫ్రంట్‌లైన్‌లో వచ్చే వ్యాసాలు చదువుతున్నారా? అని అడిగారు. సిపిఎం నాయకులు తమ్మినేని వీరభద్రం పాదయాత్ర చెయ్యడం మంచిపని అని అన్నారు. కమ్యూనిస్టులు ప్రజలను వదిలి పెట్టేసారు. తిరిగి ముమ్మరంగా ప్రజల్లో తిరిగి ప్రజల్లో మమేకమవ్వాలి అని అన్నారు. సిపిఐ(మావోయిస్టు) పార్టీపై ఆయనకు ఎప్పుడూ ఒక అభియోగం ఉండేది. నేను కలిసినప్పుడు మాటల సందర్భంలో ఆ అభియోగం బయట పెట్టేవారు. 'వాళ్లు చంపే కార్యక్రమం పెట్టుకుని అనవసరంగా చనిపోతున్నారు' అని బాధ పడేవారు. నేను వివరణలోకి వెళ్లబోతే వినడానికి అంతహితవు చూపేవారు కాదు. ఆయనకు హితవు లేని విషయాలు చెబితే మననుండి మొహం పక్కకు తిప్పేవారు. మొదట్లో నాకు ఆ మేనరిజం అర్థంకాక నేను చెప్పాలనుకున్నది చెబుతూపోయేవాణ్ణి. కాలక్రమంలో అర్థం చేసుకుని జాగ్రత్త పడేవాణ్ణి.

ఇహ ఆయన పలు పత్రికలకు రాసే వ్యాసాల గురించి గాని, ఆయన పత్రికా వ్యాసంగం గురించి గాని నేను చెప్పేంత స్థాయి నాకు లేదు. వారు పరిచయం కాక ముందు ఆయన వ్యాసాలతోనే నాకు ఒకింత పరిచయం. ఈయన ఎవరోగాని, భలే సరళంగా, ముక్కుసూటిగా, సామెతలతో జోడించి సమకాలీన అంశాలను వివరిస్తున్నాడని మక్కువగా చదివేవాణ్ణి. అటువంటి అనుభవజ్ఞుడైన వ్యక్తితో నేను కలిసి పని చేస్తానని గాని, ఓ సత్కార్యంలో భాగస్వామినౌతానని గాని నేనెప్పుడూ అనుకోలేదు. నా జీవన గమనంలో నేను సంపాయించుకున్న ముఖ్య స్నేహితుల్లో విశిష్ఠ స్నేహితుడు, అమరుడు హనుమంతరావుగారు. 100 ఏళ్ల అక్టోబరు విప్లవ సందర్భాన్ని కమ్యూనిస్టులంతా కలిసి ఘనంగా నిర్వహించాలని, ఆ స్ఫూర్తిని పెద్ద ఎత్తున ప్రచారం చెయ్యాలని 2013లోనే 'నిత్యజీవితంలో సోషలిజం' పుస్తకావిష్కరణ సందర్భంలో వేదిక నుండి ఓ 20 పాయింట్లు రాసుకొచ్చి చదివారు. ఆయన ఆ విషయాన్ని తుదిశ్వాస వరకు చర్చించి, హెచ్చరిక చేస్తూ ఉండేవారు. ఆయన ఆశయాలను కొనసాగించడం, ఆయన మనకు వదిలివెళ్లిన బాధ్యతలను సజావుగా నిర్వర్తించడం మన ముందున్న ముఖ్యకర్తవ్యంగా భావించి నడుచుకోవడమే ఆయనకు మనం ఇవ్వగల్గే నివాళి. వీ

# హనుమంతరావుగారు

**– పి. అరవింద**
సాఫ్ట్‌వేర్ నిపుణులు

నేను హనుమంత రావు గారిని 2005 జనవరి సి.డి.ఆర్.సి ఏర్పడిన సందర్భంలో మొదటిసారి కలిసాను. అంతకు ముందు సారు గురించి వినడము, పత్రికల్లో ఆయన రచనలు చదవడమే కాని పరిచయం లేదు. సి.డి.ఆర్.సిలో మా ప్రయాణం దాదాపు 7 సంవత్సరాలు సాగింది. నాకు ఆయనతో ఉన్న అనుభవాలన్ని ఆ కాలం నాటివే. అవి కొన్ని పంచుకోవాలనే ఈ చిన్న ప్రయత్నం.

హనుమంత రావు సారు వ్యక్తిత్వంలో నన్ను బాగా ఆకట్టుకున్న విషయాలు రెండు. మొదటిది రాయడం, చదవడం పట్ల ఆయన అవిరామ కృషి, ముఖ్యంగా బడ్జెట్‌కి, ఆర్థిక విషయాలకి సంబంధించినవి. రెండవది సంస్థల పనితీరు పట్ల ఆయనకున్న ప్రణాళికాబద్ధ విధానం.

నేను ఎప్పుడు హనుమంతరావు సారు ఇంటికి వెళ్లినా, ఆయన 80-90 ఏళ్లు దాటినా, ఆరోగ్యం అంతగా సహకరించక పోయినా, ఏదో ఒకటి చదువుతూనో, రాస్తూనో ఉండేవారు. ఆయన ప్రతి సంవత్సరం రాష్ట్ర, కేంద్ర బడ్జెట్ల గురించి క్షుణ్ణంగా చదవడం, విశ్లేషించడం, వాటి గురించి రాయడం, టేబుల్స్, గ్రాఫ్స్‌తో ఆర్థిక ఇయర్ బుక్కులని తేవడం, మారుతున్న రాజకీయ పరిస్థితులని పరిశీలించడం, వాటిపై వ్యాఖ్యానాలు రాయడం వగైర చేస్తూ ఉండేవారు.

ఆయన ఏ పని చేసినా చాలా పద్ధతిగా, జవాబుదారీగా, సమయాన్ని పాటిస్తూ చెయ్యాలని అనుకునే వారు, అదే సి.డి.ఆర్.సి నుంచి కూడా ఆశించేవారు. మా బోర్డ్ మీటింగులలో చాలాసార్లు ఆయన మినిట్స్ గురించి, సంస్థ అకౌంట్‌ల గురించి అడిగేవారు. సంస్థకి ఫండ్స్ తక్కువగా ఉన్న పరిస్థితుల్లో మిగతా బోర్డ్ మెంబర్ల కన్నా ఎక్కువ పట్టించుకున్నది,

వాటి కోసం తనవంతు కృషి చేసినది ఆయనే. ఆయనకి రాజకీయ పార్టీలతో, రాజకీయ నాయకులతో ఉన్న పరిచయాల ఆధారంగా సంస్థకి ఫండ్స్, ప్రకటనలు సమకూర్చడానికి ప్రయత్నించే వారు. 85 ఏళ్ల దాటినా బస్సులెక్కి ఎంతో దూరాలు ప్రయాణం చేసి తప్పనిసరిగా బోర్డ్ మీటింగ్‌లకి వచ్చేవారు – ఆరోగ్యం అంత బాగోకపోయినా, బి.పి, దయాబెటిస్ ఉన్నా. ప్రతినెల వీక్షణంలో ఏదో ఒక వ్యాసం రాయాల్సిందే. తనకి ఏ విషయాల మీద పట్టు ఉంది, దేని మీద లేదు అనేది ఆయనకి స్పష్టంగా తెలుసు. తనకి అంతగా తెలీని విషయాల గురించి తెలుసుకోవడానికి ఆయన తనకన్న చిన్నవాళ్లనైనా, తనంత అనుభవంలేని వాళ్లనైనా అడగడానికి, నేర్చుకోవడానికి సంకోచించగా నేను ఎప్పుడు చూడలేదు. ఆయనకి జర్నలిస్టుగా 50 ఏళ్ల పైన అనుభవం ఉన్నా, తెలీని విషయాల గురించి (ముఖ్యంగా విశ్లేషణకి సంబంధించినవి) రాయలేనని ఎటువంటి ఈగో లేకుండా చెప్పేవారు. పని పట్ల ఆయన పట్టుదల ఎటువంటిదంటే, కొన్నిసార్లు మేము ఇతర బోర్డ్ మెంబర్లం ఆయనతో ఏకీభవించక పోయినా ఆయన మాత్రం పట్టుపట్టి ఆ పని చేసేవారు.

ఆయనతో నా పరిచయం కొంతకాలమే అయినా, అది కూడా ఒక సంస్థకి సంబంధించినంత వరకే అయినా, పని పట్ల, ముఖ్యంగా సంస్థల పనితీరు పట్ల, తోటి మనుషులతో సంబంధాల పట్ల ఆయన నుంచి నేను చాలా నేర్చుకున్నాను. ఏ పనిచేసినా క్రమశిక్షణతో, నిబద్ధతతో చెయ్యాలని, మనకి అన్ని విషయాలు తెలీవని ఒప్పుకోవడానికి అహం అడ్డం రానక్కరలేదని, ఎవరి నుంచైనా నేర్చుకోవచ్చని, వయసు, ఆరోగ్యం పనికి అడ్డంకి కానక్కరలేదని, అవసరమైన చోట నిర్మొహమాటంగా మన అభిప్రాయాలని చెప్పాలని, అవసరమైతే ఇతరులతో వాదించైనా పని పూర్తి చెయ్యాలని? ఇట్లా ఎన్నో విషయాలు ఆయనని చూసి అర్థం చేసుకున్నాను. వీటిలో కొన్నిటినైనా నేను అలవరచుకోవడమే ఆయనతో నా పరిచయానికి విలువనిస్తుంది. వీ

# కామ్రేడ్ వి. హనుమంతరావు-కొన్ని జ్ఞాపకాలు

– డి.వి.రామక్రిష్ణారావు
అరుణతార ఎడిటర్, విరసం కార్యవర్గ సభ్యులు

కామ్రేడ్ వి.హనుమంతరావు గారు నాకు 'ప్రజాపక్ష సమీక్ష' పత్రిక ప్రారంభం నుండి పరిచయం. ఆయన 1925 ఆగస్టు 30న తూర్పు గోదావరి జిల్లా మండపేటలో పుట్టారు. హైదరాబాద్‌లో 2016 డిసెంబర్ 13న చనిపోయేనాటికి ఆయనకు 91ఏళ్లు. ఏడు దశాబ్దాల జర్నలిస్ట్ జీవితం. 'ప్రజాపక్ష సమీక్ష' పత్రిక 2003 జనవరిలో పక్ష పత్రికగా ప్రారంభమైంది. ఆ పత్రికకు గౌరవ సంపాదకులుగా ఎ.బి.కె ప్రసాద్, సంపాదకులుగా వి. హనుమంతరావు ఉన్నారు. సలహా మండలిలో ప్రొ. ఆర్.వి.ఆర్. చంద్రశేఖరరావు, ప్రొ. వకుళాభరణం రామకృష్ణ, ప్రొ. పి. నారాయణరెడ్డి, డి. పాపారావు, బి. సాంబశివరాజు, ఎన్. వేణుగోపాల్‌లు ఉన్నారు. ఆయనతో నా పరిచయంలోకి పోయే ముందు వీక్షణంతో నా అనుబంధం మీతో పంచుకోవాలి.

కామ్రేడ్ వేణు గారికి, నాకు 'ప్రజాపక్ష సమీక్ష' కన్నా ముందే విప్లవ రచయితల సంఘం (విరసం) సభ్యులుగా మాకు స్నేహం ఉంది. హైదరబాద్ విరసం సిటీ యూనిట్ సమావేశాల్లోనూ, మామూలుగా కలిసినపుడు వేణు గారు తాను ఆ మధ్యకాలంలో రాసిన తన రచనలు, కొత్తగా వచ్చిన సమీక్ష పత్రికలు నాకు అందించేవారు. ఆ రకంగా సమీక్ష పత్రికలు చూడడం, చదవడం నాకు సాధ్యమైంది. కొద్ది కాలంలోనే 'ప్రజాపక్ష సమీక్ష' 'వీక్షణం' మాస పత్రికగా వెలువడడం మొదలయింది.

వ్యవసాయ పట్టభద్రుడిని కాబట్టి అప్పటివరకు వ్యవసాయ రంగంలో రకరకాల ఉద్యోగాలు చేసి, ఆ ఉద్యోగాలతో కాస్త విసుగు చెంది ప్రత్యామ్నాయాల కోసం నేను ఆలోచిస్తున్నాను. అప్పుడు కా. వేణు సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సి.డి.ఆర్.సి.) పేరిట ఒక సామాజిక అధ్యయన, పరిశోధనా సంస్థను మిత్రుల సహకారంతో ప్రారంభిస్తున్నట్లు చెప్పారు. అలాగే వీక్షణం పత్రిక పని కూడా చూడాల్సి ఉంటుందని చెప్పారు. ఒక పక్క సామాజిక అధ్యయనం, పరిశోధన, మరోపక్క పత్రిక పని రెండూ నాకు చాలా ఆసక్తి ఉన్న అంశాలే. అయితే ముందు జాగ్రత్త చర్యగా వేణు గారితో – నేను చదవడం, రాయడం రెండింటిలో నెమ్మది కదా, ఇబ్బంది అవుతుందేమోనని చెప్పాను. పత్రికా రంగంలో ఎటువంటి అనుభవం లేనివాణ్ణి అని అన్నాను. ఎందుకంటే కా. వేణుది పర్ఫెక్షనిస్ట్ దృష్టి, కోపం కాస్త నాకు తెలుసు. అయితే కా. వేణు గారి ప్రోత్సాహం, నా సాహిత్య అభినివేశం, ఆసక్తి వల్ల సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్ రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సి.డి.ఆర్.సి.), వీక్షణం పత్రికతో 2005లో నా కొత్త ప్రయాణం మొదలయింది. అదనపు ఆకర్షణ అప్పటికే కా. వై రామచంద్రం (రాము) (అఖిల భారత ప్రజా ప్రతిఘటన వేదిక – ఎ.ఐ.పి.ఆర్.ఎఫ్. సభ్యులు) నాకన్నా ఒక రోజు ముందే అక్కడ జాయిన్ అయి ఉండడం. తను కూడా అక్కడ చేరుతున్నట్లు ముందే తెలియడం అలా సహజంగానే వీక్షణం సంపాదకులు, సి.డి.ఆర్.సి. బోర్డు మెంబర్ అయిన వి.హనుమంతరావు గారితో సన్నిహితంగా పనిచేసే అవకాశం కలిగింది. 2003 నుంచి 2016 దాకా పత్రిక పనిలో భాగంగాను, తరవాత ఆయన రచనలు చదువుతూనే ఉన్నాను. ఆయనే కాదు సి.డి.ఆర్.సి. బోర్డు సభ్యులైన ప్రొ. ఆర్.ఎస్. రావు, డా. ముదునూరి భారతి, ప్రొ. కె.ఆర్. చౌదరి గార్లతో పనిచేసే గొప్ప అవకాశం కూడా అక్కడే కలిగింది.

కా. వి.హనుమంతరావు చాలా సాధారణంగా, సామాన్యంగా ఉంటూ తన రంగంలో ఎంతో నిబద్ధత, అంకిత భావం ఉన్న మనిషి. ఆయన తన రచనా వ్యాసాంగం ద్వారా ప్రజలకు బాధ్యత పడ్డ మనిషి. ఆయన ఏడు దశాబ్దాల జర్నలిస్ట్ కృషి అనితర సాధ్యమయింది. జీవితం ఆయనకు అవకాశం ఇస్తే, ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్న మనిషి. ఆయన పాత్రికేయ వృత్తిని అత్యంత బాధ్యతాయుతమైనదిగా భావించి చేశారు. ఆయన తన పాత్రికేయ జీవిత షష్టి (1952–2012) పూర్తి సందర్భంగా ఆరు దశాబ్దాల అనుభవాలు – అనుభూతులను 'జర్నలిస్ట్ అంతర్వీక్షణం' పేరిట ఒక పుస్తకాన్ని వెలువరించారు. అందులో తాను జర్నలిస్ట్ జీవితంలోకి ఎలా వచ్చింది, కొనసాగింది చెప్పుకున్నారు. 'దేశభక్తి యుతమైన, పవిత్రమైన పాత్రికేయ వృత్తిలో ప్రవేశించి ఏదో ఉడతా భక్తిగా నా చేయి కూడా వేసే అవకాశం కలిగినందుకు, ఆ వృత్తినే ఎంచుకున్నందుకు తనకెంతో గర్వమైన విషయం'గా చెప్పుకున్నారు.

ఆయనకు ప్రేరణ ఆనాటి కమ్యూనిస్టు పార్టీ మిత్రులే. 1943–44 లలో ఆయన విశాఖలో ఉద్యోగం చేస్తూ ఒకసారి తన సొంత ఊరు మండపేట వెళ్లినపుడు తన తోటి విద్యార్థులంతా కమ్యూనిస్టు పార్టీలో

ఉన్నారు. వారితో కలిసి తిరిగే క్రమంలో వారు గ్రామ ప్రజలకు సేవలు చేయడం చూసి ప్రభావితుడిని అయ్యాను అని చెప్పుకున్నారు. స్వతహాగా ప్రజలకు అలాంటి సేవలందించాలనే స్వభావం కలవాడిని కావడంతో, అదే పనిని కమ్యూనిస్టు కార్యకర్తలు చేస్తూ ఉండడం ఆ పార్టీకి తనను దగ్గర చేశాయన్నారు.

ఆయన జీవిత కాలం ప్రభుత్వాలు తమకు తాముగా ప్రకటించి అమలు పరచని అంశాలను ప్రజలవైపు నుంచి చూసి ప్రజలకు తెలియజెప్పారు. రాజకీయ పార్టీలు అధికారంలోకి రాకముందు చేసిన హామీలు, మేనిఫెస్టోల్లో ప్రకటించిన అంశాలు, అధికారంలోకి వచ్చాక ఆయా అంశాలపై కేటాయించిన బడ్జెట్లు, విడుదల చేసిన మొత్తాలు, వాస్తవానికి ఖర్చు చేసినది, నిజానికి ప్రజలకు అందినది అనే అంశాలనే ప్రభుత్వమే ప్రకటించిన, అచ్చువేసిన బడ్జెట్ పుస్తకాలు, ఎకనామిక్ సర్వేలు, పత్రికల నుంచి ఏరి, కూర్చి ప్రజల ముందు పెట్టేవారు. మన ప్రభుత్వాల సంగతి తెలుసున్నదే కదా – పంచ పాండవులంటే మంచం కోళ్లలా ముగ్గురు అని చెప్పి, మూడు వేళ్లు చూపించబోయి రెండు వేళ్లు చూపించి, బోర్డుపై రెండుకు బదులు ఒకటి వేయబోయి సున్నా వేసిన చందంగా ఉంటుంది ఆ లెక్క! అలా ఆయన ఆర్థికం, రైల్వే, వ్యవసాయం, విద్యుత్, శాస్త్ర సాంకేతిక, సామాజిక రంగాలు అన్నిటా తనదైన దృష్టిని సారించారు. ఆర్.ఎస్.. రావు గారు రచనకు సంబంధించి ఒక మాట అనేవారు – 'ఒక రచన సమాచారం ఇస్తోందా, విశ్లేషణను అందిస్తోందా చూడాలనేవారు, అలా అంటూనే మన విశ్వవిద్యాలయాలు ఇలా ఉంది, అలా ఉంది అనే సమాచారాన్ని ఇస్తాయి, మనం మార్క్సిస్టులుగా ఎలా మారుతోందో చెప్పాల'నే వారు.

అయితే హనుమంతరావు గారు పాలకులు చెప్పిన దానికి చేసినదానికి ఉన్న తేడాను పట్టి ఇచ్చేవారు. అందుబాటులో ఉన్న సమాచారాన్ని పోలికలో అందించేవారు. ఇవ్వాల్టి తరం జర్నలిస్టులు నేర్చుకోవలసిన అనేక విలువలు హనుమంతరావుగారి వద్ద ఉన్నాయి. తన అనుభవాలు చెపుతూ 'వృత్తిలో కొనసాగుతున్నది జీతం రాళ్ల కోసమే గాని, అదే సమయంలో తన వృత్తిలో మనసు పెట్టి పనిచేస్తే రాష్ట్రానికి, దేశానికీ, పరోక్షంగానైనా ప్రజలకు సేవ చేయవచ్చనే తలపు విలేఖరి మనసులో పెట్టుకుని పనిచేస్తే ఆ వార్తకు జీవకళ వస్తుంది. పాఠకునికి విస్తృత సమాచారం లభించి, ఆ అభివృద్ధి, ఆ పరిణామం మంచిచెడులు తెలుసు కోవడానికి వీలు కలుగుతుంద' ని పని పట్ల నిబద్ధత గురించి చెప్పారు. అలాగే పత్రికల సత్య నిష్ఠత గురించి – 'అప్పటికీ, ఇప్పటికీ కూడా పత్రికల సత్యనిష్ఠ గురించి ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు పత్రికల నుంచి నేర్చుకో వలసింది ఏమీ లేద'ని తన అభిప్రాయాన్ని స్థిరంగా చెప్పారు.

పుచ్చలపల్లి సుందరయ్యగారి వద్ద లేఖకుడిగా జీవితం ప్రారంభమై 2016 డిసెంబర్ 13న చనిపోయే దాకా ఆయన పాత్రికేయ జీవితం కొనసాగింది. ఆర్థిక ఇబ్బందులవలన ఆయన పెద్ద చదువులు చదవలేకపోయారు. ఎస్.ఎస్.ఎల్.సి., టైపు, షార్ట్ హ్యాండ్ లే అర్హతలుగా ఆయన జర్నలిస్ట్ రంగంలోకి ప్రవేశించారు. అనేక పత్రికలలో పనిచేసారు. అనేక పత్రికలలో ఆయన రచనలు అచ్చు అయ్యాయి. అనేక పుస్తకాలకు సంపాదకులుగా, సహ సంపాదకులుగా ఉన్నారు. ఎ.బి.కె. ప్రసాద్ అన్నట్లు – 'హనుమంతరావు గారికి మహా మహా డిగ్రీలు లేకపోయినా లోకజ్ఞానం, చుట్టూ చూపు, పరిశీలనా శక్తి, నిరంతర పత్రికా పఠనం, పది మందితో అనుదిన పరిచయాలు వి.ఎచ్. గమనాన్ని తీర్చిదిద్దాయి. గమ్యాన్ని సునిశితం చేసాయి'. చనిపోయే నాటికి వీక్షణం వద్ద ఇంకో అచ్చు కావలసిన వ్యాసం ఉంది. జనవరి 2017 సంచికలో నోట్ల రద్దు, దేశంలో పేరుకున్న అవినీతిపై వ్యాసం అచ్చయింది.

తన డెబ్బై ఏళ్ల జర్నలిస్ట్ ప్రస్థానంలో ఆయన దాదాపు 5 వేలకు పైగా వ్యాసాలు రాశారు. అంటే నెలకు సరాసరిన అరడజను వ్యాసాల చొప్పున ఆయన రచన కొనసాగింది. ఆయన వ్యాసాలు సూటిగా సమాచారంతో ఉండేవి. ఆయన పాత కమ్యూనిస్టు విలువలకు కట్టుబడ్డ మనిషి. కాలంతో పాటు తెలంగాణ వంటి అంశాల పట్ల ఆయన వైఖరిలో మార్పు లేదు... ఆయన ' విశాలాంధ్రలో ప్రజా రాజ్యం' అనే నినాదం పైననే తన నమ్మకాన్ని ఉంచుకున్నారు. మలిదశ తెలంగాణ ఉద్యమం జరుగుతున్నప్పుడే ప్రజాశక్తి దినపత్రికలో (2005 డిసెంబర్ 7న) 'విశాలాంధ్ర వచ్చింది.. ప్రజారాజ్యం రావాలి ' అనే వ్యాసం ద్వారా తన అభిప్రాయాన్ని చెప్పారు.

ఆయన వ్యాసాల శీర్షికలోనే తన ఉద్దేశాన్ని, లక్ష్యాన్ని సూటిగా ప్రకటించే వారు.. కొన్ని చూస్తే – 'కేటాయింపులు కొండంత, విడుదల పిసరంత', 'కొద్దిమంది చేతుల్లో భూ కేంద్రీకరణ', 'గ్రామీణ అవ్యవస్థే ఆత్మహత్యలకు కారణం' , 'ప్రైవేటీకరణ ఉచ్చులో బ్యాకింగ్ రంగం', 'స్వాములపర్తి నరసింహారావు', 'పరాధీనత.. స్వాంతంత్రం.. పరాధీనత', 'పేదవారికి అందినప్పుడే సబ్సిడీలకు సార్థకత', 'భూ సమస్య పరిష్కారం భుక్తి సమస్యను పరిష్కరిస్తుంది', 'రెండో స్వాతంత్ర పోరాటం ప్రారంభించాలి'.. ఇలా దిశా నిర్దేశం చేస్తాయి ఆయన వ్యాసాలు, ఆ వ్యాసాల శీర్షికలు.

అలాగే కొత్తతరంతో కలిసిపోవడంలో ఆయనకు ఏమి ఇబ్బంది లేదు. నాతోనైనా, రాముతోనైనా చాలా స్నేహపూర్వకంగా వ్యవహరించే వారు. సి.డి.ఆర్.సి., వీక్షణంల కోసం తన వద్ద ఉన్న పుస్తకాలు, పేపర్ క్లిప్పింగ్స్ ఇవ్వడమే కాదు, పత్రికకు చందాలు కట్టించడం, తనకు చాతనైన మేరకు విరాళాలు సేకరించడం వంటి కృషి చేశారు. వృద్ధాప్యం వలన వీక్షణం పత్రిక సంపాదక బాధ్యతలు వేణు గారి పేరిట మార్చినపుడూ ఆర్.ఎన్.ఐ. మార్పు కోసం అవసరమై నపుడల్లా ఓపికగా వచ్చి సంతకాలు చేసి ఆ పని పూర్తి చేశారు.

దాదాపు ఆయన 80వ పడిలోకి వెళుతున్న క్రమంలో మా స్నేహం ప్రారంభమైంది. అంత వయసులోనూ ఆయన బస్సుల్లో వీక్షణం ఆఫీస్‌కు రావడం ఆశ్చర్యమనిపించేది... ఆరోగ్యం ఎలా ఉంది సార్ అని అడిగితే – 'బాగున్నానుగా, అందుకే వచ్చాను' అని అనేవారు. తన ఆరోగ్యం గురించి, వృద్ధాప్య ఇబ్బందుల గురించి ఎప్పుడూ చెప్పిన జ్ఞాపకం లేదు. తాను అనుకున్న పని సాధించే కార్యనిష్ఠత ఆయనకు ఉండేది. వేణుగారికి, నాకు, రాముకు కొంత ప్రజా సంఘాల పనుల ఒత్తిడులు కూడా ఉండేవి. అయినా 'వేణు వీక్షణానికి మరింత సమయం ఇవ్వాల'ని అడిగేవారు. సి.డి.ఆర్.సి. నుంచి 'ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (1956–2006)' అనే ఉద్గ్రంథం రావడంలో ఆయన ఆలోచనలు, ప్రోత్సాహం ఉన్నాయి.

తాను అనుకున్న పనిని నేర్పుతో, సహనంతో అయ్యేలా చూసేవారు. తన అభిప్రాయం చెప్పడంలో మొహమాట పడేవారు కాదు. ఆ తరవాత కాలంలో పత్రిక ఆర్థిక ఇబ్బందులు, నా ఇబ్బందులు వెరసి నేను వీక్షణంలో నవంబర్ 2012 నుండి కొనసాగలేకపోయినా మా స్నేహం కొనసాగింది. రాము పట్ల ఆయనకు ప్రత్యేక అభిమానం ఉండేది. ఆ అభిమానం ఎక్కడిది అంటే – కష్టించి పనిచేసే మనుషుల పట్ల ఉండే అభిమానం.. రాముతో అనేవారు – 'సంస్థకు నీవే కాళ్లు, చేతులూ' అని...

జర్నలిస్ట్ రంగంలో మనం చాలా మందిని చూసి ఉండవచ్చు, కానీ హనుమంతరావు గారు ప్రత్యేకమే.. చాలామంది జర్నలిస్ట్ రంగంలో తమకు వచ్చిన పేరు ప్రఖ్యాతులను వ్యక్తిగత ప్రయోజనాల కోసం, అడ్డదారుల్లో ఆస్తులు పెంచుకోవడం కోసం ఉపయోగించుకుంటారు.

కానీ, హనుమంతరావు గారు కొన్ని విలువలతో ప్రజలకు జవాబుదారీగా బతికారు. జర్నలిస్ట్ రంగంలో తనకు దొరికిన అవకాశాలను, గుర్తింపును కొత్తతరాన్ని ప్రోత్సహించడానికి ఉపయోగించారు. గ్రామీణ జర్నలిస్ట్‌లను ప్రోత్సహించడానికి వినియోగించారు. తాను నడిచి వచ్చిన క్రమాన్ని ఆయన మరిచిపోలేదు. తాను పడ్డ ఇబ్బందులను గుర్తు పెట్టుకుని కొత్త తరానికి తన స్నేహ హస్తాన్ని, సహకారాన్ని అందించారు. వీక్షణంలో జీతాల పరిస్థితి తెలుసు కాబట్టి రాముకి తన వంతుగా నెలకు ఒక మూడు వందల రూపాయల సహకారం అందించారు. తాను సహాయ పడడమే కాదు, అలా సహాయపడమని ఇతరులను ప్రోత్సహించేవారు. తాను ఎంచుకున్న రంగంలో అంకిత భావంతో చివరి దాకా కొనసాగారు. ఆయన చనిపోవడానికి ఒక మూడు నెలల ముందు నేను, రాము, అరవింద పోయి కలిసినపుడు తనకు ఉన్న ఆలోచనలు మాతో పంచుకున్నారు. 'ఫిఫ్టీ యియర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' పుస్తకాన్ని తాజా అంశాలతో అప్డేట్ చేసి, కొన్ని చాప్టర్స్ కలిపి, మార్పులు చేర్పులతో మళ్లీ తీసుకవస్తే బాగుంటుందని అన్నారు. అలాగే తన వ్యాసాల పుస్తకం ఒకటి తెచ్చే ఆలోచన ఉన్నట్లు చెప్పారు. ఆయన ఎంతలా రాశారంటే ఆయన చనిపోయాక కూడా వేయడానికి మిగిలి పోయినన్ని రాశారు.

ఆయన చాలా మృదుస్వభావి. వయసు వల్ల కూడా కావచ్చు కాస్త నెమ్మది మనిషే. అయితే ఆయనకు చాలా న్యాయమైన కోపం వస్తుంది. 2004లో మావోయిస్ట్ పార్టీకీ, అప్పటి ప్రభుత్వానికి జరిగిన చర్చల అనంతర కాలంలో విశాలాంధ్రలో రాసిన వ్యాసంలో (2005 జనవరి 29) 'జనజీవన స్రవంతి అంటే?' అనే వ్యాసంలో – 'మన సమాజ ధోరణులను చూస్తుంటే ఒళ్లు మండిపోతుంది. పట్టలేని కోపం వస్తుంది. జరుగుతున్న అన్యాయాల్ని ఒక కత్తి పెట్టి నరికేయాలనిపిస్తుంది. గ్రామీణ కుటుంబాలలో సగం దారిద్ర రేఖ దిగువన నివసిస్తున్నాయి. నిరుద్యోగుల సంఖ్య పాపం పెరుగుతున్నట్లు పెరుగుతూనే ఉంది. అవినీతి, అసభ్యత పురివిప్పి నాట్యం చేస్తున్నాయి. రాజకీయాలు నేరగ్రస్తమవుతున్నాయి. చట్ట సభల్లో నేరస్తులు చట్టాలు రూపొందిస్తున్నారు. వలసలు అధికమవు తున్నాయి. ఆత్మహత్యలు సరేసరి. అన్నీటికన్నా ముఖ్యం సమాజంలో అంతరాలు పెరుగుతున్నాయి. ఇది వరకు పాలకులను దేశం నుంచి బయటకు వెళ్లగొట్టడానికి స్వతంత్ర సమరం సాగించి విజయం సాధిస్తే, ఇప్పుడు మీరు మా దేశంలోకి రండహో అని ఎర్ర తివాచీలు పరిచి మరీ ఆహ్వానిస్తున్నారు. ఈ చట్టాలు కలవారి చుట్టాలు అవుతున్నాయి. ఇదే మన జనజీవన స్రవంతి. ఇలాంటి స్రవంతి నుంచి ఎలా బయటపడడమో అని ప్రజలు ఎదురు చూస్తునారు. ఆఖరుకు తాగడానికి నీటికోసం కూడా ఉద్యమాలు జరపాల్సిన పరిస్థితి నుంచి ఎప్పుడు విముక్తి లభిస్తుందా అని ఎదురు చూస్తున్నారు. ఈ కుళ్లు సమాజంలోకి రమ్మనేనా, ఈ జనజీవన స్రవంతిలోకి రమ్మనేనా పాలకులు విప్లవకారులను ఆహ్వానిస్తున్నారు?' అని తీవ్రంగా ప్రశ్నిస్తారు. ఆయన హృదయం ఉండాల్సిన చోటే ఉంది. మనం తీసుకోగలిగితే తీసుకోగలిగి నంత. రేపు ప్రజారాజ్యం ఏర్పడినపుడు హనుమంతరావు గారు కూర్చిన అంకెలలో దాగిన సత్యాలను మనం విశ్లేషించుకోవాలి.. ప్రజా పక్షంగా ఆ అక్షరాలు అందించిన సత్యాలు ప్రజలకు ఉపయోగపడతాయి. ప్రజా ఆకాంక్ష లకు ప్రతీకలుగా ఆయన అక్షరాలు నిలుస్తాయి.

ఈ సందర్భంగా గుర్తుచేసుకుంటే – కా. వి. హనుమంతరావు, కా. గోరుమాధవ రావు, కా. కె.జి. కన్నబీరన్, కా. ఎం.టి. ఖాన్, కా. బి. సత్యనారాయణ (బి.ఎస్.ఎ.), కా. చలసాని ప్రసాద్, కా. ద్రోణవల్లి అనసూయమ్మ, కా. వెంకాయమ్మ, కా. బొజ్జ తారకం, కా. కానూరి వెంకటేశ్వరరావు ఇలా చెప్పుకుంటూ పోతే వీరంతా తమ జీవితాన్ని చివరి క్షణం వరకు వారు ఎంచుకున్న రంగాల్లో అంకితమై కృషిచేసినవారే. జీవితం వారికి ఇచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నవారే. వారి ఆశయాలను కొనసాగించడమే మనం వారికి ఇవ్వగలిగే నిజమైన నివాళి. అరుణతార, వీక్షణంతో సహా ప్రజాప్రత్యామ్నాయలను ఎత్తిపడుతున్న పత్రికలకు మనమంతా బాసటగా నిలవాలి. సి.డి.ఆర్.సి వంటి సంస్థల అవసరం, రాజకీయార్థిక, సామాజిక అంశాల అధ్యయనం మనం కోరుకుంటున్న సామాజిక మార్పుకు ముందూ ఆ తరువాతా అవసరమే. వీటిని నిలబెట్టి కొనసాగించడంలో మనందరి అంటే సమాజం ఉన్నతంగా మారాలనే, మార్చాలనుకునే అందరిపైనా ఉంది. కా. వి. హనుమంతరావు స్మృతికి నా తరఫున, విప్లవ రచయితల సంఘం తరఫున అరుణారుణ జోహార్లు. వీ

# హనుమంతరావు జీవితం, రచన ఆదర్శమే

– వై. రామచంద్రం
వీక్షణం అసిస్టెంట్ ఎడిటర్

హనుమంతరావుతో నాకు మొదటి పరిచయం అఖిల భారత ప్రజా ప్రతిఘటన వేదిక (ఎ.ఐ.పి.ఆర్.ఎఫ్) బహిరంగసభ గుంటూరులో జరిగింది. ఆ సభకు హనుమంతరావును వక్తగా పిలిచాం. ఆయన్ను తీసుకువెళ్లే బాధ్యతను నాకు అప్పగించారు. అలా మొదలైన మా రైలు ప్రయాణ పరిచయం నేను వీక్షణంలో చేరడం, ఆయన రచనలు చదవడం, దగ్గరగా కలుసుకునే అవకాశం ఏర్పడింది. ఆ అవకాశమే నేను హనుమంతరావు గురించి ఈ నాలుగు మాటలు రాసేలా చేసింది.

రచనా రంగంలో నాకు ప్రవేశం లేకున్నా వీక్షణంలో అవకాశం రావడం, అందునా పత్రికా రంగంలో విశేషంగా కృషిచేసిన వ్యక్తుల మధ్య పనిచేయడం గొప్ప అవకాశం. ఈ క్రమంలో హనుమంతరావు ఇంట్లో లైబ్రరీ సర్దడానికి, వ్యాసాల క్లిపింగ్స్ సబ్జెక్ట్‌ల వారీగా పెట్టడానికి పిలిచారు. అప్పుడు ఆయనతో దగ్గరగా మాట్లాడే అవకాశం వచ్చింది. హనుమంతరావుకు చాలా విషయాలు తెలుసు కాబట్టి ఆ సందర్భంలో జరిగిన విషయాలను మార్క్సిస్టు దృక్పథంతో ఎలా అర్థం చేసుకోవాలని అడిగినపుడు ఆయన చాలా వినయంగా అంత లోతైన అవగాహన నాకు లేదని అన్నారు. అలా చెప్పడం ఆయన పట్ల నాకు గౌరవం కలిగేలా, నాకు విశ్వాసం కలిగేలా చేసింది. ఆయన వయసులో నా వయసు సగమే అయినా మేము మాట్లాడుకునే సందర్భంలో మా మధ్య వయసు తేడాలు లేకుండా వ్యవహరించేవారు. సి.డి.ఆర్.సిలో జరిగే పనులు సకాలంలో జరగాలని ఎప్పటికప్పుడు గుర్తుచేసేవారు. పనిలో కచ్చితత్వాన్ని పాటించేవారు. కలిసి పనిచేసే క్రమంలో జరిగే లోటుపాట్లను ఎత్తిచూపడంలో ఎలాంటి మొహమాటాలకు లోనుకాకుండా చెప్పేవారు. ఆ తరువాత కలిసి పనిచేయడంలో అంతే స్ఫూర్తిని ప్రదర్శించేవారు.

పత్రిక ఆర్థికంగా నిలదొక్కుకొని నిరాటంకంగా రావడానికి ఆయన తన శక్తిమేరకు కృషిచేశారు. 85 ఏళ్ల వయసులో కూడా విశాఖనగర

వీథుల్లో చలసాని ప్రసాద్‌తో కలిసి స్కూటర్‌పై వెళ్లి పత్రిక చందాలు, విరాళాలు సేకరించారు. ఇలాంటి పనులు తాను స్వయంగా చేసి ఇతరులకు స్ఫూర్తినిచ్చేవారు.

ఆయన అనుకోకుండా జర్నలిస్టు రంగంలోకి వచ్చినా ఆ వృత్తిని చాలా బాధ్యతగా నిర్వర్తించారు. మొదట సిపిఐ, సిపిఐ(ఎం) మిత్రులతో ఉండే అనుబంధం, అట్లాగే జర్నలిజంలో నేర్చుకున్న జ్ఞానాన్ని విశాల ప్రపంచం లోకి తీసుకెళ్లి వికసింపచేయాలనే ఉద్దేశ్యంతో పెట్టిందే డేటా న్యూస్ ఫీచర్స్ (డిఎన్ఎఫ్) అనుకుంటా. గ్రామీణ ప్రాంతాల్లో అంకిత భావంతో పనిచేస్తున్న జర్నలిస్టులను ప్రోత్సహించడానికి డిఎన్ఎఫ్ పేరిట అవార్డులు ఇచ్చారు. సామాజిక అంశాలపై రాస్తున్న రచయితలతో నిత్యం సంభాషిస్తూ వారు మరిన్ని రచనలు చేసేలా ప్రోత్సహిస్తూ తనకు వీలైన సహకారాన్ని అందించారు.

ఆయన ప్రధానంగా ఆర్థిక రంగంపై దృష్టి సారించి కృషి చేసారు. ప్రభుత్వాలు ప్రతి ఏటా ప్రచురించే బడ్జెట్ పుస్తకాలు, ప్రధానంగా ఆర్థిక సర్వేల ఆధారంగా జనాభాకు తగిన విధంగా కేటాయింపులు ఉన్నాయా లేదా అని లెక్కలువేసి ప్రభుత్వ డొల్లతనాన్ని ఎండగట్టేవారు.

ఆయన జర్నలిజం వరకు మాత్రమే తన కార్యచరణను కుదించుకో లేదు. ప్రభుత్వ విధానాలవల్ల సమాజంలో ఏర్పడుతున్న అంతరాలను విప్పిచెప్పే రచనలు చేసి వివిధ ప్రజాసంఘాలకు ఇచ్చి బుక్‌లెట్స్ వేయించారు. ఆయనే స్వయంగా పుస్తకాలు ప్రచురించారు. కొన్నింటికి సంపాదకులుగా ఉన్నారు. అట్లాగే ప్రజాస్వామిక ఉద్యమాలకు అండగా ఉంటూ ఆయా సంస్థలు నిర్వహించే సమావేశాలకు వయోభారం లెక్క చేయకుండా పాల్గొన్నారు. 1991లో నూతన ఆర్థిక విధానాలపై, చంద్రబాబు విజన్ 2020 ప్రభావం సమాజంపై ఎలా ఉండబోతుందో తన రచనల ద్వారా విస్తృత ప్రచారం చేశారు.

మేము పత్రిక గురించి చర్చించుకునే క్రమంలో నాకు పత్రికలో వచ్చే నెల జీతం ఎంత అని అడిగారు. నేను నా సహచరి కుట్టుమిషన్ కుదుతుందని, ఆమెకు, నాకు వచ్చే జీతంతో సర్దుకుంటున్నామని చెప్పాను. ఇదంతా తెలుసుకొని ఆయన హైదరాబాద్ లాంటి నగరంలో నీకు వచ్చే జీతం ఎలా సరిపోతుందని చెప్పి, ఒక సందర్భంలో నాకు ఒక లక్ష రూపాయలు ఇస్తానని అన్నారు. అది పోస్ట్ ఆఫీసులో వేసుకొని నెల నెల వచ్చే వడ్డీ తీసుకొమ్మని చెప్పారు. నేను చూద్దాం లెండి అని అప్పటికి తప్పించుకున్నాను. నాలుగు నెలల తరువాత ఆయనే ఇలా అయితే కుదిరేలా లేదని నెలకు మూడు వందల రూపాయల చొప్పున నా పేర చెక్ రాసి పంపేవారు. అట్లాగే ఆయనకు తెలిసిన వారి ద్వారా నెలకు ఐదు వందల రూపాయలు ఇప్పించేవారు. ఇలా ఐదారు నెలలు గడిచాక ఆ ఇచ్చేవాళ్లు ఆపేసారని నేను వేరే ప్రయత్నం చేస్తానని నిత్యం చెప్పేవారు. పనిచేసే మనుషుల పట్ల చాలా గౌరవం ఉండేది.

ఆయన కొత్తది నేర్చుకునే విషయంలో నిత్య విద్యార్థి అని చెప్పుకోవచ్చు. ఈ వయసులో కూడా కంప్యూటర్ నేర్చుకొన్నారు.

పత్రిక ప్రారంభంలో ఆయన ఒక్కడే పట్టుదలతో దాదాపుగా అన్ని పనులు చేసేవారు. ఇప్పుడు అదే పత్రిక పనిని వేణు, నేను, వెంకటేష్, రాజశేఖర్ కలిసి చేస్తున్నాం. ఇంతకు ముందు ఇప్ప వీరారెడ్డి, ప్రశాంత్, ఫణీంద్ర, ఎస్. కిషోర్ కుమార్, రాంకి కూడా ఉండేవారు. ఆయన మొదట్లో ఒక్కరే పత్రిక నిలబెట్టడానికి ఎంత కష్టపడ్డారో దీన్నిబట్టే అర్థం చేసుకోవచ్చు.

ఆయన రచనలు మధ్యతరగతి వారిని కూడా ఒప్పించేలా ఉండేవి. ఈ వ్యవస్థ మార్పు కోసం కృషి చేయడమే ఆయన కోరుకున్న లక్ష్యాన్ని నేరవేర్చినట్లవుతుంది. పత్రికా రంగంలో ప్రధానంగా ఆర్థికపరమైన విషయాలను విడమర్చి చెప్పడంలో ఆయనలేని లోటు కొంతకాలమైనా ఉంటుంది.

ఆయన చివరి రోజుల్లో ప్రతి నెల వీక్షణం ఆఫీసులో జరిగే ఎడిటోరియల్ కలెక్టివ్ సమావేశం తన ఇంట్లో వేసుకోవాలని పట్టుపట్టారు. ఆయన కోరిక మేరకు ఒక సమావేశం అక్కడే వేసుకున్నాం. ఇలా పత్రికలో అచ్చవుతున్న విషయాలతో, దాని కోసం కృషి చేస్తున్న మనుషులతో నిత్యం సంబంధాల్లో ఉండాలని కోరుకునేవారు.

హనుమంతరావు రచనల ద్వారానే కాదు ఆయన జీవితం ఇతరులకు ఆదర్శంగా నిలిచేలా జీవించారు. ఆయన అరుదైన వ్యక్తి, అందుకే ఇతరులకు ఆదర్శం, అనుసరణీయం. పాత్రికేయ వృత్తిలో హనుమంతరావు లాంటి వాళ్ల అవసరం ఇప్పుడున్న సామాజిక పరిస్థితుల్లో చాలా ఉంది.

మనిషి జీవించినంత కాలం ఎటువంటి విలువలతో జీవించాడనేది మనుషుల్ని అంచనా వేయడానికి ఒక కొలమానం. అలాంటి కొలమానాల్లో ఉండే విలువలను ఆయన తుదిశ్వాస వరకు ఆచరణ ద్వారా చూపారు. ఆయన నెలకొల్పిన విలువల్ని కొనసాగించడమే మన బాధ్యతగా భావించాలి. వీ

# హనుమంతరావు గారితో రెండు పదుల పైన

**- ఎన్. వేణుగోపాల్**

వీక్షణం ఎడిటర్

ఆయనతో నిరంతర సంబంధంలోకి వచ్చి ఇరవై నాలుగేళ్లు కావస్తున్నది. ఈ సుదీర్ఘ మైత్రిలో అభిప్రాయ భేదాలు వచ్చిన సందర్భాలున్నాయి. ఆ భిన్నాభిప్రాయాలు తీవ్రమై ఒకరి మీద ఒకరికి విసుగు కలిగిన సందర్భాలు, పరుషమైన మాటలు అనుకున్న సందర్భాలు, ఆయనా నేనూ కూడ ఇతరులతో ఆ విసుగును పంచుకున్న, కాగితం మీదికి ఎక్కించిన సందర్భాలు కూడ ఉన్నాయి. కాని ఇవాళ ఆయన లేరని గుర్తించినప్పుడు అది ఎంత తీరనిలోటో, పూడ్చరాని అఖాతమో తెలుస్తున్నది. అపారమైన దుఃఖం కలుగుతున్నది. ఎంతో తీవ్రంగా విమర్శించినప్పుడు కూడ నన్ను దగ్గరికి తీసుకుని ముద్దు పెట్టుకునే ఆయన వాత్సల్యం, ఇతరులెందరి దగ్గరో నా గురించి గర్వంగా, నమ్మకంగా, సాదరంతో ఆయన మాట్లాడిన మాటలు గుర్తొస్తున్నాయి. ఏదో ఒక రాజకీయార్థిక, సైద్ధాంతిక విషయంలో సందేహం అడగడానికి, తన అభిప్రాయం సరైనదేనా అని తెలుసుకోవడానికి, తన వాదన వినిపించడానికి కనీసం వారానికొకసారైనా ఆయన చేస్తూ ఉండిన ఫోన్ సంభాషణలు గుర్తొస్తున్నాయి. ఆయన ఉన్నప్పుడు అవన్నీ మామూలుగా, అలవాటుగా ఉండేవిగాని ఇప్పుడు అవి ఇక ఉండవని తెలిసి శూన్యం ఆవరిస్తున్నది. మానవసంబంధాల విశిష్టతను ఎంతగా గుర్తించేవాళ్లమైనా మనిషి మరణం తర్వాత తప్ప ఆ మానవ సంబంధాల వాస్తవ విలువను ప్రకటించలేని ఒక పాడు కాలంలో ఉన్నాం.

ఆయనతో పరిచయం గురించి గతంలోనే ఆయన పుస్తకం 'విమర్శ

– పరామర్శ' వెనుకమాటలో రాశాను. బిఎ అర్థశాస్త్రం చదవడం వల్ల కావచ్చు, లేదా అంతకుముందే 'వ్యవసాయ విప్లవం' ప్రభావం వల్ల కావచ్చు ఆర్థిక విషయాల మీద, ఆర్థికవిషయాల రచనల మీద ఆసక్తి ఏర్పడింది. ఆ ఆసక్తిని బలోపేతం చేసినవి సి వి సుబ్బారావుతో స్నేహం, ఆర్ ఎస్ రావు, శివరామకృష్ణ వంటి గొప్ప మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రవేత్తల శిష్యరికం. డిగ్రీ రెండో సంవత్సరంలో ఉన్నప్పుడు ఐఎంఎఫ్ అప్పు మీద వ్యాసం రాయడంతో ఆర్థిక విషయాల మీద నా రచన ప్రారంభమైంది. ఆ అధ్యయన, రచనా ఆసక్తి సహజంగానే అప్పటికి ఆర్థిక విషయాలపై పత్రికలలో వ్యాసాలు రాస్తున్న వి హనుమంతరావు, ఎబికె ప్రసాద్‌ల పేర్లనూ, రచనలనూ పరిచయం చేసింది. అప్పటికే హనుమంతరావు గారు డాటా న్యూస్ ఫీచర్స్ సంస్థ ఏర్పాటు చేసి, డి.ఎన్.ఎఫ్. ఇయర్ బుక్ ప్రచురిస్తున్నారు. నేను దాన్ని ప్రతి సంవత్సరం కొనుక్కునేవాణ్ని, చర్చల్లో, రచనల్లో వినియోగించే వాణ్ని. ఆతర్వాత ఎంఎ ఎకనమిక్స్ కు ఉస్మానియాకు వచ్చాక, బహుశా 1983లో, ఢిల్లీ నుంచి సెలవుల్లో వచ్చిన సుబ్బారావు 'విఎచ్ దగ్గరికి వెళ్దాం పద' అని తీసుకువెళ్లాడు. గన్‌ఫౌండ్రీలో లేపాక్షి పక్క సందులో ఒక పాత భవనంలో మొదటి అంతస్తులో డి.ఎన్.ఎఫ్. కార్యాలయం. హనుమంతరావు గారితో ఆనాటి పరిచయం పెద్దగా గుర్తులేదు. తర్వాత ఎక్కడన్నా సభల్లో చూశానేమోగాని దగ్గరికి వెళ్లిన గుర్తులేదు.

ఆ తర్వాత పది సంవత్సరాలకు, ఈలోగా నేను ఉదయం, రాడికల్ మార్చ్, ఆంధ్రపత్రిక, సమయం, ఇన్ స్టిట్యూట్ ఫర్ సోషల్ అండ్ ఎకనమిక్ చేంజ్ ఉద్యోగాలలో, నిరుద్యోగంలో విజయవాడ, హైదరాబాదు, బెంగళూరు అన్నీ చుట్టబెట్టి, బెంగళూరు ఎకనమిక్ టైమ్స్‌లో చేరాక హఠాత్తుగా హనుమంతరావు గారితో సంబంధం మొదలయింది. ఒక మిట్ట మధ్యాహ్నం బెంగళూరు ఎంజి రోడ్ ఎకనమిక్ టైమ్స్ కార్యాలయంలోకి తన సహజమైన పైజామా, లాల్చీ ఆహార్యంతో ఒక గుడ్డసంచీ వేసుకుని ప్రవేశించి మా న్యూస్ ఎడిటర్ కాబిన్‌లోకి వెళ్లారు. డెస్క్‌లో కూచున్న నేను పరుగెత్తుకు వెళ్లి ఆయనను పలకరించి, ఆయన పని అయిపోయాక మళ్లీ పరిచయం చేసుకుని మాట్లాడాను. అప్పుడు ఆయన బెంగళూరు వివేకానంద కేంద్రంలో యోగ నేర్చుకోవడానికి చేరి, ఆ సంస్థ పత్రికాసంబంధాల నిర్వహణ కూడ చేపట్టారు. ఆ పని మీదనే ఎకనమిక్ టైమ్స్‌కు వచ్చారు. ఆ తర్వాత నేను అక్కడ ఉన్న ఏడాదీ ఆయన నన్ను కలవడానికే ఎన్నోసార్లు వచ్చారు. అది బహుశా 1994 మధ్యలో కావచ్చు. అప్పటి నుంచి ఆయన చివరిశ్వాస విడిచేదాకా గడిచినకాలమంతా నిత్య సంబంధంలో, నిత్య సంభాషణలో ఉన్నాం. అప్పటికే ప్రపంచీకరణ నూతన ఆర్థిక విధానాలు మొదలయ్యాయి. వాటి మీద హనుమంతరావు, ఎబికె ప్రసాద్ గార్లతో పాటు నేను కూడ రాయడం మొదలుపెట్టాను. అలా మా ఇద్దరికీ మాట్లాడుకోవడానికి ఎన్నెన్నో విషయాలు ఉండేవి.

ఈలోగా, 1995 సెప్టెంబర్‌లో నాకు హైదరాబాద్ బదిలీ అయింది. సరిగ్గా ఒక నెల ముందే వైస్రాయ్ హోటల్ కుట్ర జరిగి చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రి అయి, ప్రపంచ బ్యాంకు ఆదేశాలను అమలు జరిపే మొనగాడుగా ముందుకు వచ్చాడు. ఈ పరిణామాల వల్ల రాష్ట్ర ఆర్థిక వ్యవహారాల గురించి మరింత ఎక్కువ రాయవలసిన అవసరం వచ్చింది. ఆ అవసరాన్ని తీర్చడానికి, ప్రజలకు ఆర్థిక వ్యవహారాల గురించి చెప్పడానికి తన శక్తినంతా వెచ్చించడానికి ముందుకు వచ్చినవారు హనుమంతరావు గారు. సరిగ్గా ఆయనకు అప్పుడే డెబ్భై సంవత్సరాలు నిండాయి. కాని ఎందరో యువకుల కన్న ఎక్కువగా ఆయన నూతన ఆర్థిక విధానాల గురించి పట్టించుకున్నారు. వాటి గుట్టు విప్పి చెప్పే పనికి పూనుకున్నారు. ఆ క్రమంలో ఆయన పివిఆర్ భాస్కరరావు, ఎబికె ప్రసాద్, కె ఆర్ చౌదరి వంటి వారెందరితోనో కలిసి పనిచేశారు. అందులో భాగంగానే ఆయనకూ నాకూ సంబంధం మరింత పెరిగింది. అసెంబ్లీ సమావేశాల్లో, ముఖ్యమైన ప్రభుత్వ పత్రికా సమావేశాల్లో కలుసుకుంటుండేవాళ్లం. దాదాపు ప్రతి ప్రభుత్వ విధానం మీద ఆయనో నేనో ప్రభుత్వ పత్రాలు సంపాదించి చర్చించుకునే వాళ్లం. ఇద్దరమూ రాస్తూ ఉండేవాళ్లం. ఆ నాలుగైదు సంవత్సరాలు రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో ఎన్నో కీలక మార్పులు జరిగాయి. వాటన్నిటినీ సన్నిహితంగా పరిశీలించి, పరీక్షించి, ప్రజాపక్ష దృక్పథం నుంచి వ్యాఖ్యానించి, సరళమైన పద్ధతిలో ప్రజలకు విప్పి చెప్పడంలో హనుమంతరావు గారి కృషి అసాధారణమైనది.

అప్పుడే ఢిల్లీలో పబ్లిక్ ఇంటరెస్ట్ రిసర్చ్ గ్రూప్ అనే స్వచ్ఛంద సంస్థ ప్రారంభమై ఆల్టర్నేటివ్ ఎకనమిక్ సర్వే అనే వార్షిక నివేదికలు వెలువరించడం ప్రారంభించింది. కేంద్ర ప్రభుత్వం ప్రతి సంవత్సరం ప్రచురించి, సరిగ్గా బడ్జెట్ ప్రవేశపెట్టడానికి ముందురోజున పార్లమెంటులో సమర్పించే ఎకనమిక్ సర్వేకు ఇది ఒక ప్రత్యామ్నాయ నివేదిక. అవి చూడగానే హనుమంతరావుగారు ఎగిరి గంతేశారు. సరిగ్గా ఇటువంటి ప్రత్యామ్నాయ ఆర్థిక నివేదిక ఆంధ్రప్రదేశ్‌కు ప్రచురించాలని అన్నారు. ఆ పని మీద మేమిద్దరం కలిసి పనిచేయడం ప్రారంభించాం. ఆ పని జరుగుతున్న రోజుల్లోనే ఆయన ఎన్నాళ్లుగానో తన మనసులో మెదులుతున్న కోరిక చెప్పారు. ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ లాంటి పక్షపత్రిక ఒకటి తెలుగులో తేవాలి అని.

ఆయన అప్పటికి ప్రజాశక్తి, విశాలాంధ్ర, గోలకొండ పత్రిక, ఈనాడు, ఎకనమిక్ టైమ్స్ వంటి పత్రికల్లో, ఎ.ఎన్.ఎస్., యు.ఎన్.ఐ. వంటి వార్తాసంస్థల్లో పని చేశారు. డి.ఎన్.ఎఫ్. తరఫున పదిహేడు సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్ ఇయర్ బుక్, ఆంధ్రప్రదేశ్ వార్షిక దర్శిని ప్రచురించారు, ఎనిమిది సంవత్సరాలు డేటా ఆంధ్రప్రదేశ్ పక్షపత్రిక నడిపారు. నేటి రాజకీయం పక్షపత్రిక కొంతకాలం నడిపారు. అప్పటికే ఎనబయ్యో పడికి చేరువవుతున్నారు. అయినా మరొక పత్రిక, ఆర్థిక పరిణామాల విశ్లేషణకే ప్రాధాన్యత ఇచ్చే పత్రిక నడిపితే బాగుంటుందనే కోరిక ఆయనను వదలలేదు. ప్రత్యామ్నాయ ఆర్థిక సర్వే పని నడుస్తున్న రోజుల్లోనే ఎకనమిక్ టైమ్స్‌లో నా ఉద్యోగం తీసేయించడానికి ముఖ్యమంత్రి కార్యాలయం ప్రయత్నాలు మొదలయ్యాయి. నేనే రాజీనామా చేసి బైటికి వచ్చి, నిరుద్యోగం, చిరుద్యోగం చేస్తూ ఉన్నప్పుడు హనుమంతరావు గారు ఇక పత్రిక పెట్టవలసిందేననీ, నేను బాధ్యత తీసుకోవాలనీ ఒత్తిడి తెచ్చారు. ప్రవృత్తి రీత్యా అది నాకూ ఇష్టమే గాని, అది తిండిపెట్టదని, మరేదైనా ఉద్యోగం చూసుకుని, ఈ పని చేస్తానని నేనన్నాను. మరొక పత్రికలో ఉద్యోగమే అయితే, ఈ పత్రికకు సంపాదకుడిగా ఉండడానికి వీలుండదు గదా అని చర్చోపచర్చలు జరిగాయి.

చివరికి, ప్రజాపక్ష సమీక్ష పేరుతో ఆ పత్రిక ప్రారంభమై 2003 జనవరి 1-15 సంచికగా మొదటి సంచిక వెలువడే నాటికి నేను ఇండియన్ ఎక్స్ ప్రెస్ లో చేరడంతో, రెగ్యులర్ గా సంపాదకీయాలు రాయాలనీ, రచనలు చేయాలనీ, ఎడిటింగ్ లో సహకరించాలనీ వాగ్దానాలు తీసుకుని, హనుమంతరావు గారు సంపాదకులుగా ఉన్నారు. ఎబికె ప్రసాద్ ను గౌరవ సంపాదకుడిగా, ఐదుగురు ప్రముఖులను సలహామండలిగా వేసి, నా పేరు కూడ సలహామండలిలో చేర్చారు. ఆ తర్వాత రెండు సంవత్సరాలు పక్షపత్రికగా వెలువడుతున్నప్పుడు ఇవ్వవలసినంత సమయం ఇవ్వడం లేదనీ, సంపాదకీయాల కోసం తిప్పించుకుంటున్నాననీ ఆయన నన్ను ఎన్నోసార్లు కోప్పడ్డారు. తొలి

సంచికలకు ఆర్థిక వనరుల కోసం ఆ డెబ్బై ఎనిమిదో ఏట ఎంతోమంది పరిచయస్తుల దగ్గరికి వెళ్లి సహాయం అర్థించారు. ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల నుంచి విరాళాలు, వ్యాపార ప్రకటనలు తెచ్చారు. రాజకీయ, పారిశ్రామిక ప్రముఖుల మాటల్లో గుర్తించదగ్గవి ఏరి "వినదగునెవ్వరు చెప్పిన", "నో కామెంట్స్" శీర్షికలు, రాజకీయ, ఆర్థిక వ్యవహారాల మీద "పక్షం-పక్షం" శీర్షిక నిర్వహించారు. ప్రతి సంచికకూ ఒక వ్యాసం, అప్పుడప్పుడు సంపాదకీయాలు రాశారు. ఎనబయో ఏట చేరవస్తుండగా, "ఇక నేను చేయలేను, ఎట్లాగూ పనంతా నువ్వే చేస్తున్నావు గనుక వర్కింగ్ ఎడిటర్‌గానైనా నీ పేరు వేస్తాను" అనడం ప్రారంభించారు. సరిగ్గా అప్పుడే నేను కూడ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వదిలేసి, స్వతంత్ర జీవనోపాధి కోసం ప్రయత్నిస్తున్నాను గనుక ఆయన సూచన అంగీకరించి, 2005 జనవరిలో వర్కింగ్ ఎడిటర్ అయ్యాను. ఆయన ఆరోగ్యం మరింతగా క్షీణిస్తుండడంతో పత్రికను పూర్తిగా నా పేరు మీదికి మారుస్తానని, ఆ పని కోసం అధికారిక కార్యాలయాలకు ఎన్నోసార్లు తిరగవలసి వచ్చినా ఓపిగ్గా తిరిగి, 2008 మార్చిలో ఆ పని పూర్తిచేశారు.

వర్కింగ్ ఎడిటర్‌గానూ, ఎడిటర్‌గానూ నేను పత్రికను ఆయన ఇష్టపడిన పక్షపత్రికగా కాక, మాసపత్రికగా మార్చాను. పత్రిక ఉపశీర్షికను "రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక" అని మార్చాను. రచనల శైలి మార్చాను. ఈ మార్పులలో కొన్నిటిని ఆయన అంగీకరించకపోయి నప్పటికీ చాల ప్రజాస్వామికంగా ఆమోదించారు. పత్రికకు ఆర్థిక వనరులు సమకూర్చడంలో, ప్రతి సంచికకూ రచన చేయడంలో, ఏ రచనలు ఉంటే బాగుంటుందో సూచించడంలో ఎప్పట్లాగనే ఉన్నారు. తాను కమ్యూనిస్టు రాజకీయాలలో ప్రవేశించినప్పటి తెలుగు జాతి ఐక్యత భావనలవల్ల చివరివరకూ ఆయన రాష్ట్ర సమైక్యతావాదిగా ఉన్నారు. వీక్షణం తెలంగాణ ప్రజా ఆకాంక్షలను సమర్థించే వ్యాసాలు ఎక్కువగా వేయడం పట్ల భిన్నాభిప్రాయం ఉన్నా, పత్రికకు అన్నిరకాలుగా సహకరిం చడం ఎప్పుడూ మానలేదు. ఇప్పటికి వెలువడిన 186 సంచికలలో ఆయన 166 వ్యాసాలు రాశారంటే, ఈ పత్రికను ఆయన ఎట్లా కన్నబిడ్డగా చూశారో అర్థమవుతుంది. ఇలా విరివిగా రాయడం ప్రజాపక్ష బుద్ధిజీవులందరూ ఆయన నుంచి నేర్చుకోవలసే ఉంది. అది మాత్రమే కాదు, సామాజిక అవసరం ఎప్పుడు వచ్చినా, ఎవరూ అడగనక్కర లేకుండా, చెప్పనక్కరలేకుండా అది తన సొంత బాధ్యతగా భావించే సమయోచిత, స్వీయ కర్తవ్య దీక్ష ఆయన ప్రధాన లక్షణం. వీక్షణంలో, ఇతర పత్రికలలో ఆయన రాసిన వ్యాసాలలో తొంబై శాతం, ప్రభుత్వ విధానాల, ప్రకటనల, గణాంకాల లోగుట్టు విప్పి ప్రజలకు చెప్పవలసినది ఉన్నదని తనంతట తాను కర్తవ్యం నిర్దేశించుకుని రాసినవే. అందువల్లనే ప్రభుత్వ దుర్మార్గాలు పెరిగినకొద్దీ ఆయన రచనలు కూడ పెరిగాయి. ఒక సమయంలో, తన వయసు, ఆరోగ్యం సహకరించకపోయినా నెలకు పద్నాలుగు వ్యాసాలు కూడ రాశారంటే, ప్రజాచైతన్యానికీ, భావప్రచారానికీ ఆయన ఇచ్చిన విలువ అర్థమవుతుంది. వీక్షణం అయితే నెలకు ఒక రచన మాత్రమే వేయగలుగుతుందని తెలిసినా, ఆ విషయం తప్పనిసరిగా రాయవలసిందని అనుకున్నప్పుడు ఒక రచన ఉండగానే మరొక రచన పంపేవారు. అలాగే, 2016 అక్టోబర్ చివరలో ఒకవ్యాసం పంపి, అది డిసెంబర్ సంచిక కోసం సిద్ధమవుతుండగానే, నవంబర్ 8న ప్రభుత్వం పెద్దనోట్ల రద్దు ప్రకటించడంతో, వెంటనే ఆ విషయం మీద మరొక వ్యాసం రాసి పంపారు. అది డిసెంబర్ సంచికలో అచ్చయి, ఆయన మరణించేనాటికి వీక్షణం దగ్గర మరొక వ్యాసం కూడ ఉండిపోయింది.

రచయితల వార్షిక సమావేశాలు అని వీక్షణం ప్రారంభించిన కొత్త సంప్రదాయాన్ని ఆయన మనస్ఫూర్తిగా ఆహ్వానించారు. ప్రతి సమావేశానికీ తప్పనిసరిగా హాజరు అయ్యారు. రెండు సార్లు ఆ సమావేశం లిఫ్ట్ లేని భవనంలో రెండో అంతస్తులో జరిగినా ఓపికగా మెట్లెక్కి వచ్చారు. ప్రతిసారీ అక్కడ చదవడానికి ఒక నోట్ రాసుకుని వచ్చేవారు. సభికులు మాట్లాడినవన్నీ శ్రద్ధగా నోట్ చేసుకునేవారు. ఈ పనులన్నీ వాటికవిగా అసాధారణం కాకపోవచ్చు, కాని ఎనభై ఏళ్లు దాటిన వ్యక్తి చేయడం అసాధారణం.

2007 నుంచి 2014 వరకూ రచయితల సమావేశాలు వరుసగా హైదరాబాద్‌లోనే నిర్వహించాం గాని, రాష్ట్ర విభజన తర్వాత రెండు రాష్ట్రాల్లోనూ జరపాలనే ఉద్దేశంతో 2015 ఆంధ్రప్రదేశ్ సమావేశం గుంటూరులో ఏర్పాటు చేశాం. అప్పటికే తొంబయవ సంవత్సరంలో ప్రవేశించి, బ్లడ్ షుగర్ స్థాయి చాల ఎక్కువగా ఉంటూ, మామూలు నడకే కష్టమైన ఆయన గుంటూరు వస్తానని పట్టుబట్టారు. ఏ ప్రత్యేకమైన సౌకర్యమూ అవసరం లేదని, మామూలుగా రైలులో వస్తానని, అక్కడ ఒక మిత్రుడి ఇంట్లో ఉండి, నేరుగా సమావేశానికి వస్తానని అన్నారు. సాధారణంగా ఏదైనా తలచుకున్నారంటే తప్పనిసరిగా చేసి తీరాలనే ఆయన మొండితనం తెలుసు గాని, ఆయన ఆరోగ్యరీత్యా ఈ సమావేశా నికి రాకుండా ఎట్లాగైనా ఆపాలని, ఆయన కూతురు పద్మ, మనవరాలు స్రవంతి, నేను దాదాపు కుట్ర చేసినంతపని చేసి ఆయనను ఆపాం.

మొండితనం, పనిరాక్షసత్వం వంటి కఠోర దీక్షతో పాటే ఆయనలో పసితనం, అమాయకత్వం కూడ మేళవించి ఉండేవి. చాల క్లిష్టమైన విషయాలను సులభంగా విప్పిచెప్పి రచయితగా వేలాది మందిని చైతన్యవంతం చేసిన ఆయన, చాల చిన్న సరళమైన విషయాలను కూడ అర్థం చేసుకోలేరా అన్నంత పసితనాన్ని, అమాయకత్వాన్ని అప్పుడప్పుడు కనబరచేవారు. ప్రభుత్వం భూసంస్కరణలు అమలుచేస్తే నక్సలైట్లు ఉండరు గదా అని అమాయకంగా అనేవారు. తెలంగాణ ప్రజల ఆకాంక్ష కాదని, అన్యాయాలను ఇప్పటికీ సరిదిద్దవచ్చునని భావించేవారు. రోడ్లు, భవనాలు చూసి ఎంత అభివృద్ధి జరిగింది అని ఆశ్చర్యపోయేవారు. వీక్షణం ఎట్లాగైనా ఆగిపోగూడదు, దానికి ఎలాగో ఒకలాగ ఆర్థిక వనరులు సమకూర్చు కోవాలని చాల అమాయకంగా, పత్రిక లక్ష్యానికి భిన్నంగా కూడ ప్రతిపాదనలు పెట్టేవారు. పత్రిక ఒక సంచిక అంతా తమ గురించి రాస్తే ఆ సంచిక ఖర్చు భరిస్తామని ఏదో బ్యాంకు ఉద్యోగుల సంఘం ముందు కొచ్చిందని ఒకసారి ప్రతిపాదించారు. 'ఆర్థిక పత్రికగా, గణాంకాలు చెప్పే పత్రికగా మాత్రమే ఉండాలి గాని, "రాజకీయార్థిక" అని చేర్చి రాజకీయాలు చొప్పిస్తున్నావు' అని విసుక్కున్నారు. అయితే అటువంటి ప్రతి సందర్భం లోనూ ప్రతివాదన వినిపిస్తే, వివరిస్తే వెంటనే అంగీకరించేవారు. 'వాడెవడో బ్లేడ్లు తినడంలో రికార్డు స్థాపించాడు అంటారు గదా అలా నాకు అంకెలతో వ్యవహరించడమంటే ఇష్టం' అని తన గురించి తానే ఒకసారి పరిహాసం ఆడుకున్నారు. సమాచారం గురించి ఆయన శ్రద్ధాసక్తులు ఒక్కోసారి చిరాకెత్తించేంతగా అతిగా కూడ ఉండేవి. తాను ప్రచురించిన 'ఎపి ఎట్ 50' లో ఒక వ్యాసం కింద అరపేజీ ఖాళీ ఉంటే బాక్స్ కట్టి దుర్యోధనుడి 99 మంది తమ్ముల పేర్లు వేశారు. ఆ పుస్తకాన్ని నేను ఎకనమిక్ టైమ్స్‌లో సమీక్షిస్తూ ఆంధ్రప్రదేశ్‌కూ దుర్యోధనుడి తమ్ముల పేర్లకూ ఏమి సంబంధం అని వ్యాఖ్యానించాను. 'అది ఒక సమాచారం కదా, అది తెలియనివాళ్లు చాల మంది ఉంటారు గదా, అది అవసరమే గదా' అని వాదించారు.

వీక్షణంకు ఆర్థిక సుస్థిరత సాధించడానికి, తెలుగు సమాజానికి అత్యవసరమైన ప్రజాపక్ష పరిశోధన, గ్రామ పరిశోధన, ప్రచురణ జరపడానికి ఒక పరిశోధనా సంస్థ ఏర్పాటు చేస్తే బాగుంటుందని, ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థల కోసం పరిశోధనా కార్యక్రమాలు చేపట్టి,

ఆర్థిక వనరులు సమకూర్చుకోవచ్చునని ఒక ఆలోచనతో 2005లో సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్స్ (సిడిఆర్ సి) అనే సంస్థను స్థాపించాం. అప్పటిదాకా సమతా పబ్లికేషన్స్ ప్రచురణగా వెలువడుతుండిన వీక్షణం, అప్పటినుంచి సిడిఆర్ సి ప్రచురణ అయింది. ఆ సంస్థ డైరెక్టర్లలో ఒకరుగా హనుమంతరావు గారు దాని చర్చలలో, నిర్ణయాలలో, ఆర్థిక వనరుల సేకరణలో, కార్యక్రమాలలో క్రియాశీలంగా పాల్గొన్నారు. కారణాంతరాల వల్ల ఆ సంస్థ తన కర్తవ్యాలను పూర్తిగా నెరవేర్చకుండానే ఆగిపోవలసి వచ్చినప్పటికీ, ఆ సంస్థ చేసిన ప్రధానమైన పనుల్లో ఒకటి, '50 ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' అనే ప్రామాణిక గ్రంథ ప్రచురణ. 2006 నాటికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి 50 సంవత్సరాలు అయిన సందర్భంగా వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, విద్య, వైద్య ఆరోగ్యాలు, సామాజిక ఉద్యమాలు వంటి అనేక రంగాలలో రాష్ట్రం నడిచిన తీరును విశ్లేషించాలనేది ఈ ప్రణాళిక. అంతకు పది సంవత్సరాల ముందే హనుమంతరావు గారు మరి కొందరు రచయితల సహాయంతో తీసుకువచ్చిన ఎపి ఎట్ 50 గ్రంథానికి ఇది సమగ్ర రూపం. ఆర్ ఎస్ రావు, వి హనుమంతరావు, నేను సంపాదకులుగా నలభై మంది రచయితల వ్యాసాలతో ఈ పుస్తకం వెలువడి, ఎన్నో పునర్ముద్రణలు పొంది, ఎందరో పరిశోధకుల అభిమానాన్ని చూరగొన్నది.

అపారమైన జీవితానుభవంతో, పరిశీలనతో, స్వయంకృషితో ఆయన అప్పటికే ఎన్నో సాధించినప్పటికీ, తానేమీ చదువుకోలేదని, ఎస్.ఎస్.ఎల్.సి. తో చదువు ఆపేశానని, సిద్ధాంత గ్రంథాలు గాని, సాహిత్యం గాని పెద్దగా చదవలేదని వినయంగా చెప్పుకునేవారు. కొత్త అర్థశాస్త్ర పారిభాషిక పదాలు గాని, భిన్నమైన వ్యాఖ్యానాలు గాని వచ్చినప్పుడు వెంటనే ఫోన్ చేసేవారు. అలా ఆయనలో ఏకకాలంలో ఒక వినయశీలి అయిన పసి బాలుడు, ఒక జ్ఞాన సంపన్నుడైన, అపార అనుభవజ్ఞుడైన, వివేకవంతుడైన వృద్ధుడు కలగలిసి ఉండేవారు. తొంబై రెండు సంవత్సరాల నిండు జీవితంలో ఏడున్నర దశాబ్దాల ప్రజాజీవితం, ఆరున్నర దశాబ్దాల పాత్రికేయ జీవితం, కనీసం ఐదువేల వ్యాసాలు, దాదాపు ఇరవై పుస్తకాలు, సంపాదకత్వం వహించిన మరొక డజను పుస్తకాలు, తన వయసులో పావు వంతు వయసున్న వారి దగ్గరి నుంచి కూడ నేర్చుకోవలసినది ఉంటుందనే వినయం, ఎప్పుడో ఒకసారి సఫారి డ్రెస్ మినహా ఎల్లప్పుడూ పైజామా లాల్చీ నిరాడంబర ఆహార్యం, మితభాషిత్వం, ప్రజలకు మాయాజాలంగా ఉన్న ఆర్థిక వ్యవహారాలను తేటతెల్లం చేయాలనే నిరంతర తపన... ఎన్నడూ ఏ పార్టీ లోనూ సాంకేతికంగా సభ్యుడు కాకపోయినా వ్యక్తిగత స్థాయిలో కమ్యూనిస్టు విలువలతో జీవించిన కామ్రేడ్ వి హనుమంతరావు జీవితమే ఒక ఉజ్వలమైన ఉదాహరణ. వీ

# మేధావి హనుమంతరావుకు విప్లవ జోహార్లు

**– కృష్ణాబాయి**
రచయిత

మా స్నేహితుల్లో ఇద్దరు హనుమంతరావులుండడంతో యుఎన్ఐ హనుమంతరావు, ప్రగతి హనుమంతరావు అని పిల్చుకునేవాళ్లం. విశాఖలో యుఎన్ఐ వార్తా సంస్థలో పనిచేయడం వలన వి. హనుమంత రావు గారిని అలా వ్యవహరించేవాళ్లం. ప్రవృత్తిరీత్యా చాలా నిదానస్తులైన యుఎన్ఐ హనుమంతరావు ఏ భావోద్రేకానికి లోనుకాకుండా విషయ ప్రధానంగా మాట్లాడేవారు. రాజకీయ చర్చలేగాని, వ్యక్తిగత విషయాలేమీ ఉండేవి కాదు. ఆయన సహచరి సరళ కూడా సాహిత్యపరంగానూ, వ్యక్తిగతంగానూ కూడా నాకు సన్నిహితురాలే. వారి కుటుంబమంతా తరతమ భేదాల్లేకుండా కమ్యూనిస్టు భావజాలంతోనే ఉండేవారు. వర్ణాంతరమా, సవర్ణమా అనే తేడాల్లేని కుటుంబాలవి.

ఒక సమయంలో కొండపల్లి సీతారామయ్యకి కొరియర్‌గా కూడా పనిచేశారు. హనుమంతరావుగారు చలసానికి సన్నిహితుడు. మా వేణుగారితో విశాఖలో చాలా విషయాలు పంచుకునేవారు.

'విమర్శ – పరామర్శ' పుస్తకం చదివితే ఆయన అనుభవాలు స్పష్టమవుతాయి. ఆఖరు సారిగా బెంగళూరు నుంచి నాతో మాట్లాడు తున్నప్పుడు చలసాని లైబ్రరీ గురించే ముచ్చటించారు. వీ

# అరుదైన పాత్రికేయుడు వి. హనుమంతరావు

**– డా. ఇమ్మానేని సత్యసుందరం**
అర్థశాస్త్రవేత్త

సీనియర్ పాత్రికేయులు వాడకట్టు హనుమంతరావు 2016 డిసెంబర్ 13న తన 91వ ఏట హైదరాబాద్‌లో కన్నుమూశారు. ఆయన 1925లో పశ్చిమ గోదావరి జిల్లాలో జన్మించారు. 1946లో విశాలాంధ్ర, ప్రజాశక్తిలో పనిచేశారు. 1974లో ఈనాడు దినపత్రిక స్థాపించినప్పుడు ఆ పత్రికకు తన సేవలు అందించారు. 'వీక్షణం' మాసపత్రికను స్థాపించి, దానికి కొన్నేళ్లపాటు ఎడిటర్‌గా ఉన్నారు. 65 ఏళ్లపాటు పత్రికా రంగంలో రాణించిన ఆయన చదివింది ఎస్ఎస్ఎల్‌సి వరకే!

హనుమంతరావు గారితో నాకు సన్నిహిత సంబంధం ఉంది. నాకు రచయితగా మంచి పేరు తెచ్చిం 'మెయిన్ స్ట్రీమ్' వారపత్రిక. ఎడిటర్ నిఖిల్ చక్రవర్తి. చనిపోయే నాటికి ఆయన ప్రసారభారతి ఛైర్మన్‌గా ఉన్నారు. ఈ పత్రికలోనే హనుమంతరావుగారు నా వ్యాసాలు చదివేవారు. కళాశాలలు, విశ్వవిద్యాలయాలు యుజిసి సహకారంతో నిర్వహించే సెమినార్లలో హనుమంతరావు గార్ని తరచు కలుస్తుండేవాణ్ని.

హనుమంతరావు గారు డేటా న్యూస్ ఫీచర్స్ (డిఎన్ఎఫ్) సంస్థను ప్రారంభించి దాదాపు 20 ఏళ్లపాటు సేవలందరించారు. ఆర్థిక కారణాల వల్ల దానిని మూసివేయడం జరిగింది. ఈ సంస్థ తరఫున ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన విలువైన సమాచారం అందించారు. సామాన్యంగా రాష్ట్ర, కేంద్ర బడ్జెట్ పత్రాలను ఎవరూ చదవరు. అన్నీ అంకెలేగా! అయితే హనుమంతరావు గారు బడ్జెట్‌లను పరిశీలించడంలో ప్రత్యేక శ్రద్ధ చూపారు. వీటిపై కొన్ని పుస్తకాలు ప్రచురించారు.

హనుమంతరావు గారికి కాశీనాథుని నాగేశ్వరరావు పురస్కారం లభించింది. ఆయన బందరు వచ్చారు. నాకు ఫోన్ చేస్తే మా ఇంటికి తీసుకొచ్చాను. నా లైబ్రరీ చూసి ఎంతో సంతోషించారు. తెలుగు పత్రికలకు కూడా వ్యాసాలు రాయమని ఆయన నాకు సూచించిన తర్వాత ఆ సలహాను పాటించాను.

2010లో నేను మచిలీపట్నం హిందూ కాలేజీ ఎంబిఏ డిపార్ట్‌మెంట్ డైరెక్టరుగా ఉన్నాను. 'ప్రపంచీకరణ, భారతదేశ ఆర్థిక వ్యవస్థ' అంశంపై జాతీయస్థాయి సెమినార్ అక్టోబర్ 9, 10 తారీఖుల్లో నిర్వహించారు. ప్రారంభోత్సవ సెషన్‌లో ఆయన పాల్గొని ఉపన్యసించారు. అప్పటికే ఆయన ప్రయాణం చేయటం మానుకున్నారు. సత్యసుందరం పిలిస్తే కాదనలేనుగా' అన్నారు. స్టేజీ మీద ఆయన నా నుదుటి మీ ముద్దు పెట్టుకోవడం మరువలేను. సెమినార్ పేపర్లతో పెద్ద సంపుటిని తీసుకొచ్చాను. రెండు కాపీలు హనుమంతరావు గారికి ఇచ్చాను. ఆయన రాత్రి రైలులో సంపుటిని చదివి ఆ పుస్తకాలను రైలులోనే మర్చిపోయారు. ఫోన్ చేస్తే మరి రెండు కాపీలు పంపాను. సెమినార్‌కు హాజరైనందుకు కొంతడబ్బు ఇవ్వబోయాను. 'నీకు చాలా ఖర్చులు ఉంటాయిగా' అని డబ్బు తీసుకోలేదు.

హనుమంతరావు గారు కమ్యూనిస్టు. ఆయన అందరినీ ఆదరించే వారు. ఎవరి అభిప్రాయాలు వారివి అన్నట్లు ప్రవర్తించే వారు. పత్రికా రంగం ప్రజాసేవకే అంకితం కావాలని ఆయన అభిప్రాయం. వీ

# వయోబేధం లేని ఆత్మీయ స్నేహితుడు

**– సజయ**

సామాజిక కార్యకర్త

హనుమంతరావుగారితో మొదటి పరిచయం 1986 ప్రాంతంలో ఆయన డేటా న్యూస్ ఫీచర్స్ నడిపిస్తున్నప్పుడు. మా మిత్రుడు ఒకాయన అక్కడ ఆయనతో పనిచేస్తుండే వాడు. అప్పుడు నేను ఉద్యోగాన్వేషణలో ఉన్నాను. అక్కడ నాకేదైనా ఒక అవకాశం ఉంటుందేమోనని వెళ్లాను. వెంటనే అయితే ఏ అవకాశం లేదని, తర్వాతెప్పుడయినా మళ్లీ రమ్మన్నారు. నేను వేరే సంస్థలో చేరడం వల్ల ఆయన దగ్గరకు మళ్లీ వెళ్లడం జరగలేదు. అయితే ఆ తర్వాత అనేక సందర్భాలలో వివిధ సమావేశాలలో కలుస్తూ ఉండేవాళ్లం. కానీ ఆయనతో పెద్దగా సాన్నిహిత్యం పెరగలేదు. చాలాకాలం తర్వాత అబ్బూరి ఛాయాదేవి గారిని కలవడం కోసం కొండాపూర్‌లోని సిఆర్ ఫౌండేషన్ హోమ్‌కి వెళ్లినప్పుడు అక్కడ హనుమంతరావు గారు ఆయన భార్య సరళ గారిని కలిశాం. ఈటివి తెలుగు వెలుగు కార్యక్రమం ద్వారా రమేష్‌కి అంతకుముందే సరళగారు పరిచయం. తరచూ కాకపోయి నప్పటికీ మేము అప్పుడప్పుడూ అందరినీ పలకరించడం కోసం హోమ్‌కి వెళ్లి వస్తుండేవాళ్లం. ఆ క్రమంలో హనుమంతరావుగారు తాను రాసిన కొన్ని పుస్తకాలను మాకు బహుకరించారు కూడా. వీక్షణంలో అణు విధానాలు, యురేనియం గనుల తవ్వకం గురించి నేను రాసిన వ్యాసాలను ప్రస్తావించి ఇంకా ఎక్కువగా ఈ అంశాల గురించి రాస్తూ ఉండు, నువ్వు రాసే విధానం బాగుంది అని అప్పుడు అభినందించారు. యురేనియం గనుల తవ్వకం, వాటి అనర్థాల గురించి పెట్టిన ఒక సభకు ఆయన అప్పట్లో వచ్చారు కూడా.

అలా అప్పుడప్పుడు కలిసినప్పుడు మాట్లాడడమే తప్పించి నాకు ఆయనతో ఒక ఆత్మీయమైన స్నేహం పెరిగింది మాత్రం నవతెలంగాణ పత్రికలో తొలిపొద్దు పేరిట 2015 మే నుంచి వారం వారం కాలమ్ రాయటం మొదలు పెట్టిన తర్వాతే. అప్పటికే ఆయన హోమ్ నుంచి వచ్చేసి అమీర్‌పేట నాగార్జుననగర్‌లోని స్వంత ఇంటికి వచ్చేశారు. మొదటి వ్యాసం 'రైతు ఆత్మహత్యలు–మనం...!?' వచ్చిన వెంటనే ఆయన నుంచి ఫోన్. 'వ్యాసం చాలా ఆలోచింపచేసేవిధంగా ఉంది, ఈ అంశం మీద ఇంకా విస్తృతంగా రావాల్సిన అవసరం ఉంది. రాస్తూ ఉండు' అన్నారు. ఇకనుంచీ ప్రతివారం రాస్తానన్నప్పుడు చాలా సంతోషించారు. ప్రతివారం వ్యాసం చదివిన తర్వాత ఫోన్‌చేసి దానిలోని అంశాల గురించి మాట్లాడే వారు. తానేమన్నా సహాయపడగలనా అని అడిగారు. ఆరువారాల తర్వాత నేను పోషకాహార భద్రతలో చిరుధాన్యాల సాగు గురించి రాశాను. ఎప్పుడూ వ్యాసం గురించి మాత్రమే మాట్లాడే ఆయన అందుకు కొంచెం భిన్నంగా 'అమ్మా సజయా, నువ్వు ఎదురుగా ఉంటే ముద్దు పెట్టుకునే వాడినమ్మా, చిరుధాన్యాల గురించి చాలాబాగా రాశావు. నాక్కొంచెం సాయం చేస్తావా, నాకు కొర్రలు ఎక్కడ దొరుకుతాయో చెబితే నేను తెప్పించుకుంటాను. లేదంటే నువ్వు తెప్పించి ఇచ్చినా సరే, నీకు వీలున్నప్పుడు మా ఇంటికి వస్తే మాట్లాడుకుందాం. నేను ఇకనుంచీ కొర్రలే తిందామని అనుకుంటున్నాను. మన దేశవ్యవసాయానికి ఏదైతే అవసరమో అదే మన పాలకులు నిర్లక్ష్యం చేశారు. దాన్ని నువ్వు బాగా ప్రెజెంట్ చేశావు. ప్రజల్లో మార్పు వస్తేనే పాలకుల్లో కూడా కదలిక వస్తుంది. వ్యవసాయంలో మేము ఇప్పటి వరకూ ఆర్థిక, రాజకీయ కోణాలను మాత్రమే చూశాం. నువ్వు సామాజిక కోణాన్ని బాగా బయటకు తీసుకువస్తున్నావు, చాలా ఎడ్యుకేటివ్‌గా ఉంటున్నాయి' అని అన్నారు.

అలా కొర్రలతో మా స్నేహం మొదలైంది. అంత పెద్దాయన ఆ వయసులో తన ఆహార అలవాట్లను మార్చుకోవడానికి సిద్ధపడడం నిజంగా ఆశ్చర్యకరమే అనిపించింది. అప్పటి నుంచీ ఆయనకు ఏదోవిధంగా ప్రతి నెలా కొర్రలు అందించే ఏర్పాటు చేశాను. కొర్రలు తినడం మొదలుపెట్టిన దగ్గర నుంచీ అరుగుదల బాగా పెరిగిందనీ, తనకు చాలా బాగుందని ఫోన్‌చేసి చెప్పేవారు. 'నీ వయసుకి నేను నెలకి 14 పైన వ్యాసాలు రాసేవాడిని. నువ్వు ఇంకా ఎక్కువ రాయాలి కదా, ఒక్క కాలమ్ మాత్రమే రాస్తే ఎట్లా' అనేవారు. ఈ మధ్యకాలంలో పని ఒత్తిడి వల్ల చాలా రోజుల పాటు ఆయనను కలవలేకపోయాను. అప్పుడప్పుడూ ఫోన్‌లో మాట్లాడడమే. 2016 డిసెంబర్ 4న ఫోన్ చేశారు. 'ఎలా ఉన్నారు' అని అడిగితే, 'ఇంకా ఉన్నారా అని అడగాలి గాని, ఈ వయసులో ఎలా ఉన్నారని అడగకూడదు' అని నవ్వారు. రెండేళ్ల క్రితం తాను తరిమెల నాగిరెడ్డి స్మారకోపన్యాసం చేశానని, అది చాలా బాగా వచ్చిందనీ, దానిని ఇంగ్లీషులో అనువదించ డానికి ఎవరైనా ఉన్నారా, నువ్వు సహాయం చేయగలవా అని అడిగారు. వచ్చి మాట్లాడతానని చెప్పాను. దానిగురించి మాట్లాడడం కోసమే నేను, నా సహాధ్యాయి ఆశాలత కలిసి డిసెంబర్ 7న ఉదయం ఫోన్‌చేసి ఆయనింటికి వెళ్లాం. ఆ రోజెందుకో రెండు మూడు షాపులకెళ్లినా గాని కొర్రలు దొరకలేదు. కొర్రల బదులు రాగులు, జొన్నలతో చేసిన అటుకులు కొని తీసుకెళ్లాం. అప్పటికే ఆయన మాకోసం ఎదురు చూస్తున్నారు. వెళ్లిన వెంటనే ఆయనన్న మొదటి మాట 'ఆ యామ్

మిస్సింగ్ యు ఇన్ నవ తెలంగాణ, వైయుఆర్ నాట్ రైటింగ్, డోన్ట్ స్టాప్ రైటింగ్'. 'పుస్తకం వేస్తున్నాను, నాలుగు మాటలు రాయండి' అని అడిగితే, కొన్ని పూర్తి చేయాల్సిన వ్యాసాలు ఉన్నాయని, తర్వాత వస్తే తాను చెప్తానని, చెయ్యి కొంచెం సహకరించడం లేదని, నన్నే రాయమని అన్నారు. ఆరోజు దాదాపు రెండు గంటల సమయం ఆయనతో ఉన్నాం. తన చిన్ననాటి నుంచి జరిగిన అనేక విషయాలను ఆరోజు ఆయన అలా మాట్లాడుతూనే ఉన్నారు. భోజనం సమయం మించిపోతున్నాగానీ మాట్లాడుతూనే ఉన్నారు. తన చిన్నతనం మండపేటలో ఎలా గడిచిందీ, తన హైస్కూలు చదువు, అక్కడి నుంచి టైపు షార్టుహాండ్ నేర్చుకోవడం, సుందరయ్యగారితో పరిచయం, ఈనాడు దినపత్రిక ఆరంభానికి ముందు తాను ఎలాంటి సలహాలు ఇచ్చారు, డేటా న్యూస్ ఫీచర్స్ ఎందుకు పెట్టారు... వాళ్ల కుటుంబం గురించి.. పిల్లల గురించి.... అలా చాలా విషయాలు చెప్పుకుంటూ వచ్చారు. అప్పుడు నేను '86లో ఉద్యోగం కోసం మీ దగ్గరకు వచ్చాను అని చెప్తే... ఐ మిస్డ్‌యు ఎట్ దట్ టైమ్' అని నవ్వారు. మేము వచ్చేసేముందు 'నువ్వు ఉపన్యాసం ఇస్తావా' అని అడిగారు. నేను కొంచెం మొహమాటంగా చూస్తుంటే ఆశా అందుకుని, 'మాట్లాడుతారు' అంది. 'అమీర్‌పేట్ కమ్యూనిటీహాల్లో మీటింగ్ ఏర్పాటు చేయిస్తాను, మనం మార్చుకోవలసిన ఆహారపు అలవాట్ల గురించి, చిరుధాన్యాలు ఎందుకు తినాలో చెప్పు, మనం రాయడమే కాదు, అవేర్‌నెస్ కూడా కల్పించాల్సిందే' అన్నారు. 'ఒకేసారి వ్యవసాయం గురించి మాట్లాడితే ఇది మాకు సంబంధించిన విషయం అని అనుకోరు, అదే ఆహారం, ఆరోగ్యం గురించి చెప్తే తొందరగా అర్థం చేసుకుంటారు' అన్నారు. 'ఐ విష్ వియ్ కుడ్ మీట్ మోర్ ఫ్రీక్వెంట్లీ, బట్ ఐ డోంట్ హావ్ మచ్‌టైమ్' అని అంటుంటే ఎందుకో ఆరోజే కొంచెం దిగులనిపించింది. ఆ తర్వాత వారం లోపలే ఆయన చనిపోయారు.

హనుమంతరావుగారు ప్రతిరోజూ ఆ కమ్యూనిటీ హాల్ లైబ్రరీకి వెళ్లి అక్కడ వచ్చే అనేక తెలుగు, ఇంగ్లీషు దినపత్రికల్లో తనకు కావాల్సిన అంశాలను నోట్ చేసుకుని, జిరాక్స్ చేసుకుని వచ్చేవారు. వేరే వాళ్లకు కొన్ని అంశాలు ఉపయోగపడతాయని అనిపించినప్పుడు వాటిని జిరాక్స్ చేసి పోస్ట్‌చేసి పంపించేవారు. అలా నాకు రెండుమూడుసార్లు వ్యవసాయానికి సంబంధించిన కొన్ని వార్తలను పోస్ట్‌లో పంపించారు. నేను కొర్రలకు డబ్బులు తీసుకోవడం లేదని, ఎవరన్నా పిల్లలకు తన తరపున ఇవ్వమని రూ.5000 చెక్ పంపించారు. స్నేహఘర్ పిల్లలకు ఇస్తానని చెప్పాను.

జర్నలిజం మీద, ముఖ్యంగా ప్రజాకోణంలో ఆలోచించే జర్నలిజం మీద ఆయన ప్రేమను ప్రతి మాటలోనూ మనం ఆస్వాదిస్తాం. తాను చనిపోయిన తర్వాత ఏ రకమైన ఆచార వ్యవహారాలు చేయవద్దని, తన శరీరాన్ని వైద్యకళాశాలకు ఇవ్వటం ఆయన ఆచరించిన విలువలకు తార్కాణం. వయసురీత్యా ఆయన నిష్క్రమణ సహజమే అయినప్పటికీ, భౌతికంగా ఆయన లేనిలోటు ఆ కుటుంబానికీ, ఆత్మీయులకు, స్నేహితులకు ఎప్పటికీ ఉంటుంది.

నాకున్న కొద్దిపాటి స్నేహంతో అనిపించిందేమిటంటే ఆయన మనుషులతో ఒక సజీవ సంబంధాన్ని కొనసాగించారు. నిరంతరం ఒక సంభాషణలో ఉన్నారు. మనుషులమధ్య అంతరాలు, దూరాలు పెరిగిపోతున్న ఈ వర్తమాన సందర్భంలో ఆయన అత్యంత విలువైన జ్ఞాపకమే. వీ

# హనుమంతరావు వ్యక్తిత్వమే వేరు

**- నరిశెట్టి ఇన్నయ్య**
జర్నలిస్ట్

సుప్రసిద్ధ పత్రికా రచయితగా ఆర్థిక విషయాల విశ్లేషకుడిగా పేరొందిన మిత్రులు వి. హనుమంతరావు చివరి దశలో ఫోను చేసి ఒక కోరిక వెలిబుచ్చారు. గున్నార్ మిర్డల్ రాసిన 'ఏషియన్ డ్రామా' కావాలని ఎంత ప్రయత్నించినా లభించలేదని చెప్పారు. 92 ఏళ్ల వయసులో ఆయనకున్న ఆసక్తి, పరిశోధనపై దీక్షను ఈ విషయం స్పష్టపరుస్తున్నది. అమెరికా నుండి ఒక మిత్రుడి ద్వారా ఆ పుస్తకాన్ని ఆయనకందజేశాము. ఎంతో సంతోషించి అందులో భారతదేశానికి సంబంధించిన వ్యవసాయ ఆర్థిక విషయాలు చూస్తున్నట్లు చెప్పారు. ఇది జరిగిన నెల రోజుల్లోనే ఆయన చనిపోయారు.

మా ఇద్దరి పరిచయం 40 సంవత్సరాల చరిత్ర గలది. హనుమంతరావు గారితో పాటు నేను ఆయన నడిపిన డేటా న్యూస్ ఫీచర్స్‌లో రాశాను. ఆయన కుమారుడు సతీష్, నేను కలిసి 'నేటి రాజకీయం' అనే పత్రిక నడిపినపుడు హనుమంతరావు గారు వ్యాఖ్యానాలు చేసేవారు. డేటా న్యూస్ ఫీచర్స్‌లో 1979లో నేను ఒక వ్యాసం రాస్తూ కమ్యూనిస్టు నాయకుడు ప్రతిపక్ష నేత పుచ్చలపల్లి సుందరయ్య ఆనాడు ముఖ్యమంత్రిగా ఉన్న చెన్నారెడ్డి పరిపాలనలో డ్రైనేజి బోర్డు ఛైర్మన్‌గా పదవి స్వీకరించి ఫైళ్లు పట్టుకుని సెక్రటేరియట్‌లో కార్యాలయాల చుట్టూ తిరగడం గర్హించదగిన విషయం అని రాశాను. అప్పుడే చెన్నారెడ్డి అవినీతి పనులపై కాంగ్రెస్ వారితో సహా విపరీత విమర్శలు రావడం చివరకు ఆయన దిగిపోవడం జరిగింది.

ఆంధ్రజ్యోతి బ్యూరో ఛీఫ్‌గా నేను సుందరయ్య గారిని ప్రశ్నిస్తే రైతులకు సేవ చేద్దామని పదవి ఒప్పుకున్నానని, బూర్జువా పాలక వ్యవస్థలో ఏమీ చేయలేమని అర్థమయిందని అన్నారు. చివరికి ఆయన అసెంబ్లీలోనూ, తమ పార్టీలోనూ విమర్శలకు గురయి పదవికి రాజీనామా చేశారు. ఆ విషయాలన్నీ మీరెందుకు ప్రచురించారని హనుమంతరావు గారిని కొందరు కమ్యూనిస్టు జర్నలిస్టులు నిలదీశారు. ఆయన గట్టిగా సమాధానమిస్తూ ఇన్నయ్య రాసిన దానికి మీరు సమాధానమిస్తే యథాతథంగా ప్రచురిస్తానని అన్నారు. కానీ ఎవరూ ముందుకు రాలేదు.

హనుమంతరావు గారు 1950ల నుంచి కమ్యూనిస్టు పార్టీలో పనిచేశారు. మాకినేని బసవపున్నయ్యకు అండర్ గ్రౌండ్‌లో ఉన్నప్పుడు చాలా కృషి చేసి పెట్టారు. ఆ తరువాత వివిధ పత్రికలలో, యుఎన్ఐ వార్తా సంస్థలో పనిచేశారు. ఈనాడులో ఎడిటర్‌గా చేరినపుడు మీ విధానాలకు, ఈనాడు యాజమాన్య పద్ధతులకు ఎలా సరిపడుతుందని నేను అడిగినపుడు ఆయన సమాధానం చెప్పకుండా దాటేశారు. ఆ తరువాత మా ఇరువురి మిత్రత్వం పరిశోధనా అంశాలలో జర్నలిజంలో కొనసాగింది.

వ్యక్తిగా హనుమంతరావు గారు నియమ నిబద్ధత గల రచయిత. ఆయన కులాంతర వివాహం చేసుకుని ఆదర్శప్రాయంగా నిలిచారు. మేము జరిపే సమావేశాలకు ఎప్పుడు పిలిచినా వచ్చి మాట్లాడేవారు. మేము ఇరువురం వారి ఇంట్లో గంటల తరబడి అనేక విషయాలపై చర్చించుకునేవాళ్లం. ఆయన జర్నలిస్టు గా నిండు జీవితం గడిపారు. అది నేటి యువతరానికి ఆదర్శప్రాయం. వీ

# అరుదైన పాత్రికేయుడు వి. హనుమంతరావు

– కందిమళ్ల ప్రతాప్ రెడ్డి
భారత కమ్యూనిస్ట్ పార్టీ నాయకులు

వి. హనుమంతరావు ప్రముఖ పాత్రికేయుడుగా, 65 సంవత్సరాలు సుదీర్ఘకాలం పనిచేసి 91 సంవత్సరాల వయసులో కన్నుమూశారు. ఆయన మరణం ఆయన కుటుంబానికి, ఆత్మీయులకే కాదు, పాత్రికేయ వృత్తిలో ఉన్న వారందరికీ తీరని లోటు. కానీ, మరణం ప్రతివ్యక్తికి అనివార్యం. 90 సంవత్సరాలు నిండినా, తుదిశ్వాస విడిచేదాక తన కలాన్ని పక్కన పెట్టలేదు.

హనుమంతరావు పాత్రికేయుడుగా ఆర్థిక అంశాల విశ్లేషకుడిగా మాత్రమే కాదు, ఆయన ఆదర్శ కమ్యూనిస్టు. అభ్యుదయవాది. దేశభక్తుడు. నిరాడంబరుడు. నిస్వార్థ వ్యక్తి – నిత్య అధ్యయన శీలి.

నాకు హనుమంతరావుతో 60 సంవత్సరాల పరిచయముంది. 1958లో ఆయన హైదరాబాద్‌కు విశాలాంధ్ర పత్రిక ప్రథమ విలేకరిగా వచ్చారు. అప్పుడు ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ కార్యాలయం హిమాయత్‌నగర్ ఏక్‌మినార్ మజ్జిద్ పక్కనుండేది. రాష్ట్ర పార్టీ, నగర పార్టీ కార్యాలయాలు, విశాలాంధ్ర ప్రాంతీయ కార్యాలయం అందులోనే ఉండేది. పార్టీ కార్యాలయం వెనకాల ఉన్న చిన్న గదుల్లో పార్టీ నిర్వాహకులు చండ్ర రాజేశ్వరరావు, వై.వి. కృష్ణారావు, వేములపల్లి హనుమంతరావు, మహిళ నాయకురాలు సత్యవతి గార్ల కుటుంబాలుండేవి.

పార్టీ కార్యాలయం కార్యదర్శి ఎన్.వి. భాస్కరరావుతో పాటు టి. సత్యనారాయణ, ఐ.వి. చారి ఆఫీసు సిబ్బంది ఉండేవారు.

విద్యార్థి, యువజన సంఘ కార్యకర్తగా కొంతకాలం ప్రతిపక్ష నాయకుడిగా ఉన్న రావి నారాయణరెడ్డి ప్రైవేట్ సెక్రటరీగా రోజూ ఆఫీసులోనే ఉండేవాడని, హనుమంతరావు, భాస్కరరావు, మిగతా మేమంతా సన్నిహితంగా ఉండేవాళ్లం. కొంతకాలం తర్వాత విశాలాంధ్రకు మరో విలేకరిగా నర్సింహ్మారావు వచ్చారు.

హనుమంతరావును మొదట చూసినప్పుడు లాల్చీ, పైజామా, చంకకు సంచి చూశాను. అతను మితభాషి – అనవసర విషయాలలో జోక్యం చేసుకోవడం చూడలేదు. ఆవేశం ఎరుగడు. ప్రతివ్యక్తినీ ఆత్మీయంగా పలకరించడం చూశాను. అమీర్‌పేట్ నుండి ఆఫీసు దాకా నగరంలో ఎక్కడికెళ్లినా సైకిల్ మీదనే ప్రయాణం చేసేవాడు.

అప్పుడు పత్రికా రంగం విస్తరించలేదు. పత్రికలన్నీ మద్రాసు లేదా బొంబాయి నుండి ప్రచురించబడేవి. హైదరాబాద్‌లో గోల్కొండ పత్రిక ఉన్నా అది నిలదొక్కుకోలేదు.

అన్ని పత్రికలకు కలిపి 10–15 మందికి మించి పత్రికా విలేఖరులు తీరు, హనుమంతరావు, సీతారాం, టి.వి. కృష్ణ, పొత్తూరి వెంకటేశ్వరరావు ఆదిరాజు, రామారావు మొదలైనావారుండేవారు. పత్రికా విలేకరులుగా వారికి ఎంతో గౌరవం దక్కేది. వార్తను వార్తగా రాయడం, స్వంత అభిప్రాయాలకు ఆస్కారం లేకుండా, విమర్శలకు తావులేకుండా ఉండేవారు. వారిలో హనుమంతరావుకు ప్రత్యేక స్థానముండేది.

కారణం! అతను పుట్టింది తూర్పు గోదావరి జిల్లాలో. జాతీయోద్యమ నేపథ్యంలో పెరిగారు. వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమం అభ్యుదయ సాహిత్యంతో ప్రభావితుడయ్యారు. కమ్యూనిస్టు సిద్ధాంతానికి ఆకర్షితు డయ్యారు. అందుకే సిద్ధాంత నిబద్ధత, అభ్యుదయ భావాలు, వామపక్ష భావాలు తుదిశ్వాస విడిచే దాకా వీడలేదు.

ఆదర్శ వివాహం చేసుకున్నారు. ఆదర్శ కమ్యూనిస్టుగా జీవించారు. తన పిల్లలకు ఆదర్శ వివాహాలు జరిపారు. విజయవాడలో ప్రజాశక్తి నగర్ వారసత్వమే హైదరాబాద్ నాగార్జుననగర్ కాలనీ (కమ్యూనిస్టు కాలనీ) క్రమశిక్షణ గలిగిన వ్యక్తిగా జీవించారు.

చిరకాల పరిచయం, సిద్ధాంత అనుబంధం, ఉద్యమ సంబంధం, కుటుంబాల బంధుత్వంలో ఆయన్ని దగ్గరగా చూసే అవకాశం లభించింది.

హనుమంతరావు పాత్రికేయ వృత్తిలో ప్రవేశించే నాటికి, అటు ఆంధ్ర, ఇటు తెలంగాణలో తెలుగు భాషకు తగిన గుర్తింపు లేదు.

విజయవాడ కేంద్రంగా విశాలాంధ్ర దినపత్రిక తొలి జాతీయ దినపత్రికగా ప్రారంభమైంది. తెలుగు పత్రికల సంఖ్య తక్కువ. ఉన్న వాటిలో గ్రాంథిక భాష వాడుకగా ఉండేది. వాడుక భాషను విశాలాంధ్రతో మొదలైంది. కానీ, రాజకీయ, ఆర్థిక, సాంఘిక అంశాలకు తెలుగు, వాడుక భాషలో ప్రత్యామ్నాయ పదాలు కావాలి. కొత్త కొత్త పదాల ప్రయోగం జరిగింది. విశాలాంధ్రలోని ఉద్దండులైన పెద్దలతో పాటు, ఎన్నో పదాలను ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టిన వారిలో హనుమంతరావు ఒకరు.

నిత్య అధ్యయనం, నిరంతర రచన లక్ష్యంగా ఎంచుకున్నారు. మనిషి మారలేదు, మాటా మారలేదు. లాల్చీ, పైజామా, సంకకు సంచి – పోలేదు.

ఎన్ని పత్రికల్లో పనిచేసినా అతను సంతృప్తి పొందలేదు. డబ్బును ఆశించలేదు. తన భావాలను, సమాజానికి కావలసిన విషయాలను తెలియ జేయాలనుకున్నారు. 'డాటా న్యూస్ ఫీచర్స్' ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ దర్శిని రచనలో పాత్రధారి అయ్యారు. పత్రికా నిర్వహణ ఆర్థిక ఇబ్బందులు – వ్యయ ప్రయాసాలతో కూడిందని తెలుసు. పత్రికా సంపాదకుడు, రచయితగానే కాకుండా పత్రికను ప్రజల మధ్యకు తీసుకెళ్లాలనుకున్నారు. ఎక్కడకెళ్లినా సంచిలో కొన్ని పత్రికలతో వెళ్లేవారు.

నాకు వ్యక్తిగత అనుభవం. ఒకరోజు ప్రెస్‌క్లబ్‌లో ఏదో మీటింగ్ జరిగింది. మీటింగ్ తరువాత నా దగ్గరకొచ్చి, జేబులో వంద రూపాయలున్నాయా? అన్నారు. దేనికోనని తీసిచ్చాను.

'ఇది అప్పుగాదు – డాటా న్యూస్ పత్రిక చందా' అన్నారు. 'ప్రతి నెల పోస్టులో వస్తుంది. తప్పక చదివి, అభిప్రాయాలు చెప్పు' అన్నారు. ఆ తరువాత పత్రిక రెగ్యులర్‌గా అందింది. చందా పూర్తి కాగానే ఫోన్ చేసేవారు.

హనుమంతరావుకు పేరు కోసమో, ఆదాయం కోసమో ఆ పత్రిక నడపవలసిన అవసరం లేదు. వ్యయప్రయాసాలు, ఆర్థిక ఇబ్బందు లెదుర్కొంటూ, సంపాదకుడిగా, రచయితగా, డిస్ట్రిబ్యూటర్‌గా అన్నీ తానే అయి పనిచేశారు. సంచార గ్రంథాలయం లాగా – సంచార పత్రిక నిర్వహించారు. తరువాత వీక్షణం తెచ్చారు.

పాత్రికేయుడిగా తన అనుభవా లను, బడ్జెట్ విశ్లేషణ తదితర అంశాలకు యువ పాత్రికేయులకు శిక్షణ ఇచ్చారు. నాగార్జుననగర్ నుండి వెళ్లి కొంతకాలం సిఆర్ ఫౌండేషన్‌లో ఉన్నప్పుడు నెలకొకసారైనా తప్పకి కలుసుకునేవాణ్ని. హనుమంతరావు, ఆయన భార్య సరళ ఎప్పుడు ఏదో రాయడంలోనో, చదవడంలోనో నిమగ్నమై ఉండేవారు.

హనుమంతరావు నిత్య అధ్యయనశీలి. ఆదర్శ కమ్యూనిస్టు. సౌమ్యుడు. మితభాషి. ఆధునిక తెలుగు పత్రికా రంగంలో నూతన ఒరవడి దిద్దిన పాత్రికేయుల్లో హనుమంతరావు ఒకరు.

వ్యక్తిగత జీవితం, వృత్తి ధర్మం, విధి నిర్వహణ, ఆదర్శాలను ఆచరించడం లో హనుమంతరావు ఈనాటి పాత్రికేయులకు ఆదర్శం కావాలి. విశాలాంధ్రతో ప్రారంభమైన పాత్రికేయ వృత్తి వీక్షణం వరకు కొనసాగింది. ఎన్నో పత్రికల్లో పనిచేశారు. ఎన్నో విశ్లేషణలు చేశారు.

కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక తరువాత ఆయన ఏ పార్టీలోనూ సభ్యుడుగా లేరు. అందరివాడుగా ఉన్నారు. వామపక్ష ఐక్యతను కోరుకున్నారు. తుదిశ్వాస విడిచేదాకా రచన సాగించారు. ఆదర్శాన్ని పాటించారు. అందుకే తన కళ్లను, భౌతికకాయాన్ని హాస్పిటల్‌కు ఇవ్వాలని వీలునామా రాశారు. హనుమంతరావు ప్రారంభించిన వీక్షణం – వేణు అతని ఆదర్శాల కనుగుణంగా కొనసాగిస్తున్నాడు. వీక్షణం హనుమంతరావు ఆదర్శాలను కొనసాగించాలని ఆశిస్తున్నా. వీ

# హనుమంతరావు సంస్మరణ

– బి.వి. రాఘవులు

భారత కమ్యూనిస్ట్ పార్టీ (మార్క్సిస్ట్) కేంద్ర కమిటీ సభ్యులు

హనుమంతరావు గారితో నా మొదటి పరిచయం ఆయన వ్యాసాల ద్వారానే. దాదాపు అన్ని దినపత్రికలలో ఆయన వ్యాసాలు వచ్చేవి. అన్ని అంశాల మీద రాసేవారు. ఆర్థిక అంశాల మీద రాయడం ఆయన ప్రత్యేకత. ప్రచురించే పత్రిక ఏదైనా ఆయన దృక్పథం ఎప్పుడూ మారలేదు. అవసరాన్ని బట్టి, పరిపాలించే వారిని బట్టి, పత్రిక యాజమాన్య ధోరణిని బట్టి తన దృష్టిని మార్చుకునే వ్యక్తిగాదు హనుమంతరావు గారు. అనేకమంది పాత్రికేయులు అనుభవం గడించే కొద్ది పైవారితో పరిచయాలు పెరిగే కొద్ది పెన్ పుషర్స్‌గా మారిపోతున్న కాలంలో కూడా నమ్మిన విలువలకు కట్టుబడే ఆయన వ్యవహరించారు. వలువలొదిలేసినట్లు విలువలనొదిలేసే వారికి పదవులు, పణం దక్కవచ్చేమో గాని గౌరవం, చిరస్మరణీయత దక్కదు. హనుమంతరావు గారు చివరి వరకు ఉన్నత పాత్రికేయ విలువలకు కట్టుబడ్డారు. దాని కోసం అతి సాధారణ జీవితాన్ని ఎంచుకున్నారు. సామాన్య ప్రజలు కేంద్రంగా రచనలు చేశారు. అందుకే తెలుగు పాత్రికేయ ప్రపంచంలో ప్రముఖ స్థానం పొందారు.

ఆయన రచనలలో పుష్కలంగా సమాచారం ఉండేది. ధారాళంగా అంకెలను వాడేవారు. ఈ అంకెలె ఆయన వ్యాసాల మీద నాకు ఆసక్తిని పెంచాయి. ఈ అంకెలె ఆయనతో నా మొదటి ప్రత్యక్ష పరిచయానికి దారితీశాయి. డాటా న్యూస్ ఫీచర్స్ బులిటెన్‌ను పరిచయం చేసి కొత్త గణాంక ప్రపంచానికి నాకు ద్వారం తెరిచారు. ఆయన పేరే డిఎన్ఎఫ్ హనుమంతరావుగా ప్రసిద్ధి పొందిన విషయం ఆ తర్వాత తెలిసింది.

ఆయన గణాంకాలతో వ్యాసాలను నింపేస్తారని విమర్శకులు అంటుంటారు. ఆయన రచనలలో గణాంకాలు ఎక్కువ ఉండే మాట వాస్తవం. అయితే అనవసరంగా, పాండితీ ప్రకర్ష కోసం అంకెలను వినియోగించరు. ఆర్థిక విషయాలపై ఎక్కువగా రాస్తుంటారు కాబట్టి ఆయన వ్యాసాలలో గణాంకాలు ఎక్కువగా ఉండడం సహజం. అంకెలుంటే చదువరుల ఆసక్తి దెబ్బతింటుంది అన్న అభిప్రాయం బలంగా ఉన్న రోజులలో సంక్లిష్ట విషయాన్ని కూడా సులువుగా అర్థం చేసుకోవడానికి వాటిని సమర్థవంతంగా వినియోగితీంచవచ్చని హనుమంతరావు గారు చేసి చూపించారు. ఆయన చూపిన ఈ దారిన ఇప్పుడు అనేక మంది నడుస్తున్నారు.

ఎపుడో 'డాటా' అన్న మాటను హనుమంతరావు తన బులిటెన్ పేరులో వినియోగించారు. ఇప్పుడా డాటా అన్న మాట వాడకుండా ఏ సంభాషణ, ఏ ఉపన్యాసం, ఏ వ్యాసం, ఏ పుస్తకం నడిచేట్లు లేదు. అంకెలకు, గణాంకాలకు అంకెల ప్రాధాన్యతను ముందుగా గుర్తించిన బహు కొద్ది మందిలో హనుమంతరావుగారు అగ్రగణ్యుడు.

నేను హైదరాబాద్‌కు మకాం మార్చిన తరువాత హనుమంతరావు గారిని తరచుగా కలిసె అవకాశం కలిగింది. మేం కలిసిన ఎక్కువ సందర్భాలు పరస్పర అభివందనలతో ముగిసేవి. ఆయన అసందర్భంగా మాట్లాడే వాడు కాదు. విషయం సాకల్యంగా మాట్లాడదల్చుకున్నప్పుడు, ముందుగా సమయం తీసుకోకుండా వచ్చేవారు కాదు. వచ్చినప్పుడు చర్చించదల్చుకున్నది పూర్తి చేయకుండా వెళ్లేవారు కాదు. ఈ అలవాటు పాత్రికేయవృత్తిలో భాగంగా వచ్చిందా, తన సమయాన్ని ఇతరుల సమయాన్ని అసందర్భ సంభాషణలతో వృథే చేయకూడదన్న సమయం విలువ తెలిసిన స్పృహ నుండి వచ్చిందా తెలియదు గాని, మనమందరం ఆయన నుండి నేర్చుకోవాల్సిన మంచి అలవాటుగా చెప్పగలను. మా ఇద్దరి మధ్య సంభాషణ ఎప్పుడూ నాకు ప్రయోజనకరంగానే ముగిసేది.

'వీక్షణం' పత్రిక ప్రారంభించడం గురించి ఇటువంటిక భేదాలతోనే ఒకసారి హనుమంతరావు గారు ప్రతిపాదించారు. సమకాలీన, రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులను ప్రజా దృక్పథం నుండి వ్యాఖ్యానించే ఒక అర్థవంతమైన పత్రిక అవసరం రాష్ట్రంలో ఎంతైనా ఉందని హనుమంతరావు గారు గాఢంగా నమ్మారు. వామపక్ష శక్తులన్ని అటువంటి ప్రయత్నానికి సహాయపడాలన్న ఆయన అభిలాషతో నేను ఏకీభవించాను. ఆయన ప్రతిపాదించిన పత్రిక ప్రజల పక్షాన ఉండాలి. పాలకుల విధానాల, చర్యల అంతరార్థాన్ని ప్రజలకు విప్పి చెప్పడం ప్రధాన బాధ్యతగా ఉండాలి. వామపక్ష, అభ్యుదయశక్తుల మధ్య వచ్చే వివాదాలకు వేదికగా ఉండకూడదు. ఈ విషయంపై మా ఇద్దరి మధ్య ఏకాభిప్రాయం ఏర్పడింది. ఇంకా ఇతర పెద్దలతో ఆయన ఈ విషయంపై చర్చించారు.

ఆయన చేసిన ప్రయత్నాల ఫలితమే ఆయన వ్యవస్థాపక సంపాదకునిగా ప్రారంభం అయిన మాసపత్రిక 'వీక్షణం'. 1995 తర్వాత ఉమ్మడి రాష్ట్రంలో ప్రపంచబ్యాంకు ప్రోత్సాహంతో ప్రారంభమయిన హానికర సరళీకరణ సంస్కరణల స్వభావాన్ని బట్టబయలు జేయడంలో 'వీక్షణం' మంచిపాత్రను నిర్వహించింది.

చివరి వరకు పాత్రికేయ వ్యాసంగాన్ని వదలకుండా హనుమంతరావు కృషిని సాగించారు. జర్నలిస్టు కురువృద్ధుడిగా అందరి మన్నలను పొందారు. విలువల బలం, ఆశయ స్ఫూర్తి ఉన్న పాత్రికేయ కృషి నాలుగు కాలాల పాటు నిలుస్తుంది. కొత్త ఒరవళ్లు దిద్దుతుంది. అటువంటివేమీ లేకుండా భాషా పటాటోపం, ఆకర్షణీయమైన రచనా శైలికే పరిమితమైన రచనలు తక్షణం చదువరులను మెప్పించ వచ్చేమో గాని చరిత్ర వడపోతకు తట్టుకుని నిలబడలేవు. హనుమంతరావు గారి పాత్రికేయ కృషి మాత్రం తెలుగు జర్నలిజం చరిత్రలో నిలిచిపోతుంది. వీ

# కమ్యూనిస్టు విప్లవకారుల నిజమైన మిత్రుడు

**– భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమైక్యతా కేంద్రం (మార్క్సిస్టు–లెనినిస్టు)**

కామ్రేడ్ వి.హెచ్ అని ఆప్యాయంగా పిలుకునే కామ్రేడ్ వి. హనుమంతరావుగారి మరణానికి యుసిసిఆర్ఐ (ఎం–ఎల్) తన సంతాపం తెలుపుతున్నది. ఆయన తన జీవితకాలమంతా కమ్యూనిస్టు విప్లవకారుల శ్రేయోభిలాషిగా, మిత్రుడుగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రెండు తెలుగు రాష్ట్రాలలోనూ సీనియర్ జర్నలిస్ట్‌గా సుపరిచితులు. 2016 డిసెంబర్ 13వ తేదీ తెల్లవారుఝామున ఆయన మరణించారు. ఆయన వయస్సు 91 సంవత్సరాలు. ఆయనకు భార్య కామ్రేడ్ సరళ, ఇద్దరు కొడుకులు, ఒక కూతురు, మనవరాళ్లు ఉన్నారు.

తూర్పుగోదావరి జిల్లాలోని మండపేట గ్రామంలో 1925 ఆగస్టు 30న ఆయన జన్మించారు. సుమారు 19 సంవత్సరాల వయసులో, తన చదువు పూర్తికాగానే, ఆయనకు కమ్యూనిస్టు ఉద్యమంతో సంబంధం ఏర్పడింది. ఆనాటి కమ్యూనిస్టు పార్టీ తాను నాయకత్వం వహిస్తున్న విప్లవ పోరాటాల్లో, ప్రత్యేకించి 1946–51 నాటి తెలంగాణ సాయుధ పోరాటంలో మునిగి ఉన్న రోజులవి. ఈ కాలంలో కొద్ది కాలం పాటు పార్టీ కేంద్ర కమిటీ ఆంధ్రాథీసిస్ రూపంలో ఉన్న తెలంగాణ మార్గాన్ని తన అధికారిక పంథాగా ఆమోదించి, ఈ విప్లవ పంథాను దేశమంతటా అమలు చేయడానికి పూనుకుని, ఆ కృషిలో తలమునకలై ఉంది. ఎంతో కీలకమైన ఈ దశలో పార్టీ కేంద్ర హెడ్‌క్వార్టర్స్‌లో స్టాఫ్ కార్యకర్తగా కామ్రేడ్ వి.హెచ్ పార్టీకి తన సేవలందించారు.

ఆ తర్వాత కూడా కామ్రేడ్ వి.హెచ్ కమ్యూనిస్టు పార్టీతో తన సంబంధాలను కొనసాగించారు. 1968 చీలిక తర్వాత తన జీవితం చివరి వరకూ కామ్రేడ్స్ దేవులపల్లి వెంకటేశ్వరరావు, తరిమెల నాగిరెడ్డి గార్లు ప్రాతినిధ్యం వహించిన కమ్యూనిస్టు విప్లవకారులతో సంబంధాలు కొనసాగించారు. భారతదేశంలో మనిషిని మనిషి దోచుకోవడాన్ని అంతమొందించే ప్రాతిపదికపై ఒక కొత్త సమాజాన్ని ఆవిష్కరించే కృషికి ఆయన ఎంతో అంకిత భావంతో, శాయశక్తులా తన సహాయ సహకారాలను అందించారు. ఆ విధంగా ఏడు దశాబ్దాల పాటు ఫలప్రదంగా సాగింది ఈ మైత్రి.

చాలా చిన్న వయసులోనే ఆయన జర్నలిజాన్ని తన వృత్తిగా ఎంచుకున్నారు. తుదిశ్వాస విడిచేవరకూ రచనలు చేస్తూనే ఉన్నారు. తెలుగు దిన పత్రికలకు రెగ్యులర్‌గా తన రచనలు పంపడమే కాక, మెయిన్‌స్ట్రీమ్, ఎకనామిక్ టైమ్స్, యుఎన్ఐ వంటి అనేక ఇంగ్లిష్ పత్రికలతో, న్యూస్ ఏజెన్సీలతో ఆయనకు సంబంధాలు ఉండేవి. ఆయన ప్రతి రచనా పాలక వర్గాల దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా, ప్రజలకు అనుకూలమైన వైఖరితో నిండి ఉండేవి. కేంద్ర ప్రభుత్వ బడ్జెట్లపైనా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ బడ్జెట్‌ల పైనా ఆయన రెగ్యులర్‌గా చేసిన వ్యాఖ్యానాలు ఈ వైఖరితోనే ఉండేవి. తెలుగు ప్రజల జాతీయ ఆకాంక్షలను ప్రతిబింబిస్తూ ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి పట్ల ఆయన ఎనలేని శ్రద్ధాసక్తులు కనపరిచేవారు. తన ప్రజాస్వామిక వైఖరితో ఆయన పాలక వర్గాల పాశవిక నిర్బంధ పద్ధతులను వ్యతిరేకించేవారు.

ఒక కమ్యూనిస్టు విప్లవకారుడిగా దేశంలో విప్లవాత్మకమైన మార్పు కోసం కృషిచేసే అనేక పత్రికలతో ఆయనకు సంబంధాలు ఉండేవి. 1978–1980 మధ్య కాలంలో ప్రజాస్వామిక పత్రికగా, పక్షపత్రికగా వెలువడిన 'సంకేతం'తో ఆయనకున్న సంబంధం ఇందులో ఒక భాగం. ఆ 'సంకేతం' పత్రికను 1981లో కామ్రేడ్ దేవులపల్లి వెంకటేశ్వరరావు గారి నాయకత్వంలోని కమ్యూనిస్టు విప్లవకారుల పత్రికగా మార్చడాన్ని ఆయన బలపరిచారు. సిద్ధాంత, రాజకీయ పరిణామాల పట్లా, కమ్యూనిస్టు విప్లవోద్యమంలో వస్తున్న పరిణామాల పట్లా ఆయన ఎంతో ఆసక్తిని కనపరిచేవారు. ఎప్పటికప్పుడు వాటి గురించి తెలుసుకుంటూ ఉండేవారు. తన జీవితం చివరి వరకూ కమ్యూనిస్టు విప్లవకారుల శ్రేయోభిలాషిగా జీవించారు.

ఆయన మరణంతో కమ్యూనిస్టు విప్లవకారులు ఒక నిజమైన మిత్రుడిని, శ్రేయోభిలాషిని కోల్పోయారు. ఆయన కుటుంబానికి మా తీవ్ర సంతాపాన్ని తెలియజేస్తున్నాము.

కమ్యూనిస్టు విప్లవకారుల నిజమైన మిత్రుడు, శ్రేయోభిలాషి కామ్రేడ్ వి.హెచ్ స్మృతి వర్ధిల్లాలి. వారికి మా జోహార్లు. వీ

# అక్షర యోధుడు హనుమంతరావుకు జోహార్లు !

**– కె. గోవర్ధన్**

భారత కమ్యూనిస్ట్ పార్టీ (మార్క్సిస్ట్–లెనినిస్ట్) న్యూ డెమోక్రసీ నాయకులు

జర్నలిస్టు అనే పదానికి అర్థం మారిపోతున్న స్థితిలో హనుమంతరావు గారి గురించి తప్పకుండా తెలుసుకోవాలి. అందులో ప్రజాపక్ష జర్నలిస్టు ఎలా ఉంటారంటే హనుమంతరావుగారినే చూయించాలి. ఒక్క సంవత్సరమో, ఒక్క దశాబ్దమో కాదు … ఏకంగా ఆరు దశాబ్దాలకుపైగా జర్నలిస్టుగా కొనసాగడం, మనగలగడం నిజంగా అత్యద్భుతమైనది.

జర్నలిస్టులనే వారు కనీసం వారానికొక్కటైనా వ్యాసం రాయాలనేది హనుమంతరావుగారి అభిలాష. అక్షరాలను వార్తలుగా మలచడమేకాదు, వాటిని ప్రజాకోణం నుంచే రాయాలనేది హనుమంతరావుగారి అభిమతం. పేజీలకు పేజీలు వ్రాసి సగటు పాఠకున్ని తికమకపెట్టే వ్యాసాలకు, వార్తలకు హనుమంతరావు గారు బద్ధవ్యతిరేకి. సమాజంలో జర్నలిజమనేది అత్యంత బాధ్యతాయుతమైన వృత్తిగా భావించడమేకాదు, దానికోసం హనుమంతరావు గారు జీవితాంతం కృషి చేసారు. ప్రతి జర్నలిస్టు నిబద్ధతతో పనిచేయడమే కాదు, తప్పకుండా ప్రజాపక్షం వహించి తీరాలనే తత్వం హనుమంతరావు గారిది. అందుకే వృత్తి నిర్వహణలో విలువలకు అత్యంత ప్రాముఖ్యత నిచ్చాడు. దాన్ని చివరి ఊపిరి వరకు అక్షరాలా అమలు జరిపిన అక్షర యోధుడాయన. హనుమంతరావుగారి జీవితం కేవలం జర్నలిస్టుగానే సాగలేదు, గొప్ప మానవతా విలువలు, ఆదర్శాలు కలగలిసి బాల్యంలోనే దిదిన కమ్యూనిస్టు సిద్ధాంతాలు చివరి వరకూ కొనసాగాయి. కమ్యూనిస్టు జర్నలిస్టంటే హనుమంతరావుగారి లాగానే ఉండాలనేంత విధంగా కొనసాగడం అతిశయోక్తికానేకాదు.

ప్రపంచ బ్యాంకు విషమ షరతులతో, ఐఎంఎఫ్ ఆదేశాలతో దేశంలో సంస్కరణల పేరిట 1991లో నూతన ఆర్థిక విధానాలు అమలులోకి వస్తున్నప్పుడు హనుమంతరావుగారి కలం మరింత పదునెక్కింది. ఆ సందర్భంగా గుంటూరులో 'ప్రజాపంథా' పత్రిక నిర్వహణా బాధ్యుడిగా పనిచేస్తున్న నాకు హనుమంతరావుగారు ఫోన్ చేసి 'విద్యుత్ రంగంలో చోటు చేసుకుంటున్న మార్పులు తీవ్రంగా ఉండబోతున్నాయి, ఇది ముఖ్యమైన రంగమైనందున దీనిపై ఓ పుస్తకం రాసాను. దాన్ని మీరు ప్రింట్ చేస్తే బావుంటుందనుకుంటున్నాను. విద్యాభూషణ్ వచ్చి మీకు అందచేస్తాడు' అని ఫోన్ పెట్టేశారు. పత్రిక సంపాదకవర్గం ఈ ప్రతిపాదన పట్ల సంతోషాన్ని వ్యక్తం చేసింది. 'వెలుగు నుండి చీకట్లోకి' అనే పేరిట ఈ చిన్న పుస్తకాన్ని 'ప్రజాపంథా ప్రచురణలు'గా వెలువరించాం. బాగా ప్రజాదరణ పొందిన పుస్తకంగా ఇది నిలిచింది.

ఇక అప్పటి నుండి వరుసగా హనుమంతరావుగారి వ్యాసాలు, వార్తలు ప్రజాపంథా పత్రికలో చోటు చేసుకోవడం ప్రారంభమయ్యింది. దాదాపు 20 సంవత్సరాలపాటు హనుమంతరావుగారు అనేక వ్యాసాలను, వార్తలను 'ప్రజాపంథా'కు రాస్తూనే వచ్చారు.

హనుమంతరావుగారు కేవలం జర్నలిస్టుగా మాత్రమే ఎప్పుడూ లేరు. అన్ని కమ్యూనిస్టు పార్టీలతో, వాటి ప్రజాసంఘాలతో నిరంతరం సంబంధాల్లో వుండేవారు. రాగద్వేషాలకు అతీతంగా వ్యవహరించేవారు. విశాలాంధ్ర, ప్రజాశక్తి అనేక దిన, వార, పక్ష, మాస పత్రికలతోపాటు ప్రజాపంథా పత్రికలకూ వ్యాసాలు రాసి పంపేవారు. ప్రజాపంథాకు కోరిన వాటిపైనే గాకుండా విషయ ప్రాధాన్యత రీత్యా అడిగి మరీ రాసేవారు కూడా.

పాలకులు ప్రజా వ్యతిరేక విధానాలను ముందుకు తెచ్చినపుడల్లా వాటిని ఎత్తి చూపుతూ హనుమంతరావుగారు అనేక రంగాలపై వందల, వేల వ్యాసాలను, వార్తలను వెలువరించారు. వాస్తవాలను నిర్ధారించు కునేలా అవసరమైన గణాంకాలను ఇచ్చేవారు. శాసనసభ, పార్లమెంటు సమావేశాల కవరేజ్ కూడా ఇదే రీతిలో సాగేది. డిఎన్ఎఫ్ సంస్థను స్థాపించి సమాచార సేకరణకు ఎంతో పాటుపడ్డారు.

వ్యాసాలు, వార్తలతోపాటు హనుమంతరావు వెలువరించిన డజను దాకా పుస్తకాలు, వివిధ రకాల సర్వేలు ఆయనలోని ప్రజాపక్ష వీక్షకుణ్ణి ఎత్తిపడతాయి. 'వీక్షణం' స్థాపకుల్లో ఒకరుగా ఆ పత్రిక 15 సంవత్సరాల పాటు నిరవధికంగా వెలువడడంలో ఆయన పాత్ర కొనియాడదగింది.

పార్టీల, ప్రజా సంఘాల సభలకు హనుమంతరావుగారు వచ్చేవారు. అఖిల భారత రైతు-కూలీ సంఘం (ఏఐకెఎంఎస్) రాష్ట్ర స్థాయి, అఖిల భారతస్థాయి సభలకు హాజరయ్యారు. జలంధర్ మహాసభల్లో ఆయన సౌహార్ద్ర ప్రతినిధిగా ప్రొ. కె.ఆర్. చౌదరి దంపతులతోపాటు వృద్ధాప్యాన్ని సైతం లెక్కపెట్టకుండా హాజరయ్యారు. సభలను నిశితంగా పరిశీలించడం, అవసరమైన సలహాలివ్వడం, వాటిపై వ్యాసాలను రాసేవారు.

ఏదో ఒక పత్రికలోనో, ఛానల్‌లో సాదరణ రిపోర్టర్‌గానో, జర్నలిస్టుగానో పనిచేసే సమయంలో వచ్చే గుర్తింపును, పరిచయాలను కొందరు తమ సొంతానికి, స్వార్థానికి వాడుకొంటున్న స్థితిలో హనుమంతరావు గారు నిప్పులాగా నిలిచారు. కడిగిన ముత్యంలా బతికారు. ఆయన ఉత్తమ, ఆదర్శ జర్నలిస్టుగానే కాకుండా నిబద్ధతకు, నిజాయితీకి మారుపేరుగా నిలిచారు. హనుమంతరావుగారి 92 సం॥రాల జీవితంలో అత్యధిక భాగం పాత్రికేయ వృత్తికే అంకితమయినా ప్రవృత్తి మాత్రం కమ్యూనిస్టు ఆశయంతోనే నిండిపోయింది. కమ్యూనిస్టు సిద్ధాంతం పట్ల అచంచల విశ్వాసం నిరంతర ప్రవాహం లాగానే కొనసాగింది.

ఆరు దశాబ్దాలపాటు నిబద్ధతగలిగిన జర్నలిస్టుగా విలువలతో కూడిన జీవితం గడిపిన హనుమంతరావుగారు అత్యంత నిరాడంబరంగా ఉండే వారు. ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమంలోని అగ్రనాయకులైన పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు, తరిమెల నాగిరెడ్డి గారిలాంటి వాళ్లతో మొదలుకొని నిన్నటి, ఈనాటితరం కార్యకర్తల వరకు సజీవ సంబంధాలు కొనసాగించారు. ఏ కమ్యూనిస్టు పార్టీలో నిర్మాణరీత్యా సభ్యుడు కాకపోయినప్పటికీ ఆయన కమ్యూనిస్టు జీవన విధానాన్నే కొనసాగించారు. ఆదర్శ కమ్యూనిస్టుగా, నిబద్ధత గలిగిన ప్రజాపక్ష జర్నలిస్టుగా కొనసాగిన ఆ అక్షర యోధుడికి సీపీఐ (ఎం-ఎల్) న్యూడెమోక్రసీ వినమ్రంగా విప్లవ జోహార్లర్పిస్తోంది. జర్నలిజంలో హనుమంతరావు గారు సృష్టించిన, ఎత్తిపట్టిన విలువలను, నిజాయితీని, నిర్భీతిని అన్నింటిని మించి ప్రజాహితాన్ని నేటితరం జర్నలిస్టులు, పాత్రికేయులు అలవర్చుకోవాల్సిన అవసరమెంతో ఉంది. వీ

# విలువలతో బతికిన మనిషి

– వరవరరావు

విప్లవ రచయితల సంఘం నాయకులు

సమాజ మార్పు గురించిన విశ్వాసాలు ఎదుటివారు గౌరవించి స్వీకరించాలంటే ఆ విశ్వాసాలు ప్రచారం చేసేవాళ్ల విలువలు, జీవనశైలి ప్రభావం కూడా చాలా ఉంటుంది. నూతన ప్రపంచానికి సంబంధించిన సిద్ధాంతాన్ని తరతరాల సంచిత భావజాలాన్ని కాదని స్వీకరించడానికి ఏటికి ఎదురీదడం లాంటి కృషి చేయాల్సి ఉంటుంది. సిద్ధాంతం జీవితానికి పర్యాయపదం కాదు. కనుక మనం చెప్పే సిద్ధాంతాన్ని స్వీకరించడానికి అది ఇప్పటిదాకా సంకల్పితంగా, అసంకల్పితంగా స్వీకరిస్తూ, ఆచరిస్తున్న సిద్ధాంతానికన్న భిన్నమైంది కనుక మన ఆచరణను వెయ్యి కళ్లు కనిపెడుతూ ఉంటాయి. వీటి బాహిర వ్యక్తీకరణ మన జీవన శైలి, మన ఆచరణను బట్టే ఉంటుంది. సమాజంలో చర్చ కూడా ఎక్కువగా వీటి గురించే జరుగుతుంటుంది. విశ్వాసాల, సిద్ధాంతాల ప్రభావం సమూహాల మీద, సమష్టి మీద ఎక్కువగా ఉంటుంది. ఫ్యూడల్ భూస్వామ్య సమాజమైనా, పెట్టుబడిదారీ సమాజమైనా వ్యక్తినిష్టమైనవి. బ్రాహ్మణీయ భావజాలంలోనైనా, గుత్త పెట్టుబడిదారీ సమాజంలోనైనా వ్యక్తి ప్రాధాన్యం ఎంత తీవ్రంగా ఉంటుందో ట్రంప్, మోడీలు మొదలుకొని రాష్ట్ర రాజకీయాల వరకూ చూస్తున్నాం. రాజకీయాలు ఒక సామాజిక చలనానికి చోదక అంశాలు కనుక అక్కడే ఈ భావజాలం పనిచేస్తుందంటే జీవన అన్ని రంగాల్లో పనిచేస్తుందని అర్థం.

ఇటువంటి నేపథ్యంలో 92 ఏళ్ల పాటు హనుమంతరావు గారు తన విశ్వాసాలు, విలువలు, నిజాయితీతో కూడిన జీవనశైలితో ఎందరితోనో స్నేహం చేసి, ప్రభావితం చేయగలిగారంటే అది అసాధారణమైన విషయం. ముఖ్యంగా అతి సాధారణంగా జీవించడం అనేది అసాధారణమైపోయిన పోటీ వ్యవస్థలో అట్లా సాదాసీదాగా బతుకుతూ తన విశ్వాసాలు, విలువలు నిలుపుకోవడం అనేది కత్తిమీద సాము

వంటిది. అందులోనూ ఎవరి మనుస్సుకూ నొప్పి కలిగించకుండా, అదే సమయంలో తన విశ్వాసాల విషయంలో రాజీ పడకుండా ఒక జీవితాచరణలో ఉండడం అనేది అరుదైపోయిన కాలం ఇది. అందుకే హనుమంతరావు గారిది చాలా సహజ మరణం అయినప్పటికీ, ఒక పరిపూర్ణమైన జీవితం గడిపినప్పటికీ ఆయన లేని లోటు ముఖ్యంగా ఇవాళ్టి వ్యవస్థలో కొట్టొచ్చినట్టుగా కనిపిస్తున్నది. అటువంటి మనుషులు చాలా అరుదైపోతున్నారు. ఈ వ్యవస్థ ఎంత చెడిపోతున్నప్పటికీ అటువంటి మనుషులను తలుచుకోవడం అనేది ఈ వ్యవస్థలో ఇంకా ఎక్కువ మందికి ఇది బాగులేదనే అభిప్రాయం ఉన్న మాట, ఇది మారాలన్న ఆకాంక్ష కూడా ఉన్నదన్నమాట. అది చాలు ఆయన కృషి ఫలించిందనడానికి.

హనుమంతరావు గారు పత్రికా రంగానికి చేసిన సేవలేమిటో చెప్పడానికి చాలామంది ఉన్నారు. ఎక్కువ మంది దృష్టికి రాని మా స్నేహం బలపడడానికి కారణమైన ఒకటి రెండు అంశాలు మాత్రమే నేను ప్రస్తావిస్తాను.

హనుమంతరావు గారితో నాకు పరిచయం, స్నేహం మన సమాజం ఒక ముఖ్యమైన మలుపు తీసుకున్న సందర్భంలో ఏర్పడింది. అది 1991-92 కాలం. 1991 పి.వి. నరసింహరావు ప్రధానిగా నూతన ఆర్థిక విధానం పేరుతో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అమలులోకి వచ్చిన కాలం. అది అమలు చేయడానికి నేరుగా ప్రపంచబ్యాంక్ గవర్నర్‌గా పనిచేసిన మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా వచ్చాడు. అప్పటికి ఆయనకే రాజకీయ జీవితం లేదు. అప్పటికే కాదు, బహుశా ఆయన ప్రధానిగా ఉన్న కాలంలో ఎప్పుడూ లోక్‌సభకు కూడా ఎన్నిక కాలేదు. సుదీర్ఘమైన రాజకీయ పోరాటాలు జరిగిన ఒక దేశంలో ఏ రాజకీయ నేపథ్యం లేనివాడు ప్రధాని కావడమే మన కేవలం రాజకీయాలు అనుకుంటున్న వాటి మీద ఆర్థిక అంశాల ప్రభావం ఎంత ఉంటుందో చెప్పడానికి నిదర్శనం. పత్రికా రంగంలో తన రచనల ద్వారా ప్రతి సంవత్సరం కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌ల సమీక్ష ద్వారా ఎక్కువగా హనుమంతరావుగారు రాజకీయార్థిక అంశాల మీద రాసే పత్రికా రచయిత. కనుక మిగిలిన పత్రికా రచయిలతకన్నా ఈ దశలో ప్రవేశించిన సమాజాన్ని ప్రభావితం చేసి ఒక మార్గనిర్దేశం చేయగల శక్తి రాజకీయార్థిక విశ్లేషణలు చేసేవాళ్లకుంటుంది. అప్పటికి విరసం మొదలుకొని ఎన్నో ప్రజాసంఘాల ద్వారా ప్రత్యామ్నాయ రాజకీయాల గురించి కృషి చేస్తున్న విప్లవోద్యమం సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ప్రతిఘటించడానికై ఒక సంస్థ అవసరం అని భావించింది. అట్లా 1992 మే లో ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం (ఎఐపిఆర్ఎఫ్) ఏర్పడింది. ఆ సంస్థకు కార్యవర్గ సభ్యుడిగా నేను అందులో మొదటి మూడు సంవత్సరాలు పనిచేసిన కాలం హనుమంతరావు గారితో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఇంక 1995 నుంచి అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లోనూ, అఖిల భారత స్థాయిలోనూ హనుమంతరావు గారికి ఆ సాన్నిహిత్యం, అందులో క్రియాశీలంగా పనిచేసిన జిఎన్ సాయిబాబాతో కూడా కొనసాగింది. ఎఐఆర్‌పిఎఫ్‌తో ఏర్పడిన ఈ పరిచయం, అనుబంధం వేరు వేరు రూపాలలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ వ్యతిరేక కార్యకలాపాలలో మేం పనిచేస్తున్న అన్ని సందర్భాలలోను హనుమంతరావు గారితో కొనసాగింది. అది ఎఐపిఆర్ఎఫ్ కావచ్చు, ఫోరం అగెనెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్ (ఫేగ్) కావచ్చు, ప్రపంచ సోషలిస్ట్ ఫోరంను బహిష్కరించి ఏర్పాటు చేసిన ముంబై రెసిస్టెన్స్ 2004 (ఎంఆర్ 2004) కావచ్చు, అన్ని సందర్భాలలోనూ ఆయన తన సలహాలూ, రచనల ద్వారా చివరి దాకా తన సహకారాన్ని అందించాడు. ముఖ్యంగా ప్రతి సందర్భంలోనూ వాటి నిర్మాణాలకు సంబంధించిన చర్చలలో ఆయన విలువైన సలహా, సంప్రదింపులు ఉండేవి. ఎఐఆర్‌పిఎఫ్ ఆంధ్రప్రదేశ్ కమిటీ నిర్వహించిన 'ఉద్యమం' పత్రిక క్రమం తప్పకుండా రాలేదు గాని, ఆయన మాత్రం క్రమం తప్పకుండా అందులో రచనలు చేసేవాడు.

1991-92 నాటికే ఆయన ఈ నూతన ఆర్థిక విధానం పేరుతోటి అమలయ్యే అభివృద్ధి నమూనా ఎంత విధ్వంసకరమైనది కాబోతున్నదో, దాని విశ్వరూపాన్ని ఊహించుకున్నాడు కాబట్టే అన్నిటికంటే ఎక్కువగా భావజాల రంగంలో కూడా వ్యతిరేకించవలసిన ఒక చర్యగా ఆయన దానిని అర్థం చేసుకున్నాడు. అందుకు ప్రజాస్వామ్యవాదులు పూనుకోవాలనుకున్నాడు. బహుశా అందుకే ఇతరులు చేసే ఇటువంటి కృషికి తన చేతనైనంత సహాయ సహకారాలు అందించడం మాత్రమే కాకుండా, స్వయంగా ఒక పత్రిక ప్రారంభించాలని కూడా అనుకొని ఉంటాడు. సామ్రాజ్యవాదాన్ని తనవలెనే తీవ్రంగా వ్యతిరేకించే తన సహచరుడు ఎబికె ప్రసాద్ కావచ్చు, యువ జర్నలిస్టుల నుంచి వస్తున్న ఎన్. వేణుగోపాల్ కావచ్చు, ఇటువంటి వాళ్లతో కలిసి 'వీక్షణం' పత్రిక ప్రారంభించే ప్రయత్నం కూడా ఆయన అందుకే చేసి ఉంటాడు.

మొత్తం మీద ఇరవై ఐదేళ్లు, వీక్షణం పత్రిక ద్వారా పదిహేనేళ్లు ఆయన ఈ సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకంగా చేసిన రాజకీయార్థిక విశ్లేషణలు ఒక చోట చేర్చి చూస్తేగాని భావితరాలు ఆయన కృషిని అంచనా వేయలేరు. ఈ భావసారూప్యత మా అనుబంధానికి ఒక ప్రధాన కారణం.

దీని నుంచి వచ్చిందే ఈ సామ్రాజ్యవాద ప్రపంచీకరణను తన ప్రకటిత విధానంగా అమలు చేస్తున్న చంద్రబాబు నాయుడు పరిపాలనను వ్యతిరేకించడం. హనుమంతరావు గారికి అప్పటి పీపుల్స్‌వార్‌తో గాని, ఆ తరువాత మావోయిస్టు పార్టీతో గాని చాలా అభిప్రాయాలు భేదాలు ఉండవచ్చు. ఎంత కాదన్నా ఆయన దీర్ఘకాలిక రాజకీయ శిక్షణలో, ప్రయాణంలో అవిభక్త కమ్యూనిస్టు పార్టీ ప్రభావం ఉంటుంది. అవిభక్త ఆంధ్రప్రదేశ్ ప్రభావం ఉంటుంది. మా చర్చల్లోనూ, మా సంబంధాల్లోనూ అవి వ్యక్తం అవుతూనే ఉండేవి. అవిభక్త కమ్యూనిస్టు పార్టీ ప్రభావం వల్ల పెద్ద సమస్యలు రాకపోవచ్చు కాని, అవిభక్త ఆంధ్రప్రదేశ్ విషయంలో ఆయనకు తెలుగు జాతి పట్ల ఉన్న మమకారం ప్రత్యేక తెలంగాణ ఉద్యమం పట్ల వైఖరి తీసుకునే విషయంలో మా మధ్య సమస్యగా నిలుస్తూ ఉండేది. కాని, అది చంద్రబాబు కావచ్చు, ఆ తరువాత వచ్చిన ముఖ్యమంత్రులు కావచ్చు, ముఖ్యంగా వైఎస్ రాజశేఖర్ రెడ్డి దాకా ప్రపంచబ్యాంక్ అభివృద్ధి నమూనాను అమలు చేసే ప్రతి సందర్భంలోను మా భావజాలంలో ఉన్న ఐక్యత వల్ల అటువంటి చిన్న అభిప్రాయ భేదాలను మేం అధిగమించగలిగాం.

హనుమంతరావు గారు అధ్యయనానికి, సంభాషణకు, చర్చకు చాలా ప్రాధాన్యం ఇచ్చేవారు. ప్రభుత్వంతో చర్చలు జరపాలనే అవగాహన కూడా ఎస్.ఆర్. శంకరన్ గారికి ఎంత బలంగా ఉండేదో, హనుమంత రావు గారికి కూడా అంత బలంగా ఉండేది. ఏ విశ్వాసాలు కలవారైనా ఒక విధానాన్ని అమలు చేసే ప్రభుత్వంతో చర్చలు జరగాలని వీళ్లిద్దరూ భావించడానికి వాళ్లకున్న ప్రాతిపదిక వీళ్లందరి ప్రకటిత లక్ష్యం ప్రజలు గనుక. ఒకరికి రాజకీయాలు ఉన్నాయంటే వాళ్ల ప్రకటిత కార్యక్షేత్రం ప్రజలు గనుక. ప్రభుత్వంలో ఉన్నవాళ్లు ఎట్లాగైనా కావచ్చు, కాని ప్రజలచే ఎన్నుకోబడుతున్నవాళ్లు. ఇరువురూ ప్రజలకు జవాబుదారీ. పీడిత ప్రజల్లో పోరాట మార్గంలో క్రియాశీలంగా పనిచేస్తూ వర్గపోరాటం నిర్వహిస్తున్న

పీపుల్స్‌వార్ ప్రభుత్వంతో చర్చలు జరపాల్సిన బాధ్యత ప్రజల దృష్టితో ఆలోచించినప్పుడు ఎక్కువగా ఉందని భావించిన వాళ్లలో హనుమంత రావుగారు ఒకరు. అందుకు దోహదం చేసే ప్రక్రియను ఆయన చంద్రబాబు కాలంలోనే ప్రోత్సహించినప్పటికీ ఆయన పట్ల ఆయనకంత గురిఉండేది కాదు. కాని ఆ కృషిలో మాకాయన సహకరించాడు.

చంద్రబాబు నాయుడు తాను ప్రపంచబ్యాంక్ సిఇఒగా ప్రకటించు కున్నాడు కాబట్టి అది సఫలం అవుతుందనే ఆశలు ఆయనకు లేవు. కాని, అదే ఎజెండాగా ఎన్నికలు జరిగి, ఎన్నికల్లో ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనా, నక్సలైట్లతో చర్చలు అనేవి అన్ని రాజకీయ పార్టీల ప్రకటిత వాగ్దానం అయిన సందర్భంలో కమిటీ ఫర్ కన్సర్న్‌డ్ సిటిజన్స్‌తో పాటు పత్రికా రంగంలో ఉన్నవాళ్లు కూడా చాలా మంది క్రియాశీలంగా పనిచేశారు. అది ఎబికె కావచ్చు, కె. రామచంద్రమూర్తి కావచ్చు, హనుమంతరావు గారు కావచ్చు. ఆ కారణంగానే వైఎస్ఆర్ ముఖ్యమంత్రి అయిన తరువాత మావోయిస్టు పార్టీతో జరిగిన చర్చల సందర్భంగా ఏర్పడిన పీస్ ఇనిషియేటివ్ కమిటీకి కూడా ఆయన వెన్నుదన్నుగా ఉన్నాడు. అందులో చాలా క్రియాశీలమైన పాత్ర నిర్వహించాడు.

2000 సంవత్సరంలో దండకారణ్య విప్లవోద్యమం నుంచి పి. శంకర్ రచించిన 'అడవి మనది' అనే పుస్తకం వెలువడింది. పి. శంకర్ విప్లవోద్యమంలో క్షేత్రస్థాయిలో పనిచేస్తూ గెరిల్లా స్థాయి నుంచి నాయకత్వ స్థాయికి ఎదిగిన నాయకుడు. దండకారణ్యంలో 1980లో ప్రవేశించిన పీపుల్స్‌వార్ దళం నుంచి ఇంకా మధ్యప్రదేశ్ నుంచి విడిపోయి ఛత్తీస్‌ఘడ్ ఏర్పడక పూర్వం దండకారణ్య చరిత్రను వివరించే పుస్తకం అది. అందులో ఆదివాసుల వేల సంవత్సరాల చరిత్రను, వాళ్ల ఉత్పత్తి విధానాలను, గోండ్వానా రాజ్యాన్ని మొదలుకొని వాళ్లు చేసిన పోరాటాల దాకా వివరించే చరిత్ర అది. బ్రిటిష్ వ్యతిరేక గూండాదర్ పోరాటం (1910) మొదలు 1980లో పీపుల్స్‌వార్ పోరాటం నుంచి జరిగిన గుణాత్మక పోరాటాలన్నిటినీ ఆ పుస్తకం వివరిస్తుంది. రాజ్యాంగం ఐదు, ఆరు షెడ్యూల్ మొదలుకొని, ఆంధ్రప్రదేశ్‌లో 1/70 మొదలుకొని చట్టాలు ఆదివాసులకు హామీ పడిన ఏ ఒక్క న్యాయం కూడా అమలు జరగనప్పుడు పైగా ఆదివాసులు దోపిడీ, పీడనలకు గురవుతూ విస్థాపితులూ, నిర్వాసితులూ అవుతున్నప్పుడు అక్కడ విప్లవోద్యమం వాళ్ల మధ్యన ఎటువంటి విప్లవాచరణ చేపట్టిందో వివరించే పుస్తకం అది. ఆ తరువాత కాలంలో ఛత్తీస్‌ఘడ్ ఏర్పడడానికి దారితీసిన దండకారణ్య రూపకల్పన, విశాల బస్తర్ డిమాండ్ మొదలుకొని జల్, జంగల్, జమీన్‌లపై ఆదివాసుల అధికారం దాకా పీపుల్స్‌వార్ తన లక్ష్యాలుగా ప్రకటించుకొని విప్లవ భూసంస్కరణలు చేసింది. హనుమంతరావు గారు ఈ పుస్తకాన్ని ఒక ప్రముఖ దినపత్రికలో చాలా నిష్పాక్షికమైన, అనుకూల దృష్టితో సమీక్షిస్తూ ఆదివాసుల కోసం రాజ్యాంగం మొదలుకొని శాసనాల వరకు చేస్తున్న పాలకులు అవి ఆచరించవలసిన సందర్భంలో ఒకసారి ఈ పుస్తకం చదివితే బాగుండును అని ఆయన ముగించారు. ఆశయ ప్రకటనలు, వాగ్దానాలు ఎవరివైనా బాగానే ఉండవచ్చు. కాని ఆశయాలను అమలు చేయడంలో ప్రజల పాత్రను గుర్తించి, ప్రజల ప్రమేయం పెంచి ప్రజల శ్రమను, సహకారాన్ని, సమష్టి భావనను, తద్వారా వాళ్ల చైతన్యాన్ని వినియోగించి మానుషత్వాన్ని ఉన్నతీకరించాలనే అవగాహనతో ఆయన ఈ సమీక్షను ముగించారు.

హనుమంతరావు గారు పత్రికా రంగంలో, రాజకీయ విశ్వాసాలలో తరిమెల నాగిరెడ్డి (టిఎన్) గారితో ఉన్న సాన్నిహిత్యంతో ప్రభావితం అయ్యారని విన్నాను. బహుశా రాజకీయార్థిక విశ్లేషణ విషయంలో గాని, సామ్రాజ్యవాదాన్ని అవగాహన చేసుకునే విషయంలో గాని టిఎన్ రాసిన 'తాకట్టులో భారతదేశం' దృష్టి ఆయనను నడిపించి ఉండాలి. ఇప్పుడు కేవలం ఈ దేశం తాకట్టులో మాత్రమే లేదు, దళారీ పాలకులు 1991 నుంచే ప్రారంభించి దశల వారీగా 1995, 2004, 2014లలో వేగవంతంగా అమ్మకానికి పెడుతున్నారు. దేశాన్ని, దేశంలోని ప్రకృతి సంపదను, శ్రమ సంపదను బహుళజాతి కంపెనీలకు, బడా కంపెనీలకు దళారీ పాలకులు అమ్ముతున్న క్రమంలో ప్రజలు స్వాతంత్ర్యాన్ని కోల్పోతున్నారు. రాజ్యాంగ మౌలిక ప్రకటిత లక్ష్యమైన ప్రజల సార్వభౌమత్వం భంగం కావడం అనేది ప్రజలు మరోసారి పరాధీనులు కావడమే. పరాధీన భారతం నుంచి ఇవాళ దేశ ప్రజల స్వాతంత్ర్యాన్నీ, సార్వభౌమత్వాన్నీ తిరిగి పొందడానికి ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయాలు తప్ప మరొక దారి లేదు. ఇటువంటి సందర్భంలో చిత్తశుద్ధితో ఇటువంటి విషయాలను ఆలోచించి, చర్చించి తన సుదీర్ఘ జీవిత అనుభవాన్ని, ఆచరణను హనుమంతరావు గారు అందించి ఉండేవారు కదా అనిపిస్తుంది. ఆయన చివరిక్షణం వరకూ మాట్లాడుతూ ఉన్నాడు. వీక్షణం రచయితల సమావేశాలకు కూడా వస్తుండేవాడు. మాటలతో, ఆచరణతో మన మధ్య మసులుకునే మనిషి వెళ్లిపోవడం అనేది ఆ కుటుంబానికే కాదు, ఆ సమాజానికి కూడా వెలితిగానే ఉంటుంది.

హనుమంతరావుగారు పరిచయం కావడం అంటే సరళ గారు కూడా పరిచయం కావడమే. ఇద్దరూ కమ్యూనిస్టు పార్టీ నేపథ్యం నుంచి వచ్చి, కమ్యూనిస్టు విలువలతో బతికినవాళ్లు. హైదరాబాద్ నగరంలో ఎల్లారెడ్డిగూడగా అప్పుడు పిలుచుకునే కమ్యూనిస్టు కుటుంబాల కాలనీలో వాళ్ల క్వార్టర్స్‌లో ఒకటి కన్నా ఎక్కువ సార్లే వాళ్లని కలుసుకొని ఉంటాను. ఇప్పుడు ఎదిగివచ్చిన వాళ్ల కొడుకులు ఆ క్వార్టర్‌ను ఒక అపార్ట్‌మెంట్‌గా మార్చారు. ఆ ఉమ్మడి కుటుంబం అందులో ఉంటున్నది. హనుమంతరావు గారి కొడుకు సతీష్ గారితో కూడా జర్నలిస్ట్ అయినందు వల్ల నాకు సన్నిహితమైన పరిచయమే ఉంది. హనుమంతరావు గారి పార్థివ శరీరంపై నిండుగా కప్పబడిన సుత్తి కొడవలి ఎర్రజెండా చూసి ఎంతో తృప్తిగా సతీష్ ముఖంలోకి చూశాను. ఆయన 'మేం ఈ అపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించినప్పుడు కనీసం ఆయన ఒక తోరణం కూడా కట్టనివ్వలేదు. ఎంత కష్టంగా, ఎంత అయిష్టంగా ఇంత పెద్ద కుటుంబానికి క్వార్టర్‌ను అపార్ట్‌మెంట్‌గా మార్చడానికి ఆయన అనుమతించాడో ఊహించండి' అన్నాడు. అటువంటి విలువలు గల మనుషులు అరుదయిపోతున్నారు. వీ

వీక్షణం నిర్వహణలో డిసెంబర్ 29, 2016, గురువారం సాయంత్రం 6 గంటలకు దొడ్డి కొమురయ్య హాల్ (సుందరయ్య విజ్ఞాన కేంద్రం), హైదరాబాద్‌లో హనుమంతరావు సంస్మరణ సభ జరిగింది. ఈ సభలో మల్లు స్వరాజ్యం, కందిమళ్ల ప్రతాప్‌రెడ్డి, ఎబికె ప్రసాద్, బి.ఎస్. రాజు, ఎస్. వీరయ్య, నాగయ్య, డి.వి. కృష్ణారెడ్డి, కె. గోవర్ధన్, కె. సజయ, అరుణోదయ రామారావు, రాంకి, వి. సతీష్ మాట్లాడారు (ఫొటోలు వెనుక కవర్‌లో). హనుమంతరావు గారి సంస్మరణలో నాగార్జుననగర్ సంక్షేమ సమితి, హైదరాబాద్ ప్రెస్ క్లబ్, నవతెలంగాణ దినపత్రికలు కూడా విడిగా సభలు నిర్వహించాయి.

## వీక్షణంలో హనుమంతరావు గారి రచనలు

### 2003

చిన్న పరిశ్రమలు బతికి బట్ట కట్టాలంటే... – నమూనా సంచిక
2002 – ఓ విహంగ వీక్షణం – జనవరి 1-15, 2003
అంతంలేని అనావృష్టిలో అనంతరైతాంగం – జనవరి 16-31
ముసాయి బడ్జెట్: పెరుగుతున్న అప్పు, తరుగుతున్న అభివృద్ధి – ఫిబ్రవరి 1-15
ఫైనాన్స్ కాపిటల్ అంటే... – ఫిబ్రవరి 16-28
నేలచూపులు చూస్తున్న దేశ ఆర్థిక పరిస్థితి – మార్చ్ 1-15
ఫలించని రాష్ట్ర బడ్జెట్ విన్యాసాలు –మార్చ్ 1-15
సభ సంప్రదాయాలకు చెల్లుచీటి – మార్చ్ 1-15
దా'రుణాంధ్ర'ప్రదేశ్ – మార్చ్ 1-15
వాజ్‌పాయ్ అయిదేళ్ల పాలన కానుక– మరింత నిరుద్యోగం – ఏప్రిల్ 1-15
సహకార అర్బన్ బ్యాంకుల దివాళా – కారణాలు – ఏప్రిల్ 16-30
అదుపూ, హద్దూ లేని రాష్ట్ర ఆదాయ వ్యయాలు – ఏప్రిల్ 16-30
ఈ సబ్సిడీలను ఎందుకు రద్దు చేయరు? – మే 1-15
అభివృద్ధి ముసుగులో జరుగుతున్నది ఏమిటి? – మే 15-31
మహానాడా? తిరునాళ్లా? – జూన్ 1-30
బంజరు భూముల కార్పొరేట్ రంగం సమర్పయామి – జూలై 1-30
ఆంధ్రప్రదేశ్– అప్పుల కుప్ప– 1 – ఆగస్ట్ 1-15
ఆంధ్రప్రదేశ్– అప్పుల కుప్ప– 2 – ఆగస్ట్ 15-30
కాన్‌కున్‌లో పేదదేశాల ఐక్యత కొనసాగాలి – సెప్టెంబర్ 15-30
పతనమవుతున్న పార్లమెంటు ప్రజాస్వామ్యం – అక్టోబర్ 1-15
సెంటు భూమి కూడా లేని 38 శాతం దళిత కుటుంబాలు – అక్టోబర్ 16-31
భద్రత చేకూర్చని ఆహార వ్యవస్థ – నవంబర్ 1-15
దేశం పాలనలో వైఫల్యాలే విజయాలు – నవంబర్ 16-30
మౌలిక సౌకర్యాలను కూడా సమకూర్చలేని వాజమ్మ ప్రభుత్వం – నవంబర్ 16-30
పరిశ్రమల కోసం పరిశ్రమించని ప్రభుత్వం – డిసెంబర్ 1-31

### 2004

వాజ్‌పేయ్‌జీ, అద్దంలో మీ ముఖం చూచుకోండి – జనవరి 16-31
ప్రజల డబ్బుతో ఫలహారాల పందేరాలు – ఫిబ్రవరి 1-15
తెలుగుదేశం ఎన్నికల ప్రణాళిక– అబద్ధాల చిట్టా – మార్చ్ 1-15
విదేశీ పెట్టుబడులు లేకుండానే రాష్ట్రాభివృద్ధి సాధ్యం – మార్చ్ 1-15
పాదయాత్ర సృష్టించిన ప్రకంపనలు! – మార్చ్ 1-15
వ్యవసాయ రంగానికి తగ్గిన పెట్టుబడులు – మార్చ్ 16-31
సామ్రాజ్యవాద దోపిడీకి మరోపేరే 'ప్రపంచీకరణ'– 1 – ఏప్రిల్ 1-15
సామ్రాజ్యవాద దోపిడీకి మరోపేరే 'ప్రపంచీకరణ'– 2 – ఏప్రిల్ 16-30
సామ్రాజ్యవాద దోపిడీకి మరోపేరే 'ప్రపంచీకరణ'– 3 – మే 1-15
తన ఓటమికి తానే పునాదులు తవ్వుకొన్న చంద్రబాబు – మే 16–జూన్ 15
సంక్షేమ పథకాలకు మరిన్ని నిధులు అవసరం – జూన్ 16-30
మంత్రివర్గ సభ్యులకే అధికారాలు పంచనివారు పంచాయితీలకు కొత్త ఊపిరి పోస్తారా? – జూలై 1-15
వ్యవసాయాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేసిన కేంద్ర బడ్జెట్ – జూలై 16-31
ప్రజల అనారోగ్యం డాక్టర్ల మహాభాగ్యం – సెప్టెంబర్ 1-15
ఆయుధ ధారణ, వినియోగం – అక్టోబర్ 16-31

### 2005

మళ్లా ప్రపంచబ్యాంకు ఊబిలోకి... – జనవరి
కొత్తదనంలేని రాష్ట్ర బడ్జెట్ – ఫిబ్రవరి
కొత్తదనంలేని బడ్జెట్ – మార్చ్
నల్లపిల్లిని ఉతికి ఆరేసినా తెల్లపిల్ల కాబోదు – ప్రభుత్వమూ అంతే – ఏప్రిల్
నేలవైపు చూస్తున్న సంక్షేమ పథకాల కేటాయింపులు – మే-జూన్
అందరూ ఆర్థిక శాస్త్ర నిపుణులే, కాని... – జూలై
ఏ వెలుగులకీ ప్రస్థానం? – ఆగస్ట్
గ్రామీణ రుణభారం – సెప్టెంబర్
ఐదు దశాబ్దాల విహంగ వీక్షణం – నవంబర్
పారిశ్రామిక రంగంలో వెలుగు, నీడ, వెలుగు (ఎన్. సుబ్బారావుతో కలిసి) – నవంబర్

### 2006

మధ్యతరగతి: సమాజశ్రేయస్సు స్థానే వ్యక్తిగత శ్రేయస్సు – జనవరి
కొత్త సీసాలో పాత సారా – ఫిబ్రవరి
ఆర్థిక సంస్కరణల ప్రభావం – మార్చ్
కేంద్ర, రాష్ట్రాల బడ్జెట్ 2006-07 – ఏప్రిల్
ఎజెండా మీదకు వచ్చిన తాగునీటి ప్రైవేటీకరణ – మే
ఇది మన గ్రామీణ భారత ముఖచిత్రం – జూన్
ఎస్సీలకు కోట్లాది నిధులు ఎగనామం – జూలై
స్వామినాథన్ కమీషన్ నివేదిక ఉగాది పచ్చడి – ఆగస్ట్
యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ – విజయాలు వైఫల్యాలు (వ్యాఖ్య) – నవంబర్
పంట భూములకు సెగపెడుతున్న సెజ్‌లు – డిసెంబర్

### 2007

మన విద్యారంగం ఓ చిల్లు కుండ – ఫిబ్రవరి
కేంద్ర బడ్జెట్ వ్యవసాయరంగాన్ని గట్టెక్కిస్తుందా? – మార్చ్
ఉట్టి కెగుర లేనమ్మ స్వర్గానికి నిచ్చెనలు వేసిందట! – మార్చ్
పత్రికారంగం – పతనమవుతున్న విలువలు – ఏప్రిల్
రాష్ట్రాలకు కేంద్రం కుచ్చుటోపీ – మే
ఆర్థిక పరిస్థితి చూపు ఆకాశం వైపు, వ్యవసాయం నేల చూపు – జూన్
ఆహార భద్రతంటే – జూలై
పరాధీనత... స్వాతంత్ర్యం.... పరాధీనత – ఆగస్ట్
అనుత్పాదక రంగాలకు బ్యాంకు రుణాలు – అక్టోబర్
ఆంధ్రప్రదేశ్ ఆర్థిక స్థితిగతులు – నవంబర్
సబ్సిడీనివ్వటం పాలకుల రాజకీయావసరం – డిసెంబర్

### 2008

వేల కోట్ల రూపాయల గ్రామీణాభివృద్ధి! – జనవరి
కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లలో విద్య, వైద్యం – ఏప్రిల్
ఇదేమి పరిపాలన రాజశేఖరా? – మే
ధరలెందుకు పెరుగుతున్నాయి? – జూన్
మారుతున్న ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు – ఆగస్ట్
పరాధీన భారతం – నిన్న, నేడు – 1 – సెప్టెంబర్
పరాధీన భారతం – నిన్న, నేడు – 2 – అక్టోబర్
బ్యాంకులు సరే, ప్రజల బతుకులో? – నవంబర్
ఉన్నత మధ్యతరగతి ఆవిర్భావం – డిసెంబర్

### 2009

కేంద్ర – రాష్ట్ర సంబంధాలు – జనవరి
ఆదాయ వ్యయాలు సరిగా చూపలేని ప్రభుత్వాలు – ఫిబ్రవరి

కేంద్ర బడ్జెట్ ఎవరి ప్రయోజనాల కొరకు? - మార్చ్
తిరోగమనంలో పురోగమనం - ఏప్రిల్
చీడపట్టిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం - మే
వ్యవసాయ సంరక్షణ - ఆహార భద్రత - జూలై
కేంద్ర బడ్జెట్ ఎవరి కోసం? - ఆగస్ట్
కరువుకు కరువు రావాలి - సెప్టెంబర్
రాష్ట్రాల నిలువు దోపిడీ - అక్టోబర్
చీకటి నుంచి మరింత చీకట్లోకి - నవంబర్
ఉపాధి హామీ పథకం ఎవరికి? - డిసెంబర్

**2010**

విధానం వికేంద్రీకరణ, ఆచరణ కేంద్రీకరణ - ఫిబ్రవరి
ధరల మంటల్లో చలికాచుకుంటున్న ప్రధాని - మార్చ్
ఇది అసామాన్యుల బడ్జెట్ - ఏప్రిల్
పేదరికం క్షేమం - పేదలూ క్షేమం - ఏప్రిల్
జవాన్లను బలిగొన్నది చిదంబరమే - మే
లాభాలు వ్యాపారులకు - కష్టాలు ప్రజలకు - ఆగస్ట్
ప్రధాని హామీలు నీటి బుడగలు - సెప్టెంబర్
ఎం.పి.కి ఎందుకంత జీతం? - అక్టోబర్
ప్రభుత్వానికే రోగం వచ్చింది - నవంబర్
చదవాల్సిన పుస్తకాలు - డిసెంబర్

**2011**

శ్రీకృష్ణ కమిటీ నివేదిక - ఫిబ్రవరి
ఈ బడ్జెట్ ఎవరి అభివృద్ధికి? - ఏప్రిల్
ప్రణాళికా వ్యవస్థకు ప్రణాళిక ఉందా? - జులై
ఇది స్వరాజ్యమేనా? - ఆగస్ట్
ప్రజా ఉద్యమాల ప్రపంచీకరణ జరగాలి - సెప్టెంబర్
దేశ ఆర్థిక పరిస్థితిపై కారుమబ్బులు - అక్టోబర్
సమస్యల వలయంలో మన్మోహన్ ప్రభుత్వం - డిసెంబర్

**2012**

పెద్దదవుతున్న మీ జేబు చిల్లు! - జనవరి
విద్యుచ్ఛక్తి - వెలుతురు నుంచి చీకట్లోకి - ఫిబ్రవరి
బడ్జెట్ గలగల, సంక్షేమం విలవిల - మార్చ్
మన దేశ విదేశీ రుణం - మే
విద్యుచ్ఛక్తి భారం పెరగడానికి కారణం? - జూన్
బ్యాంకుల మొండి బాకీలు లక్ష కోట్లు! - సెప్టెంబర్
ఇండియాను అమ్మేసిన మన్మోహన్ సింగ్ - అక్టోబర్
భూమి పందారం - నవంబర్
కాంగ్రెస్‌వాదులారా మూటా ముల్లే సర్దుకోండి - డిసెంబర్

**2013**

ప్రజాస్వామ్యం మెరిసిపోతుందా? సమసిపోతుందా? - జనవరి
చీకటి నుంచి మరింత చీకట్లోకి - ఫిబ్రవరి
స్వాతంత్ర్య పూర్వస్థితికి దిగజారుతున్న దేశ పరిస్థితి - మార్చ్
ఆమ్ ఆద్మీకి చిదంబరం శఠగోపం - ఏప్రిల్
ధరల రైలు పరుగులు - జూన్
తుంటి నొప్పికి పంటి మందు వేస్తే ఎలా? - జూలై
ప్రైవేటీకరణకే ఈ స్వాతంత్ర్యం - ఆగస్ట్
చిదంబరం మాయాజాలం - ఆగస్ట్
పేదరికం హుష్‌కాకి - సెప్టెంబర్
మన్మోహన్‌సింగ్ కోరుతున్న ఏకాభిప్రాయం - అక్టోబర్
ప్రజా పోరాటాలు పాలకులకు ఒక హెచ్చరిక - నవంబర్
పరుగులు తీస్తున్న ధరలు - నవంబర్
స్వాముల భారతం - డిసెంబర్

**2014**

ఆమ్ ఆద్మీ పార్టీ ఆచితూచి ముందడుగెయ్యాలి - ఫిబ్రవరి
ఓట్ ఆన్ అకౌంట్ రాష్ట్ర బడ్జెట్ - మార్చ్
ఓట్ ఆన్ అకౌంట్ కేంద్ర బడ్జెట్ - మార్చ్
అధోలోకంలోకి బ్యాంకుల వ్యవసాయ రుణాలు - ఏప్రిల్
దేశం మనది, రక్షణ అమెరికాది - మే
పులిని చూసి... - మే
మోడీజీ, గ్రామాల నుంచి పాలించండి! - జూన్
తెలుసుకోదగిన విషయాలు - జూన్
సుపరిపాలనా? 'స్వ' పరిపాలనా? - జులై
తెలుసుకోదగిన విషయాలు - జులై
యుపిఎ మూడవ ప్రభుత్వమే మోడీ ప్రభుత్వం - ఆగస్ట్
కొత్త బడ్జెట్ - పాత ధోరణులు - సెప్టెంబర్
డాక్టర్ సత్యపాల్ తులి - అక్టోబర్
ఆర్థిక సామ్రాజ్యానికి మోడీ ఆహ్వానం - నవంబర్
కుంభకోణాల చిట్టా - డిసెంబర్

**2015**

మళ్లీ ప్రపంచ బ్యాంకు ఊబిలోకి - జనవరి
బడ్జెట్ అంటే ఏమిటి? - ఫిబ్రవరి
ఇది డెమోక్రసీ కాదు, మోడియోక్రసీ - మార్చ్
ఆర్థిక పరిస్థితి అధోగతి వైపు పురోగతి - ఏప్రిల్
14వ ఆర్థిక సంఘం సిఫారసుకు కేంద్రం వెన్నుపోటు - మే
మోడీది సుపరిపాలన కాదు, స్వపరిపాలన - జూన్
రైతులకు రిజర్వు బ్యాంకు శఠగోపం - జులై
పెట్టుబడి, అవినీతి తోబుట్టువులే - ఆగస్ట్
అభివృద్ధి, పెరుగుదల - వేర్వేరు పరిణామాలు - సెప్టెంబర్
వీక్షణం ఎపి రచయితల సమావేశానికి లేఖ - అక్టోబర్
బ్రిటిష్ - మోడీ పాలనలకు మధ్య తేడా ఉందా? - నవంబర్
రాష్ట్రాల నిధులను పిండుకొంటున్న కేంద్రం - డిసెంబర్

**2016**

వ్యవసాయం - తీరుతెన్నులు - జనవరి
ఆర్థిక పరిస్థితి అంతా బాగానే ఉందట! - మార్చ్
ఇది ఎన్నికల బడ్జెట్ - ఏప్రిల్
అంతరాలు పెరిగితే అంతే సంగతులు - జులై
పేదరికం తగ్గనిదే అభివృద్ధి అసాధ్యం - సెప్టెంబర్
తెలుగు రాష్ట్రాల్లో పారిశ్రామికీకరణ - అక్టోబర్
నల్లధనం నల్లపూసంతైనా రాలేదు! - నవంబర్
నల్ల ధనంతో ప్రధాని అయిన మోడీ - డిసెంబర్

**2017**

నెహ్రూ నుంచి మోడీ వరకు అవినీతి - జనవరి

# భూసేకరణ చట్టానికి సవరణలు

***ప్రభుత్వం అభివృద్ధి పేరుతో తెస్తున్న ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులైన వారికి, లబ్ధిచేకూరే ప్రాంతాల్లో పునరావాసం కల్పించకుండానిర్వాసితులను తప్పుతోవ పట్టించే ప్రయత్నం చేస్తుందని అంటున్నారు బి. రామకృష్ణ***

చరిత్రలోకి వెళితే 1824 నుండి భూసేకరణకు సంబంధించి రకరకాల చట్టాలు వెలుగుచూసాయి. చివరకు 1894 చట్టం ద్వారా ఒక స్పష్టమైన రూపం ఏర్పడింది. అవన్నీకూడా ప్రభుత్వాలకు విశేష అధికారాలు కల్పించాయి. భూసేకరణ చట్టం 2013 కు ముందు 1894 చట్టంను అనుసరించి దేశంలో డ్యాంలు, మైనింగ్, రైల్వేలు తదితరాలు అనేక ప్రాజెక్టుల కోసం ప్రజల భూములను లాక్కోవడం జరిగింది. దేశవ్యాప్తంగా ఈ బలవంతపు భూసేకరణలకు వ్యతిరేకంగా నిర్వాసిత ప్రజలు ఎన్నో ఉద్యమాలు చేసారు. వాటి సమీకృత ఫలితం కొంతమేరకు జఖం ప్రభుత్వం చేసిన భూసేకరణ పునరావాసం, పునఃస్థిరీకరణలలో న్యాయబద్ధమైన నష్టపరిహారం, పారదర్శకతల హక్కు చట్టంలో ప్రతిబింబిస్తుంది. ఇది 2013 సెప్టెంబర్ 26న రాష్ట్రపతి ఆమోదం పొందింది. ఇక నుండి దీనిని భూసేకరణ చట్టం 2013 అని అందాం. ఈ చట్టం కంటే ముందు స్పష్టమైన పునరావాసం, పునఃస్థిరీకరణల విధానమేది లేదు. చేపట్టబోయే ప్రాజెక్టుల వల్ల కలిగే పరిణామాలను అంచనా వేసే విధానం, అలాగే ప్రజల భాగస్వామ్యాలకు, అభిప్రాయాలకు, ప్రజాసమ్మతికి చోటులేకుండా పోయింది.

2013 భూసేకరణ చట్టం వచ్చిన సంవత్సరంలోపే మోదీ ప్రభుత్వం ఏర్పడింది. మోదీ ప్రధానమంత్రి అయి సంవత్సరం అయిందో లేదో డిసెంబర్ 2014, ఏప్రిల్ 2015, మే 2015లలో మొత్తం మూడుసార్లు ఆ చట్టానికి సవరణలు చేస్తూ ఆర్డినెన్సులు తెచ్చారు. ఆ ఆర్డినెన్స్‌లు పార్లమెంటులో తీవ్ర వ్యతిరేకతను చవిచూశాయి. చివరకు చట్టంగా చేసే ప్రయత్నంలో లోక్‌సభలో బిల్లు ప్రవేశపెట్టి భూసేకరణచట్టం 2013కు సవరణలను నెగ్గించుకున్నారు. రాజ్యసభలో తగినంత మద్దతు లేకపోవడంతో అది చట్టంగా మారలేదు. కార్పొరేట్ శక్తులకు అనుకూలంగా, నిర్వాసితులకు వ్యతిరేకంగా చట్టంలో సవరణలు చేసే ప్రయత్నం జరిగింది. ప్రధానంగా ప్రజల సమ్మతి, సామాజిక ప్రభావ అంచనా, పునరావాస, పునఃస్థిరీకరణల నుండి మినహాయింపులు, పంటలు పండే భూములను సహితం సేకరించడం వంటివి ప్రధానమైన సవరణలు. వీటి ద్వారా 2013 భూసేకరణచట్టం బలహీనమయి పోతుంది. దానిలో ఉండే ప్రధానమైన స్పిరిట్ శూన్యమైపోతుంది. మళ్లీ ఈ చట్టం బ్రిటీష్ వారు 1894లో తెచ్చిన దుర్మార్గమైన చట్టానికి దగ్గరగా మారిపోతుందన్నమాట. భూసేకరణ చట్టం 2013కు సరిగ్గా ఇలాంటి సవరణలే తెలంగాణ ప్రభుత్వం చేసింది.

తెలంగాణ అసెంబ్లీలో 2016 డిసెంబర్ 28న ముఖ్యమంత్రి సుదీర్ఘంగా భూసేకరణ బిల్లుపై ప్రసంగించాడు. భూసేకరణ చట్టం 2013కు వ్యతిరేకంగా ప్రభుత్వం తెచ్చిన 123 భూసేకరణ ఉత్తర్వులను హైకోర్టులో సవాల్ చేసిన ప్రజలను, వారి తరపున వాదించిన మహిళా న్యాయవాదిని చులకన చేసి మాట్లాడాడు. అసహనాన్ని, ఆగ్రహాన్ని మరో రూపంలో చెప్పాలంటే లేకితనాన్ని బయటపెట్టాడు. దేశంలో ఎక్కడైనా ప్రజావ్యతిరేక సంఘటనలపై స్పందించే హక్కు పౌరులెవరికైనా ఉంటుంది. మల్లన్నసాగర్ కోసం భూములు కోల్పోతున్న వారికి పార్టీలు, ప్రజాసంఘాలు, వ్యక్తులు మద్దతు తెలపడం ముఖ్యమంత్రికి అజీర్తిని కలిగించింది. ఆ అజీర్తి వాంతులు వాగ్ధాటిగా అసెంబ్లీలో బయటకు వచ్చాయి.

ఎక్కడైనా సరే భూసేకరణ జరగకుండా ప్రాజెక్టులు కట్టారా? అని ఆక్రోశిస్తాడు, ఆగ్రహిస్తాడు. నాగార్జునసాగర్ విషయంలో గాని, శ్రీశైలం విషయంలో గాని, చివరకు చైనా దేశంలోగానీ అలా జరిగిందా అని ఉదహరణలిస్తాడు. మరోవైపు భూసేకరణ చట్టం 2013ను తాడు, బొంగురం లేని వాళ్లు తయారుచేశారని, అదో దిక్కుమాలిన చట్టమని నిందాపూర్వకంగా వాగ్ధాటిని ప్రదర్శిస్తాడు. ఉ.వా. 123 అనేది భూసేకరణ చట్టం 2013 కంటే గొప్పదని, ప్రయోజనకరమైనదని తనకుతానుగా జబ్బలు చరుచుకుంటాడు. ప్రజలకు మేలు చేయడానికి భూముల విలువకు పది రెట్లు, ఇంకా కొంచం ఎక్కువగానే పరిహారం ఇచ్చామని, ఇంత పెద్ద మొత్తంలో చెల్లించిన దాఖలాలు లేవని చెప్పుకొచ్చాడు. 2013 చట్టం ప్రకారం నష్టపరిహారం 3 రెట్లేనని ఆ చట్టాన్ని పాటిస్తే ప్రజలు నష్టపోతారని బాధపడిపోయాడు. కోర్టు కేసుల బెడద నుండి తప్పించుకోవడానికి సవరణ చట్టం చేయవలసి వస్తున్నదని చెప్పాడు. ఈ విషయమై మోడీని సంప్రదించామని అందుకు ఆయన సవరణ చట్టాలు చేసుకొమ్మని, వాటికి సహకరిస్తామని చెప్పాడని, ఇలాంటి చట్టాలను గుజరాత్ తదితర రాష్ట్రాలు చేశాయని సమర్ధించుకున్నాడు. ప్రాజెక్టులు కట్టినప్పుడు కొంత నష్టం జరగకుండా ఉంటుందా అని నిజాయితీ ప్రకటించబోతాడు. నష్టపరిహారాన్ని ఒకే మొత్తంలో ఒకే సారి చెల్లిస్తే భూ నిర్వాసితులు తమకు నచ్చిన చోట భూములు కొనుక్కోవచ్చు లేదా ఇళ్లు కట్టుకోవచ్చని ఇదెంతో సౌలభ్యకరమని వివరిస్తాడు. భూములు కోల్పోయిన భాద తనకు బాగా తెలుసని, తన తండ్రి పడిన బాధను గుర్తు చేసుకుంటాడు. ఇవి మాత్రమే వింటే ఎంత గొప్ప విషయాలు చెప్పాడోనని అనిపిస్తుంది. అలాగే ప్రజల పక్షం వహించి తెలంగాణను సస్యశ్యామలం చేసే ప్రాజెక్టుల కోసం తపించిపోతున్న గొప్పవాడిగా కనిపిస్తాడు. తాము తెచ్చిన ఉ.వా. 123, నేడు తేబోతున్న సవరణ చట్టం అనివార్యమని, మరో మార్గం లేదని దీనికి భిన్నంగా మాట్లాడే వారిని హేలన చేస్తాడు. ప్రజలకు నష్టం చేసే వారుగా చిత్రిస్తాడు. అయితే ఇవన్నీ ఎంత దగాకోరు మాటలో తెలుసుకోవడం కష్టమైనదేమీ కాదు. 2013 చట్టం రావడం వెనుక ఉన్న దేశవ్యాప్త ప్రజాపోరాటాలను కొంచమైనా ముఖ్యమంత్రి చదివినట్టు లేదు. ఒకవేళ

చదివినా అర్థమైనట్లుగా లేదు. ఆ చట్టం పూర్తిగా ప్రజల పక్షమని చెప్పలేంకాని, చాలావరకు మెరుగైనదనడంలో సందేహం లేదు.

2013 చట్టంలో సొంత భూములు, ఇళ్లు ఉన్నవారితో పాటు ఆ ప్రాంతంపై ఆధారపడి జీవనం సాగిస్తున్న భూములు, ఆస్తులు లేని వారి గురించి కూడా మాట్లాడింది. అత్యవసర, అసాధారణ పరిస్థితుల్లో తప్ప వ్యవసాయ భూములను సేకరించవద్దని చెప్పింది. ఒకవేళ తప్పనిసరైతే నీటి ప్రాజెక్టులకు సంబంధించి ప్రాజెక్టు కమాండ్ ఏరియాలో భూ నిర్వాసితులకు భూములు ఇవ్వాలని చెప్పింది. పాఠశాల, ఆరోగ్యకేంద్రం, కరెంటు, రోడ్లు, రేషన్ షాపు, పోస్టాఫీసు తదితర అన్ని రకాల వసతులతో పూర్తిస్థాయిలో పునరావాస గ్రామాన్ని నిర్మించాలని తెలిపింది. ఆ తరువాతనే ప్రాజెక్టు ప్రభావిత కుటుంబాలను తరలించాల్సి ఉంటుంది. 2013 చట్టంలో పొందుపరిచిన వాటికంటే ఇంకా మెరుగైన సౌకర్యాలు ఇవ్వదలిస్తే ఆ చట్టం అభ్యంతరం చెప్పబోదు. అంటే ఎంత భూమి కోల్పోతే అంత భూమిని ప్రాజెక్టు వల్ల లబ్ధిపొందే ప్రాంతంలో ఇవ్వొచ్చు. ఉపాధి కోల్పోబోతున్న ప్రభావిత కుటుంబాలకు శాశ్వత ప్రాతిపదికన కెసిఆర్ అంటున్న నీళ్లు, నిధులు, నియామకాలు చేపడితే ఆ చట్టం అభ్యంతరం చెప్పలేదు. ఒక ప్రాజెక్టును ప్రతిపాదిస్తున్నప్పుడు దానివల్ల కలిగే నష్టాలు, ప్రయోజనాలను పూర్తిగా తెలుసుకోవడం కోసం సామాజిక ప్రభావ అంచనాలను చేపట్టాలని 2013 చట్టం సూచించింది. దీంతో పాటుగా ఎక్స్‌పర్ట్ కమిటీ అభిప్రాయాన్ని కూడా తీసుకోవాలని 2013 చట్టం చెబుతున్నది. ఇవి చేపట్టకుండా ముందుకెళ్లే తొందరెందుకు? ఇవి చేపడితే ఆలస్యమవుతుందని మభ్యపెట్టే ప్రయత్నం చేస్తున్నారు. అలా చేయకుంటే ఎన్నో ప్రమాదాలు, తీరని నష్టాలు జరిగి పోతాయని చిత్రీకరణ చేస్తున్నారు. పెద్దఎత్తున నిర్వాసితులయ్యే సందర్భాలలో ఇవన్నీ ఆలోచించకుండా ముందుకెళ్లడం ద్వారా ఏ ప్రజలకు మేలు జరుగుతుంది.

జిఒ 123లో ఎక్కడ కూడా ఈ విషయాలు లేవు. కేవలం ప్రజలు ప్రభుత్వానికి తమ భూములు అమ్ముకుంటున్నట్లుగా ఒప్పందం అది. ఆ ప్రాంతంలో ఉన్న భూములు, ఇండ్లు లేని కుటుంబాల గురించి ప్రస్థావనే లేదు. అందులో ఏ ప్రాజెక్టు కోసం తమ భూములను ప్రభుత్వానికి అమ్ముకుంటున్న వివరాలు లేవు. పునరావాసం, పునః స్థిరీకరణల ప్రస్తావనే లేదు.

ఎంతసేపటికి నిర్వాసితుల భూముల రిజిస్ట్రేషన్ విలువకు మూడు రెట్లు మాత్రమే చెల్లించాలని 2013 చట్టంలో ఉందని దానికి బదులుగా మేము 10 రెట్లు చెల్లిస్తున్నామని గొప్పలు పోతున్నారు. అదే చట్టంలోని రిజిస్ట్రేషన్ విలువలను ఎప్పటికప్పుడు సమీక్షించాలన్న విషయాలను దాచిపెడుతున్నారు. మెరుగైన పరిహారం ఇవ్వవచ్చని చెప్పిన విషయాన్ని మరుగునవేసి తామేదో గొప్పగా చెల్లిస్తున్నట్లు ప్రకటిస్తున్నారు. పునరావాసం, పునఃస్థిరీకరణల గురించి వివరంగా చెప్పిన ఎన్నో సెక్షన్లను, అనుబంధాలను ప్రస్తావించకుండా దాచిపెడుతున్నారు. ఒకే మొత్తంలో (లమ్‌సమ్) చెల్లించే దానిని మాత్రమే ఫోకస్ చేస్తూ, నిర్వాసితులను, మిగతా ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నారు. ప్రాజెక్టు వల్ల లబ్ధిపొందే వారిని నిర్వాసితుల గురించి ఆలోచించకుండా చేసే దుర్మార్గానికి ఒడిగట్టడం సిగ్గుపడాల్సిన విషయం. ప్రాజెక్టు వల్ల లబ్ధిపొందేవారు తమ భూముల్లో కొంత భాగం పరిహారంగా నిర్వాసితులకు ఇవ్వడం గురించి ప్రస్తావనలు లేవు. ప్రాజెక్టుల కోసం, అభివృద్ధి కోసం కొందరు నష్టపోవడం సరైందేనని, తప్పనిసరైందేనని చెప్పే వారు, నమ్మేవారు ఆలోచించవలసిన ఒక విషయమున్నది. అది నిర్వాసితులయ్యే కుటుంబాల జీవితాల గురించి. ఈ కుటుంబాలు ఎవరి అభివృద్ధి కోసం, ఎవరి వెలుగుల కోసం కోల్పోవాలి. ఆ అభివృద్ధిలో, ఆ వెలుగుల్లో ప్రాజెక్టుల వల్ల నష్టపోయేవారికి భాగస్వామ్యం ఎందుకు ఉండకూడదు. ఆ భాగస్వామ్యాన్ని వారు ఎందుకు డిమాండ్ చేయకూడదు. ఈ విషయాలు అభివృద్ధి మంత్రం జపించే వారికి ఎందుకు పట్టడం లేదు. నిజంగానే సస్యశ్యామలం అవుతుందని, అభివృద్ధి జరుగుతుందని అనుకుంటే ప్రాజెక్టు కమాండ్ ప్రాంతంలో భూముల విలువలు భవిష్యత్‌లో ఏ స్థాయిలో పెరగబోతాయి అంచనా వేశారా? ఆ స్థాయికి దగ్గ పరిహారం ప్రభుత్వం చెబుతున్న 10 రెట్ల విలువకు సరిపోతుందా? ఆ డబ్బుతో అక్కడ భూములు కొనుక్కోగలుగుతారా? కొనుక్కోవా లనుకున్నవారికి అక్కడ భూములు లభిస్తాయా? కొందామనుకున్నా ఎవరైనా అమ్ముతారా? వీటి గురించి మంత్రులు, ముఖ్యమంత్రులు మాట్లడరు. వీరిచ్చే పరిహారంతో నిర్వాసితులకు ఇంకెక్కడైనా వారు కోల్పోయిన సాగుభూములు, ఇళ్ల స్థలాలు దొరుకుతాయా? అటువంటి ఏర్పాటు గురించి సవరణ చట్టంలో ఎందుకు రూపొందించడం లేదు. ఇలాంటి చట్టం గురించి ప్రభుత్వానికి మద్దతుగా మాట్లాడుతున్న వారు వారి రాతల్లో, మాటల్లో ఎందుకు ప్రస్తావించరు. అభివృద్ధి మంత్రం జపించే వారు ఆ అభివృద్ధిలో నిర్వాసితుల కుటుంబాలకు చోటుండాల్సిన అవసరాన్ని చెప్పరెందుకు? ఈ ప్రజల జీవితాల్లో వెలుగులు ఎందుకు ఉండకూడదో మాట్లడరెందుకు? ముఖ్యమంత్రి కెసిఆర్ అసెంబ్లీలో ఎంతో ఆర్తిగా ప్రస్తావించిన నీళ్లు, నిధులు, నియామకాలలో నిర్వాసితుల కుటుంబాలకు చోటుండదా? ఆ ప్రస్తావనలేవి. తెలంగాణ ఉద్యమంలో ముందుకొచ్చిన ఈ డిమాండ్ల సాకారంలో నిర్వాసిత కుటుంబాలకు చోటేది. ఆ వివరాలు చెప్పనేలేదు. చెప్పరుకూడా కాని దబాయింపులతో, మరోవైపు ఎంతో బాధపడిపోతున్నట్లుగా కనిపించే ప్రయత్నం చేస్తుంటారు.

ప్రాజెక్టుల వల్ల భూమి, ఆస్తి, ఇళ్లు, ఉపాధి కోల్పోతున్న ప్రజలతో మాట్లాడాల్సి ఉంటుందా ఉండదా? ఇది ఒక ప్రజాస్వామిక విలువ కదా! దీనికోసం చరిత్రలో ఎన్నో పోరాటాలు జరిగాయి. ఎందరో త్యాగాలు చేశారు. వాటికి విలువ ఇవ్వాల్సి ఉంటుందా? లేదా? ఆ ప్రయత్నం ఏమైనా చేశారా? చేయాలని చట్టంలో ఎక్కడైనా ప్రస్తావించారా? అలాంటి ప్రస్తావన లేని చట్టం రూపొందించారు. ప్రాజెక్టు కష్టనష్టాలను, సామాజిక ప్రయోజనాలను వివరించాలి కదా! సామాజిక ప్రయోజనాలను ప్రాజెక్టు బాధిత ప్రజలకు గ్యారంటీ చేయడం గురించి చట్టంలో గాని బయట గాని ప్రస్తావించకుండా ఎక్కడా కూడా పారదర్శకత లేకుండా ముందుకెళ్లడం దేనికి సూచిక.

2013 చట్టం వల్ల ప్రాజెక్టులు ఆలస్యం అవుతాయనడం, భూసేకరణ సాధ్యపడదు అని చెప్పడం, ఆ చట్టాన్ని వక్రీకరించి మాట్లాడడమే అవుతుంది. అంతగా త్వరపడేవారు నిర్వాసిత కుటుంబాల జీవిత భద్రత, సామాజిక భద్రత, పునరావాస, పునఃస్థిరీకరణ గురించి ఎందుకు వేగిరం గాని, ఆరాటం గాని, ఆర్తిగాని పడటం లేదు. తపించడం లేదు. ఇక్కడే వారి దిక్కుమాలిన వంకర బుద్ధి బయటపడేది. ఎక్కడైనా ప్రజల నుండి తీవ్ర వ్యతిరేకత వచ్చినప్పుడు వారితో చర్చించాల్సి ఉంటుంది. వాస్తవాలను తెలియజెప్పవలసి ఉంటుంది. నచ్చజెప్పవలసి ఉంటుంది. సామాజిక ఆర్థిక శాస్త్ర సాంకేతికలతో అన్ని వివరాలను, సాధ్యాసాధ్యాలను ప్రజలతో నేరుగా చర్చించాల్సి ఉంటుంది. అలాంటి ప్రయత్నం ఎక్కడైనా చేశారా? ప్రజల అభిప్రాయాల్లోని సహేతుకతలను పట్టించుకోవాలి కదా!

# నగదు రహితం వెనక అమెరికా హస్తం

**పెద్దనోట్ల రద్దుకు మోడీ చెప్పిన అవినీతి, నల్లధనం, తీవ్రవాదుల వద్ద ఉన్న డబ్బును పనికిరాకుండా చేయడం అనేవి వట్టి మాటలే, అసలు కారణం విదేశీ కార్పొరేట్ సంస్థలకు డిజిటలైజేషన్ ద్వారా ప్రయోజనం చేకూర్చడమే అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి**

**2016** నవంబర్ 8న రాత్రి 8 గంటల సమయంలో ప్రధానమంత్రి హోదాలో నరేంద్ర మోడీ 1000, 500 రూపాయల నోట్ల రద్దు చేస్తున్నామని ప్రకటించి రెండున్నర మాసాలు అయింది. "ఇదిగో నల్లధనాన్ని వెలికితీస్తున్నా... అదిగో అడబ్బంతా పేదలకే పంచేస్తా, అవినీతిని అంతం చేస్తా అంటూ ఊదరగొట్టిన ప్రధాని మోడీ ఒక దగాకోరు అని ప్రజలకు అర్థమైంది. పెద్ద నోట్ల రద్దు వెనుక మోడీకీ నిర్దిష్ట వ్యూహాత్మక లక్ష్యాలున్నాయి. అవి ఫిబ్రవరిలో ఐదు రాష్ట్రాల్లో జరుగనున్న ఎన్నికల్లో లబ్ధి పొందేందుకు, ప్రత్యర్థుల ఆర్థిక మూలాలను దెబ్బతీసేందుకు, దీవాళతీసిన బ్యాంకులను స్థిరీకరించేందుకు, అవ్యవస్థీకృత భారత ఆర్థిక రంగాన్ని వ్యవస్థీకృత అంతర్జాతీయ ఆర్థిక రంగంతో సమీకృతం చేయడానికే నోట్ల రద్దు, నగదు రహిత లావాదేవీలనే నాటకమాడుతున్నాడనే విషయం అందరికి అర్థమైంది.

"నోట్ల రద్దు ఓ సాహసోపేత నిర్ణయమని, నల్ల కుబేరుల భరతం పట్టినట్లేనని, తీవ్రవాదుల ఆర్థిక మూలాలను నాశనం చేసినట్లేనని, 50 రోజులు ప్రజలు పడే అష్టకష్టాలు తాత్కాలికమేనని, రాబోయే రోజుల్లో దేశం సుసంపన్నమవుతుందని, ఆర్థికాభివృద్ధికి పునాది పడి ప్రజల జీవితాలు సుసంపన్నమవుతాయని" అపర మేధావులు, మోడీ భజన పరులు, మీడియా, మోడీని కీర్తించే కమలనాధులు, ఆర్ఎస్ఎస్ సేనలు ప్రవచించిన మాటలు డొల్లని తేటతెల్లమయింది. 2014 ఎన్నికల సందర్భంలో విదేశీ బ్యాంకుల్లో దాగివున్న 70 లక్షల కోట్ల రూపాయలను బయటకు తీసి ప్రతి పేదవాని బ్యాంకు ఖాతాలో రు. 15 లక్షలు జమచేస్తానని, ప్రతి సంవత్సరం 2 కోట్ల ఉద్యోగాలు సృష్టిస్తానని చేసిన వాగ్దానాల వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోవడం కోసం, ప్రజలను ప్రక్కదారి పట్టించడం కోసం ప్రధాని మోడీ ఆడుతున్నది నాటకమనడం యదార్థం.

మోడీ చెప్పినట్లు ఒక్కపైసా అక్రమార్జన కూడ బయటకు రాలేదు. చెలామణిలో ఉన్న 97 శాతం నోట్లు బ్యాంకులకు చేరాయి. ఇక ప్రవాస భారతీయులు, ఇతరులు మార్చి 31లోపు మిగిలిన మూడు శాతం జమ చేస్తే... మరి నల్లధనం ఏమైపోయినట్టు. పేదలకే ఇచ్చేస్తామన్న ప్రధాని మోడీ వాగ్దానం వాగాడంరమేనా? కేవలం నోట్ బందీ ట్రంప్ కార్డుతో యుపి గద్దెను కైవసం చేసుకోవడమే కాదు, నోట్ల రద్దుపై ప్రతిపక్షాల రాద్ధాంతాన్ని తిప్పికొట్చొచ్చనే ఆశ అడియాశ అయింది. రద్దు చేసిన నోట్లను మార్చుకునేందుకు డిసెంబర్ 30 వరకూ గడువు ఇచ్చిన రిజర్వు

---

ఒకవేళ అవి అహేతుకమైతే ఎలాగో కూడా ప్రభుత్వం వివరించవలసి ఉంటుంది. ఇది ఒక ప్రజాస్వామిక విలువ. ఈ విలువలు పాటించకుండా సమాజం ముందు ఏ విలువలు ఉంచాలను కుంటున్నారు.

అసెంబ్లీలో ప్రవేశపెట్టిన భూసేకరణ చట్టానికి సవరణల బిల్లు కాపీలు ప్రజలకు అందుబాటులో లేవు. కష్టం మీద ఆ కాపీని సంపాదించడం జరిగింది. గవర్నర్ ఆమోదం పొందిందని చెప్పబడుతున్న దాన్ని కూడా అందుబాటులో ఉంచకుండా రహస్యం పాటించాల్సిన అవసరమేమున్నది.

తెలంగాణ ప్రభుత్వం తేబోయే భూసేకరణ సవరణ చట్టంలో రెండవ, మూడవ సవరణలుగా ప్రజల అంగీకారం, గ్రామ సభలను సంప్రదించడం సామాజిక ప్రభావ అంచనా అధ్యయనం, ఆపై ఎక్స్‌పర్ట్ కమిటీ అధ్యయనాలు నుండి మినహాయింపులు, అలాగే నీటి పారుదల వసతులున్న, బహుళ పంటలు పండే భూములను సేకరించవద్దని తెలిపే చాప్టర్ III కు అదనంగా వాటి నుండి మినహాయింపులను తెలిపే III A ను చేస్తూ అందులో 10 A ను చొప్పించారు. ఈ సవరణల ద్వారా గ్రామసభలు, ప్రజలతో సంప్రదింపులకు అవకాశం ఉండదు. ప్రాజెక్టుల వలన కలిగే సామాజిక ప్రభావాన్ని, లాభ నష్టాలను అంచనా వేయడం జరుగదు. నీటి పారుదల వసతులున్న వ్యవసాయ భూములను సహితం లాక్కోవడం జరుగుతుంది. ఈ సవరణలు మోదీ ప్రవేశపెట్టిన బిల్లు ఆర్డినెన్స్‌ల్లోని అలాగే గుజరాత్ ప్రభుత్వం తెచ్చిన భూసేకరణ సవరణ చట్టంలోని విషయాలను కాపీ చేసాయి. నాల్గవ సవరణగా 23 A అనే సెక్షన్ ను ఏడవ సవరణగా 30 Aను, ఎనిమిదవ సవరణగా 31 Aను చేర్చారు. వీటి ద్వారా మరో రూపంలో జిఓ 123 ను ముందుకు తెస్తున్నారు. 2017 జనవరి 5న జిఓ 123ను హైకోర్టు కొట్టేసింది. ఈ సవరణల ద్వారా పునరావాసం, పునఃస్థిరీకరణలు ఏమీ లేకుండానే ఒకే ముద్దగా తమకు నచ్చిన రీతిలో నష్ట పరిహారం చెల్లించడం, జరుగుతుంది.

ప్రజలకు మేలు జరిగేలా 2013 చట్టానికి మించిన మెరుగైన పరిహారం పునరావాసం, పునఃస్థిరీకరణల కొరకు రాష్ట్ర ప్రభుత్వాలు తగు చర్యలు తీసుకోవచ్చనే వెసులుబాటు గురించి 2013 చట్టంలోని 107వ సెక్షన్ చెబుతున్నది. దీని పేరుతో నష్టం చేసే ప్రతిపాదనలు చేస్తూ సవరణలు చేసుకోవచ్చుని చట్టమే చెబుతున్నదని తప్పుడు వ్యాఖ్యానాలు చేస్తున్నారు. ఈ సవరణలు కోర్టుల్లో చెల్లుబాటు అవుతాయా అనేది కాలమే నిర్ణయించాలి. సవరణ చట్టం గవర్నర్ ఆమోదం తరువాత రాష్ట్రపతి ఆమోద ముద్రను పొందితే దానికి చట్టబద్దత వస్తుంది. ఈ చట్టం గవర్నర్ ఆమోదం పొందిందని రాష్ట్రపతి ఆమోదం కోసం కేంద్ర ప్రభుత్వానికి పంపించారని చెబుతున్నారు. ఈ చట్టంపై ఎలాగూ ప్రధాని మోదీకి, ముఖ్యమంత్రి కెసిఆర్‌కు ఏకాభిప్రాయం ఉండనే ఉన్నది. కాబట్టి రాష్ట్రపతి ఆమోదం పొందడం కష్టమేమీ కాదు. ఈ సందర్భంలో ప్రజలకు వ్యతిరేకంగా కార్పోరేట్ శక్తులు, బడాబాబుల ప్రయోజనాల కోసం పాలకవర్గాల మధ్య ఎంత సఖ్యత ఉన్నదో మరో సారి రుజువవుతున్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

బ్యాంక్ ఆఫ్ ఇండియా... ప్రస్తుతం ఎంత డబ్బు బ్యాంకులకు చేరిందో వివరించటానికి సుతారాము ఇష్టపడడం లేదు. మొత్తం డబ్బు జమ అయ్యిందని ప్రకటిస్తే లేని నల్లధనం కోసం ప్రజలను ఇంత హింస పెట్టడం ఎందుకు? అన్న ప్రశ్న వస్తుందన్న ఉద్దేశంతో జమ అయిన నగదు వివరాలపై నోరు మెదపడం లేదు. దేశంలో చలామణిలో రు. 15.44 లక్షల కోట్ల వెయ్యి, ఐదొందల నోట్లల్లో సుమారు నాలుగైదు లక్షల కోట్లు నల్లధనం ఉన్నట్టు మోడీ ప్రభుత్వం చెప్పింది. సుప్రీంకోర్టు ప్రశ్నించినప్పుడు 10 నుంచి 11 లక్షల కోట్ల రూపాయలు బ్యాంకుల్లో జమ అయ్యే అవకాశం ఉందని అటార్నీ జనరల్ ముఖుల్ రోహత్గీ సమాధానం ఇచ్చారు. దీంతో మిగిలిన 4 నుంచి 5 లక్షల కోట్లు నల్లధనం కావచ్చనే ప్రచారం ఊపందుకుంది. ఐతే, డిసెంబర్ 30 నాటికే రు. 14.94 లక్షల కోట్ల పాత నోట్లు బ్యాంకులకు చేరాయి.

డిసెంబర్ 30 నుంచి ఆర్‌బిఐ తన వెబ్‌సైట్‌ను మూసేసింది. ఇంతకు ముందు ఏరోజు కారోజు ఎంత సొమ్ము బ్యాంకుల్లో డిపాజిట్ అయ్యింది. ఎన్ని వేల కోట్ల విలువ చేసే కొత్త నోట్లను బ్యాంకులకు పంపిణీ చేసింది... తదితర వివరాలన్నీ ఈ వెబ్‌సైట్‌లో అందుబాటులో ఉండేవి. చిత్రంగా డిసెంబర్ 30 నుంచి ఆర్‌బిఐ వెబ్‌సైట్ పని చేయడం లేదు. సమాచార హక్కు చట్టం కింద దరఖాస్తులను ఆర్‌బిఐ తిరస్కరిస్తోంది. అభ్యర్థులు కోరే సమాచారాన్ని ఇస్తే దేశ అంతర్గత భద్రతకే ముప్పు అని సమాధానం ఇస్తోంది. ఇప్పటికే రు. 15.4 లక్షల కోట్లల్లో రు. 14.94 లక్షల కోట్లు బ్యాంకులకు చేరింది. ఇంకా రు. 50 వేల కోట్లు జమ కావాలి. ప్రవాస భారతీయులకు, ఇతరులకు మార్చి 31 వరకూ అవకాశం ఇచ్చారు. అమెరికాలో 31.5 లక్షలు, యూరప్‌లో రు. 14.61 లక్షల మంది ప్రవాస భారతీయులు ఉన్నారు. ఇక వ్యాపారులు, ఇతరులు చివరి నిముషంలో మరో రు. 50వేల కోట్లు జమ చేస్తే? దేశంలో రద్దయిన నోట్లు బ్యాంకులకు చేరకుండా మిగిలేవి ఏమి మిగలవు.

రద్దయిన నోట్లు మొత్తం బ్యాంకులకు చేరడంతో... అసలు అక్రమార్జనను పట్ట లేదనిపిస్తోంది. మరి నల్లధనం ఎక్కడ? ఎమైంది? విదేశాలకు తరలిన ధనం సంగతి వదిలేస్తే... దేశంలో నల్లధనం ఏ రూపంలోకి మారింది? రియల్ ఎస్టేట్, బంగారం, విదేశీ పెట్టుబడుల్లో చేరిపోయింది. పెద్ద నోట్ల రద్దుతో మోడీ దేశానికి చేసిన మేలు కంటే నష్టమే ఎక్కువగా కనిపిస్తోంది. 120 కోట్ల మంది భారతీయులు బ్యాంకుల ముందు పడిగాపులు పడ్డారు. కనీస అవసరాలు తీర్చుకోవటానికి తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొన్నారు. చిరు వ్యాపారాలు ధ్వంసమయ్యాయి. కూలీనాలీ బతుకులు ఛిద్రమయ్యాయి. నోట్ల రద్దు వలన వృద్ధిరేటు తగ్గుతుందని ప్రపంచ బ్యాంకు స్పష్టం చేసింది. దేశంలో తయారీ రంగం, నిర్మాణరంగం కుదేలైంది. మోరదాబాద్‌లో బ్రాస్ పరిశ్రమ, లూదియానాలో అల్లిక పరిశ్రమ, ఫరిదాబాద్‌లో గాజుల పరిశ్రమ, తిరుపూర్‌లో దుస్తుల తయారీ పరిశ్రమ, లక్నోలో చికెన్‌కారి పరిశ్రమ, గుజరాత్‌లో వజ్రాల పరిశ్రమలు మూతపడటం వలన లక్షలాది మంది కార్మికులు తిరిగి గ్రామాలకు వెళ్లారు.

ఆర్థికాభివృద్ధి అచేతన దశకు చేరింది. 2016 డిసెంబర్ 30 నాటికి రు. 1,25,000 కోట్ల పెట్టుబడులు వచ్చాయి. నిజానికి రు. 2,36,000 కోట్ల పెట్టుబడి రావాలి, కానీ సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ సమచారాం మేరకు నవంబర్ 8 తర్వాత 61 శాతం పెట్టుబడులు తగ్గిపోయాయి. అంతకు ముందు రోజుకు ఆరు ప్రాజెక్టులను ప్రకటిస్తే... నోట్ల రద్దు తరువాత రోజుకు మూడు ప్రాజెక్టులనే ప్రకటించారు. ఇలా ఆర్థిక వ్యవస్థను అస్తవ్యస్తం చేసిన మోడీ ఆర్థికాభివృద్ధిని పెంచుకునేందుకు రుణాల వడ్డీ రేట్లను తగ్గించేందుకు ఆర్‌బిఐపై వత్తిడి తీసుకువచ్చారు. స్వయం ప్రతిపత్తిని కోల్పోయిన ఆర్‌బిఐ కూడా విచక్షణ రహితంగా వడ్డీ రేట్లను తగ్గించింది. ఓట్ల కోసం దేశ ప్రగతిని దెబ్బతీస్తున్నామనే స్పృహను కోల్పోయి... కోట్లాది మంది దేశ ప్రజలను తీవ్ర ఇబ్బందులకు గురిచేసిన మోడీకి... ఐదు రాష్ట్రాల ఎన్నికల్లో ప్రజలు ఏలా మద్దతు తెలుపుతారో? వేచి చూడాల్సిందే.

దేశంలో అవినీతి అక్రమాలకు వలస పాలన కాలంలోనే బీజాలు పడ్డాయి. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అవినీతి విస్తృతి చెందింది. ప్రపంచీకరణ విధానాలతో తారాస్థాయికి చేరింది. అంతై, ఇంతై వటుడింతై అన్నట్లు రాజకీయ రంగానికి అవినీతి పాకి దేశాన్ని భ్రష్టు పట్టించింది. అవినీతికి, రాజకీయాలకు విడదీయరాని బంధం ఏర్పడింది. ఇవాళ అవినీతి అంటని వ్యవస్థ దేశంలో లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. స్థానిక సంస్థలు మొదలు, శాసనసభ, పార్లమెంటు వరకు ఎన్నికల్లో లక్షలు, వందల కోట్ల వరకు ఖర్చు చేయని అభ్యర్థి ఉన్నారని చెప్పగలమా? అధికార బిజెపి, ప్రతిపక్ష కాంగ్రెస్, ఇతర ప్రాంతీయ పార్టీలకు కర్పొరేట్ల నుంచి వందలు, వేల కోట్ల రూపాయలు విరాళాలు తీసుకోకుండా ఎన్నికల్లో పోటీ చేయగలవా? పార్టీలను నడపగలవా? ఇటీవల వెలుగుచూసిన సహారా, బిర్లా గ్రూపుల డైరీలే ఇందుకు సాక్ష్యం. గుజరాత్ సిఎంకు (మోడీ) 2013లో సుమారు 55 కోట్లు ఇచ్చినట్లు, అదేవిధంగా మధ్యప్రదేశ్ సిఎం చౌహాన్‌కు, డిల్లీ ముఖ్యమంత్రిగా పనిచేసిన షీలా దీక్షిత్‌కు, ఇంకా మరికొంత మంది ముఖ్యమంత్రులకు ముడుపులు అందజేసినట్లు స్పష్టంగా పేర్కొన్నది.

మేకపోతు గాంభీర్యం ప్రదర్శిస్తూ మోడీ అవినీతిని అంతం చేస్తానని ఎంత గొంతు చించుకున్నా గుత్తపెట్టుబడిదారీ వర్గాలు అందించే అవినీతి సొమ్ముతోనే ఎన్నికల్లో గెలిచి అధికారంలోకి వచ్చారనడం జగమెరిగిన సత్యం. 2014 ఎన్నికల్లో టాటాలు, అంబానీలు, బిర్లాలు అందించిన కోట్ల కొలది అవినీతి డబ్బే మోడీని అధికారంలో కూర్చోపెట్టిందనేది కూడా వాస్తవం. రాజకీయ నాయకులు, కార్పొరేట్ వర్గాలకు మధ్య సంబంధాలను విడగొట్టకుండా, రాజకీయ పార్టీలకు అందే విరాళాలపై నిష్పక్షపాతంగా విచారణలు జరపకుండా అవినీతిని, దొంగ డబ్బును అరికడతాననడం, దానికి పెద్ద నోట్ల రద్దే పరిష్కార మార్గమనడం ప్రజలను మభ్య పెట్టడమే అవుతుంది. అదేవిధంగా తీవ్రవాదాన్ని, నకిలీ కరెన్సీని అరికడతాననడం కూడా అవాస్తవమే. తీవ్రవాదమనేది అంతర్జాతీయ సంబంధాలు కలిగి ఉంటుంది. పెద్ద నోట్ల రద్దుతో తాత్కాలికంగా కొద్దికాలం ఆగినా ఆ తరువాత యథా ప్రకారం తీవ్రవాద సంస్థలకు నిధులు అందుతాయన్నది తీవ్రవాదుల చేతుల్లోకి రు. 2000ల కొత్త నోట్లు వెళ్లినట్లు వార్తలు రావడమే నిదర్శనం. అదే విధంగా రు. 2000ల నోట్లు నకిలీవి వచ్చాయన్న వార్తలు గమనార్హం.

పెద్దనోట్ల రద్దుతో సంఘటిత, అసంఘటిత రంగాలన్నీ కుప్ప కూలాయి. ప్రత్యేకించి వ్యవసాయ రంగం తీవ్ర ఇబ్బందులకు గురైంది. వ్యవసాయ పంటలు వేసుకునే తరుణం కావడంతో చేతిలో డబ్బులులేక, బ్యాంకులు నగదు కొరతతో రుణాలివ్వక రైతులు, వ్యవసాయ కూలీలు మానసిక సంక్షోభాన్ని అనుభవించారు. గ్రామీణ ప్రాంతంలో నివసిస్తున్న ప్రజల బాధలు రాజకీయ నాయకులకు, అధికార యంత్రాంగం చెవికెక్కలేదు. రైతు ఆశలు నీరు కారిపోయాయి. వ్యవసాయ ఉత్పత్తుల

ధరలు పడిపోవడమే గాక, మార్కెట్లలో కొనే నాథుడే లేదు. టమోటా రైతులు ట్రాక్టర్లతో తమ ఉత్పత్తులను మండీకి తీసుకువచ్చి కొనేవారు లేక పారబోసారు. ఉత్తరాది రాష్ట్రాల్లో ఉల్లిగడ్డ క్వింటా రు.600 ఉండగా, నోట్ల రద్దు తరువాత క్వింటా రు.175కు అమ్ముకోవలసి వచ్చిందని పత్రికలు ఘోషించాయి. పెద్ద నోట్ల రద్దుతో ఏర్పడ్డ నగదు కొరత 17 లక్షల కోట్ల వ్యవసాయ, ఆహార ఉత్పత్తుల మార్కెట్‌ను దెబ్బతీసినట్లు ఆర్థికవేత్తల అంచనా. మొదటి 30 రోజుల్లో వ్యాపార నష్టాలు, నష్టపోయిన పనిరోజులు, కొత్త నోట్ల ముద్రణ వ్యయం మొత్తం కలిసి చూసుకుంటే రు. 1,28,000 కోట్ల రూపాయలు నష్టపోయినట్లు అంచనా.

2016 నవంబర్ 8న మోడీగాని, జైట్లీగాని నగదు రహిత లావాదేవీల గురించి ప్రస్తావించలేదు. పుండు మీద కారం చల్లినట్టు నవంబర్ 27న 'మన్ కీ బాత్'లో నగదు రహిత లావాదేవీల గురించి మాట్లాడాడు. ఐటి దిగ్గజాల కోసం భారత ఆర్థిక వ్యవస్థను నగదు రహితం చేయాలన్నదే మోడీ అసలు ఉద్దేశం. కాబట్టే రద్దయినా నోట్లకు సరిపడా కరెన్సీ విడుదల చేయలేదు. మోడీ సృష్టించిన అప్రజాస్వామిక అనాలోచిత చర్య యావత్తు దేశాన్ని నగదుకొరతతో సంక్షోభంలోకి నెట్టినా ప్రజల్లెవ్వరు వ్యతిరేకించడం లేదని, తనవెంటే ఉన్నారని మోడీ, పన్నుల వసూలు గతం కంటే అధికంగా వసూలు అయ్యాయని జైట్లీ అబద్ధాలు చెప్తుతున్నారు. పెద్ద నోట్ల రద్దుపై విమర్శలు చేస్తున్న ప్రతిపక్షాలను అవినీతి పరులకు కొమ్ముకాస్తున్నారంటూ వితండవాదనలు చేయడం హేయమైన చర్య. చెన్నై, కర్ణాటక, కోల్‌కత్తాలలో ఐటి అధికారులు దాడులు చేసి కోట్లల్లో దొంగడబ్బును, బంగారాన్ని పట్టుకున్నట్లు నోట్ల రద్దుతోనే నల్లడబ్బు దొరలు కలుగులో నుంచి బయటకు వచ్చినట్లు ప్రజలను నమ్మించే ప్రయత్నం చేయడం కంటే బుద్ధిమాలిన ఆలోచన ఉండదు. ఇంత చేస్తే ఐటి అధికారులు పట్టుకున్న బంగారం, నగదు విలువ 30 వేల కోట్లు దాటలేదు.

నోట్లరద్దు వలన వ్యక్తమవుతున్న వ్యతిరేకతను పక్కదారి పట్టించడానికి మోడీ డిసెంబర్ 31న రైతులకు వడ్డీ మాఫీ, గర్భిణీ స్త్రీలకు రు.6000లు బ్యాంకు ఖాతాలో జమచేస్తామని, బ్యాంకు డిపాజిట్లపై 10 సంవత్సరాలు దాటిన ఫిక్సిడ్ డిపాజిట్‌లపై వడ్డీ పెంపు, గృహ రుణాలపైన వడ్డీ తగ్గింపు తదితర రాయితీలను నూతన సంవత్సర కానుకగా ప్రకటించడం ఎన్‌డిఎ ప్రభుత్వం ప్రజల్లో పెరుగుతున్న ఆగ్రహాన్ని చల్లబరచడం కోసం, వాస్తవాలపై ప్రజల ఆలోచనను ప్రక్కదారి మళ్లించడానికే అనటంలో సందేహం లేదు. నిజానికి ఈ పథకాలు ఇందిరాగాంధీ కాలం నుంచి అప్పుడప్పుడు అరకొరా అమలవుతున్నాయి. ఇక పన్ను ఎగవేతదారులపై ఐటి శాఖ అధికారులు దాడులు చేయడం, కొంత మందిని పట్టుకోవడం, ప్రజలకు తాయిలాలు ప్రకటించడం ప్రభుత్వం చేసే రోజువారి కార్యకలాపాల్లో భాగమేతప్ప నోట్ల రద్దుకు దీనికి ఎలాంటి సంబంధం లేదు. ప్రభుత్వానికి, ప్రభుత్వ యంత్రాంగానికి అవినీతిపరులు, నల్లడబ్బు కుబేరుల వివరాలు ఎవరో తెలియక కాదు. తగిన యంత్రాంగం, చట్టాలు ఉన్నా వాటిని అమలు చేయాలన్న చిత్తశుద్ధి లేకపోవడం, రాజకీయ స్వప్రయోజనాలకు ప్రభుత్వం దాసోహమనడం కారణం.

నోట్ల రద్దు వెనుక, నగదు రహిత లావాదేవీలు జరపాలనటం వెనుక సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు ఉన్నాయి. ప్రపంచ పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసం ఏర్పడిన ప్రపంచబ్యాంక్ నోట్ల రద్దుకు సంబంధించిన రూట్ మ్యాప్‌ను 2014లోనే తయారుచేసి, ఆ సంవత్సరం ఆగస్టులో జరిగిన జి-20 దేశాల సమావేశంలో ప్రవేశపెట్టింది. ఇంటర్‌నెట్, స్మార్ట్‌ఫోన్లు, యాప్‌లు, వ్యాలెట్ వినియోగ చార్జీల పేరుతో కార్పొరేట్‌రంగానికి భారీ లబ్ది చేకూర్చడమే లక్ష్యంగా ప్రపంచబ్యాంక్ రూపొందించిన 'నగదు రహిత ఆర్థిక వ్యవస్థ' ప్రణాళికలో భాగంగానే మోడీ నోట్లరద్దు, ప్రజలను బలవంతంగా నగదు రహిత ఆర్థిక విధానంలోకి రావాలనడం, మీ బొటనవేలే బ్యాంక్ అంటూ ప్రజలను గందరగోళం లోకి నెట్టడంలోని అంతర్యం కార్పొరేట్ వర్గాలకు ఆదాయం చేకూర్చడమేనని ఆర్థికవేత్తలు చెప్పడం అవాస్తవం కాదు. 'పెటిఎం' లాంటి సంస్థలు దేశవిదేశాలకు చెందిన బడా కార్పొరేట్ సంస్థలకు చెందినవి.

డిజిటల్ నెట్ వర్క్ కంపెనీలు చాలవరకు అమెరికాకు చెందినవే. 'వీసా' నెట్‌వర్క్ 48.8 శాతం, మాస్టర్ కార్డు 31.8 శాతం, అమెరికన్ ఎక్స్‌ప్రెస్ 9.2 శాతం, డిస్కవర్ 10.7 శాతం ఈ బదిలీ సేవలు అందిస్తున్నాయి. అమెరికాలో క్రెడిట్ కార్డ్స్ వ్యాపార లావాదేవీలను చెస్ బ్యాంక్ 19 శాతం, బ్యాంక్ ఆఫ్ అమెరికా 16 శాతం, వెల్‌పార్గో 11 శాతం, యుఎస్ బ్యాంకు 10 శాతం, సిటీ బ్యాంకు 8 శాతం, కేపిటల్ ఒకే 5 శాతం, ఇతర బ్యాంకులు అన్ని కలిసి 32 శాతం చేస్తున్నాయి. వీసా కార్డుల ఆదాయం 2016 సంవత్సరానికి 1508 కోట్ల డాలర్లుగా ఉండగా మాస్టర్ కార్డు సంస్థ ఆదాయం 1600 కోట్ల డాలర్లు ఉంది. తాజాగా మన కేంద్ర ప్రభుత్వ క్యాష్‌లెస్ విధానం వల్ల ఈ సంస్థల లాభాలు మరింతగా పెరుగనున్నాయి. ప్రస్తుతానికి సేవా పన్నులు లేవని ప్రభుత్వం అసత్య ప్రచారం చేస్తోంది. డిజిటల్ పేమెంట్ సర్వీసుల్లో ఉన్న వీసా, మాస్టర్ కార్డ్, పెటిఎం వంటి ఇతర సంస్థలకు దేశవ్యాప్తంగా జరిగే క్రయ, విక్రయాలలో డెబిట్, క్రెడిట్ కార్డులు ఉపయోగిస్తే రు.1,60,000 కోట్లకు పైగా సేవా పన్నులు చెల్లించవలసి వస్తుందని ఆర్థిక వేత్తల అంచనా. ఆ భారమంతా 80 శాతంగా ఉన్న పేద, మధ్య తరగతి ప్రజలు భరించక తప్పదు.

ఇవాళ ప్రభుత్వ రంగ బ్యాంకులు దివాళా అంచున ఉన్నాయి. నిర్లక్ష్యంగా, విచ్చలవిడిగా కార్పొరేట్ సంస్థలకి అప్పులు ఇవ్వడంతో తలెత్తిన బ్యాంకుల సంక్షోభానికి పరిష్కారంగా ప్రభుత్వం నోట్ల రద్దు నిర్ణయం తీసుకొంది. గుత్త పెట్టుబడిదారులకు విచ్చలవిడిగా ఇచ్చిన రుణాలు గడువు తీరినా చెల్లింపులు జరగటం లేదు. 2014-16 సంవత్సరాల మధ్య రు.1.14 లక్షల కోట్ల రూపాయల రుణాలను ప్రభుత్వం రద్దు చేసింది. ఇవి మొత్తం కార్పొరేట్ వర్గాలకు చెందిన కంపెనీలే. ఇవిగాక ఆర్‌బిఐ ఫైనాన్షియల్ గణాంకాల నివేదిక ప్రకారం కార్పొరేట్ సంస్థలకు చెందిన రు.6.7 లక్షల కోట్ల రుణాల వసూలు క్లిష్టంగా ఉందని తేల్చి చెప్పింది. దీనిలో రు. 4.7 లక్షల కోట్లు రుణాలు చెల్లింపులకు గడువు తీరిపోయాయి.

ప్రభుత్వ, ప్రైవేటు బ్యాంకులు కలిసి ఇచ్చిన భారీ రుణాలలో 84 శాతం బడా బాబులకేనని గణాంకాలు తెలియజేస్తున్నాయి. వీరిలో సగానికి పైగా ప్రభుత్వానికి పన్నులు చెల్లించని వారు, దొడ్డిదారిన ఆ డబ్బును విదేశాలకు తరలించి తిరిగి ఆ డబ్బునే (రౌండ్ ట్రిప్పింగ్) మన దేశ షేర్ మార్కెట్లలో పెడుతున్నారు. అటువంటి అవినీతి పరులను పట్టుకొని అక్రమసంపద బయటకు తీయడానికి బదులుగా పెద్ద నోట్లను రద్దు చేసి తాను అవినీతికి, నల్లడబ్బుకు వ్యతిరేకంగా పోరాడుతున్నానని చెప్పడం అసత్యం. నోట్ల రద్దు నిర్ణయం తరువాత 'గ్లోబల్ ఎకనామిక్ ప్రాస్పెక్ట్స్' పేరిట ప్రపంచబ్యాంకు తొలిసారిగా రూపొందించిన నివేదిక వివరాలను జనవరి 11న విడుదల చేసింది. పెద్ద నోట్ల రద్దు వల్ల

జరిగినా మేలనేది ఏదన్నా ఉన్నదంటే అది ప్రజల సొమ్మంత బ్యాంకులకు చేరడమే. దీంతో కార్పొరేట్లకు తక్కువ వడ్డీతో రుణాలు లభించనున్నాయి.

ఆసియా పసిఫిక్ రీసెర్చ్ డాట్ కామ్. "చక్కగా దాచిన బహిరంగ రహస్యం. భారత్ చేపట్టిన క్రూరమైన నోట్ల రద్దు ప్రాజెక్టు వెనక వాషింగ్టన్" పేరుతో ప్రత్యేక కథనాన్ని ప్రచురించింది. పెద్ద నోట్ల రద్దు నిర్ణయం భారత్ తీసుకోవడానికి ముందు, తెరవెనుకా, తెరపైనా ఏడాది కాలంగా జరుగుతున్న 'ఏర్పాట్లు', ఈ మొత్తం ప్రక్రియలో కీలక పాత్రధారులు, ఈ నిర్ణయం వెనక అసలు ప్రయోజనాలు, లబ్దిదారుల వివరాలను ఈ కథనం వెల్లడించింది. అమెరికా కార్పొరేట్ల ప్రయోజనమే అమెరికా ప్రయోజనం అయినందున దేశాల మధ్య, దేశాలతో అంతర్యుద్ధాలను సృష్టిస్తూ, ఇప్పటివరకు ఆయుధాల వ్యాపారంతో ప్రపంచాన్ని తన కనుసన్నల్లో నడిపించింది. అమెరికా ఇప్పుడు ఐటి ఆధారిత పేమెంట్ సర్వీసుల్లోకి తమ కంపెనీల వ్యాపారాలను విస్తరిస్తూ, అదే సమయంలో అంతర్జాతీయ ఆర్థిక రంగంపై పూర్తి పట్టు సాధించాలని యోచిస్తోంది.

అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థలను పూర్తిగా డిజిటల్ చెల్లింపుల పరిధిలోకి తేగలిగితే అమెరికా ఐటి కంపెనీల వ్యాపారం పెరుగుతుంది. అదే సమయంలో వాషింగ్టన్‌లో కూర్చొని, ప్రపంచవ్యాప్త ఆర్థిక లావాదేవీలపై నిఘా వేయడం అమెరికా గూఢచార వ్యవస్థకు సులభమవుతుంది. అమెరికా బహుళజాతి సంస్థల అర్థబలం, అంతర్జాతీయ మారకంగా డాలర్‌కున్న శక్తి వల్ల, ప్రపంచవ్యాప్తంగా డిజిటల్ లావాదేవీలపై అమెరికా సైతం అలవోకగా స్థిరపడుతుంది. ఎవరైనా సరే దేశీయ, విదేశీ చట్టాలను పక్కనబెట్టి విధిగా అమెరికా చట్టాలకు తలవొగ్గి వ్యాపారాలు చేయాల్సి ఉంటుంది. అంతర్జాతీయంగా ఉన్న అన్ని ఆర్థిక సంస్థలను, బ్యాంకులను తన కనుసన్నల్లో ఆడిస్తుంది. ఎవరైనా తోకాడిస్తే, నిషేధాలు, ఆంక్షలతో వేదించడం మొదటి నుంచి అమెరికా అనుసరిస్తున్న విధానమని తెలిసిందే.

నగదు రహిత దిశగా భారత్‌ను ఒప్పించేందుకు ప్రయత్నాలు ఏడాదికాలంగా జరుగుతున్నాయి. ఆర్థికంగా ఎదుగుతున్న చైనాను కట్టడి చేయాలనుకున్న అమెరికా, భారత్‌తో వ్యూహాత్మక భాగస్వామ్యాన్ని కుదుర్చుకుంది. ఈ వ్యూహంలో భాగంగా అమెరికా ప్రభుత్వ అభివృద్ధి సంస్థ (యుఎస్ఏఐడి) మన ఆర్థిక మంత్రిత్వశాఖతో అనేక సహకార ఆర్థిక ఒప్పందాలను చేసుకుంది. భారత్‌లో డిజిటల్ చెల్లింపుల ప్రోత్సాహం, నగదు తగ్గింపు అందులో ఒకటి. ప్రపంచాన్ని నగదు రహితంగా మార్చి ఆన్‌లైన్ ద్వారా మొత్తం ఆర్థిక వ్యవస్థను నియంత్రించాలని యుఎస్ఏఐడి నిర్ణయమని ఏపిఆర్ రిపోర్ట్ చెబుతోంది. అదే సమయంలో వాషింగ్టన్‌లో కూర్చొని ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక లావాదేవీలపై నిఘా వేసేందుకు అమెరికాకు వీలవుతుంది. ఈ కుట్రలో భాగంగా మొదట భారత్‌పై కన్నేసింది. భారత్‌లో నగదురహిత చెల్లింపుల కోసం 2016 అక్టోబర్ 14న యుఎస్ఎఐడి కొత్తగా కేటలిస్ట్ అనే సంస్థను ఏర్పాటు చేసింది. నగదును పక్కకుతోసి పెద్దఎత్తున డిజిటల్ పేమెంట్స్‌ను వ్యాప్తిచేయడం, అందుకు అవసరమైన సమగ్ర వ్యవస్థ ఏర్పాటు ఈ కేటలిస్ట్ లక్ష్యం. క్యాటలిస్టు ప్రాజెక్టులో యుఎస్ ఎయిడ్స్, ఐఎంఎఫ్, వీసా, మాస్టర్ కార్డ్, బిల్ అండ్ మిలిందా గేట్స్ ఫౌండేషన్, పెటిఎం, ఫోన్పే, ఫ్రీచార్జ్, ఈబే, స్నాప్‌డీల్ వంటి ప్రపంచ ఆర్థిక సంస్థలు ఆన్‌లైన్ చెల్లింపు సంస్థలు 35 వరకు భాగస్వాములుగా ఉన్నాయి.

ఈ క్యాటలిస్ట్ ప్రాజెక్ట్ ఇంక్యుబేషన్ డైరెక్టర్ అలోక్ గుప్తా... వాషింగ్టన్‌లో వరల్డ్ రిసోర్స్ ఇన్‌స్టిట్యూట్ చీఫ్ ఆపరేటింగ్ ఆఫీసర్‌గా పనిచేశారు. దాని ప్రధాన ప్రాయోజక సంస్థల్లో యుఎస్ఎయిడ్ ఒకటి. భారతదేశంలో ఒక ముఖ్యమైన ఆన్‌లైన్ విక్రయాల వెబ్‌సైట్ స్నాప్ డీల్ ఉపాధ్యక్షుడిగా పనిచేసిన బాదల్ మాలిక్... క్యాటలిస్ట్ సిఇఓ గా నియమితులయ్యారు. 'ఆర్థిక వ్యవస్థలను డిజిటలైజ్ చేయడానికి, ఇప్పటి వరకు చేరని ప్రజానీకానికి చేరే నూతన ఆర్థిక అవకాశాలను సృష్టించడానికి చేస్తున్న కృషిలో భారతదేశం ముందు వరుసలో ఉంది' అంటూ యుఎస్ ఎయిడ్ ఇండియా మిషన్ డైరెక్టర్ జొనాథన్ అడిల్టన్ అక్టోబర్ 14న చేసిన ప్రకటన కొనసాగింపుగా నవంబర్ 8న మోడీ నోట్లరద్దు ప్రకటించడం గమనార్హం. తర్వాత దానిని నగదురహితంగా మార్చారు. భారత్‌లో ఆధార్ కార్డును డెవలప్ చేసిన టీమ్‌లోనూ అలోక్ గుప్తా ఉన్నారు. ఈ కేటలిస్ట్ ఏర్పాటైన సమయంలోనే కీలకస్థానంలో ఉన్న అమెరికా ప్రతినిధుల్లో గుప్తా ఒకరు.

అమెరికా ఒత్తిడితో మోడీ భారత్‌లో పెద్ద నోట్ల రద్దు నిర్ణయం తీసుకున్నారు. ఆ తర్వాత నగదు రహిత లావాదేవీలు అంటున్నారు. అమెరికా ఐటి సంస్థలు ప్రపంచ ఆర్థిక రంగాన్ని నగదు రహితంగా మార్చి తమ గుప్పెట్లో ఉంచుకుని శాసించే కుట్రలో భాగంగా సాఫ్ట్‌వేర్ దిగ్గజాలు భారతదేశం మొత్తాన్నీ తొలి ప్రయోగ వేదికగా మారుస్తున్నారు. వీసా, మాస్టర్ కార్డ్ వంటి అమెరికా ఆర్థిక సంస్థల హితం కోసమే... కోట్లాది మంది ప్రజలను కష్టాల పాలు చేస్తూ మన దేశాన్ని ఆకస్మికంగా నగదు రహితంగా మారాలంటున్నాడు మోడీ. ప్రథమంగా భారత్‌లోని ఒక నగరాన్ని ఎంపిక చేసి నగదు రహిత ప్రాంతంగా మార్చాలను కున్నారట. కాని భారతీయుల దేశభక్తి, అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని ఏకంగా, ముందూ వెనుక ఆలోచించకుండా ఒక్కసారిగా దేశం మొత్తం మీద ప్రయోగాన్ని చేసినట్లు ఏపీఆర్ రిపోర్ట్ వెల్లడించింది. మనం చేసే ప్రతి నగదు రహిత లావాదేవీలలోనూ ఐటి దిగ్గజాలు 1 నుంచి 3 శాతం కమీషన్ వసూలు చేస్తే మన కొనుగోలు శక్తి తగ్గిపోతుంది. దీనివలన ద్రవ్యోల్బణం పెరిగే అవకాశం లేకపోలేదు. నల్లధనం ఏరివేత, అవినీతి అంతం కోసం కొంత కాలం కష్టాలను ఓర్చుకోండి అంటూ ప్రధాని నరేంద్ర మోడీ అమలు చేసింది అమెరికా కుట్రపూరిత ఎజెండానేనా? అంటే, అవుననే సమాధానం వస్తుంది. ఏషియన్ పసిఫిక్ రీసెర్చ్ (ఏపిఆర్) సంస్థ కూడ దీన్నే నొక్కి చెప్పింది.

నల్లధనం, అవినీతి పునాదులపైన, సామ్రాజ్యవాదుల అండదండల పైన నిర్మితమైన నేటి రాజకీయ వ్యవస్థలో అడ్డూ అదుపులేకుండా దోచుకుంటున్న అక్రమార్జన పరులను అరికట్టకుండా అక్రమ సంపాదనను వెలికి తీస్తాననడం ఒట్టి మాటలే కాక మోడీ దివాళకోరు తనానికి నిదర్శనం. భారత్‌ను నగదురహిత ఆర్థిక వ్యవస్థగా రూపొందించడానికి ప్రయత్నించడం అభివృద్ధి చెందిన దేశాల అనుభవానికి విరుద్ధంగా ఉంది. పూర్తిగా డిజిటల్ చెల్లింపుల విధానాన్ని అమలు పరచడమంటే సగటు పౌరులపై అనవసర వ్యయాలను మోపడమే అవుతుంది. భారత ప్రజల అమాయకత్వాన్ని దేశభక్తి పేరుతో, అవినీతిపై యుద్ధం సాకుతో, నల్లధనం వెలికితీసే మాటున, నగదు రహితం చేస్తూ ప్రజల్ని మరింతగా దోచుకోవడానికి మోడీ ఐటి దిగ్గజాలకు ద్వారాలు తెరిచాడు. డిజిటలైజేషన్ ఎకానమీతో కార్పొరేట్ వ్యూహం ఫలించింది. ప్రజలు మాత్రం క్షతగాత్రులయ్యారు.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# నోట్ల రద్దు అవివేక చర్య

***సువోజిత్ బాగ్చీకి ఇచ్చిన ఇంటర్వ్యూలో నోట్ల రద్దును 'పనికిమాలిన చర్య'గా అభివర్ణించాడు ప్రఖ్యాత ఆర్థికవేత్త, నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్***

**ప్రశ్న: నోట్ల రద్దు ప్రాథమిక ప్రభావం చూశాం. బ్యాంకుల బయట పొడుగాటి 'క్యూ'లు, డబ్బు కొరత, మనమిప్పుడు రెండవ ప్రభావాన్ని చూస్తున్నాం. ఆలుగడ్డ లాంటి పంట చెడిపోయింది. మరికొన్ని వ్యాపారాలు దెబ్బతిన్నాయి. మరి వీటన్నిటిపై ఏమి జరుగనున్నది?**

జవాబు: రెండవ ప్రభావం అని అంటున్న దాంట్లో ఏ తప్పూ లేదు. ఎందుకంటే చిన్న వ్యాపారాలకు, ఇతరత్రా పనులకు అందే 'డబ్బు' చాలా ప్రధానమైనది. అదే ప్రస్తుతం దొరకని పరిస్థితి. ఉదాహరణకు – ప్రత్యేకించి వ్యవసాయంలాంటి చిన్నచిన్న వాటిల్లో 'డబ్బు' ఎప్పుడూ అవసరమవుతుంటది. 'నగదు రహితం' అనేది చాలాకాలం పిదప, అన్నిరకాల శిక్షణలిచ్చి మనం రూపొందించవచ్చు. కాని అప్పటికప్పుడే సాధ్యం కాదు. జబర్దస్తీగా ఏదో చేయాలనుకుంటే ప్రజలు అనుభవిస్తున్న కష్టాలు మనం చూస్తున్నదే, అలాకాక అప్పటికప్పుడే వ్యవస్థాగతంగా ఆలోచించి, ఆదరబాదరగా, అనుమానపడుతూ ముందుకు పోవడమంటే అశేష జనం కష్టార్జితాన్ని మనకు సంబంధం లేని నల్లడబ్బుకు సంబంధం పెట్టడమవుతుంది.

నేటి సృష్టివల్ల విలువైన బంగారం, వెండి లాంటి లోహాలకు సమంగా వాటి విలువలపై ఆధారపడుతాయనుకునేవి – మనం చాలా మందిమి 'డబ్బు' అని – పిలుస్తున్నది వాస్తవానికి 'ఓ ప్రామిసరీ నోటు'. గతంలో ఈ ప్రామిసరీ నోట్లు అనేవి పారిశ్రామిక యూరప్ వెన్నెముకలుగా ఒక గొప్పపాత్రను పోషించాయి. ఒకవేళ 18 లేదా 19వ శతాబ్దంలో బ్రిటిష్ వాళ్లు ఆకస్మికంగా నోట్ల రద్దుకు పూనుకొనివుంటే అది బ్రిటిష్ పారిశ్రామిక ప్రగతిని బీభత్సం చేసి వుండేది.

పూర్తిగా అభివృద్ధి చెందని ఎలక్ట్రానిక్ లావాదేవీలకు పోయివుంటే– ఆర్థిక రంగం పెద్దయెత్తున నష్టపోయి ఉండేది. ఎందుకంటే సరియైన మౌలిక సదుపాయాల కల్పన జరుగకుండా సరియైన అవగాహన, శిక్షణల్లేకుండా నగదు రహిత లావాదేవీలు అమలు చేస్తే – జనం – ముఖ్యంగా పేదవాళ్లు ఆ అవగాహన లేక తమ కష్టార్జితాన్ని కూడా పోగొట్టుకునే అవకాశముంది. అసలుదిగ్భ్రాంతి కల్గించే ప్రశ్న ఏమంటే – 'నోట్ల రద్దు'కు పూనుకునేవాళ్లు ఆ మాత్రం ముందుచూపు లేక ఇంతటి ఘోర కష్టాలను చూడలేకపోవడం – అత్యంత విచారకరం.

**ప్రశ్న: 85 శాతం గా చలామణిలో ఉన్న నోట్లను ఎందుకు రద్దు చేశారు?**

జవాబు: భారత ప్రభుత్వం తాను తలపెట్టిన ప్రయోజనాలమధ్య తికమకపడ్డట్లు, సరియైన అవగాహన లేనట్లు అనిపిస్తుంది. నోట్ల రద్దు ప్రక్రియను ఒకవైపు 'నల్లధనా'న్ని నిర్మూలించేదిగా – మరోవైపు నగదు రహితం వైపుగా చూస్తున్నారు. వ్యవస్థలో పోటీగా తయారైన ఇంత పెద్ద నల్లధనం సమస్యను నోట్ల రద్దు ఎదుర్కోలేదు. ఎందుకంటే నల్లధనం (ఇది 6 శాతంగా ఉన్నట్లు అంచనా. కాకుంటే 10 శాతం లోపే వుంటుంది.) చాలా కొద్ది భాగం మాత్రం 'డబ్బు' రూపంలో వున్నది. చాలా మొత్తం నల్లధనం విదేశాల్లో గాని, బంగారం లాంటి విలువైన వాటి రూపంలో గాని వున్నది. చిన్నచిన్న వ్యాపారులకు, రోజు కూలీలకు, ఇతరేతర చిన్న వాటికి, ఇంకా గృహిణులకు జరిగిన అసౌకర్యం, దాని నష్టంగాని – ఏదో కొంత 'నల్లధనాన్ని పట్టుకొని పొందే ప్రయోజనం కంటే పెద్దదని చెప్పవచ్చు, దీనివల్ల చాలావరకు నిరుద్యోగ సమస్యా పెరగవచ్చు. మోడీ నోట్ల రద్దు పిదప గత 34 రోజుల్లో తీవ్రమైన ఉద్యోగాల నష్టం సంభవించనున్నట్లు లండన్ పత్రిక 'ఫైనాన్షియల్ టైమ్స్' ఉవాచ. ఇదే విషయాన్ని 'అఖిల భారత ఉత్పత్తిదారుల సంస్థ' కూడా వెలిబుచ్చడం చూసాం. ప్రభుత్వం ఆశించిన ఫలితం కూడా అవాస్తవం, అసంభవమని ప్రభుత్వానికి తేటతెల్లమైంది. అందుకే నల్లధనం నిర్మూలన కోసం, అవినీతి తగ్గించడం కోసం 'నోట్లరద్దు' అని గొప్పలు చెప్పిన ప్రభుత్వం, మెల్లగా బాణీ మార్చి, ఇది 'నగదు రహితం' కోసం అని పల్లవి నెత్తుకున్నది. ఏది ఏమైనా ఇలాంటి మౌలికమైన, కీలకమైన మార్పులవైపు వెళ్తున్నప్పుడు సంయమనంతో బాటు సమయమూ తీసుకోవాలి. 'నల్లధనాన్ని' పట్టే నెపంతో అమలు చేయాలనుకునే భయంకర చట్టాలు, పెనాల్టీలు మొదలగు తీవ్రమైన దుష్ట విధానాలే.

ఫలితంగా 'నగదు రహితం' ప్రశాంతంగా ప్రారంభమవు తుందనుకుంటే తీవ్ర దుష్ఫలితాలను చవిచూడాల్సి వస్తుంది. అంతేగాక అరాచక పరిస్థితులు, తీవ్రబాధలూ తప్పవు.

**ప్రశ్న: 'నోట్ల రద్దు' వెనుక రాజకీయ కారణాలేమైనా ఉన్నాయా? రాబోయే ఎన్నికల్లో ఇదొక అంశం అవుతుందా?**

జవాబు: నాకు నిజంగా తెలియదు. ఆర్థిక రంగంలో పసలేని, తెలివిలేని చర్యలు చేపట్టడం వలన ఎన్నికల్లో ఏదో 'లబ్ధికోసమే' అనే అనుమానం ప్రజలు వెలిబుచ్చడం సహజమే. నోట్ల రద్దు పెద్దగా ఆశించిన ఫలితాన్ని సాధించలేనప్పటికీ ప్రస్తుతానికైతే ప్రధాని మోడీ మాత్రం 'అవినీతికి వ్యతిరేకంగా పోరాడే గొప్ప'యోధుడు'గా కీర్తించబడుతున్న విషయం నిజమే.

**ప్రశ్న: ఈ 50 రోజుల ప్రజల కష్టాలు ఆర్థిక రంగం నుండి 'నల్లధనా'న్ని దూరం చేయలేదా?**

జవాబు: అదెలా? తక్కువలో తక్కువ నల్లధనం 'డబ్బు' రూపంలో ఉంది. ఆ మాత్రం కూడా ?లా వెలికితీయబడిందందాం? ఎందుకంటే సామాన్య ప్రజలకంటే ఈ 'నల్లకుబేరులు' చాలా తెలివైనవారు. ఎలా పన్నులు ఎగగొట్టాలి? పెద్దమొత్తం ఎలా దాచిపెట్టాలి? అనే అంశాల్లో వీళ్లు అత్యంత చతురులు. కాబట్టి ఆ మాత్రంగా ఉన్న 10 శాతం నల్లధనం బయటకు వచ్చిందని మాత్రం చెప్పలేము.

# నగదు రహిత ఆర్థిక వ్యవస్థ అసలు రహస్యాలు

*పెద్దనోట్ల రద్దుతో ప్రారంభించి నగదు రహిత ఆర్థిక వ్యవస్థ, డిజిటలైజేషన్ దాకా సాగుతున్న ప్రభుత్వ విధానాలను నిర్ణయించినదెవరో, శాసిస్తున్నదెవరో, ఎవరి ప్రయోజనాలకో అసలు రహస్యాలను వివరిస్తున్నారు* **సాదుం శ్రీకాంత్**

**వా**స్తవానికి నేడు జాతీయ స్థాయిలో వర్షాభావ పరిస్థితుల కారణంగా నెలకొన్న తీవ్రమైన కరువు గురించో, నానాటికి అభద్రతా అగాథంలోకి నెట్టబడుతున్న వ్యవసాయ రంగంతో అగమ్యగోచరంగా మారుతున్న గ్రామ భారత సంక్షోభ గమనం గురించో చర్చ జరగాల్సి ఉంది. అదే విధంగా అంతర్జాతీయ వేదికపై గత ఆరు సంవత్సరాలుగా జరుగుతున్న అంతర్యుద్ధంలో రాలుతున్న సిరియా 'పూదోటల' గురించో, యెమన్ ఒడిలో 'మేడిన్ అమెరికా' సౌదీ యుద్ధ ట్యాంకర్ల మధ్య చిక్కుకుని కూడులేక మలమల మాడిపోతున్న ఆకలి కడుపుల గురించో చర్చ జరగవలసి ఉంది. కానీ ఇక్కడి అగ్రహార రాజ్యానికి గానీ అక్కడి అగ్రరాజ్య సామ్రాజ్యవాదానికి గానీ షరామామూలుగా ఇవన్నీ పట్టలేదు. పోగా నేడు ప్రపంచం వ్యాప్తంగా జరుగుతున్న చర్చల్లా ప్రజలకు ఏమాత్రం ప్రయోజనం చేకూర్చని ఫైనాన్షియల్ ఇంక్లూజన్ (ఆర్థిక సమ్మేళనం), కాష్ లెస్ సొసైటీ (నగదు రహిత సమాజం), డిజిటలైజేషన్ ల పైనే . మనుషుల కంటే మరయంత్రాల సమస్య, బ్రతుకుల కంటే బ్యాంకింగ్ సమస్యలే ప్రాధాన్యతను సంతరించుకున్న సామాజిక సంక్షోభ సందర్భమిది.

నోట్లరద్దుపై మన దేశంలో జరుగుతున్న చర్చలో భాగంగా ఏ పత్రికను చదివినా, ఏ టీవి ని చూసినా నల్లధనం, అవినీతి, ఉగ్రవాదం అనేవి ఆ నిర్ణయం వెనుకున్న ప్రధాన లక్ష్యాలుగా కనిపిస్తాయి. నేటి సామాజిక విధ్వంసంలో పాత్రికేయ రంగం తన వంతు ద్రోహపాత్రను తాను నిర్విఘ్నంగా నిర్వహిస్తోంది గనక, పాలకుల తప్పుడు నినాదాలను తలకెత్తుకుని వార్తల మాటున వాస్తవాలను సమాది చేసే పనిలో అది తీరికలేకుండా ఉంది .

ఇక మేధావులనబడే వాళ్లు సైతం 'ఉద్దేశ్యం బాగానే ఉందిగానీ?' అంటూ నీళ్లు నమలడానికి కూడా కారణాలు లేకపోలేదు. నిజానికి దేశంలోని బలహీన వర్గమంతా బ్యాంకుల ముందర 'క్యూ'కట్టి నిల్చుంటే, ఇంతటి సంక్షోభ సమయంలో కూడా 'ఒట్టి మాటలు తప్ప' ఏ ఒక్క రాజకీయ పార్టీ కూడా వాళ్లకు అండగా నిలబడి నిరసించక పోవడం చూస్తుంటే ఆ రాజకీయ పార్టీలు దివాలాకోరు తనం చాలా స్పష్టంగా కనబడుతోంది. ఈ సంక్షోభంలో పాలక వర్గ నిరంకుశత్వమెంత ఉందో, ప్రతిపక్షాల నిర్జీవత్వం కూడా అంతే ఉంది.

వీటన్నిటినీ అటుంచి భౌతికవాద దృక్పథంతో గనక మనం సమస్యను చూసినట్లైతే, ఎర్రతివాచీల కింద నిర్బంధించబడ్డ నగ్న సత్యాలు మాత్రం ఇందుకు పూర్తి భిన్నమైన వాస్తవాలను గొంతెత్తి చెపుతున్నాయి. పాలకుల కసాయిప్రేమ వెనుక వేటకు సిద్ధమౌతున్న కార్పొరేట్ తోడేళ్ల క్రూర పరిహాసాన్ని రహస్యంగా కప్పిపుచ్చే కుట్రలో భాగమే ఈ నల్లధనం బూటకపు నాటకమని తేటతెల్లమౌతుంది. నిజానికి దీని వెనకున్న అసలు కారణాలని విశ్లేషించాలంటే, ఈ పాలక తోలుబొమ్మల్ని తెరవెనుక నుంచి ఏ బ్యాంకింగ్ శక్తులు ఆడిస్తున్నాయో, వాటికిప్పుడీ 'కాష్ లెస్(నగదు రహిత)' అజెండా ఎందుకు అవసరమయిందో, ఆ లక్ష్య సాధనలో అవి ఎంచుకున్న 'డిజిటల్'మార్గమేమిటో, ఈ ఆటలో డిజిటల్ టెక్నాలజిని అందించే మొబైల్ సంస్థలు, ఐటి సంస్థల పాత్ర ఏమిటో, దాతృత్వం ముసుగులో తమ వాటాకోసం దారికాచి కూర్చున్న ఎన్ జి వో ల అసలు రంగేమిటో, రాబందులన్నీ పెరక్క తినగా మిగిలిన ఎంగిలి మెతుకుల పన్నులపై కన్నేసిన ప్రభుత్వ, పాలక 'దళారీ'పాత్ర ఏమిటో, వీళ్లందరి మధ్య సంధాన కర్తల్లా పనిచేస్తూ 'పేదరిక నిర్మూలన'

---

**ప్రశ్న: ఒకవేళ ఇది తప్పుడు విధానమైతే – ఎక్కడా వ్యతిరేకోద్యమాలు, ప్రతిఘటనలు ఎందుకు రాలేదు?**

జవాబు: ఈ పనికిమాలిన చర్యచుట్టూ ప్రభుత్వం పకడ్బందీ ప్రచారాన్నీ చేపట్టింది. నోట్ల రద్దును వ్యతిరేకించే వారంతా 'నల్లధనా'నికి మద్దతునిచ్చేవారని ప్రచారహోరు సాగింది. ఇది వాస్తవానికి హాస్యాస్పద మైనదే అయినా ఒక రాజకీయ నినాదమే. గణాంకాలు, ప్రజల అవగాహనతో ఈ సంక్షోభం మెల్లమెల్లగా తేటతెల్లమవుతున్నది.

తప్పుడు విధానాలు, అసత్య ప్రచారాలు పదేపదే వల్లించడంవల్ల అవి 'నిజాలు'గా, 'వాస్తవాలు'గా కొంతకాలం నిలబడే అవకాశముంది. అంతిమంగా సత్యమే నిలువవచ్చు కాని ఈ లోగ సుదీర్ఘకాలంపాటు, ఖచ్చితంగానైతే ఉత్తరప్రదేశ్ ఎన్నికలవరకు ప్రభుత్వం ప్రజల విశ్వాసాన్ని తనకనుకూలంగా మార్చుకోవచ్చు.

ఈ సందర్భంగా మనం 1840 నాటి ఐర్లాండు కరువును జ్ఞప్తికి తేవాలి. 1840లో అంతటి క్షామ పరిస్థితులు ఉన్నా లండన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలు చెప్పుకోదగ్గ ఉద్యమాన్ని చేపట్టలేదు. చాలాకాలం పిదప ఆ వ్యతిరేకత బయటపడ్డది. ఈ ప్రభావం చాలాకాలం వరకు స్థిరంగా ఉంది. ఐర్లాండు ప్రజలు సుదీర్ఘకాలంపాటు లండన్ ప్రభుత్వం పట్ల వ్యతిరేకతను కలిగివున్నారు. అంతటి కరువులో వ్యతిరేకంగా మారకున్నా ఆ పిదప అలా మారడంలో మనం ప్రభుత్వం పట్ల ప్రజలకున్న 'వ్యతిరేకత'ను ప్రస్ఫుటంగా చూడగలం. అందుకే ఈ ఘటనను ప్రస్తుత తరుణంలో మననం చేసుకోవడం ఉపయుక్తంగా ఉంటుందని భావిస్తున్నాను.

*(ది హిందూ 17.01.2017లో ప్రచురితం)*

*(తెలుగు స్వేచ్ఛానువాదం: ఎనిశెట్టి శంకర్, రచయిత-ఫ్రీలాన్స్ జర్నలిస్టు)* వీ

ముసుగేసుకున్న ప్రపంచ బ్యాంకు, ఐ ఎం ఎఫ, ఐఎఫ్‌సి ల నిజస్వరూపమేమిటో ఇలా ఈ చిక్కుముడుల్ని ఒక్కొక్కటిగా విప్పుకుంటూ పోతే నేటి ఈ నిర్ణయం దేశాన్ని ఏ విధ్వంసం దిశగా నెట్టివేస్తుందో స్పష్టంగా చూడవచ్చు.

ఇంటర్నేషనల్ ఫైనాన్సు కార్పొరేషన్ (ఐఎఫ్‌సి), మెకంజి సంస్థలు సంయుక్తంగా జరిపిన ఒక అధ్యయనం ప్రకారం 'అభివృద్ధి చెందుతున్న', వలసవాదుల దోపిడీకి గురైన బీద దేశాలలో ఉన్న వ్యాపార సంస్థల్లో దాదాపు 80 శాతం దాకా అసంఘటిత పరిశ్రమలే. ఆ దేశాలలో మొత్తం 36.5 నుంచి 44.5 కోట్ల సూక్ష్మ, చిన్న, మధ్య తరహా పరిశ్రమలున్నట్లు ఒక అంచనా. ఇందులో 2.5–3 కోట్ల సంఘటిత చిన్న పరిశ్రమలు, 5.5–7 కోట్ల వరకు సంఘటిత సూక్ష్మ పరిశ్రమలు కాగా మిగిలినవి 28.5–34.5 కోట్లు అసంఘటిత పరిశ్రమలు. బ్యాంకులకు గానీ, మరే ఇతర వ్యవస్థీకృత ఆర్థిక చట్రపు ఇరుసులో గానీ లేని ఈ అసంఘటిత వ్యాపారంలోకి కిరాణా కొట్లు, రోడ్డుమీద కూరగాయలమ్ముకునే చిన్న వ్యాపారులు, ఫుట్ పాత్ పై టిఫిన్ సెంటర్ నడిపే వాళ్లు ఇలా వీళ్లంతా ఈ కోవలోకి వస్తారు. అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్థిక వ్యవస్థలో ఈ 'అసంఘటిత' రంగం దాదాపు 45 శాతం ఉద్యోగాలను ఉత్పత్తి చేయగా దేశ జిడిపి లో దీని వాటా 33 శాతం అని అంచనా. అదే మన దేశంలోనైతే ఈ సంఖ్య రెట్టింపుగా ఉంది. నేషనల్ సాంపిల్ సర్వే ఆర్గనైజేషన్ (ఎన్ ఎస్ ఎస్ ఒ 2009–10) నివేదిక ప్రకారం దేశంలో ఉన్న మొత్తం కార్మికుల్లో 94 శాతం(43.7 కోట్లు) మంది అసంఘటిత రంగానికి చెందినవారు కాగా మిగతా 6.3 శాతం (2.8 కోట్లు) మంది మాత్రమే సంఘటిత రంగానికి చెందినవారని తెలుస్తోంది. ఈ అసంఘటిత రంగంలో పనిచేస్తున్న కార్మికుల్లో 90 శాతం మందికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ప్రవేశపెడుతున్న అరకొరక సంక్షేమం అదడం లేదని స్వయానా సుప్రీంకోర్టు న్యాయమూర్తులే అంగీకరిస్తున్నారు. వీళ్లకి న్యాయం చేకూర్చే నేషనల్ లీగల్ సర్వీసెస్ అథారిటీ ఆక్ట్ లాంటి చట్టాలు ఇంకా పెద్దోళ్ల చుట్టాలై పేదవాడికి మాత్రం అందని ద్రాక్షే అవుతున్నాయి. వెరసి ఏడు వసంతాల భారతావనిలో 70 శాతం మంది ఇంకా పేదరికపు కోరల్లో మగ్గిపోతున్నారు. ఏడాదికి దాదాపు 25 లక్షల పసిబుగ్గలు ఆకలి మంటలకు ఆహుతవుతున్నాయి..

ఐఎఫ్‌సి చేపట్టిన మరో అధ్యయనంలో అభివృద్ధి చెందుతున్న దేశాల్లో దాదాపు 16 కోట్ల చిన్న మధ్య తరహా వ్యాపారులకు వ్యవస్థాగత అప్పులు అందుబాటులో లేవని, మరో 16 కోట్ల చిన్న మధ్యతరహా వ్యాపారులకు అసలు బ్యాంకింగ్ సౌకర్యమే అందుబాటులో లేదని తేలింది. వాటికి అవసరమయ్యే రుణ సదుపాయం కల్పించాలంటే బ్యాంకులకు దాదాపు 2.1 నుంచి 2.6 ట్రిలియన్ డాలర్ల సంపద అవసరమని, మిగతా అభివృద్ధి చెందిన దేశాలను కూడా ఇందులో కలుపుకుంటే ఈ విలువ 3.2 నుంచి 3.9 ట్రిలియన్ డాలర్లకు చేరుతుందని అంచనా కట్టింది.

ఇక క్రెడిట్ స్విస్ అనే కార్పొరేట్ బ్యాంకు రాబోయే పదేండ్లలో ఒక్క భారతదేశంలోనే వినియోగదారులకు(వ్యక్తులకు), చిన్న, మధ్యతరహా పరిశ్రమలకు అవసరమయ్యే రుణం 600 బిలియన్ డాలర్ల నుంచి 3020 బిలియన్ డాలర్లకు పెరగనుందని అంచనా కట్టింది. అదే అధ్యయనంలో నేడు దేశంలో ఏడాదిలో వినియోగదారులు చేస్తున్న లావాదేవీల విలువ దాదాపు 1.3 ట్రిలియన్ డాలర్లు (80 లక్షల కోట్లు) గా అంచనా వేసింది. ఇందులో 95 శాతం నగదు రూపంలో జరుగుతుండగా కేవలం 5 శాతం మాత్రమే ఎలక్ట్రానిక్–లావాదేవీలుగా గుర్తించింది. 'ఆధార్' కార్డ్, యూనిఫైడ్ పేమెంట్ ఇంటర్ ఫేస్ (యుపిఐ) లాంటి ప్రభుత్వ సేవలు దేశాన్ని డిజిటల్ దిశగా మరల్చడంలో కీలక పాత్ర పోషించనున్నట్లు కూడా ఆ అధ్యయనం వెల్లడించింది. ఇక్కడ మనం అర్థం చేసుకోవాల్సిన ముఖ్యమైన విషయం ఏమిటంటే '95 శాతం లావాదేవీల పైన బ్యాంకులకు గానీ మరే ఇతర కార్పొరేట్లకు గానీ ఎలాంటి కమీషన్లు దక్కడం లేదనీ, ప్రభుత్వాలకు పన్నుల రూపేణా ఎలాంటి రాబడి గానీ అందడం లేదనీ, ఈ లావాదేవీలను నియంత్రించే గుత్తాధిపత్యం వాటి చెప్పుచేతల్లో లేదని, ప్రజల సొమ్ము, ప్రజల చేత, ప్రజల కొరకు పూర్తిగా వినియోగించుకునే స్వేచ్ఛ వాళ్లకుండటం బ్యాంకులకు ఇబ్బందిగా ఉందని. అందుకే ఆ నగదుపై యుద్ధం ప్రకటించారు. ద్రోహం పచ్చిగా కనపడితే ఎంతటి జీవచ్ఛవ సమాజమైన పాలకులపై తిరగబడుతుంది కాబట్టి ద్రోహాన్ని కప్పిపెట్టే ఒక ముసుగు కావాలి. ఒక బూటకపు నినాదం కావాలి. అది అభివృద్ధైనా, దేశభక్తైనా, అవినీతైనా, నల్లధనమైనా, మరేదైనా కావొచ్చు.

ఇకపోతే ప్రపంచం మొత్తం మీద 2009లో 200 కోట్లమంది మధ్యతరగతికి చెందినవాళ్లు ఉండగా ఈ సంఖ్య 2030 కంతా 500 కోట్లకు చేరనున్నట్లు కూడా ఐఎఫ్‌సి లెక్క కట్టింది. దాంతో 2009 లో 21 ట్రిలియన్ డాలర్లుగా ఉన్న మధ్యతరగతి వినియోగదారుల కొనుగోలు శక్తి 2030 నాటికంతా 55 ట్రిలియన్ డాలర్లకి పెరగనుందని కనిపెట్టింది. బ్యాంకులకు ఈ లెక్కలు చూసి నోరూరడం మొదలయింది.

రావణునికి పది తలలు ఉన్నిందీ లేనిదీ మనకు తెలియదు కానీ ప్రస్తుతం ప్రపంచాన్ని అనధికారికంగా పాలిస్తున్న ప్రపంచ బ్యాంకుకు మాత్రం లెక్కలేనన్ని తలల్ని చూడవచ్చు. అందరికీ పరిచయమైన తల ఐఎంఎఫ్.. ఐఎఫ్‌సి కూడా అలాంటి తలల్లో ఒకటి. 'అభివృద్ధి' పేరిట ప్రైవేటు రంగ పెట్టుబడులను ఇబ్బడిముబ్బడిగా ప్రచారం చేస్తున్న ప్రపంచ బ్యాంకు పెట్టుబడి పుత్రిక ఇది. ఇది 2009–13 మధ్య అంటే కేవలం నాలుగేళ్లలో ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 36 బిలియన్ డాలర్ల పెట్టుబడుల్ని పెట్టింది. అందుకేనేమో 'ప్రపంచ బ్యాంకు పేదరిక నిర్మూలనపై కాకుండా ఫైనాన్సియల్ రంగంపై దృష్టి సారించిందని' బ్రెటన్ వుడ్ ప్రాజెక్ట్ 2014 లో ప్రచురించిన 'ఫాలో ది మనీ' అనే నివేదికలో తీవ్రంగాతప్పుపట్టింది. వీళ్ల విజన్‌లో (విజన్–2020) పేదరిక నిర్మూలన అంటే జిడిపి లో 33 శాతం ఉన్న వ్యవసాయ రంగాన్ని 12 శాతం కుదించి, రైతుల్ని వలసకూలీలుగా మార్చడం. అందుకే ప్రపంచ బ్యాంకు వీళ్లను అభివృద్ధి 'చాంపియన్ల'గా కీర్తిస్తుంది. ఈ 'డార్లింగ్'లే నేడు దేశంలోని డిజిటలైజేషన్ కమిటీ కి అధ్యక్షత వహించడం ఎంతమాత్రం యాదృచ్ఛికం కాదు.

పాశ్చాత్య బ్యాంకింగ్ రంగం పేదరిక నిర్మూలన పేరిట పేద దేశాలలోని మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి ప్రజా జీవనంలోకి ప్రవేశించి, అక్కడున్న అరకొర ఆర్థిక వనరుల్ని కొల్లగొట్టే ప్రయత్నం ఈ నాటిది కాదు. వాస్తవానికి 1990 దశకంలోనే 'మైక్రోఫైనాన్స్' అజెండా తో కార్పొరేట్ బ్యాంకులు ఈ ఎత్తుగడకు తెరలేపాయి. కానీ అప్పట్లో ఉన్న అవరోధాల్ని ఎదుర్కొని తాము పెట్టిన పెట్టుబడి గుడ్లు పెట్టి పొదిగి పిల్లల్ని లేపే పరిస్థితిలో లేదని అవి గ్రహించినాయి. ముఖ్యంగా

అందుకు అనువైన సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో లేకపోవడం, ఇక్కడి ప్రజలు మొబైల్ ఫోన్ 'రుచి'కి అప్పటికింకా మరగక పోవడంతో తమకు పెద్దగా లాభాలు ఒరిగేదేమీ లేదన్న విషయాన్ని అవి గ్రహించాయి. దాంతోపాటు మైక్రోఫైనాన్స్ ప్రధానంగా సూక్ష్మ రుణాలకే పరిమితం కావడం, అరకొర భీమా పతకాలు, వినియోగదారుల లావాదేవీలను పసిగట్టే 'ఆధారం' లేకపోవడం, నిర్వహణ వ్యయం ఎక్కువగా ఉండటంతో ఇచ్చే అప్పులకి నడ్డి విరిచే వడ్డీభారం ఉండటం, వీటన్నింటినీ మించి 2009-10 ల మధ్య ఆంధ్రప్రదేశ్ లో తలెత్తిన మైక్రోఫైనాన్స్ సంక్షోభం వెరసి కార్పొరేట్ బ్యాంకులు తాము అనుకున్న లక్ష్యాన్ని చేరుకోలేకపోయాయి. మైక్రోఫైనాన్స్ రంగం తొలత అంతర్జాతీయ పెట్టుబడులను ఆకర్షించి నప్పటికీ ప్రధానంగా ప్రభుత్వ విధానంలో భాగం కాకపోవడంతో తాము పెట్టిన పెట్టుబడికి రిస్క్ ఎక్కువగావుందని 2009-10 సంక్షోభం రుజువుచేసింది. అదే సమయంలో అమెరికా కేంద్రంగా 'సబ్ ప్రైమ్ మోర్టగేజ్' సంక్షోభం ప్రపంచ ఆర్థిక వ్యవస్థని అతలాకుతలం చేసింది. ఇటు వెనుకబడ్డ దేశాలలో తలెత్తిన మైక్రోఫైనాన్స్ సంక్షోభం అటు అమెరికా కేంద్రంగా వచ్చిన ఆర్థిక మాంద్యం వెరసి బ్యాంకింగ్ రంగాన్ని ఒక సరికొత్త మార్గాన్వేషణకై పురిగొల్పేలా చేసాయి. ఆ అవరోధాలను దాటుకుని తిరిగి వ్యాపార విస్తరణకై వాళ్లకి కనిపించిన ఏకైక మజిలీ ఫైనాన్షియల్ ఇంక్లూజన్ (ఆర్థిక భాగస్వామ్యం).

మైక్రోఫైనాన్స్ సంక్షోభానికి సంబందించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2010లో రెగ్యులేషన్ ఆఫ్ మనీలెండింగ్ చట్టాన్ని తీసుకురావడంతో ఆ సంస్థల వ్యాపార లావాదేవీల మీద ఆంక్షలు వచ్చాయి. వాస్తవానికి 2007లో మైక్రోఫైనాన్స్ సంస్థల్ని ఆదుకోడానికి తీసుకురావాల్సిన 'మైక్రో ఫైనాన్సు సంస్థల చట్టం పార్లమెంటులో ఆమోదం పొందలేదు. ఇటు అమెరికా ఆర్థిక వ్యవస్థను కుదేలు చేసిన బ్యాంకులపై అక్కడి ప్రభుత్వం కఠిన చర్యలు చేపట్టే కార్యాచరణ మొదలుపెట్టింది. కార్పొరేట్ బ్యాంకులు ప్రపంచ మార్కెట్ వ్యవస్థలోకి జొప్పించిన ప్రమాదకర మోర్టగేజ్ సెక్యూరిటీలు కాన్సర్‌లా వ్యాపించి ప్రపంచ ఆర్థిక వ్యవస్థని కుప్పకూల్చాయి కాబట్టి ఇలాంటి సమస్య భవిష్యత్తులో మళ్లీ తలెత్తకుండా వినియోగదారులను రక్షించే ధ్యేయంతో డాట్ ఫ్రాంక్, బేసెల్-3, వోల్కేర్ చట్టం వంటి కఠినమైన నిబంధనలు తీసుకురాడానికి ప్రభుత్వం రంగం సిద్ధం చేసింది (కనీసం అలా నటించనైనా నటించింది). దాంతో బ్యాంకుల ఇష్టారాజ్యానికి సంకెళ్లు వేసినట్లయింది. ఇలాంటి 'కఠిన చట్టాలకి' లోబడి అక్కడ పెట్టే పెట్టుబడికి వాళ్లు ఆశించినంత పెద్ద మొత్తంలో లాభాలు వెనకేసుకోలేకపోవడం, అక్కడి మార్కెట్లో ని పోటీతత్వం, వ్యాపార విస్తరణకై మరింత పెట్టుబడి అవసరం కావడం, ఆయా దేశాలలోని మార్కెట్లు అప్పటికే స్థాయిని మించి వినియోగించబడటం, మరెన్నో కారణాల వల్ల 'భాగ్య'దేశాలలోని బ్యాంకింగ్ రంగం తన దిశని తప్పనిసరి పరిస్థితుల్లో వలసవాదుల దోపిడీకి గురైన అభాగ్య దేశాల వైపుకు మళ్లేటట్లు చేసాయి.

నిజానికి ఈ బ్యాంకుల్లో ఏ ఒక్కటి కూడా అవినీతికి అతీతం కాదు. తాజాగా జర్మనీ కి చెందిన డాయిష్ బ్యాంకు, స్విట్జర్లాండ్ కు చెందిన క్రెడిట్ స్విస్ అనే కార్పొరేట్ బ్యాంకులు 2008 లోని సంక్షోభ సమయంలో పాల్పడ్డ అవకతవకలకు గాను అమెరికా జస్టిస్ డిపార్ట్ మెంట్ కి 12.5 బిలియన్ డాలర్ల అపరాధ రుసుము చెల్లించనున్నాయి . జేపీ మోర్గాన్ అనే మరో బ్యాంకు అదే ఆరోపణలపై 2013 లో 13 బిలియన్ డాలర్ల అపరాధ రుసుము చెల్లించడానికి ఒప్పుకుంది. ఈ ఆర్థిక మాంద్యం వలన 2008-10 లో ఒక్క అమెరికాలోనే దాదాపు 80 లక్షల మంది ఉద్యోగుల బతుకులు బజారున పడ్డాయి. లక్షలాది మంది తమ ఇళ్లను కొల్పోవాల్సి వచ్చింది. వందలాదిమంది ఆత్మహత్యల పేరిట వ్యవస్థీకృత హత్యకు బలికావలసి వచ్చింది. ఇది మార్కెట్ చట్రంలో ఇరుక్కున్న ఆర్థివ్యవస్థ క్రమం తప్పకుండా చేరుకునే పతనదశలో భాగంగా జరిగిన తాజా సంక్షోభ పరిణామ సాక్ష్యం మాత్రమే.

సంక్షోభం తలెత్తినప్పుడల్లా బ్యాంకులు సరికొత్త అవతారాలెత్తుతాయి. ఆ ఊబిలో నుంచి బయట పడటానికి వాటికి అపారమైన అదనపు పెట్టుబడి అవసరమౌతుంది. ఆ అన్వేషణలో అవి రెగ్యులేట్ చేయబడని, అంటే అంతగా నియమ నిబంధనలకు నోచుకోని మార్కెట్లు గల పేద దేశాల వైపు వలలు పట్టుకుని వలసలొస్తాయి. అలా అక్కడి ఆర్థిక వనరులకై వేట కొనసాగిస్తాయి. పైకి మాత్రం అంతా ప్రజల మంచికోసమే అని డాంబికాలు పోతాయి. ఇక్కడ పాలక దళారీలకు కొదవేముండదని వాటికి బాగా తెలుసు. ఆనాడు 'గ్రీన్ రెవల్యూషన్' పేరిట పాలకులు వ్యవసాయ రంగాన్ని ఏవిధంగా అంతర్జాతీయ అంగట్లో మోన్సాంటో లాంటి కార్పొరేట్ కంపెనీలకు కట్టబెట్టారో, ఏవిధంగా 'గ్రీన్ హంట్' పేరిట అడవుల్లోని బాక్సైట్, ఇనుము లాంటి విలువైన ఖనిజ సంపదని వేదాంతా, పోస్కో లాంటి విదేశీ సంస్థల హస్తగతం చేయ జూశారో, అదే విధంగా నేడు 'డిజిటల్ రెవల్యూషన్' పేరిట ఇక్కడి శ్రమజీవులు కూడబెట్టుకున్న పిడికెడు ఆర్థిక వనరుల్ని కార్పొరేట్ బ్యాంకుల ఖాతాల్లోకి చేరవేసే కుట్ర ఇది. చీమల పుట్టలపై పాశ్చాత్య పాములు మరోమారు పడగవిప్పాయి.

స్వయం జీవనం కోల్పోయి అప్పుల ఊబిలో కూరుకుపోయిన మైదాన ప్రాంత రైతుల ఆత్మహత్యలను వాళ్లానాడు హరిత'విప్లవం'గా కీర్తించారు, లక్షలాది గిరిజనుల నివాస స్థావరాలైన అడవుల్లో 'కోబ్రాలు', 'సాల్వా జుడుం'లు పరిచే నెత్తుటి మరకలని 'పరిశుద్ధ యుద్ధ యాత్ర'ని అభివర్ణించారు. ఒకచోట విధ్వంసం శాంతియుతంగా 'విప్లవీక'రించబడితే, మరోచోట హింస ఒక వేటగా(హంట్) గా అహింసీకరింపబడింది. ఇక రెంటిలోనూ మిగిలిన 'గ్రీన్', రక్తం కనిపించకుండా మారణహోమానికి రాజ్యం తొడిగిన ముసుగన్నమాట. నేడు వీటవసరం కూడా లేకుండానే అరచేతిలోనే మరయంత్రాలు మొలిచి ఇక్కడి సమాజాన్ని దాదాపుగా చిద్రం చేయనున్నాయి. దానికి వాళ్లు డిజిటల్ విప్లవంగా డప్పుకొట్టి ప్రచారం చేస్తున్నారు. ఇది ప్రత్యేకమైన మార్కెట్ పరిభాష. పాలకుడు మారినా అభివృద్ధి పేరిట సాగుతున్న విధ్వంసం, రూపంలో మారిందేమోగానీ సారంలో మాత్రం రవ్వంత కూడా మారలేదు.

2007 మొదలుకుని ప్రపంచ బ్యాంకు గ్లోబల్ పేమెంట్స్ సిస్టమ్స్ సర్వే నిర్వహిస్తోంది. ప్రపంచ వ్యాప్తంగా వివిధ రంగాల్లో జరుగుతున్న మొత్తం లావాదేవీల వివరాలను పసిగట్టి, కార్పొరేట్ బ్యాంకులకు ఇతర అంతర్జాతీయ ఫైనాన్సియల్ ఇన్స్టిట్యూషన్లకు గల వ్యాపార అవకాశాలను అంచనా వేయడం, దాంతో పాటుగా ఆ అవకాశాలను చేజిక్కించుకునే క్రమంలో వాటికి ఎదురయ్యే అవరోధాలను ఎలా ఎదుర్కోవాలని విశ్లేషించడం ఆ అధ్యయనం ప్రధాన లక్ష్యం. అందులో భాగంగా ప్రపంచం మొత్తంగా వివిధ దేశాలలో జరుగుతున్న చెల్లింపులను, ఇతర ఆర్థిక లావాదేవీల వివరాలను ఆరా తీసింది. అభివృద్ధి చెందిన దేశాలలో ప్రతి మనిషి సంవత్సరానికి సగటున 100 నుంచి 200 వరకు నగదు

రహిత లావాదేవీలు జరుపుతుండగా దక్షణాసియా దేశాలలో (భారతదేశంతో సహా) ఆ సంఖ్య కేవలం 4 గా కనుగొంది(2006). దాంతో పాటుగా ఆయా దేశాలలో పౌరులకు అందుబాటులో ఉన్న ఫైనాన్సియల్ సర్వీసులు, వాటి వినియోగం, ఆ సర్వీసుల్ని వినియోగదారులకి అందచేయడంలో పాటిస్తున్న నాణ్యతా ప్రమాణాలు ఇలాంటి అంశాలను అధ్యయనం చేయడానికి 24 ద్రవ్య విస్తరణ సూచికలు తయారుచేసి ప్రపంచ దేశాలలోని సెంట్రల్ బ్యాంకుల నుంచి కావలసిన సమాచారాన్ని కూపీ లాగి అక్కడ లాభసాటి వ్యాపార అవకాశాలు పుష్కలంగా ఉన్నట్లు గ్రహించింది. తర్వాతి రోజుల్లో ఆ అధ్యయనాన్ని పౌరుల మొబైల్ సర్వీసుల వాడకం వంటి మరిన్ని వివరాలకై విస్తరించింది కూడా.

మరోపక్క మనదేశంలో 27 శాతం రైతు కుటుంబాలకు మాత్రమే వ్యవస్థీకృత (బ్యాంకులు ఇతర సంస్థలు) అప్పులందుతుండగా, 22 శాతం మంది రైతు కుటుంబాలకు ఇతర రూపాలలో (స్నేహితులు, బంధువులు, వడ్డీ వ్యాపారులు ఇతరత్రా) అప్పులు అందుతున్నాయని, మిగతా వాళ్లకు అప్పు సదుపాయం అందుబాటులో లేదని 2003లో ఎన్ఎస్ఎస్ కేంద్ర ప్రభుత్వానికి నివేదించింది. ఈ సమాచారంతో 2006-07 ఆ మిగతా వాళ్లకు అప్పు అందక పోడానికి గల కారణాలను విశ్లేషించి ఒక నివేదిక నివ్వవలసిందిగా సి. రంగరాజన్ అధ్యక్షతన కేంద్ర ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. దాన్ని ఫైనాన్షియల్ ఇంక్లూజన్ కమిటీ అన్నారు. బహుశా కేంద్ర ప్రభుత్వం ఫైనాన్సియల్ ఇంక్లూజన్ అనేపదాన్ని అధికారికంగా వాడటం ఇదే ప్రథమం. కేంద్ర ప్రభుత్వం 2007-08లో ఫైనాన్షియల్ ఇంక్లూజన్ ఫండ్, ఫైనాన్షియల ఇంక్లూజన్ టెక్నాలజీ ఫండ్ అని రెండు నిధులను ఏర్పాటు చేసి చెరి రు. 25 కోట్ల నిధుల్ని కేటాయించింది. 2008-09లో రాబోయే 5 సంవత్సరాలకుగానూ మరో 500 కోట్ల నిధులు మంజూరు చేయాలని అప్పటి ప్రభుత్వం నిర్ణయించింది.

2010లోనే 'ఇన్నోవేటివ్ ఫైనాన్సియల్ ఇంక్లూజన్' పేరిట జి20 ఫైనాన్షియల్ ఇంక్లూజన్ ఎక్స్ పర్ట్స్ గ్రూప్ ఒక నివేదికను తీసుకొచ్చింది. అందులో వాళ్ల అజెండా ప్రచారానికి అవసరమైన 9 మూలసూత్రాలను ప్రకటించడం జరిగింది. అంతేకాకుండా ఆయా దేశాలలో అవసరమైన పరిపాలనా పరమైన నాయకత్వం మొదలుకుని ఆ లక్ష్య సాధనకు అవసరమైన మార్కెట్ చట్ర (ఫ్రేమ్ వర్క్) నిర్మాణం వరకు అనేక అంశాలపై వివరాలున్నాయి. ఇవన్నీ కూడా కేవలం అంతర్జాతీయ 'మార్కెట్' అవసరాలను తీర్చే లక్ష్యంగా జాతీయంగా చోటు చేసుకోవాల్సిన మార్పులకై దిశానిర్దేశాలు మాత్రమే.

**ఆధార్ ఎవరికి, దేనికి ఆధారం?**

వాస్తవానికి ప్రభుత్వం పౌరుల పన్నుల లెక్కలు చూడాలంటే 1972 లోనే ఆదాయపు పన్ను శాఖ ప్రవేశపెట్టిన శాశ్వత అకౌంట్ నంబర్ (పర్మనెంట్ అకౌంట్ నంబర్ లేదా పిఎన్ లేదా పాన్ కార్డ్) ఉంది. మన ప్రభుత్వానికి ఏ మాత్రం చిత్తశుద్ధి ఉన్నా పన్నుకు సంబందించిన వివరాలను ఆ కార్డు ద్వారా తెలుసుకోవచ్చు. పన్ను అనే నెపంతో దేశంలోని ప్రజల నిత్య జీవితంలోని ప్రతి ఆర్థిక లావాదేవీనీ వేలిముద్రల ఆధారంగా పసిగట్టే లక్ష్యంగా ఆధార్ కార్డును తీసుకురావడం జరిగింది. ఇది అమెరికాలోని సోషల్ సెక్యూరిటీ నెంబర్(ఎస్ ఎస్ ఎన్) కి నమూనా. మార్కెట్ చట్రంలో మనీకి తప్ప మనిషికి గానీ, మనిషి వ్యక్తిత్వానికి గానీ తావుండదు. ఇక్కడ వినియోగదారులను సులభంగా గుర్తించడానికి ఒక ప్రత్యేకమైన నంబరు కావాలి. దాని ఆధారంగా క్రెడిట్ రేటింగ్ సంస్థలచే వాళ్లకు ఒక రేటింగ్ ఇవ్వబడుతుంది. అదో కొలబద్ద. అదే వాళ్లు పెట్టే పెట్టుబడికి ఎంత రిస్క్ ఉంటుందో తెలుసుకునేందుకు ఆధారం. దాన్ని బట్టి వడ్డీ రేట్లు మిగతా అన్ని నిర్ణయాలు ఆధారపడి ఉంటాయి. దానికి ప్రభుత్వం చెల్లించే రాయితీలు కూడా అనుసంధానమై ఉంటాయని 'ఆధార్ ఆక్ట్ 2016' చెబుతోంది. ఈ లావాదేవీల సమాచారమంతా ఎప్పటికప్పుడు కార్పొరేట్ సంస్థలకు, ప్రపంచ బ్యాంకుకు చేరవేయబడుతుంది. అందుకే ప్రపంచ బ్యాంకు 2016 లో ప్రచురించిన 'వరల్డ్ డెవలప్మెంట్ రిపోర్ట్' లో 'ఆధార్ కార్డ్ లాంటి డిజిటల్ గుర్తింపు వ్యవస్థ పౌరుల ఆర్థిక లావాదేవీలకు సంబంధించిన సమాచార సేకరణలో అదివరకు ఉన్న సంక్లిష్టతను పరిష్కరించేదిగా' కొనియాడింది. అంటే 2007 నివేదికలో 'రిటైల్ రంగానికి సంబంధించిన సరైన సమాచారం అందుబాటులో లేదంటూ 'అది వ్యక్తపరిచిన అసంతృప్తికి ఆధార్ లో పరిష్కారం దొరికిందన్నమాట. 2014 డెవలప్మెంట్ రిపోర్ట్‌కి 'ఫైనాన్షియల్ ఇంక్లూజన్' అనే పేరుపెట్టుకున్న ప్రపంచ బ్యాంకు 2016 కొచ్చేసరికి దానికి 'డిజిటల్ డివిడెండ్స్' అని పేరు పెట్టడం ఎంతమాత్రం యాదృచ్చికం కాదు. అంటే రెండేళ్లకే పెట్టుబడి పెట్టకోడి లాభాల గుడ్లుకొచ్చిందన్న మాట.

'ప్రభుత్వ సేవలు అందుకోవడానికి ఆధార్ కార్డ్ తప్పనిసరి కాదని' ఒకపక్క దేశ అత్యున్నత న్యాయస్థానం పదే పదే నొక్కిచెప్తుంటే మరోపక్క దేశ పౌరుడే కానటువంటి మైక్రోసాఫ్ట్ అధినేత బిల్ గేట్స్ మాత్రం " మరో పది సంవత్సరాలలో ఆధార్ కార్డ్ విస్తృతంగా వినియోగించ బడుతుందని అన్నాడు. "అబద్ధాలు చెప్పడానికి వీలు లేని స్థితిలో జనాన్ని గుర్తించాలంటే (డిజిటల్ చెల్లింపులు చేయాలంటే) ఆధార్ దానికి పునాది" అన్నాడు. అసలు బిల్ గేట్స్ కి భారత పౌరులకు సంబంధించిన ఆధార్ కార్డుకీ ఏమిటి సంబంధం?

నవంబర్ 17 న బిల్ గేట్స్ భారత ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ మంత్రి రవి శంకర్ ప్రసాద్ ను కలిసినప్పుడు రూ. 50000 కోట్లు ప్రజాధనాన్ని ఖర్చుచేసి 100 కోట్ల భారతీయులకు ఇస్తున్న 'గుర్తింపు కార్డ్' ఎలా పనిచేస్తుందో మంత్రిగారు ఆయనకు వివరించారని ఆయనే స్వయంగా పత్రికాముఖంగా చెప్పుకున్నారంటే విషయం అర్థమౌతుంది.

ఒక పక్క కోట్లాదిమంది ప్రజలు తమ చెమటను ధారపోసి కూడబెట్టుకున్న సొమ్మును నల్లధనం కాదని నిరూపించుకునే క్రమంలో, రోజుల తరబడి 'క్యూ'లో పడిగాపులు కాస్తుంటే మరోపక్క నవంబర్ 16 న నీతి అయోగ్ ఏర్పాటు చేసిన సదస్సులో " లైన్లో నిలబడి సమయం వృధా చేసుకోవద్దని", "సాంకేతిక పరిజ్ఞానమే మార్పుకు సాధనం" అనే బిల్ గేట్స్ మాటలను పొల్లుపోకుండా చెపుతూ "మోడీయే మైక్రోసాఫ్ట్‌కు సాధనం" అని హితబోధ చేస్తాడు దేశ ప్రధాని.

ఒక్క బిల్ గేట్స్ కే కాదు ప్రపంచ దేశాలను ఫైనాన్షియల్ ఇంక్లూజన్ కిందకు తెచ్చి " ప్రపంచాన్ని నగదు లావాదేవీల నుంచి డిజిటల్ చెల్లింపుల దిశగా మళ్లించే లక్ష్యంగా" 2012 లో ఏర్పడ్డ బెటర్ దాన్ కాష్ అలయన్స్ అనే సంస్థకు ఆర్థిక వనరుల్ని చేకూర్చే పాశ్చాత్య బహుళజాతి కంపెనీలైన బిల్ అండ్ మిలిండా ఫౌండేషన్, వీసా, మాస్టర్ కార్డ్, సిటి బ్యాంకు, ఐక్యరాజ్యసమితి కాపిటల్ డెవలప్ మెంట్ ఫండ్ లకు మనదేశంపై

అపారమైన అంగడి ప్రేమ పుట్టుకొచ్చింది. 2015 సెప్టెంబర్ 1 న భారతదేశం కూడా అందులో ఒక సభ్యదేశంగా చేరింది. అంతేకాదు మనదేశం ఆ కూటమితో చేతులు కలిపిందో లేదో, వెంటనే మన 'జన్ ధన్' లెక్కలు రెక్కలు కట్టుకుని అక్కడ వాలిపోయాయి. ఇలా తవ్వుకుంటూ పోతే వీళ్ల ఈ అనుబంధం వెనుక దాగిన అనేక చీకటి కోణాలు బయటపడతాయి.

జి-20 దేశాల వంటి అంతర్జాతీయ వేదికలపై ఫైనాన్షియల్ ఇంక్లూజన్ ని ఒక ప్రధాన అజెండాగా నేడు ప్రపంచ బ్యాంకు పావులు కదుపుతోంది. 2013 లో ప్రపంచ బ్యాంకు ప్రెసిడెంట్ అయిన జిమ్ యంగ్ కిమ్ ప్రపంచంలో బ్యాంకు సేవలు అందని జనాభా దాదాపు 200 కోట్లు అని,, ఆ సంఖ్యను 2020 కంతా 100 కోట్లకు తగ్గించాలని ప్రపంచ దేశాలకు సిఫారసు చేసాడు. అక్కడ యూనివర్సల్ ఫైనాన్షియల్ ఆక్సెస్ 2020 పేరిట ఒక పెద్ద ప్రచారమే జరుగుతోంది. 2015, ఏప్రిల్ 15-17 తేదీలలో ప్రపంచ బ్యాంకు, ఐ ఎం ఎఫ్ లు వాషింగ్టన్ లో నిర్వహించిన ఒక సమావేశంలో ఈ గమ్యాన్ని చేరుకోవడానికి అవసరమైన భాగస్వాములను ఎంపిక చేసే ప్రక్రియను కూడా పూర్తిచేశాయి. ఇందులో మాస్టర్ కార్డ్, వీసా కార్డ్ లు మొదలుకుని మనదేశానికి చెందిన స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా తో సహా మరో 27 ప్రభుత్వ, ప్రైవేటు రంగ సంస్థల ప్రతినిధులు పాల్గొన్నారు. మనదేశం తరఫున స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా కొత్తగా 7 కోట్ల వినియోగదారులను చేరుకునే లక్ష్యంగా పనిచెయ్యనున్నట్లు హామీ ఇచ్చింది.

ఎస్ బి ఐ ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అజెండా ని దేశవ్యాప్తంగా ప్రచారం చేయడంలో చాలా కీలకపాత్ర పోషిస్తోందని, ఇది మొదలైన మొదటి దశలో (2010-13) 20531 గ్రామాలలో రెండు కోట్లా రెండు లక్షల కొత్త ఖాతాలను ప్రారంభించామని, రెండో దశలో (2013-16) మరో 85130 గ్రామాలలో ఏడు కోట్ల కొత్త ఖాతాలను ప్రారంభిస్తామని, ఈ ఏడు కోట్ల ఖాతాదారుల మునుపటి లావాదేవీలను బట్టి చూస్తే వాళ్ల వద్ద అపారమయిన వ్యాపారావకాశాలు కనిపిస్తున్నాయని, వీళ్లకి పెన్షన్, భీమా లాంటి ద్రవ్య ఉత్పత్తులను, సేవలను అమ్మకోవచ్చని ఎస్ బి ఐ చైర్ పర్సన్ అరుంధతి భట్టాచార్య పేర్కొంది. నిత్య సంచలనాల అచంచల నేత, దేశ ప్రధాని నరేంద్రమోడీ మాటల్లోనే కాదు ఆయన పరిచయం చేసే 'సంక్షోభ' పథకాల పేర్లు కూడా 'దనా ధన్?(జన్ ధన్ యోజన)" అంటూ తూటాలై పేలుతూ ఉండాలి. ఆయన ప్రభుత్వ బ్యాంకులకు పంపిన ఈమెయిలు సందేశంలో పేర్కొన్న 7.5 కోట్ల ఖాతాలను తెరవాలన్న 'మన్ కీ బాత్', పైన పేర్కొన్నట్లు అదే సందేశాన్ని 'మోడీ కా బాత్' అన్నట్లు అరుంధతి భట్టాచార్య ప్రపంచ బ్యాంకుకు చేరవేసింది. అలా కాంగ్రెస్ పాలకులు కుట్టిన చొక్కాకు బిజెపి కొంత డిజైన్ మార్చి తన బ్రాండ్ పేరు పెట్టుకుందంతే. కాకపోతే ఇప్పుడు ఆ విధానాలు శరవేగంగా ముందుకు కదులుతున్నాయి. దానికి ప్రధాన కారణం ఎప్పుడూ ఏదో ఒక ప్రాంతీయ పార్టీ మద్దతుతో అధికారాని కొచ్చిన కాంగ్రెస్ పాలన సాగినంత కాలం తుమ్మితే ఊడిపోయే ముక్కులా ఉన్నింది కాబట్టి. ఇక నోట్ల రద్దు లాంటి నిర్ణయాన్ని అమలుపరచడమంటే వాళ్లకి ఆత్మహత్యాసదృశమైనది. ఇక ఈ 'జన ధన యోజన' ఫైనాన్షియల్ ఇంక్లూజన్ లో అంతర్భాగమని ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ నిస్సిగ్గుగా అయినా నిజాయితీగా ఒప్పుకున్నాడు.

ఇక్కడ గమనించాల్సిన మరో విషయం ఏమిటంటే జన ధన ఖాతా ద్వారా ఖాతాదారులకు ఉన్న లక్ష రూపాయల ప్రమాద భీమా వర్తించాలి అంటే ఆ ఖాతాకు అనుసంధాన పరిచిన 'రూపే' కార్డును 45 రోజుల్లో కనీసం ఒక్కసారైనా ఉపయోగించి ఉండాలి అనే నిబంధన ఉంది. ఖాతా దారులు రూ. 5000 అదనంగా తమ ఖాతాలో నుంచి పొందే మరో సదుపాయం ఉన్నట్లు చెప్తున్నారు. వాస్తవానికి ఇది ఖాతాదారు లందరికీ వర్తించదు. ఈ సదుపాయం ఆ ఖాతాదారులు 'రూపే' కార్డును ఎంత ఎక్కువగా వాడుతున్నారు అనేదాన్ని బట్టి ఆయా బ్యాంకులు ఇస్తాయి.

ప్రభుత్వానికి నిజంగా పేదల పట్ల, పేదరికం పట్ల చిత్తశుద్ధి ఉంటే ఈ చీకటి నిబంధనలు దేనికి? అంటే, కేవలం తాము అనుకున్న డిజిటల్ లక్ష్య సాధనలో ప్రజల్ని పావులు చేయడానికే!

ఒకవైపు దళితుల అణిచివేతకు, వ్యవస్థీకృత హత్యల కారకులైన యూనివర్సిటీ వీసీ తెల్లదొరలను అవార్డులతో సత్కరిస్తూ మరోవైపు దళితరంగు పూసి దేశ ప్రజలకు 'అంకితం' పేరిట అమ్ముకోవాలని చూస్తున్న 'భీమ్' టెక్నాలజీ అంతా కూడా 2008 లో అప్పటి ప్రభుత్వం స్థాపించిన నేషనల్ పేమెంట్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అందిస్తున్న సాంకేతిక పరిజ్ఞానమే. అది 'రూపే' కావచ్చు, ×99చ కావచ్చు, యూనిఫైడ్ పేమెంట్స్ ఇంటర్ ఫేస్ కావచ్చు. ఇవి పొరపాటున కూడా దేశంలోని పేదరికం, ఆకలి, కరువులను రూపుమాపే లక్ష్యంగా పనిచేస్తామని ఎక్కడేగానీ చెప్పుకోలేదు. ఇవన్నీ కూడా ఫైనాన్షియల్ ఇంక్లూజన్, డిజిటల్ పేమెంట్స్, కాష్ లెస్ సొసైటీ గురించి మాత్రమే మాట్లాడుతున్నాయి.

ఇదే సమావేశంలో కలకత్తాకు చెందిన 'బంధన్' అనే మరో సంస్థ 2 కోట్ల పై చిలుకు సేవింగ్స్ ఖాతాలను, కోటి వరకు క్రెడిట్ ఖాతా దారులను కొత్తగా చేరుస్తానని తన వంతు భాగంగా స్వీకరించింది. యూనినార్ (టెలినార్) తనవంతు భాగంగా 11 కోట్ల మొబైల్ వినియోగదారులకు(భారత్, బంగ్లాదేశ్, మయాన్మార్, పాకిస్తాన్) ఫైనాన్షి యల్ సర్వీసులు అందజేస్తానని ఒప్పుకుంది. వీసా కార్డ్ 50 కోట్ల మందికి తన సర్వీసులు అందజేయనున్నట్లు చెప్పుకుంది. ఇలా 30 సంస్థలు 'తిలా పాపం తలా పిడికెడు' అన్నట్లు ప్రజల్ని ఈ ఉచ్చులోకి లాగే పన్నాగంలో సేవల పేరిట తమ వాటాలు పంచుకున్నాయి.

2014 ప్రపంచ బ్యాంకు ప్రచురించిన 'గ్లోబల్ డెవలప్ మెంట్ రిపోర్ట్' ముందుమాటలో అంతర్జాతీయ చర్చా వేదికలపై ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అజెండా అంతర్జాతీయ 'సంస్కరణ' స్థాయికి ఎదిగిందని, విధాన కర్తలకి(పార్లమెంటు, శాసనసభల సభ్యులు), రెగ్యులేటర్స్ కి, మార్కెట్ శక్తులకు, ఇతర పెట్టుబడి దారులకు మధ్య ఇది ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకుందని స్పష్టంగా చెప్పారు. అంటే ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అనేది ప్రపంచ బ్యాంకు సంస్కరణ సారాంశమన్న మాట. ఇందులోనే, జాతీయ స్థాయిలో మార్కెట్ ని నియంత్రించే ప్రభుత్వ రంగ సంస్థలు ఫైనాన్షియల్ అజెండాకి ప్రాధాన్యత ఇవ్వాలని కూడా పేర్కొన్నారు. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 50 దేశాలు ఈ అజెండాకై దిశానిర్దేశం చేశాయని కూడా చెప్పారు. 'అన్ని శక్తులు ఏకమౌతున్నాయి' అన్న బిల్ గేట్స్ మాటల వెనకున్న ఆంతర్యం ఇదేనన్న మాట.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత అమెరికాలో అంతర్జాతీయ ద్రవ్య సంస్థ ఉద్యోగి)* వీ

# ప్రైవేట్ విశ్వవిద్యాలయాల వ్యాపారం

***విద్యారంగంలో ప్రైవేటు రంగానికి అనుమతిస్తే అది సామాజిక బాధ్యత మరిచి లాభార్జనే లక్ష్యంగా మారి, ఇప్పుడిపుడే ఉన్నత విద్యలోకి వస్తున్న దళిత, మైనారిటీ, మహిళా వర్గాలకు విద్య అందక మరింత అసమానతలకు దారి తీస్తుందని అంటున్నారు*** **బి. సతీష్**

కె.జి. టు పి.జి. ఉచిత విద్య అనే ఆకర్షణీయమైన ప్రాసతో కూడిన నినాదంతో ఓట్లు బాగానే రాల్చుకొని అధికారంలోకి వచ్చిన తరువాత కూడా ఊదరగొట్టి కొట్టి ఉసూరుమనిపిస్తూ అదే హామీని మరోలా 'నిజం' చేసి నిలబెట్టుకొనే ప్రయత్నాన్ని చేస్తున్నది తెలంగాణ ప్రభుత్వం. అదే కె.జి. టు పి.జి. విద్యను సంపూర్ణంగా ప్రైవేటీకరించి, వ్యాపారీకరణ చేయడం. ఉమ్మడి రాష్ట్రంలో ఉన్నత విద్య, ఉపాధి, ఉద్యోగాలు తెలంగాణ బిడ్డలకు రాకుండా పోయాయని 'బంగారు' తెలంగాణలోనే ఉన్నత విద్య, ఉద్యోగాలు ఊటలాగ ఊరుతాయని, ఊరిస్తూనే కె.జి. టు పి.జి ఉచిత విద్య ఉత్తదే అని తేలిపోయే చర్యలు అనేకం చేపట్టింది. పాఠశాల నుండి కళాశాల స్థాయి వరకు గురుకులాల రూపంలో ఇబ్బడిముబ్బడిగా ప్రకటిస్తూ వస్తున్నది. ఇప్పటికే ఏర్పరచి ఉన్న విద్యాలయాల్లో ఎటువంటి మౌలిక వసతులు, బోధన, బోధనేతర సిబ్బంది నియామక ప్రక్రియ పూర్తి స్థాయిలో జరపకుండానే హడావుడి చేస్తున్నది.

మరోవైపు ముఖ్యమంత్రి గారే స్వయంగా ప్రైవేటు యూనివర్సిటీలకు అనుమతిస్తూ చట్టం తీసుకొస్తామని మంత్రి వర్గ ఉప సంఘాన్ని నియమించడమే కాకుండా ఆ ఉప సంఘంతోనే తన ప్రకటన కనుగుణమైన అభిప్రాయాన్నే చెప్పించుకొని ఆ దిశగా చర్యల్ని వేగవంతం చేసేలా అధికార యంత్రాంగాన్ని పురమాయిస్తున్నాడు. తోటి తెలుగు రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వం ఏకంగా ప్రైవేటు విశ్వవిద్యాలయాల స్థాపనకు సంబంధించిన బిల్లును లోతైన చర్చ, విద్యావంతుల అభిప్రాయంతో సంబంధం లేకుండానే శాసన సభలో ఆమోదింప జేసుకున్నది. అటు ఆంధ్ర ప్రభుత్వం, ఇటు తెలంగాణ ప్రభుత్వం మొత్తం ఉన్నత విద్యారంగ ముఖ చిత్రాన్నే మార్చివేయగలిగే ఈ కీలక విధాన నిర్ణయం తీసుకోవడంలో నేపథ్య పరిస్థితులను, ఏ లక్ష్యాలను ఆశించి ముందుకెళ్తున్నాయి అని తెలుసుకోవడం అవసరం. రాజ్యం ఏ కారణాలు చెప్పకుండానే ఏ విధానాల రూపకల్పననైనా చేయవచ్చుననే రీతిలో ప్రవర్తిస్తున్నది.

ఉన్నత విద్యలో అత్యున్నతమైన అంతర్జాతీయ ప్రమాణాలు తీసుకురావాలని, ప్రపంచ వ్యాప్తంగా పేరుమోసిన విద్యాసంస్థలు, విశ్వవిద్యాలయాలు ఇక్కడికి కూడా వస్తాయని చెప్పుకొస్తున్నది. నిజానికి ప్రైవేటు యూనివర్సిటీల ఏర్పాటుకు సంబంధించిన మార్గం సుగమం అవటం అనేది గత రెండున్నర దశాబ్దాల కాలంలో దేశ వ్యాప్తంగా అమలౌతున్న పునాది రంగ సంస్కరణల నేపథ్యంలో నుంచి వచ్చిందే. బహుళజాతి, కార్పొరేట్ సంస్థల వస్తూత్పత్తుల, సేవల మార్కెట్ సంక్షోభంలోకి పడిపోయిన సందర్భంలో తక్కువ పెట్టుబడులు, తక్కువ రిస్క్‌తో లాభాలు గ్యారెంటీగా కల్గిన విద్యారంగాన్ని ఎంచుకొన్నది. దాంట్లో భాగంగానే 2015 డిసెంబర్‌లో నైరోబిలో జరిగిన గాట్ చర్చలు విద్యను వ్యాపార వస్తువుగా (ట్రేడబల్ గూడ్) పరిగణిస్తూ అన్ని దేశాల్లో కూడా విదేశీ విద్యా సంస్థలను, ప్రైవేటు విశ్వవిద్యాలయాలు నెలకొల్పేలా రంగాన్ని సిద్ధం చేసే దిశలో జరిగినాయి.

విద్యారంగాన్ని మొత్తంగా పరిశ్రమగా మార్చివేసి పెట్టుబడుల ప్రయోజనాలను పదిలపరిచే కుట్రనే ఈ మొత్తం వ్యవహారాన్ని నడిపిస్తున్నది. పచ్చి వ్యాపారానికి ప్రమాణాలనే ముసుగు తొడిగి, అంతర్జాతీయ స్థాయి విద్య అనే ఆర్భాటం వెనక కార్పొరేట్ల గుప్పిట్లో ఉన్నత విద్యను ఊడ్చి పెట్టే ఉదార విధానాలే కానీ అన్ని వర్గాల ప్రజలకు విద్య చేరువయ్యేలా చేయడం మాత్రం కాదు. కొనగలిగే వాడికి కొనుక్కున్నంత, అమ్మగలిగే వాడికి అమ్ముకున్నంత అని అంగట్లో సరుకుగా విద్యను మార్చివేస్తున్నారు.

వ్యాపార ప్రయోజనాల కోసమే ఈ ప్రైవేటు విశ్వవిద్యాలయాలు తప్ప సమాజ విద్యావసరాలు, ప్రజా ప్రయోజనాలు ఏ మాత్రం దీనిలో ఇమిడి లేవన్నది సత్యం. ప్రభుత్వ రంగంలోని యూనివర్సిటీలలో ప్రమాణాలు పెంచుకోలేమని ప్రభుత్వం భావిస్తున్నదా? కేవలం ప్రైవేటు విశ్వవిద్యాలయాలు మాత్రమే ఆ పని చేయగలవని అనుకుంటున్నదా?

అసలు మొత్తంగా ప్రైవేటు రంగ విశ్వవిద్యాలయాల ద్వారా మాత్రమే అంతర్జాతీయ స్థాయిలో ప్రమాణాలు పెరుగుతాయని, ప్రస్తుతం ఉన్న ప్రభుత్వ విశ్వవిద్యాలయాలు పనికిరావని, అవి వర్తమాన అవసరాలకు సరిపడే మానవ వనరుల అభివృద్ధిని చేయలేవని, ప్రమాణాలు నెలకొల్పలేవని చెప్పడం వెనక పెట్టుబడుల ప్రయోజనాలను పరిరక్షించే తమ విధానాలకు ప్రజల్లో ఆమోదం పొందేలా చేసే విష ప్రచారం మాత్రమే తప్ప చారిత్రక వాస్తవం కాదు.

నేటికీ భారతదేశ వ్యాప్తంగా అంతో ఇంతో అంతర్జాతీయంగా పేరుగాంచి, ఉపాధి, ఉద్యోగాలు సంపాదించి పెట్టే స్థితిలో ఉండి అధిక డిమాండ్ ఉన్న విద్యాలయాలన్నీ కూడా కేవలం ప్రభుత్వ రంగంలో మాత్రమే ఉన్నాయన్న విషయాన్ని మరువరాదు. అలా అని తక్షణ ప్రయోజనమైన ఉద్యోగాలు సంపాదించి పెట్టే విద్యనందించే విశ్వవిద్యాలయాలే ఉన్నత భోదనా ప్రమాణాలతో నాణ్యమైన విద్యను అందిస్తున్నాయని అర్థం చేసుకోవాల్సిన అవసరమూ లేదు. ఉన్న విశ్వవిద్యాలయాలను పూర్తిగా నిర్లక్ష్యం చేసి, ఏళ్ల తరబడి వి.సి.లు, పాలక మండల్ల నియామకం జరపకుండా మౌలిక సదుపాయాలతో పరిపుష్టం చేయకుండానే ప్రైవేటు పల్లవిని అందుకుంటున్నాయి ప్రభుత్వాలు.

గత దశాబ్ద కాలంగా తెలంగాణలో వచ్చిన నూతన విశ్వవిద్యాలయాల్లో పరిస్థితి మరింత అధ్వాన్నంగా తయారయ్యింది. పాలమూరు యూనివర్సిటీలో శాశ్వత ప్రాతిపదికన నియమించబడిన బోధనా సిబ్బంది పట్టుమని పదిమంది కూడా లేరు. భోదనేతర సిబ్బంది ఒక్కరంటే ఒక్కరు కూడా లేరంటే ఏ మాత్రం అతిశయోక్తి కాదు. మిగతా విశ్వవిద్యాలయాల పరిస్థితి కూడా ఇంతకంటే భిన్నంగా ఏమీ లేదు. ప్రభుత్వం తన ఆధీనంలో

ఉన్న వాటిని అన్ని విధాల బలోపేతం చేయకుండా ఇప్పుడిప్పుడే ఉన్నత విద్యకు చేరుకుంటున్న దళిత, బడుగు, బలహీన వర్గాల మైనార్టీ, మహిళా వర్గాలకు ఉన్నత విద్యను అందని ద్రాక్షగా మార్చే కుట్రనే ఈ ప్రైవేటు ప్రతిపాదన. ప్రజల్లో మరింత అసమానతలను, అంతరాలను పెంచే, ప్రజాతంత్ర విద్యను విచ్ఛిన్నం చేసే చర్యనే.

గత కొన్ని దశాబ్దాలుగా ప్రైవేటు రంగంలో విద్య ఈ దేశంలో ఏయే వర్గాలకు ఎంత ప్రయోజనకరంగా ఉన్నదో, మొత్తం సమాజ వికాసానికి ఏ మేరకు ఉపకరించిందో ప్రైవేటు జపం చేస్తున్న ప్రభుత్వాలే చెప్పాలి. ప్రాథమిక స్థాయి నుండి కళాశాల స్థాయి వరకు ఈ దేశంలో ప్రైవేటు రంగం పట్టు ఆందోళనకరంగా పెరిగిపోతున్నది. ఇవాళ అది ఒక వికృత స్థాయికి చేరుకున్నది. అదో మాఫియాలా తయారై విద్యా వ్యవస్థనే శాసించే స్థితికి చేరుకున్నది.

ప్రైవేటు విశ్వవిద్యాలయాల ప్రతిపాదన సింగపూర్ లాంటి నగర రాజ్యాల్లోనే బెడిసి కొట్టింది. ప్రచారార్భాటమే తప్ప ప్రమాణాలు పట్టని అనేక సంస్థలు, వ్యక్తులు ఆ దేశంలో విశ్వవిద్యాలయాలను నెలకొల్పి మొత్తం విద్యా వ్యవస్థనే భ్రష్టుపట్టించిన నేపథ్యంలో అక్కడి ప్రభుత్వం కఠినంగా వ్యవహరించి 90 శాతానికి పైగా అటువంటి విశ్వవిద్యాలయాలను మూసివేసింది.

మనదేశంలో కూడా అనేక రాష్ట్రాల్లో ప్రైవేటు విశ్వవిద్యాలయాలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చి కనీస ప్రమాణాలు కూడా పాటించలేక మూతపడినాయి. 2002 లోనే ఛత్తీస్‌గడ్‌లాంటి చిన్న రాష్ట్రంలోనే ప్రైవేటు యూనివర్సిటీలకు అనుమతివ్వడం వల్ల 150కి పైగా యూనివర్సిటీలు జాతరలో దుకాణాల్లా వెలసినవి. కేవలం 3 సంవత్సరాల కాలంలోనే అవి పసలేనివని, పనికిమాలినవని ప్రొఫెసర్ యశ్‌పాల్ సుప్రీంకోర్టుకు వెళ్లడంతో 112కి పైగా ప్రైవేటు యూనివర్సిటీలు దుకాణాలు మూసి వేయాల్సి వచ్చింది.

తెలంగాణలో కూడా అంతకంటే భిన్నంగా ఏమీ ఉండబోదు. ఏ లిక్కర్ కాంట్రాక్టరో, ఇప్పటికే విద్యావ్యాపారం రుచి మరిగిన వాళ్లో ముందుకు వచ్చి విశ్వవిద్యాలయాలను ఏర్పాటు చేస్తామంటారు. ప్రైవేటు విద్యాలయాల్లో అంత ప్రమాణాలు, నాణ్యత ఉంటే కుప్పలు తెప్పలుగా వచ్చిన ఇంజనీరింగ్, ఎం.సి.ఎ., ఎం.బి.ఎ. కళాశాలలు పెద్ద సంఖ్యలో ఎందుకు మూతబడుతున్నట్టు?

ఒకవేళ ప్రైవేటు యూనివర్సిటీలు వచ్చినా వాటిపైన ప్రభుత్వ నియంత్రణ, ఆజమాయిషీ ఉండే అవకాశం అస్సలు ఉండదు. స్కూళ్ల ఫీజులే నియంత్రించలేకపోతున్న ప్రభుత్వం స్వతంత్ర సంస్థలుగా ఉండే ప్రైవేటు విశ్వవిద్యాలయాలను ఏవిధంగానూ నియంత్రించలేవు. అవి అందించే కోర్సులు కూడా వివిధ వర్గాల ప్రజల అభిరుచులకు అనుగుణంగా ఉండేవి కాకుండా మార్కెట్ ప్రయోజనాలకనుగుణంగా రూపొందించబడి మార్కెట్‌కు ఊడిగం చేసే మనుషులను మాత్రమే ఉత్పత్తి చేస్తాయి. సామాజిక శాస్త్రాలు, ప్రకృతి శాస్త్రాలు, సాహిత్యం, తత్వశాస్త్రం, కళలు లాంటివి ఏవీ వారి ఊహల్లో కూడా ఉండవు. ఇప్పటికే కార్పొరేట్ విద్యారంగమంతా వాటిని పనికిరాని శాస్త్రాలుగా తేల్చిపారేసింది. కళలు, సాహిత్యాలకు చోటులేని ఏ విద్య అయిన మనుషుల్ని మరమనుషులుగా మాత్రమే మలుస్తుంది.

ఇవాళ ప్రభుత్వాలకు కూడా సరిగ్గా ఇదే కావాలి. మనిషిని మనిషిగా నిలబెట్టగలిగే, ప్రశ్నించే తత్వాన్ని పెంచే విద్య కాకుండా అచేతనంగా మార్చివేసి, ఆత్మ గౌరవం లేని చైతన్య రహితంగా జీవించే ఒట్టి ఆర్థిక జీవులుగా మాత్రమే తయారుచేసే విద్య, అటువంటి యాజమాన్యం కావాలి కాబట్టే తెలంగాణ ప్రభుత్వానికి ప్రైవేటు విశ్వవిద్యాలయాల ఏర్పాటు మరింత ప్రియంగా తోస్తున్నది. ప్రశ్నించే మనిషి ఉనికిలో ఉండకూడదు, వేలెత్తి చూపే సాహసం ఎవరూ చేయకూడదు, సామాజిక శాస్త్రాల అధ్యయనం ద్వారా ప్రజలను చైతన్యవంతం చేసి ప్రభుత్వాలను బోనులో నిలబెట్టే తరాన్ని అంతం చేయాలంటే అలాంటి చైతన్య వేదికలైన ప్రభుత్వ విశ్వవిద్యాలయాలను నిలబడకుండా నిర్వీర్యపర్చాలి. నేరుగా ఆ పనిని చేయలేవు కాబట్టి ప్రభుత్వాలు ఈ ప్రైవేటు మార్గాన్ని ఎంచుకున్నాయి.

తెలంగాణలో అయితే విశ్వవిద్యాలయాలు విప్లవ కేంద్రాలు, కెరటాలు. అంతరాలు, అసమానతల మూలాల్లోకి వెళ్లి చరిత్ర గుప్పిట దాగిన రహస్యాలను ఛేదించి కులవర్గ పునాదుల్ని పెకిలించే ఉద్యమ గళాలు, కళాలు సాయుధులైన మట్టి మనుషులెందరో ఈ విశ్వవిద్యాలయాల ఒడిలోంచి వచ్చిన వారే. గడీల ఆధిపత్యాన్నెదిరించేలా గడ్డిపోచల్ని గడ్డపారలుగా మలిచిన మన కాలపు యుద్ధవీరులు ఈ 'క్యాంపస్'లలో ఉదయించిన కిరణాలే. పాలకులు ఉద్యమించే తరాన్ని కోరుకోవడం లేదు. ఒదిగుండే తరాల్ని మాత్రమే తయారు చేయాలనుకుంటున్నారు. దానికి వేదికలుగా ఈ ప్రైవేటు విశ్వవిద్యాలయాలు పక్కాగా పనికి వస్తాయి. అక్కడ చరిత్రలుండవు, రాజకీయాలుండవు, తత్వశాస్త్రాలస్సలే ఉండవు టై, బెల్టుల తరం మాత్రమే తయారవుతుంది. అందుకే అంత తహతహ పాలకులకు.

చదువును ఎంతకైనా అమ్ముకోవచ్చు, ఎంతైనా సొమ్ముచేసుకోవచ్చు. అయితే అక్కడ జీయర్‌ల పాదపూజలు చేసే 'భక్తి' లోకం, యాగాల, పీఠాల బృందం భద్రంగా ఉంటుంది. అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో సనాతన ప్రవచనాలు, వేధాలు, ధర్మాలను వల్లించే 'శాస్త్రాలు' చాలినంత ఉంటాయి. నరేంద్రుడి ఏలుబడిలో జీయర్ పాదసేవకులైన పాలకులు మార్కెట్‌కు, మతానికి బంధాన్ని మరింత బలోపేతం చేస్తారు.

16 నుండి 23 ఏళ్ల వయస్సున్న యువతీ యువకులు కేవలం 12 నుండి 15 శాతం మాత్రమే ఉన్నత విద్యలో చేరుతున్నారు. ఏ మాత్రం ఉన్నత విద్యావాసనలు తగలని అనేక సామాజిక వర్గాలు ఇంకా ఉన్నాయి. మరోవైపు జిల్లాకో విశ్వవిద్యాలయం ఉండాలని, ఉన్నత విద్యను అన్ని వర్గాలకు మరింత చేరువ చేయాలని ప్రజలు ఆకాంక్షిస్తుంటే ప్రైవేటుకు బాటలు వేయడం తెలంగాణ రాష్ట్ర ఉద్యమ స్ఫూర్తికి విరుద్ధమైనది. ఉద్యమ కాలంలో ఉచిత విద్య నినాదాలిచ్చి ఇప్పుడేమో విద్యను మీరే కొనుక్కోండి, మా బాధ్యత ఏమీ లేదన్నట్టు ప్రవర్తిస్తున్నది తెలంగాణ ప్రభుత్వం. విశ్వవిద్యాలయాలకు ఇవ్వాల్సిన నిధులు ఇవ్వకుండా, ఆర్థికంగా పరిపుష్టం చేయకుండా వాటిని మూసివేసేలా ప్రైవేటు పాట పాడుతున్నది. ఇప్పుడున్న విశ్వవిద్యాలయాల భూముల్ని, ఆస్తుల్ని ప్రైవేటుకు అప్పగించినా ఆశ్చర్యపోవాల్సిందేమీ లేదు. జనాకాంక్షతో సంబంధంలేని ప్రాజెక్టులకు వేలకోట్ల రూపాయలు గుమ్మరిస్తూ అవసరమైన నిధుల్ని అందివ్వకుండా యూనివర్సిటీలను కనుమరుగు చేసేలా, ఏ సామాజిక బాధ్యతా పట్టని లాభార్జనే లక్ష్యంగా పెట్టుకొని పనిచేసే ప్రైవేటు సంస్థలకోసం పనిచేస్తున్నది ప్రభుత్వం. ఒకవైపు గిరిజనుల కోసం, సింగరేణిలో బొగ్గుగనుల అధ్యయనానికై ప్రత్యేక విశ్వవిద్యాలయాల డిమాండ్‌లు ప్రజలనుండి బలంగా వస్తున్న నేపథ్యంలో వాటిని పెడచెవిన పెట్టి మరీ ప్రైవేటు పాటనే పాడుతున్నది ప్రభుత్వం. ప్రజలు వారి సామాజిక ఆర్థిక స్థాయిలతో సంబంధం లేకుండా అందరికి నాణ్యమైన ఉన్నత భోదనా ప్రమాణాలతో కూడిన విద్యను అందించాలన్న రాజ్యాంగ లక్ష్యాన్ని గాలికి వదిలేసి మరిన్ని అసమానతలకు అంతరాలకు దారితీసేలా వ్యవహరిస్తున్నది. రిజర్వేషన్లు పాటిస్తే, కొనుక్కోగల్గిన వారున్నపుడు ప్రైవేటు విశ్వవిద్యాలయాలుంటే తప్పేంటని వాదిస్తున్నారు

# ఉద్యమ మేధావి బి. జనార్దన్ రావు

***ఆదివాసులపై, తెలంగాణపై పరిశోధించి, ఆలోచించి, ఉద్యమ నిర్మాణం చేసిన తొలితరం మేధావి గురించి వివరిస్తున్నారు* డా. సుంకరి సత్యం**

ప్రొ. బి. జనార్దన్ రావు గురించి ఇప్పుడు రాయాల్సిన అవసరం ఏంటి? ఇప్పుడు ఈయన గురించి తెలుసుకోవడం అవసరమా? దీనికి ఒకే ఒక కారణం, ఆయన ఉద్యమకాలంలో లేవనెత్తిన చాలా అంశాలు సమకాలీన తెలంగాణ రాజకీయాల్లో, పాలనా విధానాల్లో ప్రముఖ పాత్ర పోషించే అవకాశముంది. ఆలోచనలను రేకెత్తించే వివేకముంది.

జనార్దన్ అంటే జననాడి, ప్రజల మనిషి. అత్యంత సామాన్య ప్రజల గొంతుక, ఆదివాసుల గుండె చప్పుడు, అడవితల్లి ఆత్మ. అర్థవంతమైన ఆలోచనలకు ఒక వేదిక ఈ సారు వ్యక్తిత్వం. ఉవ్వెత్తున ఎగిసిపడే ఒక ఆలోచనల కెరటం. శక్తివంతమైన ఉపన్యాస పటిమ. ఇవన్నీ కలగలుపే ప్రొ. జనార్దన్‌రావు. వరంగల్ జిల్లాలో ఒక సామాన్య రైతు కుటుంబంలో జన్మించి, అకడమిషియన్‌గా, పరిశోధకుడిగా, విలక్షణమైన సామాజిక శాస్త్రవేత్త, విద్యావేత్త, సాహితీవేత్త, ఒక సామాజిక కార్యకర్తగా అన్నిటికన్న ముఖ్యంగా ఉద్యమ మేధావిగా, విస్తృత ఆలోచనలతో సామాజిక మార్పులను, వాటి మధ్య ఉన్న సంబంధాలను, విరుద్ధ స్వభావాలను తెలంగాణ ఉద్యమ సందర్భాన్ని అన్వయించి ప్రత్యేక రాష్ట్ర సాదన అనివార్యతను సవివరంగా విశ్లేషించిన మృదుస్వభావి. ప్రత్యేక రాష్ట్ర ఆవశ్యకతను, దశాబ్దాలుగా తెలంగాణ పై కొనసాగిన అణిచివేత, కుట్రపూరిత రాజకీయాలు, వనరుల దోపిడీని నిట్టనిలువున నిలబెట్టిన ఘనత ఈ ఉద్యమ మేధావిది.

తెలంగాణ సాహిత్యం విషయంలో తనదైన శైలిలో ఉద్యమం ఉరకలెత్తినట్టు, అక్షరాలే ఉద్యమ వీరులైనట్లు, పాటలు తెలంగాణ ద్రోహుల గుండెలను చీల్చినట్లు సాగేవి. 'తెలంగాణ ఆటలాడుదాం, తెలంగాణ పాట పాడుదామంటూ మొదలుపెట్టి, తెలంగాణకున్న అస్తిత్వ నిర్మాణాన్ని, సామాజిక అంతరంగాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేశారు. దానిలో భాగమే, ఆదివాసుల అస్తిత్వాన్ని కూలంకషంగా వివరించే ప్రయత్నం చేశారు. తన పరిశోధనలో బాగంగా, వరంగల్ జిల్లా గిరిజన ప్రాంతంలో మూడు గ్రామాలలోని ఒక కేస్ స్టడీలో, స్థానిక భూస్వాములు ఏ విధంగా భూమిని పెద్ద ఎత్తున తారుమారు చేశారో, ఎలా ప్రభుత్వాలు వాటిని అరికట్టలేకపోయాయో విశదీకరించారు. ఆదివాసి పేదరికం, వెనుకబాటుతనం, వాటికి దారితీసిన రాజకీయాలను మానవశాస్త్ర కోణంలో చేసిన పరిశోధన విధానం, సామాజిక శాస్త్రాల అధ్యయన పద్ధతులకూ ఒక నూతన ఒరవడిని ప్రతిపాదించారు. 1970-80ల ప్రాంతంలో, ఆదిలాబాద్ జిల్లాలోని ఉట్నూరు, నార్నూరు, చుట్టు పక్కల ఉన్న ఇతర మండలాల్లో కొనసాగించిన పరిశోధన విధానానికి, అదనంగా చారిత్రక కోణంలో, విశాల మానవధర్మ శాస్త్రాన్ని జోడించి కొనసాగించిన అధ్యయనం ద్వారా సాంప్రదాయక గిరిజన/ఆదివాసి హక్కులు, జీవనోపాధులు, నూతనంగా ఉద్భవిస్తున్న ఇతర ఆధునిక వృత్తులపై ఏర్పడబోతున్న సంక్షోభ పరిస్థితులను ముందే వివరణాత్మకంగా తెలంగాణ సమాజానికి అందించారు.

ప్రొ. జనార్దన్‌కు తెలంగాణ సామాజిక-ఆర్థిక, రాజకీయ వ్యవస్థలపై స్పష్టమైన అవగాహన ఉండడమేగాక, ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన అన్యాయాలు, ఆర్థిక వనరుల నిలువు దోపిడి, బడ్జెట్ పంపిణీలో అసమానతలు, సాగునీటి కేటాయింపులో అన్యాయాలు లాంటి విషయాలపై స్పష్టమైన ఆధారాలతో అవగాహన, కూలంకుషంగా వివరించగలిగే సత్తా ఉండేది.

హైదరాబాద్ అభివృద్ధి కేంద్రంగా, ముఖ్యంగా మెదక్, రంగారెడ్డి జిల్లాల ముఖ చిత్రాన్ని, అవి ఏ విధంగా ధ్వంసం అవుతున్నాయో, వాటి విపరీత పరిణామాలు తెలంగాణను ఎలా అన్యాయం చేస్తున్నాయో

---

కొందరు. అసలు ప్రమాదమంతా ఇక్కడే ఉన్నది. రిజర్వేషన్లు ఆయావర్గాల హక్కు, అది రాజ్యం నెరవేర్చాలి. ప్రైవేటు దయాదాక్షిణ్యాలకు వాటిని వదిలివేయడం సామాజిక న్యాయ భావనకు గొడ్డలిపెట్టు. ఇప్పటికే విద్యాహక్కు చట్టంలో పేర్కొనబడిన రిజర్వేషన్ల అంశానికి ప్రైవేటు రంగం ఎంతగా తూట్లు పొడిచిందో చూస్తూనే ఉన్నాం. ప్రైవేటు విద్యాలయాలే నాణ్యమైనవనే భావనను ప్రభుత్వాలు ప్రజల మెదళ్లలో బలంగా నాటడం వల్ల ఆస్తి పాస్తుల్ని తాకట్టు పెట్టైనా చదివిస్తూ అనేక కుటుంబాలు వీధిపాలవుతున్నాయి. ఇంకా విశ్వవిద్యాలయాల స్థాయిలో అయితే ఈ వికృత పోకడలకు అంతే ఉండదు. అవి మరింత సంక్షోభాన్ని సృష్టిస్తాయి. విలువలు లేని, మనిషిని ప్రేమించని వ్యాపార జీవుల్ని మాత్రమే ప్రైవేటు విద్యావ్యవస్థలు ఉత్పత్తి చేస్తాయి. ఇవాల టాటా, జిందాల్, బిర్లా లాంటి కార్పొరేట్ విద్యాలయాల్లో చదివే వాళ్లంతా సంపన్న శ్రేణి వర్గాలే. ఆ వర్గాలే మళ్లీ సమాజంపై అనేక అధికార పీఠాల్లోకి వచ్చి ఆధిపత్యం చేస్తారు. అందరివీ, అందరిదీ అనే సమిష్టి భావన కల్గిన ప్రభుత్వ విద్యాలయాల్లోనే ఏ వివక్ష లేకుండా పౌరులందరికీ నాణ్యమైన విద్యనందించాలి. ప్రభుత్వ రంగంలో ఉన్న అనేక విశ్వవిద్యాలయాల్లో మౌలిక సమస్యలను తక్షణమే పరిష్కరించడమే కాకుండా అవసరమైన చోట కొత్త యూనివర్సిటీలను నెలకొల్పాలి. నిధుల లేమి, సిబ్బంది కొరత లేకుండా శాశ్వత ప్రాతిపదికన చర్యలు చేపట్టాలి. ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు విద్యావ్యాపారం ద్వారా లాభాలు చూపెట్టేలా ప్రైవేటు విశ్వవిద్యాలయాలకు మార్గం వేయడం కాకుండా శ్రమను గౌరవించే, అంతరాలను రూపుమాపే, స్వేచ్ఛాయుత ఆలోచనలను ప్రేరేపించే, సమిష్టి తత్వాన్ని పెంచే, సమసమాజ భావనను విస్తృతపర్చటమే విద్యా లక్ష్యంగా విశ్వవిద్యాలయాల పనితీరును మెరుగుపర్చే విధంగా మాత్రమే ప్రభుత్వాలు వ్యవహరించాలి.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

శాస్త్రీయ ఆధారాలతో వివరించారు. అసలు రంగారెడ్డి జిల్లా రెవెన్యూ, పరిపాలన సంబంధిత అంశాలను హైదరాబాద్ జిల్లా నుండి నిర్వహిస్తున్నారు. దాదాపు 2300 నుంచి 2500 చిన్న, మధ్యతరహా, భారీ పరిశ్రమలను స్థాపించారు. వాటిలో ఒక్కటి కూడా తెలంగాణ సమాజానికి సంబంధించింది కాదు. అందులో ఈ ప్రాంతపు మానవ వనరుల ప్రవేశం అసలే లేదు. దీనిలో వచ్చే ఆదాయం మాత్రం ఇతర ప్రాంతాల వారిది. ఈ పారిశ్రామిక వ్యర్థాల వల్ల వచ్చే రోగాలు, కాలుష్యం మాత్రం ఈ ప్రాంత ప్రజలవి. వనరులు ఈ ప్రాంతానివి, కాని ఈ ప్రాంతపు వనరుల ద్వారా వచ్చిన లాభాలు మాత్రం మనవి కాదు. ఇది హైదరాబాద్ జిల్లా కేంద్రంగా జోడించిన అభివృద్ధి.

హైదరాబాద్ అభివృద్ధిలో బాగంగా, కొత్తగా 140 పైచిలుకు కొత్త కాలనీలు ఏర్పడ్డాయి. ఇవన్నీ కూడా సీమాంధ్ర నుండి వచ్చి స్థిరపడ్డవారివే. అయితే వచ్చి స్థిరపడడాన్ని ఎవరు వ్యతిరేకించట్లేదు కాని, ఆ వచ్చిన వారి వివరాలను విశదీకరిస్తే, తేలేదేమంటే, వారికి అదే స్థాయిలో ఉద్యోగాలు లభించాయన్నమాట. అంటే ఇక్కడ నష్టపోయింది ఎవరు? తెలంగాణ కాదా, ఇక్కడి ప్రజలు కాదా అని ప్రశ్నించేవారు.

ఆంధ్ర ప్రాంతాన్ని అన్నపూర్ణగా చేసి, తెలంగాణను కరువు భూమిగా మార్చిన కపట రాజకీయాలను లెక్కలతో సహా కక్కించడానికి జయశంకర్ సార్‌తో ఎన్నో రాత్రులు, పగళ్లు శ్రమించి సమాచారాన్ని క్రోడీకరించారు. మెదక్ జిల్లాను మెతుకు లేని జిల్లాగా మార్చడానికి, పరిపాలన సౌలభ్యమంటూ ఆ జిల్లాలోని కొన్ని పారిశ్రామిక ప్రాంతాలను రంగారెడ్డి జిల్లా పరిదిలోకి తేవడం లాంటి సంఘటనలను ఆధారాలతో వివరించేవారు. కలిసి ఉంటామనే కుట్రలను చేదించి, అసలు కలిసి ఉంటే ఎలా ఉండాలో విశ్లేషించేవారు. కలిసి ఉండడం అంటే భావోద్వేగంగా కలిసి ఉండాలి కాని, అభివృద్ధిలో, వనరుల పంపిణీలో, రెవెన్యూ వాటాలలో కాదా? అందుకే, అది కాని పని కాబట్టి, తెలంగాణ తథ్యం, ఆవశ్యం అని నిర్ధారణకు వచ్చారు.

ఇపుడు కృష్ణ నీటి వనరుల పంపిణీపై తర్జనభర్జనలు జరుగుతున్న ఈ సమయంలో, జయశంకర్ సార్, జనార్ధన్‌రావు సార్ కలిసి, కృష్ణా నదిలో జరుగుతున్న పంపిణీ బూటకాన్ని ఎప్పుడో బట్టబయలు చేశారు.

అలా నాగార్జునసాగర్ కుడి కాలువ, శ్రీశైలం, తెలుగుగంగ ఇవన్నీ నీటి పారుదల సామర్థ్యాన్ని పెంచడమే గాకుండా వ్యవసాయ ఉత్పాదకతను పెంచేసి, మిగులును సమకూర్చాయి. ఆ విధంగా సారవంతమైన సాగు భూములుగా ఏర్పడి, వ్యవసాయ దిగుబడుల ద్వారా ఆర్థిక వనరులు సమకూర్చుకొని, వ్యవసాయరంగం ద్వారా వచ్చిన ఆదాయాన్ని, తిరిగి ఇతర రంగాలలో ముఖ్యంగా సినిమా, లిక్కర్, రియల్ ఎస్టేట్ రంగాలలో పెట్టుబడులు పెట్టడానికి అవకాశమేర్పడింది. ఇలా నూతన పెట్టుబడిదారీ వర్గం ఏర్పడి మరింత కుట్రలకు తెరతీయడం జరిగింది. అలా తెలంగాణను ముప్పు తిప్పలు పెట్టి, అన్ని రకాలుగా అన్యాయానికి గురిచేశారు. ఇక, గోదావరి నది విషయంలోనూ అలానే జరిగింది.

ఈ విషయాన్ని కూడా చాలా వేదికల మీద కుండబద్దలుకొట్టడం జరిగింది. సీమాంధ్ర నాయకత్వం ఆడిన భావోద్వేగ రాజకీయాలను సైతం, వారు ప్రవేశపెట్టిన పాలన సంస్కరణలు కాని, పథకాల రూపకల్పన లో దాగి ఉన్న కపట సమైక్యత రాగాన్ని కాని బట్టబయలు చేశారు.

సీమాంధ్ర నాయకత్వానికి సూటిగా సంధించిన ప్రశ్న ఏంటంటే, అధికారిక లెక్కల ప్రకారం తెలంగాణ ప్రాంతంలో అధిక వర్షపాతం నమోదవుతున్నపుడు, ఆ స్థాయిలో నీటి నిలువ ఉండాలి కదా, మరి అలా ఎందుకు జరగట్లేదు? ఈ ప్రశ్న అప్పటికే కాదు, ఇప్పటికీ, ఎప్పటికీ తెలంగాణకు ఉపయోగపడేదే. ఎందుకంటే, ఆయా స్థాయిల్లో నీటినిలువ సామర్థ్యం పెంచే ఆలోచనలు ఇప్పటి ప్రభుత్వాలకు ఎంతైనా అవసరం.

సార్‌కు ఆదివాసుల హక్కులు ముఖ్యంగా గిరిజన ప్రాంతాలలో అక్రమ భూ బదలాయింపు, భూమి పరాయీకరణపై ఆది నుంచి ఆసక్తి ఉండడమే గాక, 1985 ప్రాంతంలో పి.హెచ్.డి పరిశోధనలో బాగంగా చేసిన అధ్యయనం అందుబాటులో ఉన్న ఉత్తమ సాహిత్యంగా ఇప్పటికీ పరిగణింపబడుతుంది. అలా, జనార్ధన్‌రావు సార్ ఆదివాసుల అభివృద్ధి, భూ సమస్యలపై ఎన్నో పరిశోధనా వ్యాసాలు, పుస్తకాలు ప్రచురించడమే గాకుండా, మానవ హక్కుల కార్యకర్తగా, అదివాసుల హక్కుల పరిరక్షణకు జరిగిన అనేక ఉద్యమాలలో పాలుపంచు కోవడంలో జరిగిన పరిణామాలు, ఆయా సంఘటనలతో పరిచయం, ఆసక్తి కారణంగా తెలంగాణ రాష్ట్ర సాధనలో ముఖ్యుడయ్యారు.

ఉద్యమ స్ఫూర్తి ఒకవైపు, బోధన-పరిశోధన మరో వైపు, రెండు విరుద్ధ తత్వాలను సమాంతరంగా ముందుకు తీసుకువెళ్లిన ఉద్యమ తాత్వికుడు. ఉసిళ్ల పుట్టలై ఊరిన మన పని-పాటల్ని కమ్మేస్తున్న దొంగ టివి ఛానళ్లను ఊడబెరికి మన జానపదాల్ని కాపాడుకుందామంటూ' పిలుపునిచ్చిన మట్టి బెడ్డ ఈ తెలంగాణ బిడ్డ. దీన్ని తెలంగాణ ఆత్మ అంతరంగాల్లోంచి తొంగిచూస్తూ, ఈ ప్రాంతపు చారిత్రాత్మక-సామాజిక అంతరంగాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేశారు. ఎందుకంటే తెలంగాణ సమాజంలో ఉన్న విభిన్న సామాజిక సమూహాల మధ్య ఉన్న మానవీయ సంబంధాలను, సమైక్య రాష్ట్రంలో అత్యంత ప్రభావంగా ఆధిపత్యపు సాంస్కృతిక ధోరణితో టీవీ ఛానళ్ల ద్వారా చిన్నాభిన్నం చేశారో వాటిని తిరిగి కాపాడవలసిన బాధ్యతను తన ఆలోచనా విధానంతో ప్రభావితం చేసిన అడవి తల్లి జన మేధావి. మన మూలాలను, చారిత్రకంగా నిర్మింపబడ్డ మన మానవీయ సాంప్రదాయాలను కాపాడమని గుండె లోతుల్లోంచి మనుషుల ఘర్షణను వెలికి తీసిన మహా సంఘర్షి.

తెలంగాణ సకల సమస్యలపై చూడ చక్కని రీతిలో మాటల మంత్రదండాన్ని పేర్చి, తెలంగాణ పేగుబంధాన్ని సకల జనులకు అంటకట్టిన ఉద్యమ మేధావికి జోహార్లు. తెలంగాణ సమస్యలపైనే గాకుండా, అస్తిత్వ రాజకీయ నిర్మాణంలో భాగమై, ఉద్యమా లకు రాజకీయ వేదికగా పేర్చబడ్డ తెలంగాణ రాష్ట్ర సమితి పార్టీ నిర్మాణంలో భాగమై తనకున్న పరిశోధన అనుభవాన్ని, ఉద్యమ నేపథ్యాన్ని జోడించి, పార్టీని ప్రజలకు దగ్గర చేయడంలో సఫలీకృతుడయ్యారు.

మే 12, 1956లో జన్మించి, ఫిబ్రవరి 27, 2002 నాడు తన ఆత్మను, భౌతిక నిర్మాణంతో వేరుచేసుకొని, నిరంతర మానసిక సంఘర్షణకు, ఘర్షణాత్మక ఆలోచనలకు విశ్రాంతినిచ్చాడు. కాని తన ఆలోచనలతో నిర్మించిన తెలంగాణ ఉద్యమాన్ని మాత్రం తనతో ఎన్నో రాత్రులు - పగళ్లు చర్చించిన మిత్రులకు, శ్రేయోభిలాషులకు, సిద్ధాంతపర శత్రువులకు మాత్రం విశ్రాంతినివ్వలేదు. పేరుకు తగ్గట్టుగానే, బియ్యానికి - బతుక్కి మధ్య ఉన్న బంధాన్ని, బతుక్కి-సమాజానికి ఉన్న సంబంధాన్ని ఎప్పుడూ వేరు చేయలేదు. ఆ విధంగా ప్రకృతికి-ఆదివాసుల బతుకులకు ఎప్పుడూ బాసటగానే నిలబడ్డాడు. పోలవరం ప్రాజెక్ట్-దాని పర్యవసానాలు, ఆదివాసుల సంస్కృతి-జీవనోపాదుల విధ్వంసం ఎన్నో ఉద్యమ - ఆకాడమిక్ వేదికల మీద లోతైన అవగాహనతో మౌలిక - మూల కారణాలు, ప్రాథమిక అంశాలపై చర్చించి నిర్దిష్ట ప్రామాణిక వ్యాఖ్యానాలను నిర్మించి వాటి ఆధారంగా ప్రజాస్వామ్యయుత చర్చలకు మరింత బలాన్ని చేకూర్చే విధంగా అవకాశాన్ని కల్పించారు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, కౌన్సిల్ ఫర్ సోషల్ డెవలప్‌మెంట్)* వీ

# నిజ నిర్ధారణే నేరమా?

***చత్తీస్‌గడ్ లో మానవహక్కుల ఉల్లంఘన ఘటనలపై నిజనిర్ధారణ సాగించడానికి తెలంగాణ నుంచి వెళ్లిన బృందాన్ని పోలీసులు నిర్బంధించి, తప్పుడు కేసులు బనాయించి ఎలా వేధిస్తున్నారో వివరిస్తున్నారు* పద్మజా షా**

కొత్త సంవత్సరానికి చత్తీస్‌గడ్ ప్రభుత్వం ఎన్నో ఘటనలతో ఆహ్వానం పలికింది. మొదట నక్సలైట్లతో సంబంధాలున్నాయనే చత్తీస్‌గడ్ పోలీసులు చేసిన తప్పుడు ఆరోపణలపై జైలులో ఉన్న ఆదివాసి కార్యకర్త కోపా కుంజమ్ ఏడు సంవత్సరాల తర్వాత విడుదలయ్యాడు. ఆ తర్వాత ప్రభుత్వ భద్రతా బలగాలు ఆదివాసి స్త్రీల మీద సాగించిన లైంగిక అత్యాచారాలకు, నేరాలకు ప్రభుత్వం బాధ్యత వహించాలని జాతీయ మానవహక్కుల సంఘం నోటీసులు ఇచ్చింది.

అదే వారంలో దంతెవాడ జిల్లా కోర్టులోని నక్సల్ ప్రత్యేక విభాగం ఏడుగు పౌరహక్కుల కార్యకర్తల బెయిల్ దరఖాస్తులను కొట్టివేసింది. వారు ఆంధ్రప్రదేశ్, తెలంగాణ హైకోర్టు న్యాయవాదులు చిక్కుడు ప్రభాకర్, బల్లా రవీంద్రనాథ్, జర్నలిస్టు బి దుర్గాప్రసాద్, ఆంధ్రప్రదేశ్ కుల నిర్మూలన పోరాట సమితి అధ్యక్షులు దుడ్డు ప్రభాకర్, ఆదివాసి తుడుం దెబ్బ ప్రధాన కార్యదర్శి ఆర్ లక్ష్మయ్య, పరిశోధక విద్యార్థులు రాజేంద్ర ప్రసాద్, నజీర్. వారిని డిసెంబర్ 25న తెలంగాణ పోలీసులు అరెస్టు చేసి చత్తీస్‌గడ్ పోలీసులకు అప్పగించారు.

తమ బృందం చత్తీస్‌గడ్‌కు నిజనిర్ధారణ కోసం వెళుతుండగా, తమ మోటర్ సైకిళ్లను నాలుగు జీపులలో వచ్చిన, సాధారణ దుస్తుల్లో ఉన్న చత్తీస్‌గడ్ పోలీసులు తెలంగాణలోని దుమ్ముగూడెంలో చుట్టుముట్టారని, తమను ఆ జీపుల్లోకి లాగడానికి ప్రయత్నించగా తాము ప్రతిఘటించామని, అప్పుడు వాళ్లు తెలంగాణ పోలీసులను పిలిచారని చిక్కుడు ప్రభాకర్ చెప్పారు.

అలా రంగంలోకి ప్రవేశించిన తెలంగాణ పోలీసులు వారందరినీ మొదట దుమ్ముగూడెంలో నిర్బంధంలోకి తీసుకుని, చత్తీస్‌గడ్ పోలీసులకు అప్పగించారు. చత్తీస్‌గడ్ పోలీసులు వారిని కుంట పోలీస్ స్టేషన్ కు తీసుకువెళ్లిన చత్తీస్‌గడ్ ప్రత్యేక ప్రజా భద్రతా చట్టం 2005 లోని సెక్షన్ 8 (2)(3)(5) కింద ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేశారు. వారు నక్సలైట్ల దగ్గర ఉన్న కరెన్సీని మార్చడానికి పాత 500, 1000 రూపాయల నోట్లు ఒక లక్ష రూపాయలు, నిషిద్ధ సాహిత్యం తీసుకు పోతున్నారని నేరారోపణలు చేశారు.

ప్రస్తుతం సుక్మా జైలులో ఉన్న కార్యకర్తలు, న్యాయవాదులు చత్తీస్‌గడ్ పోలీసుల చట్టవ్యతిరేక నిర్బంధానికి సహకరించడంలో తెలంగాణ పోలీసులు నిర్వహించిన పాత్ర పట్ల తీవ్రమైనగ్భ్రాంతిలో ఉన్నారు. ఈ నిర్బంధితులందరూ కూడ ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలోచురుగ్గా పాల్గొన్నవారు. ఎన్నో దశాబ్దాలుగా దళిత, ఆదివాసి, విద్యార్థి హక్కుల కోసం పోరాడుతున్న గౌరవనీయమైన నాయకులు.

దంతెవాడ జిల్లా కోర్టులో 2017 జనవరి 2న నిర్బంధితుల బెయిల్ దరఖాస్తు విచారణకు వచ్చినప్పుడు ఈ రచయితతో సహా, హైదరాబాదుకూ, విశాఖపట్నానికీ చెందిన పదకొండు మంది న్యాయవాదులతో, నిర్బంధితుల కుటుంబసభ్యులతో కూడిన 18 మంది బృందం దంతెవాడ వెళ్లింది.

పంచనామా నివేదిక, జప్తు నివేదికల వంటి బహిరంగ పత్రాలతో సహా నిందితుల మీద పోలీసులు సేకరించామని చెపుతున్న సాక్ష్యాధారాలలో ఏ ఒక్కదాన్నీ డిఫెన్స్ న్యాయవాదులకు చూపించడానికి నక్సల్ ప్రత్యేక కోర్టు ఇబ్బంది పడింది. డిఫెన్స్ న్యాయవాది గట్టిగా పట్టు పట్టినతర్వాతనే న్యాయమూర్తి ఆ పత్రాలను కోర్టులో చదివి వినిపించడానికి ఆమోదించారు.

డిఫెన్స్ న్యాయవాది, తెలంగాణ హైకోర్టు సీనియర్ న్యాయవాది వి. రఘునాథ్, పోలీసు ఆరోపణలను ఖండిస్తూ, పాత నోట్లను తీసుకుపోతున్నారని చూపుతూ, నక్సలైట్ల నోట్ల మార్పిడికి సహకరిస్తున్నారని ఆరోపించడం అర్థరహితమని వాదించారు. ఒకవేళ ఆ ఆరోపణ నిజమని అనుకున్నా, నిర్బంధితులను అరెస్టు చేసిన డిసెంబర్ 25 నాటికి ఒక లక్ష రూపాయల పాత నోట్లను కలిగి ఉండడం ఎంత మాత్రం చట్టవ్యతిరేకం కాదని అన్నారు. నిర్బంధిస్తుల దగ్గర దొరికాయని చెపుతున్న పుస్తకాల జాబితా చూస్తే అవన్నీ బహిరంగ మార్కెట్ లో దొరికేవేనని, వాటిలో ఏ ఒక్కటీ నిషిద్ధ సాహిత్యం కాదని అన్నారు.

అయినప్పటికీ, ఒక నిషిద్ధ సంస్థలో సభ్యత్వం ఉండడం దానికదే నేరం కాదని అరూప్ భుయాన్ కేసులో, సాహిత్యం ఉండడమే నేరం కాదని బినాయక్ సేన్ కేసులో సుప్రీం కోర్టు తీర్పులు ఉన్నాయని, ఒక ప్రజాస్వామిక దేశంలో ఒక వ్యక్తి స్వేచ్ఛలను అరికట్టడానికి అవి కారణాలు కాజాలవని రఘునాథ్ వాదించారు.

నిందితులు అనుమతి లేకుండా చత్తీస్‌గడ్‌లో ప్రవేశించారని, వారు స్థానిక పోలీస్ స్టేషన్ లో తమ రాకను నమోదు చేసి, ఏ కారణం మీద వచ్చారో సమాచారం ఇచ్చి ఉండవలసిందని ఒక దశలో పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదించారు. దానికి జవాబిస్తూ, ఏ వ్యక్తి అయినా చత్తీస్‌గడ్ లోకి ప్రవేశించకుండా నిరోధిస్తూ ఏ చట్టమూ లేదని, భారత రాజ్యాంగం ప్రకారం భారత పౌరులందరికీ దేశంలో ఏ ప్రాంతానికైనా వెళ్లే హక్కు ఉన్నదని రఘునాథ్ అన్నారు.

ఈ వాదనలన్నీ విని కూడ సమస్య తీవ్రమైనదనీ, అందువల్ల నిందితులకు బెయిల్ ఇవ్వడం కుదరదని అంటూ ప్రత్యేక కోర్టు బెయిల్ దరఖాస్తును తోసిపుచ్చింది.

ఛత్తీస్‌గడ్‌లోని 'శాంతి భద్రతల' పాలనలో అన్ని సందర్భాలలోనూ జరిగేది దాదాపుగా ఇదే. వ్యక్తులను పట్టుకుంటారు. నక్సలైట్లతో సంబంధాలున్నాయనో, వారికి సహకరిస్తున్నారనో ఆరోపించి ఛత్తీస్‌గడ్ ప్రత్యేక ప్రజా భద్రతా చట్టం 2005 కింద కేసు నమోదు చేస్తారు. సాధారణంగా ఈ కేసుకు ఏ సాక్ష్యాధారాలూ ఉండవు. కాని కింది కోర్టులు బెయిల్ నిరాకరిస్తాయి. "చట్టం తన పని తాను చేసుకుపోతూ ఉండగా" నిర్బంధితులు ఏడెనిమిది సంవత్సరాలు కూడ జైలులో మగ్గిపోవలసి వస్తుంది.

కోపా కుంజం ఉదంతం అదే. ఆయన మీద ఏ ఆరోపణా నిలవక, కేసు కొట్టేసి విడుదల చేసే సమయానికి ఏడు సంవత్సరాలు జైలు జీవితం అనుభవించాడు. కవాసి హిడ్మె అనే ఆదివాసి యువతిని కూడ నక్సలైట్లతో సంబంధాలున్నాయనే ఆరోపణతో నిర్బంధించారు. జైలులో ఆమె మీద అత్యాచారం చేశారు. భయంకరమైన చిత్రహింసలకు గురిచేశారు. అన్ని ఆరోపణలూ కొట్టుడుపోయి ఎనిమిది సంవత్సరాల తర్వాత విడుదలయ్యాక కూడ ఆమెనూ ఆమె కుటుంబాన్నీ పోలీసులు వెంటాడుతున్నారు. ప్రస్తుతం ఆమె సోనీ సోరీ సంరక్షణలో ఉంది. జైలు జీవిత కాలంలో అనుభవించిన దారుణమైన చిత్రహింసలకు, మానసిక హింసకూ శస్త్ర చికిత్సలతో సహా వైద్య చికిత్సలు పొందుతున్నది.

ఛత్తీస్‌గడ్‌లో ఈ ఉదాహరణలు మినహాయింపులు కావు, అవే నిత్యం జరిగే ఘటనలు. భద్రతా బలగాలు, పోలీసులు అనునిత్యం స్త్రీలను అతి భయంకరమైన లైంగిక హింసకు గురి చేస్తారు. ఆ తర్వాత వారి మీద నక్సలైట్ సానుభూతిపరులుగా నేరారోపణలు చేస్తారు. మహిళలపై హింసల, లైంగిక అత్యాచారాల వ్యతిరేక సంస్థ ఎన్నో నిజనిర్ధారణ నివేదికలలో ఈ విషయాలు వివరించింది.

ఛత్తీస్‌గడ్‌లోని సుక్మా, బస్తర్, బీజాపూర్, దంతెవాడ ప్రాంతాలలో జనావాసం చాల తక్కువ. కాని డి.ఆర్.జి, సి.ఆర్.పి.ఎఫ్, ఛత్తీస్‌గడ్ పోలీసులు, బి.ఎస్.ఎఫ్‌ల సంయుక్త, విడివిడి చర్యలతో అవి అతి ఎక్కువగా సైనికీకరణ జరిగిన ప్రాంతాలు కూడ. ఆ ప్రాంతానికి వెళ్లి చూస్తే ఎక్కడ పడితే సాధారణ దుస్తుల పోలీసులతో అదంతా ఒక ముట్టడిలో ఉన్న ప్రాంతమనిపిస్తుంది.

మా పద్దెనిమిది మంది సభ్యుల బృందం దంతెవాడలో బెయిల్ దరఖాస్తు మీద విచారణ వినడానికి వెళ్లినప్పుడు పోలీసులు మా బృందం ఉంటున్న హోటల్ మీదికి ఎన్నోసార్లు వచ్చి దర్యాప్తు చేశారు. హోటల్‌లో ఇచ్చిన మా గుర్తింపు పత్రాల ఫోటో కాపీలు తీసుకుపోయారు. మర్నాడు ఉదయానికల్లా ఆ హోటల్ హాలులో, వరండాలలో సిసిటివి కెమెరాలు నెలకొల్పమని ఒత్తిడి తెచ్చారు.

సల్వాజుడుం వంటి నేర ముఠాలను తయారు చేయడంలో ఛత్తీస్‌గడ్ పాలనా యంత్రాంగం గతంలోనే అపకీర్తి మూటకట్టుకుంది. ఆ ముఠాలు చట్ట వ్యతిరేకమంటూ సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చిన తర్వాత వాటిని రద్దు చేయక తప్పలేదు. కాని ప్రస్తుతం అటువంటి ముఠాల కొత్త అవతారాలు పుట్టుకొచ్చి అదే పద్ధతిలో జర్నలిస్టుల మీద, న్యాయవాదుల మీద, పౌరహక్కుల కార్యకర్తల మీద, విద్యావేత్తల మీద బెదిరింపులు, వేధింపులు, వెళ్లగొట్టే ప్రయత్నాలు సాగిస్తున్నాయి. రాష్ట్రంలో పెద్ద ఎత్తున సాగుతున్న మానవహక్కుల ఉల్లంఘనల వార్తలు బైటికి రాకుండా అడ్డుకుంటున్నాయి.

దంతెవాడ జిల్లా కోర్టులో బెయిల్ దరఖాస్తు తోసిపుచ్చడం జరిగిందో లేదో, తెలంగాణ కార్యకర్తల బెయిల్ నిరాకరణ పట్ల ఇన్‌స్పెక్టర్ జనరల్ కల్లూరి తన సంతోషం వ్యక్తం చేస్తున్నారంటూ సుబ్బారావు అనే వ్యక్తి వాట్సప్ సందేశం పంపాడు. ఈ సుబ్బారావు ఆక్షన్ గ్రూప్ ఫర్ నేషనల్ ఇంటిగ్రిటీ (ఎజిఎన్ ఐ– అగ్ని) అని పేరు పెట్టుకున్న ముఠా నాయకుడు. సామాజిక్ ఏకతా మంచ్ అని మరొక ముఠా అపకీర్తి పాలై, రద్దయిన తర్వాత ఇది పుట్టుకొచ్చింది. ఆ సందేశంలో నిర్బంధిత కార్యకర్తలను "తెల్లచొక్కాల నక్సలైట్లు" అని అభివర్ణించారు. వారి పట్ల ఎటువంటి దయా దాక్షిణ్యాలు చూపబోమని, త్వరలోనే వారిని పోలీసు కస్టడీకి కూడ తీసుకుంటామని అన్నారు. ఇటువంటి బెదిరింపులు నిత్య కృత్యమైపోయాయి.

ఆదివాసుల గ్రామాల మీద దాడి చేయడం, వారినందరినీ జైళ్లకు తరలించడం ఎంత మామూలుగా జరిగిపోతుండేదో ప్రస్తుతం కార్యకర్తల మీద, న్యాయవాదుల మీద, జర్నలిస్టుల మీద తప్పుడు ఆరోపణలు చేయడం కూడ అంతే మామూలుగా జరుగుతున్నది. దేశంలోకెల్లా అతి ఎక్కువ మందిని కుక్కిన జైళ్లుగా ఛత్తీస్‌గడ్ జైళ్లు అపఖ్యాతి పొందాయి. ఛత్తీస్‌గడ్ పోలీసులు నమోదు చేస్తున్న కేసులలో కేవలం 4.3 శాతం మాత్రమే ఆరోపణలు రుజువై శిక్షలు పడుతున్నాయి.

ఎంతమాత్రం జవాబుదారీతనం లేని విచారణాతీత నేరప్రవృత్తి వల్ల ఛత్తీస్‌గడ్‌లో పరిస్థితి రోజురోజుకూ దిగజారుతున్నది. బాధితులకు ఎస్.సి.ఎస్.టి అత్యాచారాల నిరోధ చట్టం కింద నష్ట పరిహారం చెల్లించాలని జాతీయ మానవహక్కుల సంఘం ఆదేశాలు చెపుతున్నప్పటికీ, అసలు ఈ నేరాలు సాగిస్తున్న, మానవహక్కులను ఉల్లంఘిస్తున్న, తప్పుడు కేసులు బనాయిస్తున్న భద్రతా బలగాల మీద ఏ చర్యలు తీసుకోవలసి ఉన్నదో, పాలనా యంత్రాంగానికి జవాబుదారీతనం ఎలా నేర్పవలసి ఉన్నదో జాతీయ మానవ హక్కుల సంఘం చెప్పడం లేదు.

*(రచయిత ఉస్మానియా విశ్వవిద్యాలయ రిటైర్డ్ ప్రొఫెసర్)* వీ

**వచ్చే సంచికలలో...**

- **కాపిటల్‌కు 150 ఏళ్లు - ఎన్. వేణుగోపాల్**
- **బోరేవాలా ముస్లింల బతుకు చిత్రం - షేక్ ఇబ్రహీం**
- **కార్ల్ మార్క్స్ తాత్విక బోధనలు - డా. కత్తి పద్మారావు**
- **డచ్ రోగం.... జనతన వాక్సిన్ - వెన్నెలకంటి రామారావు**

# మార్కెట్ల పునర్విభజన వేటలో ట్రంప్

*మెరుగైన అమెరికా నిర్మాణం అంటూ నూతన అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ అమలు పరుచనున్న విధానాలు చూస్తే హిట్లర్, ముస్సోలనీల అడుగుజాడల్లో నడిచి ప్రపంచాన్ని యుద్ధం వైపు నెట్టే ప్రమాదం ఉందని అంటున్నారు* **పి. ప్రసాద్**

పాతికేళ్ల క్రితం ప్రపంచీకరమ విధానాలను బలవంతంగా ప్రపంచం మీద రుద్దడంలో ఆనాటి అమెరికా పాలకవర్గం కీలక పాత్రను పోషించింది. నాటి ప్రపంచీకరణ ప్రక్రియ నేటి ప్రపంచానికి తగదని వాదిస్తున్న వర్గం నేడు అదే అమెరికాకి నూతన పాలకవర్గంగా ఎన్నికైంది. దేశాల మధ్య సరిహద్దులు అక్కరలేదని ఆనాటి అమెరికా అధ్యక్షుడు సీనియర్ బుష్ వాదించాడు. సరిహద్దులు లేకపోతే అమెరికా సైతం తన అస్తిత్వాన్ని కోల్పోయే ప్రమాదం వుందని వాదిస్తున్న ట్రంప్ నేడు అమెరికాకి నూతన అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. 'నియంతృత్వాల' నుంచి 'మెరుగైన ప్రపంచ' నిర్మాణం కోసం దేశాల సరిహద్దు గోడలను కూల్చే విధ్వంసకుడిగా సీనియర్ బుష్ పేరొందాడు. 'అక్రమ చొరబాటుదార్ల' నుంచి 'మెరుగైన అమెరికా' స్థాపన కోసం సరిహద్దు గోడల నిర్మాతగా నేడు ట్రంప్ వెలుగులోకి వచ్చాడు. నాటి జార్జి బుష్ ప్రభుత్వ ప్రకటిత లక్ష్యం 'మెరుగైన ప్రపంచ స్థాపన'. నేటి ట్రంప్ ప్రకటిత లక్ష్యం 'మెరుగైన అమెరికా స్థాపన'. ప్రపంచీకరణ ప్రక్రియ నాటి బుష్‌కు ముద్దు. అది నేటి ట్రంప్‌కు చేదుగా మారింది. ఈ విధంగా పరస్పర విరుద్ధ విధానాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న నాటి బుష్, నేటి ట్రంప్‌లిద్దరూ కాకతాళీయంగానైనా ఒకే రిపబ్లికన్ పార్టీ నుంచి అమెరికాకి అధ్యక్షులుగా ఎన్నిక కావడం గమనార్హం.

నేడు అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడులకు అమెరికా సారథ్యం వహిస్తున్నది. అమెరికా ఆర్థిక వ్యవస్థ మీద ఆధారపడి దాని అంతర్జాతీయ సారథ్య శక్తి వుంటుంది. అంతర్జాతియ పెట్టుబడులకు సారథ్యం వహించడానికి అవసరమైన సామర్థ్యం అమెరికా ఆర్థిక వ్యవస్థకు వున్నప్పుడే అది సాధ్యమవుతుంది. అలాంటి సారథ్యశక్తికి నేడు సవాళ్లు ఎదురవుతున్నాయి. సీనియర్ బుష్ కాలంలో అమెరికా ఆర్థిక రాజకీయ వ్యవస్థకు యీ తరహా సవాళ్లు ఎదురు కాలేదు. నేడు తనకి ఎదురవుతున్న తాజా సవాళ్లను అధిగమించేందుకు అమెరికా ద్రవ్యఆర్థిక వ్యవస్థ కొత్త పరిష్కారాలను అన్వేషిస్తున్నది. అందులో భాగంగా అది కొత్త ప్రయోగాలకు పూనుకుంటున్నది. వాటి నిర్వహణ కోసం దానికి నూతన సారథులు అవసరమవుతున్నారు. అమెరికా ద్రవ్య వ్యవస్థకు ఏర్పడుతున్న యిలాంటి నూతన అవసరంలో నుంచే ట్రంప్ నూతన అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు. ట్రంప్ ఆకాశంలో నుంచి హఠాత్తుగా వూడిపడ్డ ఉన్మాద పాలకుడు కాదు. అమెరికా సాంప్రదాయ పెత్తందారీ ఆర్థిక వ్యవస్థకు నేడు ఎదురౌతున్న సవాళ్ల నుంచి అది మరింత ఉన్మాదపూరిత విధానాలను చేపట్ట జూస్తున్నది. ట్రంప్ అలాంటి ఉన్మాద విధానానికి నిబద్ధుడైన క్రమశిక్షణగల నూతన పాలకుడు మాత్రమే. పాత ప్రపంచీకరణ ప్రక్రియను కొనసాగించడం ద్వారా లబ్ధిపొందే సాంప్రదాయ అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడులకు ట్రంప్ ఉన్మాదిలా కనిపించడం సహజమే. కానీ పాత ప్రపంచీకరణ సాంప్రదాయ ప్రక్రియను తిరగదోడటం ద్వారా మాత్రమే తమకు లాభం చేకూరుతుందని భావించే అంతర్జాతీయ ధిక్కార ద్రవ్యపెట్టుబడులకు ట్రంప్ అత్యంత సమర్థుడైన మార్గదర్శకునిగా కనిపిస్తాడు. ట్రంప్ నోటి నుంచి వస్తున్న మాటలను బట్టి ఆయన్ని విశ్లేషించడం సరికాదు. ఆయనతో మాట్లాడిస్తున్న అమెరికా ఆర్థిక వ్యవస్థను విశ్లేషించడం సరైన విధానమవుతుంది. అలాంటి శాస్త్రీయ అంతర్జాతీయ రాజకీయ విశ్లేషణకు ట్రంప్ ఎన్నిక సరైన సందర్భమవుతుంది.

1929-30ల నాటి మహామాంద్యం (అతి తీవ్ర ఆర్థిక సంక్షోభం) అమెరికా ఆర్థిక వ్యవస్థను బలహీన పరిచింది. మూడుసార్లు వరసగా అధ్యక్షునిగా ఎన్నికైన రూజ్‌వెల్ట్ హయాంలో అమెరికా కోలుకోవడంతోపాటు అగ్రరాజ్యంగా ఎదిగింది. ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధంలో ప్రత్యక్షంగా పాల్గొనకుండా, కేవలం చివరి దశలో హిరోషిమా, నాగసాకీలపై అణ్వస్త్రాల ప్రయోగంతో అది ఉగ్ర ఆగ్రరాజ్యంగా అవతరించింది. 1945లో యుద్ధం ముగిసే నాటికి ప్రపంచ స్థూల జాతీయోత్పత్తి (జిడిపి)లో అమెరికా జిడిపి వాటా దాదాపు సగానికి చేరుకున్నది. నేటికి డెబ్భై ఏళ్లు గడిచాయి. నేటి ప్రపంచ జిడిపిలో అమెరికా జిడిపి వాటా నాలుగో వంతుకంటె పైగా పడిపోయింది. ముఖ్యంగా పాతికేళ్ల క్రితం కూడా ప్రపంచ జిడిపిలో అమెరికా వాటా దాదాపు నలభై శాతం వుండేది. అది నేడు నాలుగోవంతు కంటె క్రిందికి పడిపోయింది. ప్రపంచీకరమ ప్రక్రియ ప్రపంచ జిడిపిలో అమెరికా స్థానాన్ని మెరుగు పరుస్తుందన్న సాధారణ రాజకీయ అంచనాలన్నీ తలక్రిందులయ్యాయి. ఈ తారుమారైన పరిస్థితుల నుంచే ట్రంప్ పుట్టుకొచ్చాడు. వర్షాలు కురవకుండా ఆకాశంలో మేఘాలుంటాయి. కానీ మేఘాలు లేకుండా వర్షాలు కురవవు. పరిస్థితులు మారిన వెంటనే అందుకు తగ్గ నూతన సారథులు పుట్టకపోవచ్చు. కానీ నూతన పరిస్థితులు లేకుండా నూతన సారథులు పుట్టరు. ప్రపంచీకరణ ప్రక్రియవల్ల అమెరికా స్థానం బలహీన పడుతున్న నేపథ్యం నుంచే 'అమెరికా ఫస్టు', 'బెటర్ అమెరికా' (మెరుగైన అమెరికా) వంటి నినాదాలు పుట్టుకొచ్చాయి. అట్టి నినాదాల వెనక నిర్దిష్ట విధానాలున్నాయి. వాటికి ఒక నేపథ్యచరిత్ర వుంది. ట్రంప్ ఇప్పుడు కొత్తగా వెలుగులోకి వచ్చాడు. కానీ అంతకంటె ముందు కొన్నేళ్ల నుంచే అమెరికా ఆర్థిక వ్యవస్థ యిలాంటి పరిణామక్రమానికి గురౌతూ వచ్చింది. ట్రంప్ కంటె చాలా ముందునుంచే ట్రంప్ విధానాలు అమెరికా ఆర్థిక వ్యవస్థలో బలపడుతూ వచ్చాయి. ట్రంప్ చేపట్టిన విధానాలు ట్రంప్ లేకుండా మనుగడ సాగించగలవు. కానీ అవిలేకుండా ట్రంప్‌కు మనుగడ లేదు.

రూజ్‌వెల్ట్ హయాంలో అగ్రరాజ్యంగా తీర్చిదిద్దబడ్డ అమెరికా ఆ తర్వాత ట్రూమన్ హయాంలో తనదైన బాణీలో ఒక 'నూతన ప్రపంచ క్రమం' ఏర్పాటు కోసం ప్రధానంగా 'శాంతియుత నిర్మాణ ప్రక్రియ'ను చేపట్టింది. అందులో యుఎన్‌ఓ స్థాపన నుంచి నాటో స్థాపన వంటి పరిణామాలున్నాయి. కానీ ఆ తర్వాత ఐసెన్ హోవర్ హయాంలో

కొరియా యుద్ధం వంటి సవాళ్లు ఎదురయ్యాయి. అయితే సూయజ్ కాలవకై సాగిన అరబ్-ఇజ్రాయిల్ యుద్ధం అంతిమంగా మధ్యప్రాచ్యంలో అమెరికా పాగా వేయడానికి అవకాశమిచ్చింది. కెనడీ హయాంలో ఒకింత సాపేక్షిక 'శాంతియుత' పురోగమనం సాగినా జాన్సన్ హయాంలో వియత్నాం విమోచన యుద్ధం అమెరికా ఆర్థిక వ్యవస్థను తీవ్రంగా దెబ్బతీసింది. నాడు తనకు సైనికంగా సవాలుగా మారిన సోవియట్ యూనియన్ను ఏకాకిని చేసే లక్ష్యంతో శత్రువుల మధ్య వైరుధ్యాలను ఉపయోగించుకునే నూతన విధానం నిక్సన్ హయాంలో ఉనికిలోకి వచ్చింది. అందుకే తైవాన్‌కు బదులు జన చైనాను యుఎన్ఓ సభ్యదేశంగా (వీటో పవర్ గల సభ్యరాజ్యంగా సైతం) అమెరికా గుర్తించింది. చైనాతో దౌత్య సంబంధాలలో ఒక వ్యూహాత్మక వైఖరిని నిక్సన్ ప్రభుత్వం ఆనాడు చేపట్టింది. అంతేకాకుండా ఆఫ్ఘనిస్తాన్ను దురాక్రమించిన సంఘటనను అవకాశంగా ఎంచుకొని తన ప్రత్యర్థి అగ్రరాజ్యమైన సోవియట్ యూనియన్‌ను బలహీనపరిచే విధానాన్ని అవలంభించింది. నిజానికి 1970-80ల దశాబ్దాలలో అమెరికా ఆర్థిక వ్యవస్థ తీవ్ర ఆంతరంగిక సంక్షోభానికి గురైనది. తన ఆత్మరక్షణ కోసం రీగన్ హయాంలో తీవ్ర దుందుడుకు విధానాన్ని కూడా అమెరికా అవలంభించింది. కానీ 'కర్ర వంకరను పొయ్యి తీర్చినట్లు' గోర్బచెవ్ హయాంలో సోవియట్ యూనియన్ ఆర్థిక వ్యవస్థ బలహీనపడి చివరకు విచ్ఛిన్నం కావడంతో అమెరికా ఆర్థిక వ్యవస్థకు ఆకస్మికంగా లాభించింది. అది తనకు అత్యంత లాభిస్తుందన్న అంచనాతో ప్రపంచీకరణ ప్రక్రియను చేపట్టింది. అవి తొలిదశలో అమెరికా ఆర్థిక వ్యవస్థకు పంట పండించింది. మలి దశలో లాభం కంటె నష్టం ఎక్కువగా మారింది. నేడు ఆఖరి మూడో దశలో ప్రపంచీకరణ ప్రక్రియ అమెరికా కంటె ఇతర ప్రత్యర్థి రాజ్యాలకు సాపేక్షికంగా ఎక్కువ లాభం చేకూరే పరిస్థితి ముందుకొచ్చింది. వాటి నుంచే తాజా ట్రంప్ విధానాలు రూపొందడం గమనార్హం.

పాతికేళ్ల ప్రపంచీకరణ కాలంలో అమెరికాని సీనియర్ బుష్, బిల్ క్లింటన్, జూనియర్ బుష్, ఒబామా ప్రభుత్వాలు వరసగా పాలించాయి. ఇప్పుడో 'ఐదో సర్కారుకి' ట్రంప్ సారథ్యం వహిస్తున్నాడు. సీనియర్ బుష్ హయాంలో అమెరికా ఏకధృవ అగ్రరాజ్యంగా చెలామణి కాగలిగింది. క్లింటన్ హయాంలో దానికి కొన్ని సవాళ్లు ఎదురయ్యాయి. అయితే కొంత మూల్యం చెల్లించి, వాటిని అది అధిగమించగలిగింది. జూనియర్ బుష్ హయాంలో ఏకధృవ రాజ్యాధిపత్యం ప్రశ్నార్థకమైంది. ఆయన చివరికాలంలో జార్జియా సంఘటన బహుళధృవ ప్రపంచంగా మారడానికి ప్రాతిపదిక అయ్యింది. ముఖ్యంగా బీజింగ్ ఒలింపిక్ క్రీడావేళ (2008 ఆగస్టు) రష్యా సైన్యాలు దక్షిణ ఒసేతియా పునరాక్రమణతో పాటు జార్జియా సరిహద్దు పైపులైన్ ప్రాంతాలపై అదుపును సాధించాయి. దీన్ని ప్రచ్ఛన్నయుద్ధ శకం పునరుద్ధరణకు శ్రీకారం చుట్టిన సంఘటనగా అంతర్జాతీయ రాజకీయ విశ్లేషకులు నిర్వచించడం తెల్సిందే. ఇకముందు ఇరాక్ ఆఫ్ఘనిస్తాన్‌ల తరహాలో దురాక్రమణలు సాగించడం అమెరికాకి సాధ్యంకాదని జూనియర్ బుష్ హయాంలో రుజువైంది. పైగా మరింతకాలం ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్‌లను సైనికంగా నియంత్రించడం సాధ్యంకాదని కూడా రుజువైపోయింది. సరిగ్గా యీ నేపథ్యంలోనే తాను గెలిస్తే అమెరికా సైన్యాలను ఇరాక్ నుంచి పూర్తిగా ఉపసంహరిస్తాననీ, ఆఫ్ఘనిస్తాన్ నుంచి పాక్షికంగా ఉపసంహరిస్తాననీ బరాక్ ఒబామా హామీలిచ్చి గెలుపొందడం గమనార్హం. అంతేకాకుండా రష్యా, చైనాలతో సత్సంబంధాలు కొనసాగిస్తాననడం కూడా తెల్సిందే. అవి ఆనాటి అమెరికా ఆర్థిక వ్యవస్థకు ఆవశ్యకతగా మారింది. దానికనుగుణ్యంగా ఒబామా గెలిచాడు.

ఒబామా ఎనిమిదేళ్ల పాలనలో మున్నెన్నడూ లేని బలహీనతలూ వైఫల్యాలూ, ఓటములూ అమెరికాను వెంటాడాయి. సీనియర్ బుష్ నుంచి జూనియర్ బుష్ వరకూ అనుసరించి యుద్ధోన్మాద విధానాలు అమెరికాకి శాపంగా మారాయి. వాటిని అధిగమించడానికి బదులు అట్టి ఊబిలోనే ఒబామా సర్కారు దిగబడిపోయింది. ఎట్టకేలకు 2011లో ఇరాక్ నుంచి సైన్యాలను ఉపసంహరించింది. అయితే ఇరాక్‌పై సంపూర్ణాధిపత్యాన్ని కోల్పోయింది. ఆఫ్ఘనిస్తాన్‌లో సైన్యాలను కొనసాగిస్తున్నది. అక్కడ కూడా ఆధిపత్యం చేజారింది. ఒబామా మొదటి దశ నాలుగేళ్లలో 'అరబ్ వెల్లువ నుంచి ఆక్యుపై వాల్‌స్ట్రీట్' వరకూ రాజకీయ సంక్షోభాలు వెంటాడాయి. రెండో దశ నాలుగేళ్లల్లో క్రిమియా నుంచి సిరియా వరకూ సైనిక సంక్షోభాలు వెంటాడాయి. ముఖ్యంగా రష్యా సైనికంగా సవాలు చేసే శక్తిగా ఎదిగింది. చైనా ఆర్థికంగా సవాలు చేసే శక్తిగా ఎదిగింది. మరోవైపు యూరప్ మీద తన పూర్వాధిపత్యాన్ని చేజార్చుకుంటున్నది. మధ్యప్రాచ్య పరిస్థితి మరింత ఎదురు తిరిగింది. యాభై ఏళ్లకు పైగా తన వ్యూహాత్మక భాగస్వామి టర్కీ (నాటో సభ్యదేశం కూడా) చేజారడంతో పాటు రష్యాకు సన్నిహితమైంది. ఇరాన్ కూడా రష్యాకు వ్యూహాత్మక మిత్రరాజ్యంగా మారింది. యెమెన్‌లో సౌదీ అరేబియా సాగిస్తున్న యుద్ధం వల్ల అమెరికా అనుకూల గల్ఫ్ కూటమి రాజ్యాలమధ్య వైరుధ్యాలు తీవ్రమయ్యాయి. నల్ల సముద్రం, కాస్పియన్ సముద్ర పరిసర ప్రభావిత ప్రాంతాలు చేజారిపోతున్నాయి. ఇదంతా అమెరికాను క్రమంగా ఆత్మరక్షణ పరిస్థితులలోకి నెడుతున్నది. ఈ నేపథ్యం నుంచే 'అమెరికా ఆత్మరక్షణ' విధానాలకు ట్రంప్ ప్రతినిధిగా ముందుకొచ్చాడు.

అమెరికాను సైనికంగా సవాలు చేస్తున్న రష్యాకంటె, ఆర్థికంగా సవాలు చేస్తున్న చైనా దీర్ఘకాలిక పెను ప్రమాదంగా భావిస్తున్న ధోరణి నేడు అమెరికా కార్పొరేటు వ్యవస్థలో ముందుకొస్తున్నది. ప్రపంచీకరణ విధానాలకు దూరంగా వుంది. తొలిదశలో డబ్ల్యూటీవోలో చేరడానికి చైనా నిరాకరించింది. అది చేరిన తర్వాత చైనా ఆర్థిక వ్యవస్థ వేగంగా విస్తరిస్తున్నది. ఈ కాలంలో జి-7 దేశాల ఆర్థిక వ్యవస్థల జిడిపిలను దాటి నేడు అమెరికా తర్వాత ప్రపంచంలో అతిపెద్ద ఆర్థిక వ్యవస్థగా ఎదిగింది. మరో నాలుగైదేళ్లలో నెంబర్ వన్‌గా మారనున్నది. రష్యా తుపాకులతో అమెరికాకి పక్కలో బల్లెంలా మారుతుంటే చైనా తన చౌక సరుకులతో అమెరికా ఆర్థిక వ్యవస్థను దిగజార్చుతున్నది. చైనా తన సరుకుల రవాణా కోసం ఇరాన్, పాకిస్థాన్ రేవులకు బ్రహ్మాండమైన రవాణా మార్గాలను నిర్మించింది. చైనా నుంచి ఏ దేశాల గుండా (కజకిస్థాన్, రష్యా, బెలారస్, పోలండ్, జర్మనీ, బెల్జియం, ఫ్రాన్స్‌లు) లండన్‌ల వరకూ ఒక కార్గో రైల్వే రవాణా కారిడార్ నుంచి నిర్మించింది. ఈ జనవరిలో తొలి కార్గో రైలు సరుకులతో లండన్ చేరింది. ఇదంతా ప్రపంచీకరణ వల్ల చైనాకు చేకూరిన లాభమే. పైగా పాతికేళ్ల ప్రపంచీకరణ కాలంలో 12 ట్రిలియన్ల డాలర్ల ధనాన్ని అమెరికా యుద్ధాలకు వెచ్చిస్తే తాను సైనికంగా గెలుచుకున్న ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్‌ల పునర్నిర్మాణ ప్రక్రియలలో రష్యా, చైనాలు అధికంగా లాభపడుతున్నాయి. రెండో ప్రపంచ యుద్ధంలో నాటి అగ్రరాజ్యాలు ఫ్రాన్స్, బ్రిటన్‌ల ఆర్థిక వ్యవస్థలు నష్టపోతే, యుద్ధానికి దూరంగా వున్న అమెరికా బాగా లాభపడింది. చరిత్ర పునరావృతమౌతున్నది. నేడు యుద్ధాలు చేసిన అమెరికా బలహీనపడుతున్నది. వాటికి దూరంగా వున్న చైనా, రష్యాలు (ముఖ్యంగా చైనా) బాగా లాభపడుతున్నాయి. ఇది అమెరికా ఆర్థిక వ్యవస్థను వేధిస్తున్నది. ఆయిల్, ఇతర సహజ వనరుల కోసం యుద్ధం చేసినా వాటిని పూర్తి స్థాయిలో అనుభవించలేని పరిస్థితి అమెరికా ద్రవ్య పెట్టుబడిలోని ఒక విభాగాన్ని తీవ్ర చర్యలకు పురిగొలుపుతున్నవి. దాని ప్రతినిధే ట్రంప్.

# భారత లౌకిక స్ఫూర్తికి వన్నె తెచ్చిన తీర్పు

*రాజకీయ పార్టీలు తమ రాజకీయ అవసరాల కోసం ప్రజలను కుల, మతాల పేరుతో చీల్చుతున్నాయనీ, ఈ నేపథ్యంలో సుప్రీంకోర్టు కుల, మతాల పేర ఓటు అడగడం నిషిద్ధం చేయడం చారిత్రాత్మకమైన తీర్పనీ అంటున్నారు* **షేక్ కరిముల్లా**

ఎన్నికల నగారా మోగింది. కేంద్ర ఎన్నికల కమిషన్ ఐదు రాష్ట్రాల ఎన్నికల షెడ్యూల్ని ప్రకటించింది. ఐదు రాష్ట్రాలలోని 690 అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరగనున్నవేళ సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పలు విశిష్టమైన తీర్పులిచ్చిన జస్టిస్ ఠాకూర్ పదవీ విరమణకు ముందు జనవరి 3న ఒక మంచి తీర్పు వెలువరించారు. మతం, కులం, భాషల పేరిట ఎన్నికల్లో ఓట్లు అడగడం నిషిద్ధమని, అది అవినీతి కిందికే వస్తుందని జస్టిస్ ఠాకూర్ నేతృత్వంలోని ఏడుగురు సభ్యుల సుప్రీంకోర్టు ధర్మాసనం 4:3 మెజార్టీతో వెలువరించిన తీర్పు ప్రజాస్వామిక భారత లౌకికవాద స్ఫూర్తికి వన్నె తెచ్చింది. అభ్యర్థి మతం, కులం, భాష, ప్రాంతం ఆధారంగా ఓటు వేయాలని విజ్ఞప్తి చేయడం నేరమేనని స్పష్టం చేయడంతో పాటు ఓటర్ల కుల, మత పరమైన గుర్తింపు కోరేటువంటి విజ్ఞాపననైనా రాజ్యాంగ విరుద్ధమేనని కోర్టు తీర్పు చెప్పింది. కులం, మత సంబంధ అంశాలను, రాజ్యం, ప్రభుత్వ కార్యకలాపాల నుంచి వేరు చేయాలని చెప్పింది. అత్యంత ప్రాధాన్యత కలిగిన 1951 ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని సెక్షన్ 123 (3, సవరణ (1961) లను క్రోడీకరించి విపులంగా వివరించే ప్రయత్నం చేసింది. మతం వ్యక్తిగతం అని హిందూత్వ లేదా హిందూ మతం అన్నది భారత ఉప ఖండంలో ప్రజల జీవన విధానం మాత్రమే నని 1955లోనే అప్పటి న్యాయమూర్తి జె.ఎస్. వర్మ నేతృత్వంలోని ధర్మాసనం అభిప్రాయపడింది. మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఎడాపెడా దాడులకు గురవుతున్న భారత లౌకికవాదం, ప్రజాస్వామిక విలువలకు ఈ తీర్పు ఊపిర్లూదింది. 70 ఏళ్ల స్వాతంత్ర భారతదేశాన్ని 'అఖండ భారత్' పేరిట మత రాజ్యంగా మార్చేందుకు సంఘ్‌పరివార్, బిజెపి శక్తులు చేస్తున్న ప్రయత్నాలకు చెంప పెట్టులాంటి తీర్పు ఇది. భారత లౌకిక వ్యవస్థలో మతంతో రాజ్యంకు ఎలాంటి ప్రమేయం ఉండరాదని ఈ తీర్పు కుండబద్దలు కొట్టింది. ఈ నేపథ్యంలో రాజ్యాంగంలోని లౌకికవాదం, కుల, మత రాజకీయాల పరిణామాల చరిత్రను సంక్షిప్తంగా తెలుసుకుందాం.

**లౌకికవాద చరిత్ర**

బ్రిటిష్ వలస పాలకుల రాకకు పూర్వం భారత ఉపఖండంలో మతతత్వం తాలూకు ఆనవాళ్లు లేవనే చెప్పాలి. 1857 సిపాయిల తిరుగుబాటు నందు భారతీయులు కుల, మతాలకతీతంగా కలిసి కట్టుగా పాల్గొన్నారు. ఇలా ప్రజలు కలిసికట్టుగా ఉద్యమిస్తే తమ పని ఖాళీ అని భావించిన వలస పాలకులు 1857 తరువాత చురుగ్గా దేశ ప్రజలను కులం, మతం, భాష ప్రాంతాల వారీగా విభజించడానికి పూనుకున్నారు. దశాబ్దాల తరబడి తరతరాలుగా పెంచుతూ వచ్చారు. లౌకికవాదానికి భారత్‌లో మాత్రమే ప్రత్యేకంగా కనిపించే ప్రత్యేకత ఉంది. వలసవాదంపై పోరాడేందుకు భారతీయులను ఏకం చేసే ఒక భావాజాలంగా 19వ శతాబ్దం ఆఖరులో లౌకికవాదం ఆవిర్భవించింది. భారత జాతీయోద్యమం, కాంగ్రెస్‌లు మతతత్వాన్ని నిర్మూలించడంలో పూర్తిగా విజయవంతం కాకపోయినప్పటికీ - మతతత్వాన్ని వ్యతిరేకించాయి. 1946-47 దేశ విభజన అల్లర్లలో పెట్రేగిన మతతత్వాన్ని, 1948 జనవరిలో గాంధీజీ హత్యకు గురవడంతో ప్రజలు ఈసడించుకున్నారు. 1952లో జరిగిన మొదటి సార్వత్రిక ఎన్నికలలో మతతత్వాన్నే జవహర్‌లాల్ నెహ్రూ ఒక ప్రధాన ఎన్నికల అంశంగా చేసి మతతత్వ పార్టీలను మట్టికరిపించారు. దాంతో అవి నామమాత్రపు స్థాయికి క్షీణించాయి. అప్పటి నుంచి ఈ సమస్యను దాదాపు నిర్లక్ష్యం చేయడంతో ఇది నేడు మరింత జటిలమైపోయింది. ఉత్తర భారతదేశంలో 1980ల చివర ఒక్కసారిగా పెల్లుబికిన హిందూత్వం 1990లో 2000లల్లో తన క్రూరమైన ప్రస్థానాన్ని సాగిస్తూ క్రమంగా భారతదేశమంతట విస్తరించింది. ఇదే సమయంలో 1991లో నూతన ఆర్థిక విధానాల పేరుతో దేశం ప్రపంచ బ్యాంకు కబంధ హస్తాలలో చిక్కుకుంది. ప్రపంచీకరణ యుగం ప్రారంభమైంది. మతం దోపిడీకి సాధనం. అందుకే మార్క్స్ 'మతం ప్రజల పాలిట మత్తు మందు' అంటాడు. దేశం పూర్తిగా పెట్టుబడిదారి విధానంలోకి అడుగు పెట్టే సమయంలోనే హిందూత్వం

---

నాలుగు దశాబ్దాల క్రితం రష్యాను నియంత్రించడానికి నిక్సన్ ప్రభుత్వం చైనాతో స్నేహం చేసింది. అదే దౌత్య విధానాన్ని ట్రంప్ మార్గదర్శకంగా భావిస్తున్నాడు. చైనా సరుకుల చొరబాటుకు వ్యతిరేకంగా రష్యా తుపాకులతో స్నేహం అవసరమని అమెరికాలోని ఒక ద్రవ్యపెట్టుబడి విభాగం భావిస్తున్నది. రష్యా తుపాకుల కంటె చైనా చౌక సరుకులే దీర్ఘకాలంలో ఎక్కువ ప్రమాదమని భావిస్తున్న యీ వర్గం ప్రపంచీకరణ విధానాన్ని మార్చజూస్తున్నది. ప్రపంచ ప్రజలను కొల్లగొట్టడంలో బందిపోటు రాజ్యాలన్నింటి మధ్య నేటికీ వ్యూహాత్మక ఐక్యత అవసరమని నేటి ప్రపంచీకరణ వర్గాలు భావిస్తున్నాయి. అందుకు ప్రపంచీకరమ ప్రక్రియ యధాతథంగా కొనసాగాలని అవి భావిస్తున్నాయి. ఈ ప్రక్రియను తిరగదోడే వర్గాలు ఆచరణలో మార్కెట్ల పునర్విభజన కోసం బందిపోటు రాజ్యాల మధ్య యుద్ధాలకు తెరదీయక తప్పదు. 1930వ దశాబ్దకాలం పునరావృతం కావచ్చు. నాడు హిట్లర్ 'ఫస్ట్ జర్మనీ', 'బెటర్ జర్మనీ' నినాదాలివ్వడం తెల్సిందే. విఫలమవుతాడో, సఫలమవుతాడో ఇప్పుడే చెప్పలేకపోయినా ట్రంప్ తాజా విధానాలు స్థూలంగా హిట్లర్ ముస్సోలినీల అడుగు జాడల్లో సాగుతున్నట్లు చరిత్ర గమనాన్నిబట్టి అర్థమవుతున్నది. అమెరికా కార్మికవర్గం పట్ల 'ప్రేమ' వెనక తీవ్ర అసహన ఆర్థిక రాజకీయ విషాధం వుంది. అది ప్రపంచాన్ని మరింత యుద్ధోన్మాదం వైపు నడిపించకతప్పదు.

*(రచయిత ఐయఫ్‌టియు జాతీయ కార్యదర్శి)* వీ

పెట్రేగిపోయింది. 1992 డిసెంబర్ 6న బాబ్రీ మసీదు కూల్చివేతలను ఇందులో భాగంగా చూడాలి. ఇలా దేశ ప్రజల దృష్టిని మరల్చడానికి పాలక వర్గాలకు మతతత్వం ఉపయోగపడుతుంది. దేశంలో హిందూత్వ మతతత్వం దోపిడీ పీడక శక్తిగా ఆవిర్భవించింది. ఇది నేడు కార్పొరేట్ పెట్టుబడి మార్కెట్ అనుకూల, విదేయతను చూపడాన్ని మనం గుర్తించవచ్చు. దేశంలో హిందూ మతతత్వంను ఈ చట్రంలో నుంచి సైద్ధాంతిక విశ్లేషణ చేయవలసి ఉంటుంది. ఇది నేడు అత్యవసరం.

**లౌకికవాదం నిర్వచనం**

జాతీయోద్య కాలంలో మతతత్వం విసిరిన సవాలును ఎదుర్కోవడానికి 19వ శతాబ్దపు చివరి 23 ఏళ్ల నుంచి జాతీయోద్యమం లౌకికవాదాన్ని అవలంభించి ప్రజల్లో వ్యాపింపచేసింది. అందువల్ల భారత్‌లో లౌకికవాదం అంటే అన్నింటికి మించి మతతత్వ వ్యతిరేకత అనే అర్థంలోనే వచ్చింది. ఇది ఈనాటికి అంతే వాస్తవం. భారత్ భిన్న మతాలు, సంస్కృతి, ఆచారా వ్యవహారాలతో కూడిన దేశం. ఈ భిన్నత్వం వలన లౌకికవాదానికి భారత్‌లో మరో నిర్దిష్టత ఏర్పడింది. అదేమిటంటే రాజ్యం ఈ అన్ని మతాల నుంచి వేరుపడి తీరాలి. అన్ని మతాల పట్ల తటస్థంగా ఉండాలి. రాజ్యానికి అన్ని మతాల పట్ల సమానమైన గౌరవం ఉండాలి. ఈ సందర్భంగా లౌకికవాదం మతానికి వ్యతిరేకం కాదనేది సుస్పష్టం. ఇది క్లుప్తంగా లౌకికవాద సారాంశం.

**భారత రాజ్యాంగం - మౌలిక స్వరూపం**

1976లో రాజ్యాంగ సవరణ చట్టాన్ని అనుసరించి 42 రాజ్యాంగ సవరణ ద్వారా రాజ్యాంగ ప్రవేశికలో సామ్యవాద లౌకికవాదంను చేర్చడం జరిగింది. భారత రాజ్యాంగ ప్రాథమిక లక్షణాలలో లౌకిక విధానం ఒకటి. రాజ్యాగంలోని 25-28 వరకు గల అధికరణలు లౌకిక వాదంను ధృవపరుస్తున్నాయి. ఇంకను భారత రాజ్యాంగ ప్రవేశిక భారతదేశాన్ని ప్రజాస్వామ్య రాజ్యంగా ప్రకటించింది. ప్రజాస్వామ్యం అంటే ప్రజల చేత, ప్రజల కోసం ఏర్పడిన ప్రజా ప్రభుత్వం. వయోజన ఓటింగ్, ఎన్నికల నిర్వహణ, ప్రజాస్వామ్యానికి ప్రతిబింబకాలై శాసన సభలకు కార్యనిర్వాహక శాఖ బాధ్యత వహించి జవాబుదారీతనం, భారత పౌరులకు రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కులు వాటికి న్యాయ స్థానాల పరిరక్షణ, న్యాయస్థానాల స్వతంత్ర ప్రతిపత్తి మొదలగు అంశాలు ప్రజాస్వామ్యాన్ని పటిష్టవంతం చేశాయి. ఈ రాజ్యాంగ పరమైన బాధ్యతలను అమలు చేయడంలో పాలకులు (కార్య నిర్వాహక శాఖ) విఫలమైనప్పుడు న్యాయస్థానాలు పాలకులకు వాటి బాధ్యతను గుర్తు చేస్తూ ఇటువంటి మంచి తీర్పులు ఇస్తుంటాయి. నేడు చట్ట సభలకు ఎన్నికవుతున్న వారంతా నిరక్షరాస్యులు, నేరస్తులు లేదా సంపన్నులు వీరు ఎన్నికలలో దాదాపుగా కుల, మత, ప్రాంతీయ, భాషా బేధాలను రెచ్చగొట్టి నాలుగు ఓట్లు రాల్చుకోవడం జరుగుతుంది. తద్వారా చట్ట సభలకు ఎన్నికై ప్రజా సమస్యలు చర్చించకుండా వాదోపవాదాలు, తన్నుకోవడాలతో అసలు సమావేశాలు జరగని పరిస్థితి నెలకొంది. ఇది కూడా ఒక రకంగా రాజ్యాంగ ఉల్లంఘనే. ఇటువంటి వాతావరణంలో ఇలాంటి తీర్పులు రావడం హర్షణీయం.

**రాజకీయ పార్టీలు, కులం, మతం, భాషా, ప్రాంతీయ తత్వాల పాత్ర**

భారతదేశంలో ప్రాంతీయ పార్టీలు, బిజెపి దాదాపుగా కులం, మతం, భాషా, ప్రాంతీయ తత్వాల ప్రాతిపదికన ఏర్పడినవే. కాంగ్రెస్ లాంటి జాతీయ పార్టీలు కూడా ఈ విషయాలకు ప్రాధాన్యతను ఇస్తున్నాయి. హిందీ భాషా దక్షిణాది రాష్ట్రాలలో ప్రవేశపెట్టడంతో ఉత్తరాది వారి ఆధిపత్యం తమ మీద ఏమిటని భావించిన తమిళనాడు ప్రజలు పెరియార్ రామస్వామి నాయకర్ ప్రారంభించిన హిందీ వ్యతిరేక ఆత్మగౌరవ ఉద్యమం జెస్టిస్ పార్టీ కలసి ద్రవిడ కజగం పార్టీగా 1944లో ఏర్పడింది. రామస్వామితో విభేదించిన అన్నాదురై ద్రవిడ మున్నేత్ర కగజం (డిఎంకె) ను స్థాపించారు. కరుణానిదితో విభేదించిన ఎం.జి. రామచంద్రన్ ఎఐఎ డిఎంకెని స్థాపించారు. ఇక ప్రాంతీయ రాజకీయ పార్టీలన్నింటిలోకి ప్రత్యేకత కలిగినది సిక్కు మతస్థులకు చెందిన అకాలీదళ్ పార్టీ. ఇది పంజాబ్‌లోని ప్రాంతీయ పార్టీ. ఇది వాస్తవంగా మతరాజకీయ పక్షం. సిక్కు మతస్థుల సమస్యలను పరిష్కరించడానికి1929లో శిరోమణి అకాలీదళ్‌ను స్థాపించారు. మహారాష్ట్రలో ఉన్న శివసేన పార్టీ ముఖ్యంగా ముంబాయి నగరంకు పరిమితమైన ప్రాంతీయ హిందూ మత రాజకీయ పక్షం. హింసాయుత పద్ధతులను అవలంభించే ఈ స్థానిక పార్టీని 1966లో బాల్‌థాకరే స్థాపించాడు. నేషనల్ కాన్ఫరెన్స్ ఇది జమ్ము కశ్మీర్‌లోని ప్రాంతీయ రాజకీయ పార్టీ. కశ్మీరీల ప్రయోజనాలను కాపాడే ప్రధాన ఆశయంతో షేక్ అబ్దుల్లా స్థాపించాడు. ఉత్తరప్రదేశ్‌లో తరతరాలుగా విభిన్న సామాజిక వర్గాల సమ్మేళనంగా ఉన్నది. అలాగే వైరుధ్యాలున్నాయి. ముఖ్యంగా కుల పరమైన పార్టీలు ఇక్కడ ఆవిర్భవించాయి. ములాయం సింగ్ యాదవ్‌చే 1992లో స్థాపించిన సమాజ్‌వాది పార్టీ బిసిల పార్టీగా, ప్రధానంగా యాదవుల పార్టీగా ఆవిర్భవించింది. ఇటువంటి పరిస్థితే బీహార్‌ది. ఇక్కడ కూడా లాలూప్రసాద్ యాదవ్ నాయకత్వంలో బిసిల (యాదవుల) పార్టీగా రాష్ట్రీయ జనతాదళ్ (ఆర్‌జెడి) ఏర్పడింది. ఉత్తరప్రదేశ్‌లోని బహుజన సమాజ్‌వాది పార్టీని కాన్షీరాం స్థాపించాడు. ఇది కూడా నేడు మాయావతి నాయకత్వంలో ఎస్‌సిలకు ప్రాతినిధ్యం వహించే పార్టీగా ఉంది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 1982లో ఏర్పడ్డ తెలుగుదేశం పార్టీ 'తెలుగుజాతి ఆత్మగౌరవం' పేరుతో ముందుకు వచ్చింది. మొదట్లో అన్ని వర్గాల ప్రజలను కలుపుకొని పోయినప్పటికీ అది క్రమంగా కమ్మ సామాజిక వర్గంలోనికి పోయింది. సీట్లు, కీలక పదవులన్ని ఆ సామాజిక వర్గానికి ఇస్తుండడంతో అది కమ్మ కులస్థుల పార్టీగా నేడు కుటుంబ పార్టీగా మారిపోయింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ పార్టీ కూడా ఆది నుండి రెడ్డి సామాజిక వర్గ ఆధిపత్యంలోనే కొనసాగుతూ ఉంది. కొత్తగా కాంగ్రెస్ నుండి చీలి ఏర్పడిన వైఎస్ఆర్‌సిపి కూడా రెడ్డి సామాజిక వర్గ పార్టీగానే కొనసాగుతూ ఉంది. తెలంగాణలో 2001లో ప్రత్యేక తెలంగాణ సాధన లక్ష్యంతో ఏర్పడిన తెలంగాణ రాష్ట్ర సమితి కూడా దొరల పార్టీగా, కుటుంబ సంస్థగా మారిపోయింది. ఇక మతతత్వాన్ని ఆధారం చేసుకుని ఆవిర్భవించిన పార్టీల విషయానికొస్తే ఎంఐఎం పార్టీ హైదరాబాద్ పాత బస్తీ ముఖ్య కేంద్రంగా ఉన్న ప్రాంతీయ ముస్లిం మత రాజకీయ పక్షం ఇది. సలా ఉద్దీన్ ఓవైసి స్థాపించిన ఈ పార్టీ ఇటీవలి మహారాష్ట్ర ఎన్నికలలో ఒక ఎంఎల్ఎ సీటును గెలిచి తన ఉనికిని చాటుకుంది. తెలుగు రాష్ట్రాల రాజకీయాలలో దీని పాత్ర నామ మాత్రమే. చివరగా ఎటువంటి ఉద్యమ, పోరాట, త్యాగ చరిత్ర లేకుండా హిందూ మతతత్వాన్ని ఆధారంగా చేసుకొని ఆవిర్భవించిన రాజకీయ పక్షం భారతీయ జనతా పార్టీ (బిజెపి). 1951లో శ్యాం ప్రసాద్ ముఖర్జీ ఏర్పాటు చేశాడు. భారతీయ జన సంఘ్ మారు రూపమే బిజెపి. ఈ పార్టీ పుట్టుక, నిర్మాణం మొత్తం హిందూ మహాసభ, ఆర్ఎస్ఎస్ నుండి వచ్చినవే. 1925లో ఏర్పడిన ఆర్ఎస్ఎస్ నాజీల నుండి, హిట్లర్ నియంతృత్వం నుండి ప్రేరణ పొందినది. మహారాష్ట్ర బ్రాహ్మణీయ వర్గాల

# జైళ్లలోనే జీవితంలో సగభాగం

*భారతదేశంలో లోపభూయిష్టమైన న్యాయవ్యవస్థ తీరుతో న్యాయ విచారణకు నోచుకోకుండా సంవత్సరాల తరబడి జైళ్లలో మగ్గుతున్న విచారణ ఖైదీల స్థితిగతులను, జైళ్లలోని పరిస్థితులను వివరిస్తున్నారు* **రాజేంద్రబాబు అర్విణి**

కేంద్ర ప్రభుత్వ హోంమంత్రిత్వ శాఖకు అనుబంధంగా ఉన్న 'జాతీయ నేర సంబంధిత చట్టాల విభాగం' (నేషనల్ క్రైం రికార్డ్స్ బ్యూరో) గత నెల (అక్టోబర్ 24) విడుదల చేసిన 'జైళ్ల గణాంకాల నివేదిక – 2015'లో దిగ్భ్రాంతి కలిగించే వాస్తవాలు వెలుగు చూశాయి. 'కామన్‌వెల్త్ హ్యూమన్ రైట్స్ ఇనిషియేటివ్' అన్న సంస్థ వీటిని క్రోడీకరించి భారతదేశ జైళ్లల్లో మగ్గుతున్న వారి స్థితిగతులను వివరించింది. ఈ రిపోర్ట్‌ను ఈ గమనంలోకి తీసుకుంటే మనకసలు ప్రజాస్వామ్యం మూలాలు ఉన్నాయా, రాజ్యాంగం పూచీపడ్డ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మనదేశ జనాభాలో ఎంత మంది అనుభవిస్తున్నారు అన్న సంశయం రాక మానదు. సంక్షిప్తంగా ఆ వివరాలు ఈ కింద పేర్కొన్న విధంగా ఉన్నాయి.

**విచారణ ఎదుర్కొంటున్న ఖైదీలు**

భారతదేశ జైళ్లల్లో నిర్బంధించబడిన ఖైదీలు పదిమందిలో ఏడుగురు విచారణ ఎదుర్కొంటూనే ఉన్నారు. వారి విషయంలో తీర్పు ఎప్పుడు వస్తుందో తెలియదు. విచారణ ఎన్ని సంవత్సరాలలో పూర్తి అవుతుందో తెలియదు. తీర్పు వచ్చిన తర్వాత శిక్ష పడితే ఇంకా ఎన్ని సంవత్సరాలు జైల్లో ఉండాలో అనిశ్చితం. విచారణ ఎదుర్కొంటున్న ఖైదీల సంఖ్య 70 శాతంగా గత పది సంవత్సరాలుగా ఇదే రీతిలో కొనసాగుతుంది.

బీహార్, జమ్ము కశ్మీర్ రాష్ట్రాలలో పరిస్థితి ఇంకా అధ్వానంగా ఉంది. బీహార్ జైళ్లల్లో ఉన్న ఖైదీలలో 82 శాతం మంది, జమ్ము కశ్మీర్‌లో 81 శాతం మంది విచారణ ఎదుర్కొంటున్న వారే.

ఉత్తరాఖండ్, మిజోరం, త్రిపుర రాష్ట్రాలలో నేరం నిర్ధారింపబడి శిక్ష అనుభవిస్తున్న ఖైదీలు ఎంత మంది ఉన్నారో అంత మందీ విచారణ ఎదుర్కొంటున్న వారూ ఉన్నారు.

ప్రపంచం మొత్తంలో 17 దేశాలలో మాత్రమే విచారణ ఎదుర్కొంటున్న ఖైదీల సంఖ్య శిక్షపడిన వాళ్లకంటే ఎక్కువగా ఉంది. ఆ దేశాలలో భారతదేశం కూడా ఉండడం బాధాకరం. మన దేశంలో మూడింట రెండొంతుల మంది ఖైదీలు విచారణ కోసం ఎదురు చూస్తూ జైళ్లల్లో మగ్గుతున్నారు. దీనిని బట్టి భారతదేశ న్యాయ వ్యవస్థ ఎంత లోపభూయిష్టంగా ఉందో అర్థం అవుతుందని కామన్ వెల్త్ హక్కుల సంస్థ వ్యాఖ్యానించింది. ఉగండా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ దేశాలు మనకంటే మెరుగు. భారతదేశం కంటే నికృష్ట స్థాయిలో లిబియా, బొలివియా, లిబేరియా దేశాలు ఉన్నాయి.

విచారణ ఎదుర్కొంటున్న ఖైదీలు మన ఉపఖండంలోని శ్రీలంక, నేపాల్ దేశాలలో మనకంటే మెరుగ్గా వరుసగా 52.8 శాతం, 58.9 శాతంగా ఉంటే, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో మనలాగే 69.1 శాతం, 73.8 శాతం నిష్పత్తిలో ఉన్నారు. అనవసరమైన అరెస్టులు, మందకొడిగా సాగే విచారణ తంతు, అధికార యంత్రాంగానికి అనుకూలంగా ఉండే విధంగా వరుస వాయిదాలు, జైలు నుంచి కోర్టుకు తీసుకెళ్లడానికి అవసరమైన భద్రతా సిబ్బంది లేమి, న్యాయమూర్తుల కొరత ఈ స్థితికి ప్రధాన కారణాలుగా చెప్పుకోవచ్చు. పర్యవసానంగా జైళ్ల కిక్కిరిసిపోయి అమానవీయ వాతావరణం భారతదేశ జైళ్లల్లో రాజ్యం చేస్తున్నది.

---

చేత ఏర్పాటు చేయబడినది ఆర్ఎస్ఎస్. ప్రారంభం నుండి దీని మద్దతుదారులందరూ భూస్వామ్య, వ్యాపార, బ్రాహ్మణ, బనియా వర్గాలే. జాతీయోద్యమానికి దూరమై మతాల మధ్య చిచ్చుపెట్టి మత కలహాలలో పాలు పంచుకున్నది. అప్పుడు ఇప్పుడు దీని చరిత్ర ఇదే. ఆర్ఎస్ఎస్ వాళ్లు బ్రిటిష్ వాళ్లను వ్యతిరేకించలేదు. ఈ సంస్థ జాతీయవాదం పనల్లా ముస్లింలను వ్యతిరేకించడం. తదితర మైనార్టీలను సమర్థిస్తున్నారంటూ జాతీయ నాకులను తిట్టడం మాత్రమే. ఈ దేశాన్ని హిందూ మత రాజ్యంగా నిర్మించాలనేది ఆర్ఎస్ఎస్ ప్రధాన లక్ష్యం. ఇలాంటి సంస్థ నుండి వచ్చిన వాడే మోడీ. గుజరాత్‌లో మత మారణ హోమం సృష్టించి అధికారాన్ని పొంది ఢిల్లీ పీఠానికి ఎగబాకిన వ్యక్తి ప్రజలకు మేలు చేస్తాడా? నల్లధనం పేరిట పెద్ద నోట్లను రద్దు చేసి మొత్తం దేశ ప్రజలను బ్యాంకుల ముందు నిలబెట్టి కష్టాల పాలు చేశాడు. సుమారు 170 మంది వరకు ప్రజలు చనిపోయారు. సంపన్నులు బాగానే ఉన్నారు. కష్టాలు, నష్టాలు మాత్రం సామాన్య ప్రజలది. ఏ పార్టీ అయినా మొదట ప్రారంభంలో కుల, మతాతీతమైనదిగా కనిపించినా ఒక కులం లేదా మతతత్వ పార్టీలుగా మారిపోవడం సర్వ సాధారణం అయిపోయింది. ఎన్నికలలో లబ్ది పొందడానికి కుల, మత చిచ్చులు పెట్టి పబ్బం గడుపు కొంటున్నాయి. దురదృష్టవశాత్తు దేశంలోని సామాజిక – ఆర్థిక పరిస్థితులు కుల, మతతత్వానికి అనుకూలిస్తూనే ఉన్నాయి. ఇంత సంక్లిష్ట పరిస్థితులున్న దేశంలో సుప్రీంకోర్టు తీర్పు ఎంత వరకు ఆచరించబడుతుంది అనేది ప్రశ్నార్థకం. భారత రాజ్యాంగంలో లౌకికవాద స్ఫూర్తి నిండుగా ఉన్నా దాని అమలు, ఆచరణలో రాజ్యం పూర్తిగా విఫలమైంది. కులం, మతం పేరుతో ప్రజల్ని ఆకట్టుకోవడం రాజకీయ పక్షాలకు వెన్నతో పెట్టిన విద్య అయింది. ప్రజల ప్రయోజనం దృష్టితో కాక ఆయా కుల, మతస్తుల ఓటర్లను దృష్టిలో ఉంచుకొని నిర్ణయాలు తీసుకోవడం ప్రభుత్వాలకు, పార్టీలకు పరిపాటైంది. ఇది గ్రహించిన సుప్రీంకోర్టు కులం పేరిట, మతం పేరిట, భాషా పేరిట, ప్రాంతం పేరిట ఎన్నికలలో ఓట్లు అర్థించడం చెల్లదని స్పష్టం చేయడం హర్షణీయం. కుల మత సంస్కృతికి వ్యతిరేకంగా ప్రజాస్వామిక ప్రత్యామ్నాయ ప్రజా సంస్కృతిని నిర్మిద్దాం – మతోన్మాద భావాజాలాన్ని నిర్మూలిద్దాం.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వీ

**నిర్బంధ సమయ పరిమితి**

విచారణ ఎదుర్కొంటున్న వారిలో దాదాపు నాలుగవ వంతు ఖైదీలు సంవత్సరం కంటే ఎక్కువ కాలం జైలులోనే గడుపుతారు. పది మందిలో ముగ్గురి ఖైదీల నిర్బంధ కాలం సుమారుగా మూడు నెలలని లెక్కలు చెపుతున్నాయి. కొంతకాలం నుండి, మరీ ముఖ్యంగా గత పది సంవత్సరాల నుండి, కోర్టులలో కేసుల విచారణ పూర్తి కావడానికి ఎక్కువ సమయం పడుతున్నది. దీని వలన విచారణ ఎదుర్కొంటున్న ఖైదీలు ఎక్కువ కాలం జైళ్లల్లో గడపవలసి వస్తున్నది. 2001వ సంవత్సరంలో విచారణ ఖైదీలు 19 శాతం మంది ఒక సంవత్సరం పాటు జైలు జీవితం గడిపితే 2014వ సంవత్సరం వచ్చేసరికి ఆ సంఖ్య 25 శాతంకు పెరిగింది. 2001లో 40 శాతం ఈ ఖైదీలు దాదాపు మూడు నెలలు జైలు జీవితం విచారణ సమయంలో అనుభవిస్తే ఆ సంఖ్య 2014లో 35 శాతంకి చేరింది. వివిధ కోర్టులలో విచారణ మందకోడిగా సాగుతున్నందు వల్ల నేరం నిరూపించబడని అమాయకులు కూడా చాలా కాలం జైళ్లల్లో గడపాల్సిన పరిస్థితి భారతదేశంలో నెలకొందని కామన్ వెల్త్ మానవ హక్కుల ఇనిషియేటివ్ ఆవేదన వ్యక్తం చేసింది.

పేదరికం వల్ల బెయిల్ కోసం ఖైదీలు ప్రయత్నించకపోవడం, బెయిలు వచ్చే పరిస్థితి ఉన్నా పూచీకత్తు ఇవ్వడానికి ఎవరూ లేకపోవడం, పలు కారణాల వల్ల బెయిలు దొరకకపోవడం లాంటివి ఈ దయనీయ పరిస్థితికి అద్దం పడుతున్నాయి.

**జైళ్లల్లో మరణాలు**

భారతీయ జైళ్లలో ప్రతి ఐదున్నర గంటలకు ఒక మరణం సంభవిస్తున్నది. ప్రతి ఐదు రోజులకు ఒక ఆత్మహత్య చోటు చేసుకుంటున్నది. జైలు బయట సమాజంలో కంటే జైలు లోపల ఆత్మహత్య ప్రవృత్తి రెండింతలు ఎక్కువగా ఉందని మానసిక శాస్త్ర వేత్తలు చెపుతున్నారు. ఆత్మహత్యలు, అనారోగ్యాల వలన కాకుండా 'ఇతర కారణాల' వలన కూడా జైళ్లల్లో మరణాలు ఎక్కువగానే సంభవిస్తున్నాయి. సంవత్సరానికి 752 మంది ఖైదీల మరణాలతో పంజాబ్ రాష్ట్రం ఖైదీల మరణాలకు రాజధానిగా పేరు గాంచింది. పెద్ద రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌లో సంవత్సరానికి జైళ్లలో 323 మంది ప్రాణాలు కోల్పోతున్నారు.

ప్రపంచంలోని ఇతర దేశాలతో పోల్చుకుంటే భారతదేశ జైళ్లల్లో మరణాలు ఎక్కువగా సంభవిస్తున్నాయి. చాలా వరకు వాటిని సహజ మరణాలుగానే గుర్తిస్తున్నారు. నిజానికి ఇవన్నీ సహజ మరణాలు కావు. మనిషి స్వేచ్ఛను హరింప చేసి (విచారణ పేరుతోనే బహు కాలం జైళ్లలోనే గడపాల్సి రావడం), వారి ఆహార, ఆరోగ్య అవసరాల కోసం రాజ్యంపై ఆధారపడే పరిస్థితి చాలా కాలం ఉండడం వల్ల ఈ పరిస్థితి దాపురిస్తున్నది. కాబట్టి ఇవి సహజ మరాణాలు కావు. జైళ్లల్లో తటస్థపడే 'సహజ మరణాల' కారణాలు ప్రత్యేకంగా ఎక్కడా పేర్కొనబడవు. 'ఇతర కారణాలు' అని చెప్పబడిన మరణాలకు కూడా అవి ఎందువల్ల సంభవించాయో ఎక్కడా చెప్పరు.

**కులం, మతం**

మన దేశంలోని జైళ్లలోని ఖైదీలలో 2/3 భాగం షెడ్యూల్డ్ కులాలు. షెడ్యూల్డ్ తెగలు. ఇతర వెనుకబడిన తరగతులకు చెందినవారు. తమిళనాడు రాష్ట్రంలోని ఖైదీలలో 92 శాతం మంది ఈ వర్గాలకు చెందిన వాళ్లే. దేశంలో ఉన్న ఖైదీల జనాభాలో 19 శాతం ముస్లింలు అయితే 71 శాతం మంది హిందూ మతానికి చెందినవారు. 2015లో ఇచ్చిన నివేదిక ప్రకారం షెడ్యూల్డ్ కులాల వారు 21.4 శాతం (దేశ జనాభాలో వీరు 16.6 శాతం), షెడ్యూల్డ్ తెగలు 12.8 శాతం (మొత్తం జనాభాలో వీరు 8.6 శాతం), ఇతర వెనుకబడిన తరగతుల వాళ్లు 31.4 శాతం అయితే ఇతరులు 34.3 శాతం. దేశం మొత్తం మీద ముస్లింల జనాభా 15 శాతం ఉంటే, జైళ్లల్లోని ఖైదీలలో 19 శాతం మంది ముస్లింలు ఉన్నారు.

**ఖైదీల విద్యార్హతలు**

మన దేశంలోని ఖైదీలలో 28 శాతం మంది నిరక్షరాస్యులే ఉన్నారు. ఆరు శాతం మంది పట్టభద్రులైతే 2 శాతం పోస్ట్ గ్రాడ్యుయేషన్ పూర్తి చేసినవారు. పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని ఖైదీలలో 83 శాతం మంది నిరక్షరాస్యులు లేదా 10వ తరగతి వరకు చదివినవారు. దేశం మొత్తం మీద 70 శాతం మంది ఖైదీలు నిరక్షరాస్యులు కాదంటే 10వ తరగతి లోపు చదువుకున్న వారు. వీరికి తమ హక్కుల గురించి అవగాహన ఉండదు. పోలీసుల, జైలు సిబ్బంది కర్తవ్య నిర్వహణ గురించి అసలు అవగాహన ఉండదు. నిష్పాక్షిక విచారణకై ఎలాంటి చర్యలు తీసుకోవాలో తెలియదు. దరఖాస్తులు రాసే నేర్పు ఉండదు. ఎక్కువ పని భారంతో సతమతమవుతున్న జైళ్లు, న్యాయ వ్యవస్థల దయా దాక్షిణ్యాలపై ఆధారపడక తప్పని పరిస్థితి వీరిది.

**జైళ్ల నిర్వహణా సిబ్బంది**

దేశంలో జైళ్ల నిర్వహణ కోసం 80,236 ఆఫీసర్ పోస్టులు ఉన్నాయి. నివేదిక ఇచ్చే సమయానికి 34 శాతం ఖాళీలు ఉండినయి. ప్రస్తుతం 53,009 మంది అధికారులు పని చేస్తున్నట్లు గణాంకాలు తెలుపుతున్నాయి. దేశంలోని 1401 జైళ్లల్లో ఖైదీల మానసిక దిద్దుబాటు నిమిత్తం కేవలం 597 మంది సిబ్బంది పనిచేస్తున్నారు. అంటే జైలుకు ఒక్కొరు చొప్పున కూడా ఈ కరెక్షన్ సిబ్బంది లేరన్న మాట. దేశంలో అన్ని జైళ్లల్లోను కలిపి 18 మంది మానసిక వైద్యులు, మనస్తత్వ శాస్త్ర నిపుణులు మాత్రమే ఉన్నారు. అంటే ప్రతి 23 వేల మంది ఖైదీలకు ఒక మానసిక వైద్యుడు ఉన్నాడని అర్థం

జైలు మాన్యువల్ ప్రకారం ప్రతి ఆరుగురు ఖైదీలకు ఒక రక్షక భటుడు ఉండాలి. జైలు సిబ్బందికి ఖైదీల సంఖ్యకు మధ్య అంతరం ఊహించలేనంతగా ఉంది. నియమించబడ్డ సిబ్బందిలో చాలా మంది సస్పెన్షన్‌లో ఉంటారు. లేదా గైరు హాజరై ఉంటారు. కాకపోతే లీవులోనో, లేదంటే ఇతర డ్యూటీలలోనో ఉంటారు. కాబట్టి జైళ్లు చాలా వరకు దీర్ఘకాలం శిక్ష విధించబడిన ఖైదీల పర్యవేక్షణలో నడుస్తూ ఉంటాయి. సిబ్బందికి తగిన శిక్షణ ఉండదు. జీత భత్యాలు సరిపోయినంతగా ఉండవు. ప్రమోషన్ల ఊసే ఉండదు. అధికార పదవులను పోలీసు శాఖలోని సీనియర్లతో నింపేస్తారు. వారికి ఖైదీలను సంస్కరించాలన్న ఉద్దేశం ఉండదు. ఖైదీలను దొంగలుగా చూస్తారు కాని, సంస్కారం నేర్పితే దొంగలు కూడా మంచి మనుషులవుతారన్న ఆలోచన ఉండదు.

**మహిళా ఖైదీలు**

ఖైదీలలో 4.3 శాతం మంది మహిళలు. 2015లో భారతదేశ జైళ్లల్లో 51 మంది మహిళా ఖైదీలు మరణించారు. డిసెంబర్ 31 నాటికి 1597 మంది స్త్రీలు, 1866 మంది చిన్న పిల్లలతో ఖైదీలుగా ఉన్నారు.

పురుష ఖైదీల సంఖ్యతో పోల్చినపుడు, ఆశ్చర్యకరంగా స్త్రీ ఖైదీల సంఖ్య ప్రతి సంవత్సరం పెరుగుతున్నది. ఈ 15 సంవత్సరాల కాలంలో, అంటే 2000వ సంవత్సరం నుండి ఆ సంఖ్య 61 శాతం పెరిగింది. ఇది ప్రపంచ వ్యాప్తంగా 50 శాతంగా ఉంది. 2001లో మహిళా ఖైదీల సంఖ్య 11,094 అయితే, 15 సంవత్సరాల తర్వాత అది 17,834కు పెరిగింది. జైళ్లలో ఉన్న మొత్తం ఖైదీల సంఖ్యలో ఇది 4.3 శాతం.

**తనిఖీలు**

చట్ట ప్రకారం జైళ్ల తనిఖీల కోసం అధికారులు, అనధికారులతో ఒక బృందం ఏర్పాటు చేయాలి. ఆ బృందంలో న్యాయమూర్తులు, మానవ హక్కుల సంస్థల సభ్యులు, ప్రజా సంక్షేమ సంబంధమైన పనులలో ఉండే అధికారులు, వైద్య, ఆరోగ్య, సాంఘిక సంక్షేమ శాఖలకు చెందిన అధికారులు, స్థానిక ప్రజల నుండి తీసుకోబడిన గౌరవనీయ పెద్దలు సభ్యులుగా ఉంటారు. ఈ బృందం ప్రతి జైలును తరచుగా తనిఖీ చేస్తూ ఉండాలి. వారు వ్యక్తిగతంగా గాని, సమిష్టిగా గాని తనిఖీ చేయవచ్చు. ఆకస్మిక తనిఖీలు కూడా చేపట్టి ఖైదీల బాధలు తెలుసుకోవచ్చు. ఈ బృందాలను 'సందర్శకుల మండలి'లు (విసిటర్స్ బోర్డ్స్) అంటారు. వారు జైళ్ల స్థితిగతులు బాగు పరచడానికి తగు సూచనలు చేయవచ్చు. అయితే మనదేశంలో ఈ బోర్డులు చాలా అరుదుగా జైళ్లను సందర్శిస్తుంటాయి. తనిఖీలు జరిగినా అవి కాగితం పైనే ఉంటాయి. వారు జైళ్లను క్షుణ్ణంగా పరిశీలించి తమ రిపోర్టులను అధికారులకు ఇవ్వడం, తగు సూచనలు చేయడం లాంటి సందర్భాలు చాలా తక్కువ. చట్ట ప్రకారం ప్రతినెలా రెండుసార్లు జైళ్ల తనిఖీలు జరగాలి. ఈ నియమాన్ని ఎక్కడా పాటించరు. జైళ్ల తనిఖీలు, జైళ్ల నిర్వహణ ఎంత లోపభూయిష్టంగా ఉందంటే ఒకానొక సందర్భంలో దేశ అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు తానే స్వయంగా న్యాయ అధికారులచే తనిఖీల బాధ్యతను చేపట్టడానికి పూనుకుంది. ఆ సందర్భంగా విచారణ జరుగుతున్న వ్యాజ్యానికి '1382 జైళ్లల్లో అమానవీయ పరిస్థితులు' అన్న పేరు కూడా నిర్ధారించింది. ఆ తర్వాత జైళ్ల తనిఖీలలో కొంత మార్పు వచ్చి తనిఖీలు తరచుగా చేస్తున్నారు. కాని ఆ మార్పు 2005 వరకే కనిపించింది. 2005 నుండి మళ్లీ మామూలు పరిస్థితి నెలకొని జైళ్ల తనిఖీల సంఖ్యలో ఏమాత్రం పెరుగుదల కనిపించలేదు.

**ఖైదీలపై ఖర్చు**

జైళ్ల శాఖ ప్రతి ఖైదీపై ప్రతిరోజు దేశంలో సగటున రు. 86 ఖర్చు చేస్తుంది. ఇందులో ఆహారం కొరకు రు. 52 వెచ్చిస్తారు. దేశం మొత్తంగా ఈ ఖర్చు ఒకే విధంగా లేదు. బీహార్, ఢిల్లీ, నాగాలాండ్‌లలో ఎక్కువగా రు. 229, రు, 201, రు. 179లు ఖర్చు చేస్తే, అతి తక్కువగా రాజస్థాన్‌లో రు. 8, పంజాబ్‌లో రు. 45లు ఖర్చు చేస్తున్నారు. వృత్తి శిక్షణ, విద్య కోసం చేసే ఖర్చు చాలా తక్కువ.

14 రాష్ట్రాలలో, కేంద్ర పాలిత ప్రాంతాలలో విద్య కోసం, వృత్తి శిక్షణ కొరకై ఒక్క పైసా అయినా ఖర్చు చేసిన దాఖలాలు లేవు. కామన్‌వెల్త్ మానవ హక్కుల సంఘం వారి పరిశీలనలో వెలుగు చూసిన విషయాలను అవగతం చేసుకుంటే జైళ్ల బడ్జెట్ పెరిగింది కాని, ఖైదీల జీవన ప్రమాణాలు పెరగలేదన్న విషయం అర్థమవుతుంది. పెట్టే ఖర్చులో చాలా వరకు ఆహారం మీద, బట్టల కోసం ఖర్చు చేస్తున్నారు కాని చదువు, వృత్తి శిక్షణల గురించి అసలు ఆలోచించడం లేదు.

**విదేశీ ఖైదీలు**

2015 డిసెంబర్ 31 నాటికి భారతదేశంలోని వివిధ జైళ్లలో 6185 మంది విదేశీ ఖైదీలు ఉన్నారు. వారిలో 2363 మంది శిక్షా కాలం గడుపుతన్న వారైతే, 3795 మంది విచారణలో ఉన్న ఖైదీలు , 37 మంది అదుపులోకి తీసుకున్నవారు ఉన్నారు. విదేశీ ఖైదీలలో 66 శాతం మంది బంగ్లాదేశ్‌కు చెందిన వాళ్లు. వీరిలో చాలా మంది పశ్చిమ బెంగాల్‌లోని జైళ్లలోనే ఉన్నారు. విదేశాలకు చెందిన ఖైదీలలో పలువురు శిక్షాకాలం పూర్తయినా స్వదేశాలకు తిరిగి వెళ్లేందుకు డబ్బులు లేక, సరైన అనుమతి పత్రాలు లేక జైళ్లలోనే ఉండిపోయారు. మొత్తం ఖైదీల సంఖ్యలో వీరు 3 శాతం ఉంటారు. వారు పిల్ల పాపలతో సహా జైళ్లలోనే కాపురం. ఆ పిల్లలతో కలుపుకొని ఇంకా ఎక్కువ శాతమే ఉండే అవకాశం ఉంది. వారిని వారి వారి దేశాలకు తిరిగి పంపించేందుకు దేశాల మధ్య ఒడంబడికలు కావలసి ఉంటుంది.

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

*రావు. దానికి పెట్టుబడిదారుడి దగ్గర జవాబు ఉందదా? 'నీ సరుకు మిగతా సరుకుల కన్నా భిన్నమైనదైనా, ఆ సరుకు కోసం ఇవ్వదానికి, నువ్వూ నేనూ ఒక ఒప్పందానికి వచ్చాం. ఆ ప్రకారమే నీకు చెల్లిస్తున్నాను' అనదా? అలా అంటే కార్మికుడి జవాబు ఏమిటి? 'అమ్మడం', 'కొనడం' అనే అసహజ సంబంధాలలో నుంచి పుట్టుకొచ్చిన తర్కమే అలాంటిది. అసలు నిజం ఏమిటంటే కార్మికులు ఏదీ అమ్మడం లేదు. కార్మికులు పనిచేసి కొంత విలువని సృష్టించాక, ఆ విలువ నుంచే కొంత భాగాన్ని తీసి, పెట్టుబడిదారుడు కార్మికుడికి జీతంగా ఇస్తాడు. కాబట్టి ఇక్కడ ఒకరు అమ్మడం, ఇంకొకరు కొనడం అనే ప్రశ్నే లేదు. అసలు మారకమే లేదు. అందుకే, 'శ్రమశక్తి'ని అమ్మడం అంటే, అది పెట్టుబడిదారుడికే బలాన్ని ఇస్తుందని రంగనాయకమ్మ గారు చెప్పినది.*

**– యు.ఎచ్. ప్రీతమ్**
*ఖమ్మం*

*చెర్లపల్లి కేంద్ర కారాగారంలో ఉన్న రాజకీయ ఖైదీ కోబడ్ గాంధీ అవసరమైన దస్త్రాలు, నివేదికలు అందుబాటులో లేకపోయినప్పటికీ నోట్ల రద్దుకు సంబంధించి సుదీర్ఘ వ్యాసం అనేక వివరణలతో తెలియచేశారు. నకిలీ కరెన్సీ మార్పిడికి కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల కొరకు నోట్ల రద్దు చర్య ఉపయోగపడింది. అట్టడుగు ప్రజల ఇబ్బందులు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. అలాగే 'భారత సామాజిక ఆర్థిక పరిస్థితి' వ్యాసం అనేక అంశాలను వెలుగులోకి తెచ్చింది. వీక్షణం పదిహేనో జన్మదిన ప్రత్యేక సంచిక అనేక సామాజిక అంశాలకు డాక్యుమెంట్.*

**– తుంపాల శ్రీరామమూర్తి**
*విశాఖపట్నం*

*పెద్దనోట్ల రద్దుపై రాసిన ఎడిటోరియల్‌లో – దాని తీపిపూత చూసి ప్రజలు ఆమోదించారు– అని నిర్ధారించడం సరైంది కాదేమో? దేశంలో అనేక చోట్ల ఎటిఎంలు ధ్వంసం చేయబడ్డాయి. చాలాచోట్ల ప్రజలు సమూహాలుగా బ్యాంకు అధికారులపై తమ కోపాన్ని ప్రదర్శించారు. అనేక ఆత్మహత్యలు జరిగాయి. ఇవన్నీ నిరసన రూపాలే. కేవలం బ్యాంకుల్లో ఉన్న సొమ్మును ఇవ్వడం ఎక్కడ ఆపేస్తారో అన్న భయం వారి కోపాన్ని అణచుకునేటట్లు చేయగలిగింది. పైగా నాయకత్వం వహించే శక్తులు లేకపోవడం అనేది అక్షరాలా సత్యం.*

**– పి.వి. రమణ**
*విశాఖపట్నం*

వీ

చర్చ

# మార్క్సిస్టు భావవాదుల సృజనాత్మక మార్క్సిజం

**లంకా పాపిరెడ్డి**

అక్టోబర్ నెల వీక్షణంలో తోలేటి జగన్‌మోహన్‌రావు గారు రాసిన వ్యాసానికి జవాబుగా నవంబర్ నెల వీక్షణంలో ప్రీతమ్, ప్రసాద్‌లు తమ అభిప్రాయాలను రాసారు. వీరిద్దరు ఒకే విధమైన విషయాలగురించి రాశారు. భాష కూడా ఒకే విధంగా ఉంది. ప్రీతమ్, ప్రసాద్ లు ఇద్దరూ చెప్పిన విషయాలు ఒకటే. ఒకరు ఒక విషయాన్ని వక్కాణించి చెప్పితే, ఇంకొకరు ఇంకో విషయాన్ని వక్కాణించి చెప్పారు. ఈ తేడా తప్ప అంతా ఒకే విధంగా ఉంది. ప్రసాద్ గారు కమ్యూనిస్టు సమాజం కూడా మారిపోతుందా అనే విషయం పైన కేంద్రీకరించాడు. ప్రీతమ్ గారేమో తత్వశాస్త్రం కంటే మార్క్స్ పెట్టుబడి యే గొప్పదీ ప్రధానమైనదీ అని వక్కాణించారు. మొత్తంగా ఇద్దరూ మార్క్స్ అర్ధశాస్త్రమే ప్రధానం అన్నారు. అర్ధశాస్త్ర మార్క్సిస్టులుగా నిలబెట్టుకున్నారు. ప్రపంచంలో ఏ మార్క్సిస్టు కూడా మార్క్సిజంలోని మూడు భాగాలకు మధ్యన పోటి పెట్టి ఏదో ఒకదాన్ని ప్రధానం అని చెప్పరు. గతితార్కిక భౌతిక వాదం, రాజకీయ అర్ధశాస్త్రం, శాస్త్రీయ సోషలిజం ఈ మూడు కలిసే మార్క్సిస్టు సిద్దాంతం అవుతుంది. గతితార్కిక భౌతిక వాదం అవసరం లేదు అనేవారు అనుకునే వారు మార్క్సిస్టులు కాదుగదా కనీసం భౌతిక వాదులు కూడా కాలేరు. ఒకరి మస్తిష్కంలో గతితార్కిక భౌతికవాద అవగాహన లేకుంటే అక్కడ శూన్యం ఉండదు, భావవాద అవగాహనే ఉంటుంది. లేదా అధి భౌతికవాద అవగాహన ఉంటుంది. మార్క్సిజం పదజాలాన్ని వల్లిస్తూ మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని వ్యతిరేకించే వారు మార్క్సిస్టు భావవాదులే అవుతారు. ఇటువంటి మార్క్సిస్టు భావవాదులు సృష్టించే సృజనాత్మక మార్క్సిజానికి ప్రపంచంలో కొదువ ఏమిలేదు.

ప్రీతమ్ తన వ్యాసంలో ముఖ్యంగా అర్ధశాస్త్రం పైన కేద్రీకరించారు. మార్క్సిస్టు తత్వశాస్త్రం మార్క్సిస్టు అర్ధశాస్త్రం పైన ఆధారపడి ఉందని చెప్పారు. శ్రమ దోపిడి జరుగుతుందని ఎలా చెప్పగలుగుతారు? తత్వశాస్త్రంలో ఏ పుస్తకం చదివి చెప్పుతారు? అంటూ ప్రశ్నించాడు. శ్రమదోపిడి గురించి చెప్పాలంటే కాపిటల్ చదివే చెప్ప గలరు అన్నాడు. అయితే ప్రీతమ్ గారు మార్క్సిస్టు అర్ధశాస్త్రం మాత్రమే చదివి దోపిడి గురించి చెప్పగలుగుతారు కాని ఇతరుల అర్ధశాస్త్రం చదివి మాత్రం ఆ పని చేయలేరు. ఎందుకని? అది మాత్రం వారి ఆలోచనకు తట్టదు. ఆడం స్మిత్, రికార్డోల అర్ధశాత్రం చదివి ప్రీతమ్ గారు దోపిడి గురించి ఎందుకు చెప్పలేరు? ప్రీతమ్ గారికి కానీ మార్క్సిస్టు మహోపాధ్యాయుల సరసన నిలబెట్ట గలిగిన వారి రంగనాయకమ్మ గారికి కానీ ఈ విషయం మాత్రం అర్ధం కాదు. ఆడం స్మిత్, రికార్డోలకు సరుకు విలువను నిర్ణయించే విషయం ఏమిటనేది అర్ధం అయినా దోపిడి విషయం గురించి చెప్పలేదు. ఎందుకు చెప్పలేదు అంటే వారికి గతితార్కిక భౌతికవాదం గురించిన అవగాహన లేదు. లింగమూర్తి గారు ఒక్క వాక్యంలో సరిగ్గా చెప్పారు, 'కాపిటల్ ఆమె(రంగనాయకమ్మ) అనుకున్నట్లుగా ఉత్తి ఆర్ధికశాస్త్ర పుస్తకం కాదు. అది ఒక తాత్విక ప్రాపంచిక ధృక్పధానికి ఆర్ధిక సంభంధాల (ఉత్పత్తి సంభంధాల) వ్యక్తీకరణ'. ప్రీతమ్ గారు అడిగినట్లుగానే ఒక భావవాది, ఎవరు దోపిడి చేస్తున్నారు? ఎవరు దోపిడికి గురి అవుతున్నారు? అంతా ఉత్తిదే, అంతా మాయ, అంతా మన భ్రమ అని అంటే ఈ మాయ గురించి ఏమి చదివి చెప్పుతారు? భౌతిక వాదం గురించి చెప్పకుండా మాయను ఖండించ గలుగుతారా? కార్మికుడు ఒక భౌతిక వాస్తవం, అతని శ్రమ ఒక భౌతిక వాస్తవం అని చెప్పకుండా నిరూపించకుండా మాయను ఖండించ గలుగుతారా? ఒక మనిషిని మరో మనిషి దోపిడి చేయడం అనాదిగా ఉన్నదే, అనంత కాలం వరకు కొనసాగుతుంది అని ఎవరైనా అంటే గతితార్కిక భౌతికవాద ధృక్పధంతో చరిత్రను వివరించకుండా శాశ్వత దోపిడి సిద్దాంతాన్ని ఎలా ఖండించ గలుగుతారు? అసలు పెట్టుబడిదారి విధానం సోషలిజంలోకి వెల్లుతుందని ఏ సిద్దాంతం ఆధారంగా చెప్పుతారు? లేక పోతే రోజూ దోపిడీ దోపిడీ అని చెప్పుతూ ఉంటే పెట్టుబడిదారి విధానం దానికదే సోషలిజం లోకి పరివర్తన చెందుతుందా? మార్క్సిస్టు తత్వశాస్త్రం తెలియకుండా అర్ధశాస్త్రమే (కాపిటల్) కాదు మార్క్సిస్టు రాజకీయాలు కూడా తెలవవు (కార్మికవర్గ నియంతృత్వం లాగ). ఇంకా ఆశ్చర్యంగా ప్రీతమ్ గారే సమసమాజంప్పు ప్రాతిపదికన ఏర్పడుతుంది? పెట్టుబడిదారి వ్యవస్థ సరైనదా కాదా అనే విషయాలను కాపిటల్ ను వివరించకుండా ఎలా చెప్పుతారు అంటూ ప్రశ్నిస్తున్నాడు. అయ్యా ప్రీతమ్ గారు కారల్ మార్క్స్ గారు గతితార్కిక భౌతికవాద సిద్దాంతం ఆధారంగానే పెట్టుబడిదారి వ్యవస్థను దోపిడీ వ్యవస్థ అనీ, అది సమసమాజ నిర్మాణానికి అవసరమైన పరిస్థితులను సృష్టిస్తుందనీ, అందు కొరకు కార్మిక వర్గం చైతన్య యుతంగా పోరాడవలసి ఉంటుందనీ చెప్పారు. ఇటువంటి సిద్దాంతం లేకపోవడం వల్లనే ఆడం స్మిత్ కానీ రికార్డో కానీ సమసమాజం గురించి చెప్పలేదు. సరుకుల సృష్టిలో శ్రమ పాత్ర అర్ధం అయినా అది అంతే అనుకున్నారు. దాన్ని శాశ్వత నియమం అనుకున్నారు. మార్క్సిస్టు అర్ధశాస్త్రం నుండి మార్క్సిస్టు తత్వశాస్త్రాన్ని వేరు చేయడం 'సృజనాత్మక' మార్క్సిజమే. ఇక రెండవ విషయం, కమ్యూనిజం కూడా మారి పోతుందా అనేది. ప్రసాద్‌గారు తన వ్యాసంలో, మార్క్స్ ఎంగెల్స్‌లు కమ్యూనిస్టు "సమాజానికి (వర్గాల రాహిత్యాన్నే) సమాజానికి చివరి స్థిర రూపంగా చెప్పుతారు" అని రాశాడు. ఇది ఒక పచ్చి అబద్దం. చెప్పని వాటి గురించి చెప్పారు అనడం, అబద్దాలు రాయడం చర్చ కాదు. దబాయించడమే అవుతుంది. అసలు సమస్య ఏమిటంటే ప్రసాద్‌కు కానీ ప్రీతమ్‌కు కానీ గతితార్కిక భౌతికవాదం గురించి తెలవదు. తెలిసిన వారెవరైనా ఈ విధంగా చర్చించరు. ఒక సిద్దాంతం అన్ని సమాజాలకు అన్వయించబడి ఒక సమాజానికి మాత్రం అన్వయించబడదు అంటే అది సిద్దాంతమే కాదు. ప్రతిదీ మారుతుంది కాని కమ్యూనిజం మాత్రం మారదు అనడం ఎలా ఉందంటే, హెగెల్ ప్రతిదీ మారుతుంది కాని జర్మన్ ప్రభుత్వం మాత్రం మారదు అన్నట్లుంది. అయితే ప్రభుత్వం కూడా మారి పోతుంది అంటే ఎక్కడ జైల్లో పెడతారో అనే భయంతో హెగల్ అలా అన్నాడు. వీరు కూడా తమ మనస్సులలోఏర్పరుచుకున్న (భావవాద) శాశ్వత సత్యం కమ్యూనిజం ఎక్కడ కూలిపోతుందో అనే భయంతో కమ్యూనిజం మారదు అంటున్నారు. మార్క్స్ ఎంగెల్స్ లు, దోపిడి ఉత్పత్తి సంభంధాలు ఉన్న సమాజాలు మాత్రమే మారతాయి అని చెప్పారనుకుంటున్నారు వీరు. తరువాత కాలం ఆగిపోతుందా?.. తెలుగు సినామాల్లో లాగ చివరికి శుభం కార్డు పడి హిరో హిరోయిన్‌లు పిల్లా పాపలతో అనంతకాలం వరకు జీవిస్తారా? మార్క్స్ ఎంగెల్స్‌లు ప్రతిదీ మారుతుంది ఆ మార్పు అంతకు ముందరి కంటే అభివృద్ధి కరంగా ఉంటుంది అనే చెప్పారు కాని సహకార ఉత్పత్తి సంభంధాలు ఏర్పడిన సమాజాలకు ఎక్కడ మినహాయింపు ఇవ్వలేదు. సహకార ఉత్పత్తి సంభంధాలలో కూడా ఎన్నో అభివృద్ధి కర మార్పులు ఉంటాయి. గతితార్కిక భౌతికవాదం ప్రకారం కమ్యూనిజం తరువాత అంతకంటే ఉన్నతమైన సమాజం ఏర్పడుతుందనే అర్ధం అంతేకాని సమాజం మల్లి వెనకకు వెల్లుతుందని కాదు. అసలు గతితార్కిక భౌతికవాదం ఏమి చెప్పుతున్నదీ, సమాజ పరిణామానికి అది ఎలా అన్వయించబడుతుంది అని చర్చించకుండా, అయితే కమ్యూనిజం కూడా మారిపోతే ఇక దాని గురించి పోరాడడం ఎందుకు అని ప్రశ్నిస్తున్నారు. గతితార్కిక భౌతికవాదం కాదు వీరికి జనరల్‌సైన్స్ కూడా తెలవదు అని తెలిసి పోతున్నది. అధిరోహణ క్రమం ఉన్నట్లే మానవజాతికి అవరోహణ క్రమం కూడా ఉంటుంది(ఏంగెల్స్). ఈ భూమి అవతరించాక

భూమి మీద రాజ్యం ఏలిన ఎన్నో జంతు జాలాలు అంతరించాయి. ప్రస్థుతం మానవుడు ఆధిపత్యం లో ఉన్నాడు. ఒక రోజు మానవజాతి కూడా నశిస్తుంది. ఆధునిక సైన్స్ ప్రకారం సూర్య కుటుంబం కూడా నశించేదే. బహుశా ఈ విషయాలన్ని ధృవపరుచుకుంటే ప్రసాద్, ప్రీతమ్‌లు, మానవజాతే నశించేది అయితే కమ్యూనిజమే ఎందుకు ఎదో ఒకటి ఏడవనీ అనుకుంటారు తప్పకుండా. మార్క్సిస్టు వ్యతిరేకులుగా మారినా మారవచ్చు. కాని మార్క్సిస్టులు మాత్రం మానవ సమాజం ఎన్ని రోజులు ఉంటే అన్ని రోజులు ముందు కంటే అభివృద్దికర సమాజం కొరకు కృషి చేస్తూనే ఉంటారు.

వర్గపోరాటంతో ఎటువంటి సంభంధం లేని వారికి మార్క్సిస్టు సిద్దాంతం ఎంత చదివినా అర్ధం కాదు. మార్క్స్ ఎంగెల్స్‌లు పడక కుర్చీలలో కూచుని, పుస్తకాలు చదివి పుస్తకాలు రాయలేదు. వర్గపోరాటంలో పాల్గంటూ అధ్యయనంచేశారు. వర్గపోరాటంలో పాల్గంటూ సిద్దాంతాన్ని అభివృద్ది చేశారు. సిద్దాంతం వెలుగులో వర్గపోరాటాన్ని అభివృద్ది చేశారు. ఎంత గొప్ప మేధావులైనా వర్గపోరాటంతో సంభంధం లేకుంటే మార్క్సిజం అర్ధం కాదు. కోళ్ళు సజ్జలు తిని సజ్జలు విసర్జించినట్లే ఉంటుంది. మనిషి అస్తిత్వమే మనిషి చైతన్యాన్ని నిర్ధారిస్తుంది అని నమ్మినందుననే మార్క్స్ ఎంగెల్స్‌లు ఎప్పుడూ జ్యోతిష్యాలు చెప్పలేదు. కమ్యూనిస్టు సమాజం గురించి కూడా నిర్ధిష్టంగా చెప్పలేదు. దాని రూపురేఖలు, సారాంశం మాత్రమేచెప్పారు. ఈ విషయం అర్ధం చేసుకునే శక్తి లేక, అయితే కమ్యూనిజం తరువాత ఎటువంటి సమాజం వస్తుందో చెప్పండి అంటూ ప్రశ్నిస్తున్నారు. కమ్యూనిస్టు సమాజం గురించే జ్యోతిష్యం చెప్పలేం అని మార్క్స్ ఎంగెల్స్ అన్నారు. తరువాతి సమాజం గురించి నిర్ధిష్టంగా జ్యోతిష్కులు మాత్రమే చెప్పగలుగుతారు.ప్ర మార్క్సిస్టులు జ్యోతిష్యాలు చెప్పరు. కమ్యూనిస్టు సమాజం కంటే అభివృద్ది కరంగా ఉంటుందని మాత్రమే చెప్పగలరు, గతితార్కిక భౌతికవాదం ఆధారంగా.

అయితే వైరుధ్యాలు లేని సమాజం ఎలా మారుతుంది అని ప్రీతమ్ గారిప్రశ్న. మొదటి విషయం ఏమిటంటే కమ్యూనిస్టు సమాజంలో వైరుధ్యాలు వుండవు అనుకోవడమే ఒక పొరపాటు. వైరుధ్యాలు లేకుండా ఏ విషయం మనగలగ లేదు. కమ్యూనిస్టు సమాజంలో వర్గాలు ఉండవు కావున వైరుధ్యాలు కూడా ఉండవు, మానవసమాజానికి ప్రకృతికి మధ్యనే వైరుధ్యం ఉంటుంది, ఈ వైరుధ్యం వలనే సమాజం అభివృద్ది చెందుతూ ఉంటుందని చెప్తుతారు. కాని ఇది గతితార్కిక భౌతికవాదానికి వ్యతిరేకమైనది. ఏ విషయం అయినా అంతర్గత వైరుధ్యం కారణంగనే అభివృద్ది చెందుతుంది. బాహ్య వైరుధ్యం సహాయకారి మాత్రమే. ప్రకృతితో ఉండే వైరుధ్యం కారణంగా సమాజం అభివృద్ది చెందుతుంది అంటే బాహ్యావైరుధ్యమే ప్రధానం అని చెప్పినట్లు అవుతుంది. కమ్యూనిజం దశలో అయినా సమాజంలో వైరుధ్యాలు లేకుండా ఉండడం సాధ్యం కాదు. ఈ విషయాన్ని మావో చాలా స్పష్టంగా చెప్పాడు. మావో రచనలు 10 వ భాగంలో ఇలా చెప్పాడు. కమ్యూనిస్టు సమాజంలో కూడా వైరుధ్యాలు ఉంటాయి. సరి అయిన ఆలోచనకు, సరిఅయినకాని ఆలోచనకు మధ్య వైరుధ్యాలు ఉంటాయి. వీటి వలనే సమాజం మనగలుగుతుంది, అభివృద్ది చెందుతుంది. అయితే కమ్యూనిస్టు సమాజంలో వర్గాలు ఉండవు కావున ఈ ఆలోచనలు ఏదో ఒక వర్గానికి(వర్గసమాజం లో లాగ) చెంది ఉండవు అని చెప్పాడు. (మావో రచనలు 10వ భాగం నావద్ద లేనందున కరెక్టుగా మావో వాక్యాలను పేర్కొనలేకపోతున్నా. కాని సారాంశం ఖచ్చితంగా ఇదే).

చివరిగా ఈ వాక్యాలతో ముగిస్తాను,. 'అంచేత ఈ గతితార్కిక తత్వశాస్త్రం, శాశ్వత, పరమసత్యాన్ని గురించిన దానికి అనుగుణంగా ఉండే, మానవ సమాజపు శాశ్వత, పరమస్థితిని గురించిన భావనలన్నింటిని పటాపంచలు చేసింది. ఏమంటే దీనికి పరమమూ, పవిత్రమూఅంటూ ఏదీ లేదు. ప్రతి ఒక్కదానికీ, ప్రతి ఒక్క దానిలోని పరివర్తనా స్వభావాన్ని అది బహిర్గతం చేస్తుంది. ఉనికిలోకి రావడం, నశించి పోవడం అనే నిరంతరాయమైన ప్రక్రియ తప్ప, కిందినుండి పైస్థాయికి సాగే అనంతమైన ఊర్ధ్వగమనం తప్ప, దీనిముందు ఏది నిలబడలేదు." (లుడ్విగ్ ఫ్యుయర్‌బా,పేజి 22). వీ

# వర్గ రాహిత్యమే సమాజానికి చివరి స్థిర రూపం!

**- జె.యు.బి.వి. ప్రసాద్**

జనవరి 'వీక్షణం'లో, 'రంగనాయకమ్మ తత్వశాస్త్ర పరిచయం గురించి–2' అనే సీరియల్ వ్యాసంలో, ప్రతీకార పునరుద్ఘాటన తప్ప, వ్యాసకర్త కొత్తగా చెప్పిందేమీ లేదు. ఏ విషయం మీదైనా ఒక చర్చ జరిగేటప్పుడు, ఒక పక్షం వ్యక్తి, అవతలి పక్షం వాదన ఎంత తార్కికంగా ఉన్నా పెడచెవిన పెట్టి, పాత వాదనలనూ, పాత శాపనార్ధాలనూ (రంగనాయకమ్మ 'అవాకులూ–చెవాకులూ; పేలవమైన విమర్శ; ఓనమాలు తెలియవు; బొటన వేలంత మనిషి' వంటి శాపనార్ధాలను) తిరిగి వల్లిస్తే, అది 'చర్చ' అవదు.

'శతృ వర్గాలూ, శతృ వైరుధ్యాలూ పోవడాన్నే అంటే వర్గాల రాహిత్యాన్నే సమాజానికి చివరి స్థిర రూపంగా మార్క్స్ ఎంగెల్స్‌లు ఎక్కడ చెప్పారో చూపించమని వ్యాస కర్త ప్రశ్న!

వర్గాల రాహిత్యమే సమాజానికి చివరి స్థిర రూపంగా మార్క్స్ ఎంగెల్స్‌లు ఎలా భావించి, ఏం చెప్పారో, వారి రచనల నుంచీ కొన్ని మాటలు, ఎక్కడ ఏ సందర్భమో, ఆ వివరాలతో సహా ఇక్కడ ఇస్తున్నాను. ప్రత్యేకంగా చెబితే తప్ప, మిగతా కొటేషన్లు అన్నీ 'కమ్యూనిస్టు సమాజం గురించి' అనే 1976 నాటి మాస్కో సంకలనం నించి.

– ('జర్మన్ ఐడియాలజీ'లో, మార్క్స్, ఎంగెల్స్‌లు; మాస్కో ప్రతి, పేజీ 60.)

"చరిత్ర పట్ల మా అవగాహన నుంచీ మేము వచ్చిన నిర్ధారణలు మరికొన్ని: ...కమ్యూనిస్టు విప్లవం, వర్గాలతో పాటు, అన్ని వర్గాల పాలననూ రద్దు చేస్తుంది (ఎబాలిషెస్ ది రూల్ ఆఫ్ ఆల్ క్లాసెస్ విత్ ది క్లాసెస్ దెమ్‌సెల్వ్స్). ఎందుకంటే, దాన్ని (కమ్యూనిస్టు విప్లవాన్ని) నిర్వర్తించే వర్గం, సమాజంలో ఒక వర్గంగా ఇక ఏ మాత్రమూ లెక్కకు రాదు; అన్ని వర్గాల రద్దుకీ, అది వ్యక్తీకరణగా ఉంటుంది కాబట్టి."

"వర్గాలు" అన్నప్పుడు, విషయాలు తేలిగ్గా అర్థం కావడానికి, 1) శ్రామిక వర్గం, 2) దోపిడీ వర్గం (యజమాని – శ్రామిక వర్గాలు) అని రెండే వర్గాల్ని చెప్పుకుంటాం. కానీ, ఆ వర్గం లోనూ, ఈ వర్గం లోనూ కూడా తేడాలుగా ఉండే బృందాలు ఉంటాయి. "కమ్యూనిస్టు సమాజం" అనేది, దోపిడీ వర్గాన్నే కాదు; శ్రామిక వర్గాన్ని కూడా, ఒక ప్రత్యేక వర్గంగా లేకుండా చేస్తుంది అని మార్క్స్, ఎంగెల్స్‌లు చెపుతున్నారు. ఆ సమాజంలో ఇక తేడాలు గల వర్గాలే ఉండవని చెప్పడం – అది. దాన్ని అలా ఏర్పర్చుకోవాలి – అని.

– (ఎంగెల్స్, "కమ్యూనిస్టు సమాజం గురించి" పుస్తకంలో, పేజీ 19.)

"... కమ్యూనిస్టు పద్ధతిలో వ్యవస్థీకరింపబడిన సమాజం వర్గాల ఉనికితో పొసగదు..."

"అదే విధంగా పట్టణానికీ గ్రామానికీ మధ్య గల వైరుధ్యం (యాంటి థీసిస్) అదృశ్యమవుతుంది. రెండు భిన్న వర్గాలకు బదులు అదే మనుషులు వ్యవసాయాన్నీ, పారిశ్రామిక ఉత్పత్తినీ సాగించడం, ...కమ్యూనిస్టు సంయోగానికి (కమ్యూనిస్ట్ అసోసియేషన్‌కు) ముఖ్యమైన షరతు." (1847లో రాసిన 'కమ్యూనిజం సూత్రాలు'లో.)

అందరూ శ్రమలు చెయ్యడం ప్రారంభించిన తర్వాత, కేవలం పారిశ్రామిక శ్రమలే చెయ్యడం గానీ, కేవలం వ్యవసాయ శ్రమలే చెయ్యడం గానీ, కాదు. మనిషి, ఆ 2 రకాల శ్రమల లోనూ పాల్గోవాలి. అప్పుడు, అందరూ శ్రమలు చేసినా, వేరు, వేరు వర్గాలుగా ఉండరు.

– (మార్క్స్ ఎంగెల్స్‌లు. "కమ్యూనిస్టు సమాజం గురించి" పుస్తకంలో, పేజీ 28.)

"సమాజంలో విప్లవం తెచ్చే భావాలు – అని ఎవరైనా అన్నప్పుడు, పాత సమాజం లోపల కొత్త సమాజపు బీజాలు ఉద్భవించాయనీ; పాత జీవిత విధానం ఏ మేరకు క్షీణిస్తే ఆ మేరకు పాత భావాలు కూడా క్షీణిస్తాయనీ, అనే వాస్తవాన్ని మాత్రమే ఆ మాటలు వ్యక్తం చేస్తాయి." (1847 – 48 లలో రాసిన 'కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక'లో.)

పాత సంప్రదాయాలూ, పాత సంబంధాలూ, మారుతూ ఉంటే, ఆ పాత భావాలు నశిస్తూ ఉంటాయి._ (అదే పుస్తకం, పేజీ 29.)

"…. గత సమాజపు చరిత్ర అంతా వివిధ దశలలో వివిధ రూపాలు ధరించిన వర్గ వైరుధ్యాల అభివృద్ధే … ఆ వైరుధ్యాలు ఏ రూపం ధరించినప్పటికీ! …సమస్త వర్గ వైరుధ్యాలూ సమూలంగా అంతరించినప్పుడు తప్ప, ఆ రూపాలు …సంపూర్ణంగా అంతరించిపోవు."

ఈ మాటలు గమనించండి! "సమస్త వర్గ వైరుధ్యాలూ సమూలంగా అంతరించినప్పుడు" – ఏమిటి దీని అర్థం? "సమస్త వైరుధ్యాలూ అంతరించడం" అంటే? "సమూలంగా అంతరించడం" అంటే? ఇది వర్గ రాహిత్యం కాదా? _(అదే పుస్తకం, పేజీ 31.)

"వర్గాలూ, వర్గ శతృత్వాలూ (క్లాస్ యాంటగనిజంస్) గల పాత బూర్జువా సమాజానికి బదులు, మనకొక నూతన సదస్సు (అసోసియేషన్) లభిస్తుంది; ప్రతి ఒక్కరూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందినప్పుడే అందరూ స్వేచ్ఛగా అభివృద్ధి చెందగల సదస్సు అది!" – (అదే పుస్తకం, పేజీ 31.)

"శ్రామిక వర్గం… విప్లవం ద్వారా… మొత్తం వర్గాలూ, వర్గ విభేదాలూ నిలవడానికి అవసరమైన పరిస్థితులను వూడ్చి (… స్వెప్ట్ …) పారవేస్తుంది, తన్మూలంగా తన వర్గాధిపత్యాన్నే రద్దు చేసుకుంటుంది."

శ్రామిక వర్గం దోపిడీ వర్గంతో పోరాడి, దోపిడీ లేకుండా చెయ్యడం అంటే, "నీ దోపిడీ తీసేసి మా దోపిడీ పెడతాం" అని చెప్పడం కాదు.

అందరూ శ్రమలు చేసే సంబంధాలు ఏర్పడితే, శ్రమ చెయ్యకుండా ఇతరుల శ్రమని తినే పరిస్తితే ఉండదు. అంటే, "శ్రమ దోపిడీ" ఉండదు. వడ్డీల ద్వారా, లాభాల ద్వారా, భూమి అద్దెల ద్వారా, ఆ రకంగా దోపిడీ ఆదాయాలు లాగే మార్గం ఉండదు. ఆ మార్గాల్ని తీసివేసే భావాలూ, ఆ మార్పులూ ప్రారంభమై సాగుతూ ఉంటే, అదే కమ్యూనిజం! దాని తర్వాత ఇంకో దశ రావాలంటే, మళ్లీ దోపిడీ సమాజం రావాలన్న మాట! అది వస్తుందనీ, అలా మారుతూ ఉంటుందనీ, మార్క్స్ ఎంగెల్స్‌లు చెప్పారా? దాన్నే విప్లవం అని చెప్పారా?

– (1847లో ఎంగెల్స్ రాసిన "ప్రిన్సిపుల్స్ ఆఫ్ కమ్యూనిజం"లో.)

"మొదటి ప్రశ్న: కమ్యూనిజం అంటే ఏమిటి?

జవాబు: శ్రామిక వర్గ విమోచనకు కావల్సిన పరిస్తితులను గూర్చిన సిద్ధాంతం."

శ్రామిక వర్గానికి విమోచన – అంటే ఏమిటి? – మళ్లీ మళ్లీ ఆ వర్గం, దోపిడీ అవుతూనే ఉండడమా; లేకపోతే ఆ దోపిడీ నించి పూర్తిగా ఎన్నడూ ఆ స్థితి లేకుండా బైట పడడమా? "విమోచన"కి అర్థం ఏమిటి?

– (1847లో మార్క్స్ రాసిన "పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ" నించి పేజీ 151 –152, మాస్కో ప్రతి 1966.)

"వర్గాల శతృత్వం (యాంటగనిజం ఆఫ్ క్లాసెస్) మీద ఆధారపడ్డ ప్రతీ సమాజానికీ కీలకమైన షరతు (వైటల్ కండిషన్), అణచివేతకి గురయ్యే ఒక వర్గం ఉండాలి! ఈ విధంగా, అణచివేతకి గురయ్యే వర్గ విముక్తి – అనే దానిలో తప్పని సరిగా ఒక కొత్త సమాజ సృష్టి – అనే అర్థం ఇమిడి ఉంది (ఇంప్లైస్)." – (అదే పుస్తకంలో అదే పేజీలో)

"పాత సమాజం కూలిపోయాక, కొత్త రాజకీయాధికారం రూపంలో కొత్త వర్గ ఆధిపత్యం ఉంటుందా? ఉండదు! (నో)."

కమ్యూనిజాన్ని, "కొత్త సమాజం" అనీ, "సమసమాజం" అనీ అనుకుంటే, సమాజ జనం, ఆ భావాలతో, ఆ మార్పులు చేసుకుంటే, ఒక బృందం, ఇంకో బృందం మీద పెత్తనాలు చెయ్యడానికా? అదే అయితే, అది "సమ సమాజం" అవుతుందా? _ (అదే పుస్తకం, అదే పేజీలో.)

"శ్రామిక వర్గ విమోచనకు షరతు, ప్రతీ వర్గం రద్దు కావడం!"

"శ్రామిక వర్గం తన అభివృద్ధి క్రమంలో (ఇన్ ది కోర్స్ ఆఫ్ ఇట్స్ డెవలప్‌మెంట్), పాత పౌర సమాజం (సివిల్ సొసైటీ) స్థానంలో, వర్గాలూ, వాటి శతృత్వమూ (క్లాసెస్ అండ్ దెయిర్ యాంటగనిజం) లేని (ఎక్స్‌క్లూడ్) సంఘాన్ని (అసోసియేషన్‌ని) తెచ్చి పెడుతుంది (సబ్‌స్టిట్యూట్). 'రాజకీయ అధికారం' అని పిలిచేది ఇంక ఎంత మాత్రమూ ఉండదు; ఎందుకంటే, రాజకీయాధికారం అనేది, పౌర సమాజంలో ఉండే శతృత్వానికి (యాంటగనిజానికి) ఖచ్చితంగా అధికారికమైన వ్యక్తీకరణ కాబట్టి."

"రాజ్యాంగ యంత్రం" ఉందంటే, ఆ సమాజంలో శత్రు వర్గాలు ఉన్నాయని అర్థమే. "సోషలిజం" ప్రారంభమైన దశలో, శ్రామిక వర్గ రాజ్యాంగ యంత్రం తప్పని సరిగా ఉంటుంది. దోపిడీ సంబంధాల్ని తీసివేసే కార్యక్రమమే దానిది. అయినా, రాజ్యాంగ యంత్రం ఉందంటే, వర్గ పోరాటం ఉన్నట్టే. వర్గ సంబంధాల్ని మార్చగలిగితేనే, శ్రామిక వర్గానికి ఆ చైతన్యం ఏర్పడితేనే ఆ పోరాటం సమానత్వ సంబంధాల్ని ఏర్పర్చగలుగుతుంది. _ ("కమ్యూనిస్టు సమాజం గురించి", పేజీ 104.)

"కమ్యూనిస్టు సమాజపు మరింత ఉన్నత దశలో, 'శ్రమ విభజన'కు మనిషి బానిస లాగా లోబడడమూ, దానితో పాటు మేధో శ్రమకూ, శారీరక శ్రమకూ మధ్య వైరుధ్యం (యాంటీ థీసిస్) అదృశ్యమైన తర్వాత …" సమాజంలో, కొందరు ఎప్పుడూ మేధో శ్రమ, కొందరు ఎప్పుడూ శారీరక శ్రమ చేసే దోపిడీ సమాజాల "శ్రమ విభజన" సాగుతూ ఉంటే, దోపిడీ శ్రమ విభజననే కొనసాగిస్తే, దాన్ని కూడా 'బానిసత్వానికి లోబడడమే' అన్నాడు మార్క్స్. (1875లో రాసిన 'గోతా కార్యక్రమ విమర్శ'లో).

అంటే, "శ్రమ దోపిడీ"ని తీసివెయ్యడమే కాదు; ఆ తర్వాత, మనుషులందరూ శ్రమలు చేస్తూ ఉన్నా, ఆ విధానాన్ని కూడా సమానత్వం అనే గుణంతో ఏర్పర్చుకోవాలి. పురుషుల మధ్య సమానత్వం, స్త్రీల మధ్య సమానత్వం, స్త్రీ–పురుషుల మధ్య సమానత్వం!

**చివరి మాట:**

గతి తర్క సూత్రాల్లో "చలనం" అనే విషయం ఉంటుంది. ఈ చలనం, ప్రకృతి విషయాల్లో శాశ్వతమైనదే. పదార్థంలో ఎప్పుడూ చలనం ఉంటుంది. మానవ శరీరంలోనూ చలనం ఉండి, ఆ శరీరం వృద్ధాప్యం లోకీ, నిర్జీవత్వం లోకీ, పోతుంది. కానీ, సమానత్వం అనే గుణంతో సాగే మానవ సంబంధాలు ఆ గుణంతోనే సాగవలసి ఉంటుంది. సమాజంలో ఉండే ఉత్పత్తి సాధనాలూ – ఉత్పత్తి క్రమాలూ – తయారయ్యే ఉత్పత్తులూ – ఇవన్నీ మారుతూ ఉండవచ్చు. కానీ, సమానత్వ సంబంధాలు మారిపోతూ ఉంటాయని కాదు.

సమానత్వాన్ని ఏర్పరిచే కమ్యూనిజానికి కూడా చలనం ఉంటుందనీ, సమాజం ఎప్పుడూ మారుతూనే ఉంటుందనీ అర్థం చేసుకోవడం అంటే, ప్రతీ ప్రకృతి సూత్రాన్నీ, మానవ సంబంధాలకు అంటగట్టడమే! – ఈ అభిప్రాయాన్ని, రంగనాయకమ్మ, వ్యాసకర్త రాసిన పుస్తకాన్ని సమీక్షిస్తూ చెప్పారు.

_వ్యాసకర్త భ్రమల్ని తొలగించడానికి ఈ మాత్రపు కొటేషన్లు చూపించవలసి వచ్చింది. కానీ, నిజానికి, వీటిలో ఒక్క కొటేషన్ కూడా అక్కర లేదు. శ్రమ దోపిడీ, అదనపు విలువా, శ్రమ శక్తి విలువ లెక్కలతో జీతాలూ – ఈ నాలుగైదు విషయాలూ తెలిస్తే చాలు, కమ్యూనిజాన్ని అర్థం చేసుకోవచ్చు. శ్రమ దోపిడీ సాగకుండా దాన్ని ఆపితే, అందరూ శ్రమలు చేసే సమాజాన్ని ఏర్పర్చుకోగలిగితే, ఇక అది దోపిడీ లేని సమాజమే అవుతుంది. మార్క్స్ ఎంగెల్స్‌లు, "సమస్య"కి కారణం చెప్పారు; పరిష్కారం చెప్పారు. అసలు, కారణం తెలిస్తే చాలు, పరిష్కారం తెలుస్తుంది.

అయినా, వ్యాస కర్తకి ఈ మార్క్సిజం మాట ఎందుకు? "మార్క్సిజం పరిపూర్ణ సిద్ధాంతం కాదు; అది, అంతిమ సత్యాన్ని ఆవిష్కరించదు" అని తేల్చి చెప్పిన వ్యక్తి ఆయన. అంటే, "కమ్యూనిజం" అంతిమ సత్యం కాదు అని. "అంతిమ సత్యం ఉండదు" అని! సమస్యకి పరిష్కారం ఉండదు అని! ఇక దాని మీద ఈ చర్చ లెందుకు? వీ

### సోషలిజమే పరిష్కారం

సిపిఐ(ఎంఎల్) న్యూడెమోక్రసీ కేంద్ర కమిటీ ఆధ్వర్యంలో సుందరయ్య విజ్ఞానకేంద్రంలో 'రష్యా అక్టోబర్ విప్లవం–భారత నూతన ప్రజాస్వామిక విప్లవంపై దాని ప్రభావం' అనే అంశంపై డిసెంబర్ 27న అఖిల భారత సదస్సు నిర్వహించింది. ఈ సదస్సులో వరవరరావు ప్రారంభోపన్యాసం చేస్తూ 1917 అక్టోబర్ విప్లవం ప్రపంచగతిని మార్చిందని ఆ స్ఫూర్తిని దేశ ప్రజలు కొనసాగించాలన్నారు. మోడీ అధికారంలోకి వచ్చాక ఫాసిస్టు శక్తుల ప్రాభల్యం పెరుగుతోందన్నారు. దేశంలో భూస్వామ్య పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద శక్తులను తొలగించి సమసమాజాన్ని స్థాపించాలన్నారు. ఈ సదస్సుకు న్యూడెమోక్రసీ కేంద్ర కమిటీ సభ్యులు ముఖ్తార్ పాషా అధ్యక్షత వహించారు. దేశవ్యాప్తంగా ఉన్న న్యూడెమోక్రసీ నాయకులు, కార్యకర్తలు సదస్సుకు హాజరయ్యారు.

### భూసేకరణ బిల్లుకు తెలంగాణ పభుత్వ ఆమోదం

తెలంగాణ రాష్ట్ర శాసనసభ, శాసన మండలి 'భూసేకరణ (పునరావాసం – పునఃపరిష్కారంలో న్యాయమైన పరిహారం, పారదర్శకతకు హక్కు) చట్టం – 2013 లోని నిబంధనలు భూముల సమీకరణకు అవరోధంగా ఉన్నాయని, ఆ చట్టంలో సవరణలు చేయాలని డిసెంబర్ 28న నిర్ణయించాయి. దీని ప్రకారం 2013 చట్టంలోని మూడు కీలక నిబంధనలను రాష్ట్ర ప్రభుత్వం సవరిస్తోంది. 1) ఒకటి కన్న ఎక్కువ పంటలు పండే భూములను కూడా నీటి పారుదల ప్రాజెక్టుల కోసం సేకరించే వీలు కల్పించడం. 2) సామాజిక ప్రభావం అధ్యయనాన్ని తొలగించడం. 3) 2013 చట్టంలోని చాప్టర్ 2, చాప్టర్ 3 నుంచి నీటి పారుదల ప్రాజెక్టులకు మినహాయింపు ఇవ్వడం.

### క్యాబ్ డ్రైవర్ల, ఓనర్ల సమ్మె

తమ సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్ వద్ద ఓలా, ఉబర్ క్యాబ్ డ్రైవర్లు, ఓనర్లు డిసెంబర్ 31 నుండి జనవరి 4న నిరాహార దీక్షలు చేపట్టారు. ఓలా, ఉబర్ సంస్థలు, ప్రభుత్వం తమ న్యాయమైన డిమాండ్లను పరిష్కరించాలని కోరితో కంపెనీలు బౌన్సర్లతో తమపై దాడులు చేయించాయన్నారు. తమ సమస్యలు పరిష్కారమయ్యే వరకు దీక్షవిరమించేది లేదనడంతో జనవరి 4న క్యాబ్ డ్రైవర్ల దీక్షలను పోలీసులు భగ్నంచేసి అరెస్టు చేసి పోలీసు స్టేషన్‌కు తరలించారు.

### నాగముని మృతి

కార్మిక ఉద్యమ నాయకులు గంటా నాగముని (నాగమునేశ్వరరావు) (56) జనవరి 6న విశాఖపట్నంలోని గాజువాకలో గుండెపోటుతో మరణించారు. ఆయన 1984లో విశాఖపట్నంలోని హిందూస్తాన్ షిప్‌యార్డ్‌లో వెల్డర్‌గా చేరారు. షిప్‌యార్డ్‌లోని కార్మికోద్యమ సంస్థ అయిన 'ప్రగతిశీల కార్మిక సమాఖ్య'లో చేరి ఎర్నెస్ట్ నేతృత్వంలో పలు పోరాటాల్లో పాల్గొని నాయకత్వ స్థాయికి ఎదిగారు. 1991లో దేశంలో అమలు పరిచిన నూతన ఆర్థిక విధానాల్లో భాగంగా తెచ్చిన ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాల అమలు నేపథ్యంలో ఆవిర్భవించిన 'అఖిల భారత ప్రజా ప్రతిఘటన వేదిక' (ఏఐపిఆర్‌ఎఫ్) కు రాష్ట్ర అధ్యక్షునిగా పనిచేశారు. ఆ సంస్థ నిర్వహించే 'ఉద్యమం' పత్రికకు సంపాదకులుగా ఉన్నారు. 'కార్మిక తీరం' పత్రిక నడపడంలోనూ తన వంతు కృషిచేశారు.

### కాంట్రాక్ట్ లెక్చరర్ల నిరసన దీక్ష

కాంట్రాక్ట్ లెక్చరర్లను క్రమబద్దీకరణ చేయాలనీ, 10వ పిఆర్‌సి ప్రకారం వేతనాలు చెల్లించాలనీ, సుప్రీం కోర్టు తీర్పు ప్రకారం సమాన పనికి సమాన వేతనం చెల్లించాలనీ డిమాండ్ చేస్తూ కాంట్రాక్ట్ లెక్చరర్లు డిసెంబర్ 30 నుంచి ఇందిరా పార్క్‌లో నిరసన దీక్షలు ప్రారంభించారు. ప్రభుత్వం సమ్మె విరమించాలని చేసే బెదిరింపులు సరికాదని పలు సంఘాల నేతలు విమర్శించారు. జనవరి 12 లోగా విధుల్లో చేరాలని, లేదంటే రెగ్యులరైజ్ అయ్యేందుకు అర్హత కోల్పోతారని విద్యాశాఖ మంత్రి కడియం శ్రీహరి హెచ్చరించిన నేపథ్యంలో పదిహేను రోజుల పాటు సమ్మె చేసినా ప్రభుత్వం నుంచి ఎలాంటి హామీ లేకుండానే సమ్మె విరమించారు.

### కుల నిర్మూలన సదస్సు

రోహిత్ వేముల మరణించిన జనవరి 17ను 'కుల నిర్మూలన పోరాట దినంగా పాటిద్దాం' అన్న శీర్షికతో కుల నిర్మూల పోరాట సమితి జనవరి 17న, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జాతీయ సదస్సు నిర్వహించింది. ఈ సదస్సులో వక్తలు దళితులు, గిరిజనులు, మైనార్టీలు, కార్మికులు ఐక్యమై కలిసి ప్రజా పోరాటంగా మలచాలని రోహిత్ ఆలోచించాడని తెలిపారు. దళిత విద్యార్థులను విశ్వ విద్యాలయాల్లో సామాజిక వివక్షకు గురిచేస్తున్నారని అన్నారు. రోహిత్ తల్లి రాధిక వేముల రోహిత్ స్థూపాన్ని జైల్లో పెట్టినట్లు పోలీసులు బంధించారని ఆవేదన వ్యక్తం చేశారు. ఈ సదస్సుకు కెవిపిఎస్ రాష్ట్ర అధ్యక్షులు బండారి లక్ష్మయ్య అధ్యక్షత వహించారు.

### ఎచ్‌సియులో విద్యార్థుల ఆందోళన

రోహిత్ వేముల ప్రథమ వర్ధంతి సందర్భంగా హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో జనవరి 17న తీవ్ర ఉద్రిక్తత నెలకొంది. క్యాంపస్‌లో జరిగే ఈ కార్యక్రమానికి బయటి వ్యక్తులను అనుమతించకపోవడంతో విద్యార్థి సంఘాలు ధర్నాకు దిగాయి. విద్యార్థులు ప్రధాన గేటు తాళం పగులగొట్టడంతో తీవ్ర ఉద్రిక్తత నెలకొంది. రోహిత్ వేముల తల్లి రాధికను కూడా లోనికి రానీయక పోవడంతో పలు సంస్థలు, విద్యార్థి సంఘాల నేతలు ఆందోళన వ్యక్తం చేశారు. ఎంత ప్రయత్నించినా లోనికి అనుమతించకుండా రోహిత్ వేముల తల్లిని, విద్యార్థులను పోలీసులు అరెస్ట్ చేశారు.

### నిజనిర్ధారణ బృందంపై కేసు అప్రజాస్వామికం

తెలంగాణ ప్రజాస్వామిక వేదిక నిజనిర్ధారణ బృందంపై చత్తీస్‌గఢ్ ప్రభుత్వం పెట్టిన 'చత్తీస్‌గఢ్ పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్' కేసును ఎత్తివేయాలని డిమాండ్ చేస్తూ తెలంగాణ ప్రజాస్వామిక వేదిక, ప్రజాస్వామిక హక్కుల సంఘాల సమన్వయ కమిటీ ఆధ్వర్యంలో జనవరి 21న ఇందిరా పార్కు వద్ద ధర్నా నిర్వహించాయి. సుక్మా జైల్లో నిర్బంధించిన తెలంగాణ ప్రజాస్వామిక వేదిక నిజ నిర్ధారణ కమిటీ సభ్యులను వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేశారు. ప్రజాస్వామిక హక్కుల కోసం ఉద్యమిస్తున్న వారిపై కేసులు పెట్టి నిర్బంధించడం అప్రజాస్వామికమని అన్నారు. కార్యాలయాలను సీజ్ చేయడం, సెర్చ్‌ల పేరుతో సోదాలు నిర్వహించి ఇబ్బందులకు గురిచేయడం దారుణమన్నారు. ఈ విషయంపై రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు స్పందించి అరెస్టు చేసిన వారిని విడుదల చేసేలా చర్యలు తీసుకోవాలన్నారు.

### హిరాఖండ్ రైలు ప్రమాదం

జగదల్‌పూర్ నుంచి భువనేశ్వర్ వెళ్తున్న హిరాఖండ్ ఎక్స్‌ప్రెస్ విజయనగరం జిల్లా కొమరాడ మండలం కూనేరు రైల్వేస్టేషన్ సమీపంలో జనవరి 21న ఘోర ప్రమాదానికి గురైంది. పట్టాలు తప్పి ఐదు బోగీలు పక్కన ఆగి ఉన్న గూడ్స్ బండిపై పడ్డాయి. ఈ ప్రమాదంలో నలభై ఒక్క మంది చనిపోగా, యాభై మందికి పైగా గాయపడ్డారు. రైలు పట్టాలు తప్పడంతో ఈ ప్రమాదం జరిగిందని రైల్వే అధికారులు తెలిపారు.

### మానెపల్లి మృతి

ప్రముఖ సాహితివేత్త మానెపల్లి సత్యనారాయణ (72) తీవ్ర అనారోగ్యం తో జనవరి 25న కన్నుమూశారు. సుదీర్ఘకాలంగా ఆయన హృద్రోగ సమస్యల తో బాధపడుతున్నారు. యలమంచలికి చెందిన మానెపల్లి అధ్యాపక వృత్తిలో ఉంటూనే, వివిధ ప్రజా ఉద్యమాలతో సన్నిహితంగా మెలిగారు. ఆయన నవలలు, వ్యాసాలు, అనువాదాలు చేశారు. ఆయన తన దగ్గర ఉన్న లైబ్రరీని ప్రజలందరికీ అందుబాటులో ఉంచారు. వీ

### ఇరవై వేల ఎన్‌జిఓల లైసెన్సుల రద్దు

దేశవ్యాప్తంగా ఉన్న 33వేల స్వచ్ఛంద సేవా సంస్థల్లో 13 వేల ఎన్‌జిఓలు మాత్రమే చట్టబద్ధమైనవని కేంద్ర హోంమంత్రిత్వ శాఖ పేర్కొంది. ఇరవై వేల ఎన్‌జిఓల లైసెన్సులను రద్దు చేస్తున్నట్లు డిసెంబర్ 27న కేంద్ర హోంశాఖ ప్రకటించింది. పలు నిబంధనలను ఉల్లంఘించి ఎన్జీవోలకు విదేశాల నుంచి అక్రమంగా నిధులు వస్తున్నాయన్న ఆరోపణల వల్ల ఈ నిర్ణయం తీసుకున్నట్లు కేంద్ర హోంశాఖ రాజ్‌నాథ్ సింగ్ ప్రకటించారు.

### ఐదు రాష్ట్రాల ఎన్నికల షెడ్యూల్ విడుదల

శాశాసనసభ గడువు ముగియడంతో ఉత్తర్‌ప్రదేశ్, ఉత్తరాఖండ్, గోవా, పంజాబ్, మణిపూర్ రాష్ట్రాలకు ఎన్నికలు నిర్వహించాలని కేంద్ర ఎన్నికల సంఘం నిర్ణయించింది. ఎన్నికల సంఘం ప్రధానాధికారి నసీం అహ్మద్ జైదీ జనవరి 4న ఎన్నికల షెడ్యూల్ ప్రకటించారు. ఈ రాష్ట్రాల్లో ఎన్నికల నియమావళి వెంటనే అమల్లోకి వస్తుందని స్పష్టం చేశారు. ఈ ఎన్నికలు ఫిబ్రవరి 11న మొదలై మార్చి 8తో ముగుస్తాయి. ఐదు రాష్ట్రాల్లోనూ మార్చి 11న ఓట్ల లెక్కింపు చేపట్టి, అదే రోజు ఫలితాలు ప్రకటించనున్నారు.

### జార్ఖండ్ బొగ్గుగనిలో ప్రమాదం

జార్ఖండ్‌లోని లాల్మాటియా వద్ద డిసెంబర్ 30న బొగ్గు గని కుప్పకూలిన ఘటనలో ఏడుగురి కార్మికుల మృతదేహాలను వెలికి తీశారు. ఘటనాస్థలి వద్ద రక్షణ బృందాలు సహాయ చర్యలు కొనసాగిస్తున్నాయి. అధికారుల సమాచారం ప్రకారం దాదాపు 15 నుంచి 20 మంది శిథిలాల కింద చిక్కుకుని ఉన్నారని భావిస్తున్నట్లు ముఖ్యమంత్రి రఘుబర్‌దాస్ తెలిపారు.

### మణిపూర్‌లో ఆర్థిక స్థంభన

నాగా ప్రాభల్య ప్రాంతాన్ని విడదీసి ఏడు కొత్త జిల్లాలను ఏర్పాటు చేయాలనే సిఎం ఒక్రమ్ ఇబోబి సింగ్ వైఖరికి నిరసనగా సరిహద్దు రాష్ట్రం మణిపూర్ గడచిన రెండు నెలలుగా ఉద్రిక్తతలతో అట్టుడుకుతోంది. ప్రభుత్వ నిర్ణయాన్ని నిరసిస్తూ యునైటెడ్ నాగా కౌన్సిల్ (యుఎన్‌సి) రోడ్ల దిగ్బంధనానికి దిగింది. ఇందుకు ప్రతిగా రాష్ట్రంలోని మెజారిటీ తెగ అయిన మీటీలు కూడా నాగాలు ఎక్కువగా ఉండే ప్రాంతాలకు నిత్యావసరాలు సరఫరా కాకుండా వాహనాలను అడ్డుకుంటున్నారు. ఫలితంగా ఇతర ప్రాంతాలను మణిపూర్‌తో అనుసంధానం చేసే 53, 2 జాతీయ రహదారులు రెండు నెలలుగా దిగ్బంధనానికి గురయ్యాయి. జనవరి 20 వరకు 17వేలకు పైగా కేంద్ర బలగాలను మోహరించారు.

### కుల, మతాల ఆధారంగా ఓట్లు అడగొద్దు సుప్రీం

ఎన్నికల ప్రచారానికి సంబంధించి సుప్రీం కోర్టు కీలక తీర్పును ఇచ్చింది. ఏ రాజకీయపార్టీ, నాయకుడు కుల, మత విశ్వాసాల ఆధారంగా ఓట్లు అడగకూడదని జనవరి 2న తీర్పు ఇచ్చింది. మతానికి ఎన్నికల ప్రక్రియలో ఎటువంటి పాత్ర లేదని స్పష్టం చేసింది. ఎన్నికలు లౌకిక ప్రక్రియ కావడంతో దాని ప్రకారమే ముందుకు వెళ్లాలని పేర్కొంది. భగవంతుడు, వ్యక్తి మధ్య సంబంధాలు పూర్తిగా వ్యక్తిగతమైనవి. మతం, జాతి, కులం, వర్గం, భాష ఎన్నికల్లో ఇటువంటి విషయాల జోక్యం తగదని, వాటి జోక్యం ఉంటే అది అవినీతితో సమానమని సర్వోన్నత న్యాయస్థానం పేర్కొంది. ప్రజాప్రాతినిధ్య చట్టంలోని సెక్షన్ 123(3)లో 'హిజ్ రెలిజియన్' అన్న పదం వాడడంపై విచారణ జరిగింది. 4:3 నిష్పత్తిలో వెలువడిన ఈ తీర్పులో చీఫ్ జస్టిస్ టిఎస్ ఠాకూర్, న్యాయమూర్తులు ఎంబి లోకూర్, ఎస్ఎ బాబ్డే, ఎల్ఎన్ రావు.. ఇక్కడ హిజ్ రెలిజియన్ అంటే ఓటర్లు, అభ్యర్థులు, ఏజెంట్లు అందరికీ వర్తిస్తుందని అభిప్రాయపడ్డారు. మరో ముగ్గురు న్యాయమూర్తులు యుయు లలిత్, ఏకె గోయల్, డివై చంద్రచూడ్ అభ్యర్థి మతం.. అన్న అర్థం అన్నారు.

### హక్కుల నేత మురుగన్ అరెస్ట్

తమిళనాడు సెంటర్ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ సివిల్ లిబర్టీస్ కార్యదర్శి, న్యాయవాది మురుగన్‌ను జనవరి 8న క్యూ బ్రాంచి పోలీసులు అరెస్ట్ చేసి చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం కింద కేసు నమోదు చేశారు. ఐదు నెలల కింద కరూర్‌లో అరెస్టయిన మావోయిస్టులకు సహాయపడ్డాడనే అభియోగం మోపారు. ఆయన గత పది సంవత్సరాలు న్యాయవాదిగా, హక్కుల కార్యకర్తగా పనిచేస్తున్నారు.

### జల్లికట్టును అనుమతించిన కేంద్రం

తమిళ సంప్రదాయ క్రీడ జల్లికట్టు నిర్వహణకు అవకాశమివ్వాలంటూ మెరీనా బీచ్‌లో యువతి, యువకులు వేలాది మందితో నిరసనకు దిగారు. తమిళనాడు ప్రభుత్వం రూపొందించిన ఆర్డినెన్స్ ముసాయిదాను కేంద్ర ప్రభుత్వం జనవరి 20న ఆమోదించింది. ఆర్డినెన్స్ ముసాయిదాను కేంద్రం ఆమోదించినా తమిళనాడులోని నిరసనకారులు సంతృప్తి చెందలేదు. జనవరి 16న నిరసన మొదలైంది. జనవరి 20 నాటికి 2 లక్షల మంది ధర్నాలు, రాస్తారోకో, రైలురోకో, విద్యా సంస్థల బంద్‌లు నిర్వహించారు. జనవరి 20 చేపట్టిన బంద్ రాష్ట్ర వ్యాప్తంగా ప్రభావం చూపింది.

### అవార్డును తిరస్కరించిన కన్నడ రచయిత

దేశంలోనూ, రాష్ట్రంలోనూ పాలక పక్షాల వైఖరి కారణంగా కన్నడ రచయిత, విమర్శకులు జి. రాజశేఖర్ కర్ణాటక సాహిత్య అకాడమీ అవార్డును తిరస్కరించారు. కర్ణాటక రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డును జనవరి 10న ప్రకటించింది. రేండేళ్ల క్రితం దేశవ్యాప్తంగా రచయితలు, మేధావులు, సాహితీ ప్రముఖులు అప్పటి వరకు తమకు లభించిన అవార్డులను తిరిగి ఇచ్చేందుకు చెప్పిన కారణాలుగా నిలిచిన అసహనం, హింసాత్మక ధోరణులు ఇప్పటికీ మారలేదని ఆయన ఆరోపించారు. ఆనాటి ప్రముఖులు ఆవేదనకు సంఘీభావంగా ఇప్పుడు కర్ణాటక సాహిత్య అకాడమీ ప్రకటించిన అవార్డును తాను తిరస్కరిస్తున్నట్లు ఆయన తెలిపారు. ఆయన రాసిన బహువచన భారత్ పుస్తకానికి గాను ఈ అవార్డు ఇవ్వాలని అకాడమీ ఆశించింది.

### 3 కోట్ల మందితో మానవహారం

మద్యపాన నిషేదానికి మద్దతుగా జనవరి 21న బీహార్‌లో ప్రభుత్వం నిర్వహించిన భారీ మానవహారంలో ప్రజలు పెద్దఎత్తున పాల్గొన్నారు. 11400 కిలో మీటర్ల పొడవునా దాదాపు 3 కోట్ల మంది పాల్గొన్నారు. ప్రపంచంలో ఇదే అతి పొడవైన మానవహారమని బీహార్ ముఖ్యమంత్రి ప్రకటించారు.

### మరణశిక్ష రద్దు

రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ తన దగ్గర పెండింగ్‌లో ఉన్న అన్ని మరణశిక్ష రద్దు పిటిషన్‌లను యావజ్జీవ శిక్షగా మార్చారు. ఇందులో ప్రముఖంగా వచ్చిన కేసు 1992 ఫిబ్రవరిలో బీహార్ రాష్ట్రంలోని గయా జిల్లాలో బారా గ్రామంలోని 32 మంది భుమియార్ బ్రాహ్మణులను చంపిన కేసులో మావోయిస్టు కమ్యూనిస్ట్ సెంటర్ (ఎంసిసి) కి చెందిన నలుగురికి 2001లో గయా జిల్లా సెషన్స్ కోర్టు మరణశిక్ష విధించింది. సుప్రీంకోర్టు మరణశిక్షను ఖరారు చేస్తూ ఏప్రిల్ 2002లో తీర్పు ఇచ్చింది. ఈ నేపథ్యంలో శిక్ష పడిన నలుగురు రాష్ట్రపతికి ప్రాణభిక్షకు అప్పీల్ చేసుకున్నారు. ఈ అభ్యర్ధనకు రాష్ట్రపతి ఆమోదం తెలిపారు. రాష్ట్రపతి ఇప్పటివరకు వచ్చిన మరణశిక్ష రద్దు పిటిషన్‌లలో నాలుగింటికి మాత్రమే ఆమోదించి, 28ని తిరస్కరించారు.

### సిబిఐ మాజీ డైరెక్టర్‌పై సిట్

బొగ్గు కుంభకోణం కేసులో అధికార దుర్వినియోగ ఆరోపణలు ఎదుర్కొంటున్న సిబిఐ మాజీ డైరెక్టర్ రంజిత్ సిన్హాపై విచారణకు సుప్రీంకోర్టు ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్)ను నియమించింది. న్యాయమూర్తులు జస్టిస్ మదన్ బీ లోకూర్, జస్టిస్ కురియన్ జోసఫ్, జస్టిస్ ఎ.కె. సిక్రీలతో కూడిన ధర్మాసనం జనవరి 23న ఉత్తర్వులు జారీచేసింది. వీ

## సిరియాలో కాల్పుల విరమణ

సిరియాలో తిరుగుబాటు గ్రూపులకు, ప్రభుత్వానికి మధ్య శాంతి చర్చలు సఫలమయ్యాయి. కాల్పుల విరమణ ఒప్పందానికి రష్యా, టర్కీ అంగీకారం తెలిపాయి. డిసెంబర్ 29 అర్ధరాత్రి నుంచి ఈ ఒప్పందం అమలులోకి వచ్చింది. ఇరుపక్షాలు కాల్పుల విరమణను అంగీకరించినట్లు రష్యా అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్ అధికారికంగా తెలిపారు. అయితే ఈ ఒప్పందం కేవలం తిరుగుబాటు దళాలు, ప్రభుత్వ అధీనంలో ఉన్న ప్రాంతాల్లో మాత్రమే అమలులో ఉంటుంది. ఐఎస్, జిహాదీ గ్రూపుల అధీనంలో ఉన్న ప్రాంతంలో ఒప్పందం అమలులో లేదు. ఈ ఒప్పందంలో భాగంగా 1) సైన్యం, తిరుగుబాటు గ్రూపులు కాల్పుల విరమణ పాటించాలి; 2) ఒప్పందాన్ని ఉల్లంఘిస్తే తీసుకోవాల్సిన చర్యలు; 3) శాంతి చర్చలు ప్రారంభించాలన్న దానిపై అంగీకారం అనే మూడు ముఖ్యమైన అంశాలు ఉన్నాయి.

## ఇరాక్‌లో బాంబు పేలుళ్లు

ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో డిసెంబర్ 31న రెండు బాంబు పేలుళ్లు సంభవించాయి. రద్దీగా ఉండే సెంట్రల్ బాగ్దాద్‌లోని సినార్ మార్కెట్‌లో ఈ పేలుళ్లు సంభవించాయి. ఈ ఘటనలో 28 మంది మరణించగా, యాభై మందికి పైగా గాయపడ్డారు. బాగ్దాద్‌లోనే జనవరి 2న ఈశాన్య నగరమైన సదర్‌లో షియా ముస్లింలు ఎక్కువగా ఉండే ప్రదేశంలో ఆత్మాహుతి కారు బాంబు దాడి జరిగింది. ఈ ఘటనలో 35 మంది మరణించారు. అరవై మంది గాయపడ్డారు. మృతుల్లో ఎక్కువ మంది దినసరి కూలీలు ఉన్నారు. ముగ్గురు పోలీసులు కూడా ఈ ప్రమాదంలో మరణించారు. ఈ సంఘటన ఫ్రాన్స్ అధ్యక్షుడు హోలాండే ఇరాక్ పర్యటనలో ఉన్న సమయంలోనే జరిగింది. ఆయన సందర్శించిన కౌంటర్ టెర్రరిజం సర్వీస్ అకాడమీకి దగ్గరలోనే ఈ ఆత్మాహుతి దాడి జరిగింది.

## ఐక్యరాజ్య సమితి నూతన ప్రధాన కార్యదర్శి

ఐక్యరాజ్య సమితి (ఐరాస)కి ప్రధాన కార్యదర్శిగా పోర్చుగల్ మాజీ ప్రధాని ఆంటోనియో గుటెరెస్ జనవరి 1న బాధ్యతలు స్వీకరించారు. దాదాపు పదేళ్లపాటు ఐరాసకి ప్రధాన కార్యదర్శిగా ఉన్న బాన్ కీ మూన్ పదవి కాలం డిసెంబర్ 31తో ముగిసింది. 2007 జనవరి 1న తొలిసారి ఐరాస ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టారు. దశాబ్ద కాలంలో ఆయన అంతర్జాతీయంగా చెలరేగుతున్న హింసను అడ్డుకునేందుకు ప్రయత్నించారు.

## టర్కీలో నూతన సంవత్సర వేడుకల్లో కాల్పులు

టర్కీ రాజధాని ఇస్తాంబుల్‌లో నూతన సంవత్సర వేడుకలపై దాడి జరిగింది. ఇస్తాంబుల్‌లోని బెసిక్తస్ జిల్లాలోని రీనా నైట్ క్లబ్‌లోకి తుపాకితో ప్రవేశించిన వ్యక్తి విచక్షణా రహితంగా కాల్పులు జరిపాడు. ఈ కాల్పుల్లో 39 మంది మరణించారు. డెబ్బై మందికి పైగా గాయపడ్డారు. కాల్పుల సమయంలో దాదాపు ఐదు వందల మంది నూతన సంవత్సర వేడుకలు జరుపుకుంటున్నారు. కాల్పులు జరిపిన వ్యక్తిని పోలీసులు కాల్చి చంపారు. మరణించిన వారిలో పదిహేను మంది విదేశీయులు ఉన్నారు.

## సిరియాలో బాంబు పేలుడు

సిరియా సరిహద్దులోని అజాజ్ నగరంలో జనవరి 7న కారు బాంబు పేలుడు జరిగింది. ఎప్పుడూ రద్దీగా ఉండే జలహాట్ సెంటర్‌లో ఈ పేలుడు సంభవించింది. ఈ పేలుడులో అరవై మంది చనిపోయారు. యాభై మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. కాల్పుల విరమణ ఒప్పందాన్ని విఫలం చేయడానికి ఇస్లామిక్ తిరుగుబాటుదారులు ఈ కారు బాంబు దాడికి పాల్పడినట్లు అధికారులు తెలిపారు.

## ప్రపంచవ్యాప్తంగా పెరుగుతున్న శరణార్థులు

ప్రపంచంలో పెరుగుతున్న అంతర్యుద్ధ పరిస్థితులతో శరణార్థుల సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతోంది. ఈ యుద్ధాల వల్ల అనాథ పిల్లల సంఖ్య కూడా గణనీయంగా పెరుగుతోంది. 2016లో ఆరున్నర కోట్ల మంది పిల్లలు అనాథలయ్యారు. ప్రతి 113 మందికి ఒకరు శరణార్థిగా మారుతున్నారు. అందులో సగానికి పైగా పిల్లలున్నారు. మొత్తం శరణార్థుల్లో 6 శాతం మాత్రమే యూరప్‌లో ఆశ్రయం పొందారు. పశ్చిమాసియా, ఉత్తరాఫ్రికాలో 39 శాతం, ఆఫ్రికాలో 29 శాతం, ఆసియా పసిఫిక్‌లో 14 శాతం, అమెరికాలో 12 శాతం మంది శరణార్థులు ఉన్నారు. సిరియా, అఫ్ఘనిస్తాన్, సోమాలియా, దక్షిణ సూడాన్, సూడాన్, డిఆర్ కాంగో దేశాలలో శరణార్థుల సంఖ్య ఎక్కువగా ఉంది. దేశంలో ఒకచోట నుంచి మరోచోటికి 4.08 కోట్ల మంది అంతర్గత వలసలు పోతున్నారు.

## మెక్సికోలో నిరసనలు

మెక్సికోలో గ్యాస్, చమురు ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. గ్యాస్ ధరలు 20 శాతం పెరిగాయి. ధరల పెరుగుదలతో ప్రజలు తీవ్ర ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. ప్రభుత్వ తీరుకు నిరసనగా ప్రజలు ఆందోళన కార్యక్రమాలు చేపట్టారు. స్థానిక గ్యాస్ దుకాణాలపై దాడి చేశారు. ఈ దాడులతో సెంట్రల్ మెక్సికోలోని 170 గ్యాస్‌స్టోర్‌లు మూతపడ్డాయి. గ్యాస్ కొరతతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొన్నారు. రవాణా వ్యవస్థ పూర్తిగా స్థంబించిపోయింది. నిరసన ప్రదర్శన చేస్తున్న ప్రజలపై ప్రభుత్వ బలగాలు నిర్బంధాన్ని అమలు చేశాయి. ఏడు వందల మందిని పోలీసులు అదుపులోకి తీసుకొని విచారిస్తున్నారు.

## అమెరికా అధ్యక్షుడిగా డోనాల్డ్ ట్రంప్ ప్రమాణ స్వీకారం

అమెరికా 45వ అధ్యక్షుడిగా డోనాల్డ్ ట్రంప్ జనవరి 20న ప్రమాణ స్వీకారం చేశారు. అమెరికా రాజధాని వాషింగ్టన్ డిసిలోని క్యాపిటల్ భవనం మీద ఎనిమిది లక్షల మంది మద్దతుదారుల సమక్షంలో అమెరికా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జాన్ రాబర్ట్ ట్రంప్‌తో ప్రమాణ స్వీకారం చేయించారు. ఈ ప్రమాణ స్వీకారానికి అమెరికా మాజీ అధ్యక్షులు బరాక్ ఒబామా, జార్జ్ బుష్, బిల్ క్లింటన్ హాజరయ్యారు. అధ్యక్ష బరిలో డోనాల్డ్ ట్రంప్‌కు పోటీగా నిలబడి ఓడిపోయిన హిల్లరీ క్లింటన్ కూడా హాజరయ్యారు. అమెరికా ఉపాధ్యక్షుడిగా మైక్ పెన్స్ ఎన్నికయ్యారు. విదేశాంగ మంత్రిగా, రెక్స్ టిల్లర్, రక్షణ మంత్రిగా జనరల్ (రిటైర్డ్) జేమ్స్ మేటిస్, వాణిజ్య మంత్రిగా విల్‌బర్ రాస్ పదవీ బాధ్యతలు చేపట్టారు. ఇక అమెరికా ఇంటిలిజెన్స్ విభాగం సిఐఎ డైరెక్టర్‌గా మైక్ పాంపియో ఎన్నికయ్యారు. జాతీయ భద్రతా సలహాదారుగా ఆర్మీలో లెఫ్టినెంట్ జనరల్‌గా పనిచేసిన మైఖేల్ ఫ్లిన్ నియమించబడ్డారు. డోనాల్డ్ ట్రంప్ అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారానికి వ్యతిరేకంగా అమెరికాలోని అనేక నగరాల్లో భారీ నిరసన ప్రదర్శనలు జరిగాయి. వేలాదిగా ప్రజలు వీధుల్లోకి వచ్చి ఆందోళన చర్యలు చేపట్టారు. పోలీసులు ఆందోళనకారులను చెదరగొట్టేందుకు లాఠీచార్జ్, రసాయన స్ప్రేలు ప్రయోగించారు. దాదాపు వంద మందిని అరెస్ట్ చేశారు.

## యెమెన్‌లో ఘర్షణలు

యెమెన్‌లో ప్రభుత్వ బలగాలకూ, హౌతీ తిరుగుబాటుదారులకూ మధ్య తీవ్ర పోరు జరుగుతోంది. జనవరి 23న జరిగిన ఘర్షణల్లో అరవై మందికి పైగా మరణించారు. సౌదీ అరేబియా నేతృత్వంలో సంకీర్ణ బలగాలు వైమానిక దాడులు జరుపుతున్నాయి. ఈ దాడుల్లో బాబల్–మందాబ్ జలసంధి సమీపంలో జరిగిన ఘర్షణల్లో హౌతీ తిరుగుబాటుదారులు ఎక్కువ సంఖ్యలో మరణించారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(డిసెంబర్ 1 నుండి డిసెంబర్ 31, 2016 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1010), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (858) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1868)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | | | | | | | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | – | – | 18 | 22 | 5 | 4 | 3 | 2 | 2 | 2 | 2 | – | 1 | 22 | 29 | – | – | – | 3 | – |
| హైదరాబాద్ | – | – | – | 6 | 3 | 2 | 1 | – | 1 | – | 4 | 2 | 8 | 3 | 16 | 11 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 1 | – | 9 | 7 | 3 | 3 | 2 | – | 1 | 2 | 2 | 2 | 3 | 18 | 14 | – | – | – | – | – |
| ఖమ్మం | – | 1 | – | 5 | 9 | 4 | 9 | – | – | 2 | 1 | 3 | 3 | 1 | 12 | 14 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 4 | – | 11 | 10 | 3 | 3 | 2 | – | 1 | 4 | 11 | 16 | 12 | 30 | 3 | – | – | – | – | – |
| మెదక్ | 2 | 22 | 2 | 12 | 19 | 14 | 29 | 1 | 12 | 12 | 25 | 12 | 32 | 39 | 69 | 82 | – | – | – | 4 | 1 |
| నల్గొండ | – | 4 | – | 9 | 7 | 1 | 1 | – | – | 1 | 4 | 2 | 4 | 6 | 22 | 9 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 3 | 8 | – | 1 | – | – | 3 | 1 | 1 | – | 1 | 10 | 11 | – | – | – | – | – |
| వరంగల్ | – | 2 | 1 | 4 | 5 | 3 | 5 | 3 | – | – | 1 | 2 | – | 5 | 16 | 14 | – | – | – | – | – |
| వికారాబాద్ | – | – | – | 7 | 4 | – | 2 | – | – | – | 2 | – | – | 2 | 13 | 6 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **4** | **34** | **3** | **84** | **94** | **35** | **58** | **11** | **15** | **22** | **46** | **37** | **65** | **73** | **228** | **193** | **-** | **-** | **-** | **7** | **1** |
| అనంతపురం | – | 5 | 2 | 19 | 32 | 2 | 3 | – | 2 | 5 | 2 | 3 | 6 | 4 | 52 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | 1 | – | 4 | 8 | 8 | 6 | – | – | – | 5 | 9 | 13 | 1 | 39 | 6 | – | – | – | – | – |
| కడప | – | 2 | – | 3 | 4 | – | – | – | – | 3 | 1 | 3 | – | 3 | 23 | 1 | – | – | – | – | – |
| గుంటూరు | – | – | – | 4 | – | – | 6 | – | – | 1 | 2 | 5 | 1 | 2 | 11 | 8 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 5 | 1 | 1 | 2 | – | – | 1 | – | – | 1 | 3 | 19 | 11 | – | – | – | – | – |
| కర్నూలు | – | 1 | – | 3 | 5 | 4 | 6 | 8 | 3 | 2 | 1 | 3 | 6 | 2 | 15 | 14 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | 1 | – | 4 | 11 | 2 | 10 | 2 | – | 4 | – | 1 | 1 | 2 | 25 | 11 | – | – | – | 1 | – |
| ప్రకాశం | – | – | – | 4 | 3 | 2 | – | – | 1 | 6 | 1 | 4 | – | 5 | 17 | 8 | – | – | – | – | 1 |
| శ్రీకాకుళం | 1 | – | – | 4 | 7 | 4 | 14 | 2 | – | 2 | – | 2 | 7 | 4 | 31 | 3 | – | – | – | – | – |
| పశ్చిమ గోదావరి | – | – | – | 3 | 5 | 2 | 5 | 4 | – | 1 | 3 | 3 | – | 3 | 15 | 7 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 2 | 6 | – | 2 | 2 | – | 2 | 3 | 2 | 1 | 3 | 14 | 12 | – | – | – | – | 3 |
| విజయనగరం | – | – | – | 3 | 1 | 3 | 5 | – | 1 | 4 | – | 2 | 3 | 1 | 12 | 9 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 4 | 8 | – | – | – | – | 7 | – | 2 | 5 | – | 20 | 14 | – | – | – | 6 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **1** | **10** | **2** | **62** | **91** | **28** | **59** | **18** | **7** | **38** | **18** | **39** | **44** | **33** | **293** | **104** | **-** | **-** | **-** | **7** | **4** |

## నూతన వత్సర మరియు సంక్రాంతి శుభాకాంక్షలు!

# పిల్లలు పుట్టని దంపతుల్లారా! విసిగి వేసారిపోయారా ?!

# మీకొక ఆశాకిరణం!

# డా॥ రమా సంతాన సాఫల్య కేంద్రం!!

**ISO 9001:2008 సర్టిఫైడ్ ఐ వి ఎఫ్ సెంటరు**



ఇక్కడ అన్ని ఆధునిక శాస్త్రీయ పరీక్షలూ, **IUI-IVF-ICSI** (టెస్ట్ ట్యూబ్ బేబి), సరోగేసి, లేజర్, **TESA-MESA,** సెమెన్/ ఎగ్/ఎంబ్రియో ఫ్రీజింగ్ / డొనేషన్ లాంటి సౌకర్యాలు అన్నీ అందుబాటులో ఉన్నాయి. ఎటువంటి సమస్యలు ఉన్నవారికైనా తగిన వైద్య సహాయం అందుతుంది.

పిల్లలు పుట్టక పోవటానికి కారణాలు అనేకం! అతి తక్కువ స్పెర్మ్ కౌంట్ ఉన్నా, అసలు స్పెర్మ్ కౌంట్ లేకున్నా, వారి టెస్టిస్ లోపల ఏ కొద్దిగా స్పెర్మ్ కణాలు ఉన్నా వాటిని బయటకు తీసి నేరుగా **ICSI** ద్వారా అండంలోకి పంపి పిండోత్పత్తి జరపవచ్చు! స్వంతంగా అండోత్పత్తిలేని స్త్రీలకు డోనార్ ఎగ్ ద్వారా గర్భధారణ కలిగించవచ్చు. గర్భసంచి లేనివారికీ, ఉన్నా గర్భధారణకి వీలుకాని వారికీ సరోగేట్ మదర్ ద్వారా సంతాన ప్రాప్తి కలిగించవచ్చు!

ఇదివరకు **IVF** ఫెయిల్ ఐనవారికీ, 35 సం॥ తరువాత **IVF** ప్రయత్నించేవారికీ, పాలిసిస్టిస్ ఓవరీస్ ఉన్న వారికీ **Diode Laser Assisted Hatching** పద్ధతిలో గర్భధారణకి కృషి చేయవచ్చు!

. . . . . . . . . . . . . . . .

సూచనలు : * వివాహం జరిగాక కూడా ఋతుక్రమం సరిగాలేని వాళ్లు తక్షణం సంప్రదించాలి. లేకపోతే తీరని నష్టం జరగవచ్చు. * ఒక సంవత్సర కాలం కావాలనుకున్నా సంతానం కలుగని దంపతులు వెంటనే సంప్రదించడం ఉత్తమం. * వచ్చే ముందు 5 రోజులు భార్యా భర్తలు దూరంగా ఉండాలి. * ఒకటి, రెండు సార్లు గర్భస్రావం జరిగిన వాళ్లు మళ్లీ గర్భధారణకోసం ఆగకుండా తప్పనిసరిగా ముందు గానే రావాలి * తమ పాత రిపోర్టులన్నీ తెచ్చుకోవాలి. * బయటి నుండి వచ్చే వారికి గదులు లభిస్తాయి.

**డా॥ పాపోలు రమాదేవి గారు**

| | |
|---|---|
| విశాఖపట్నం | : 15వ తేదీన మ॥ 3 గం. నుండి రా॥ 8 గం.ల వరకు<br>16వ తేదీన ఉ॥ 9 గం. నుండి మ॥ 3 గం.ల వరకు |
| రాజమండ్రి | : 17వ తేదీన ఉ॥ 10 గం. నుండి రా॥ 7 గం.ల వరకు |
| విజయవాడ | : 18వ తేదీన ఉ॥ 10 గం. నుండి రా॥ 7 గం.ల వరకు |
| గుంటూరు | : 19వ తేదీన ఉ॥ 9 గం. నుండి సా॥ 6 గం.ల వరకు |

ఆ యా ప్రాంతీయ కేంద్రాలలో మీకు అందుబాటులో ఉంటారు.

**Dy. Director డా॥ విజయలక్ష్మి గారు**

| | |
|---|---|
| విశాఖపట్నం | : 1వ తేదీన మ॥ 3 గం. నుండి రా॥ 8 గం.ల వరకు<br>2వ తేదీన ఉ॥ 9 గం. నుండి మ॥ 3 గం.ల వరకు |
| రాజమండ్రి | : 3వ తేదీన ఉ॥ 10 గం. నుండి రా॥ 7 గం.ల వరకు |
| విజయవాడ | : 4వ తేదీన ఉ॥ 10 గం. నుండి రా॥ 7 గం.ల వరకు |
| గుంటూరు | : 5వ తేదీన ఉ॥ 9 గం. నుండి సా॥ 6 గం.ల వరకు |

ఆ యా ప్రాంతీయ కేంద్రాలలో మీకు అందుబాటులో ఉంటారు.

**ఆంధ్రప్రదేశ్‌లో వేలాది మందికి మాతృత్వ సౌభాగ్యాన్ని కలిగించిన డా॥ రమా సంతాన సాఫల్య కేంద్రం ఇప్పుడు కర్ణాటకలో "డా॥ రమా టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్"** పేరుతో డి.సి. ఛేంబర్స్, 421/ఎమ్, కృష్ణ దేవస్థానం రోడ్డు, ఇందిరా నగర్ 1వ స్టేజ్, **బెంగళూరు** వద్ద కూడా సేవలందిస్తోంది. **ఫోన్లు :: 02261816191 (టోల్‌ఫ్రీ), 070229 86300**

## చందన బ్రదర్స్ ఎదురుగా, అమీర్‌పేట్, హైదరాబాద్.

**ఫోన్లు : (040) 2340 1255, 99892 23316 / 99892 23320.**

విశాఖపట్నం : 99892 23314, 99892 23325; విజయవాడ : 99892 23324, 99124 60584 ;
రాజమండ్రి : 99892 23323, 94408 20132 ; గుంటూరు : 99892 23321, 99892 23322 ;
బెంగళూరు : 02261816191 (టోల్‌ఫ్రీ), 070229 86300 .

E-mail: ramafertility@yahoo.com   టోల్ ఫ్రీ నెం : **1800 425 3255**   www.fertilityindia.com

## మీ సేవలో. 1991 నుండి.

Advt.

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 187 - February 2017 • **ISSN 2231-6892**
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/01/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19

Date of Posting : 29th, 30th

# వి. హనుమంతరావు సంస్మరణ సభ

డిసెంబర్ 29, 2016, గురువారం, హైదరాబాద్



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao